# నాట్యకళ

వింశతి వార్షికోత్సవ ప్రత్యేక సంచిక

**1958–1979**



ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

హైదరాబాద్

సంపాదక వర్గం:

ప్రొఫెసర్ కె. వి. గోపాలస్వామి,
అధ్యక్షులు, ప్రధాన సంపాదకులు

డాక్టర్ సి. నారాయణరెడ్డి

శ్రీ నటరాజ రామకృష్ణ

శ్రీ జి. రామకృష్ణరావు

సంపాదకులు, సంపాదక వర్గ సంచాలకులు:

డాక్టర్ మొదలి నాగభూషణశర్మ

ఈ సంచికకు ముఖచిత్ర రూపకల్పన:

శ్రీ వి. శ్రీనివాసశర్మ

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| **సంపాదకీయం** | | |
| ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ : 20 సంవత్సరాల కృషి | శ్రీ కె. వి. సుబ్బారావు | I |
| ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ : పది సంవత్సరాల ప్రగతి | శ్రీ వసల సూర్యచంద్రరావు | XI |
| **సంగీతం :** | | |
| సంగీత లక్ష్య లక్షణ సమన్వయాలు, సంప్రదాయాలు | శ్రీ డొక్కా శ్రీరామమూర్తి | 1 |
| రాగము–చతుర్విధఫలములు | శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు | 12 |
| రాగలక్షణము | శ్రీ పి వేణుగోపాలరెడ్డి | 18 |
| రాగములు–మేళములు | శ్రీ యన్.సి హెచ్. కృష్ణమాచార్యులు | 22 |
| శ్రీ హరి నాగభూషణంగారు | శ్రీ భావరాజు నరసింహారావు | 27 |
| త్యాగరాజ–సంగీత సాహిత్య సమ్మేళనము | శ్రీ ఇ. యన్. పురుషోత్తమ్ (అనువాదం శ్రీమతి సరస్వతి) | 34 |
| కర్ణాటకపద్ధతి–హిందూస్థానీ శైలి | శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు | 38 |
| హిందూస్థానీ–కర్ణాటక సంగీత సంప్రదాయాలు | శ్రీ చేతన్ కర్నానీ (అనువాదం : శరత్) | 43 |
| శ్రీపారుపల్లి రామకృష్ణయ్య పంతులు | డాక్టర్ బాలమురళీకృష్ణ | 50 |
| **నాటకం** | | |
| డాక్టర్ గరికిపాటి రాజారావు | శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి | 57 |
| గత రెండు దశాబ్దాలలో తెలుగులో నాటక ప్రయోగం: కొత్త పోకడలు | శ్రీ చాట్ల శ్రీరాములు | 60 |
| తెలుగు ఏకాంకిక–పుట్టుపూర్వోత్తరాలు | శ్రీ పి. విజయరాఘవరెడ్డి | 65 |
| తెలుగు నాటకం | శ్రీ అత్తిలి కృష్ణారావు | 72 |

| | | |
|---|---|---|
| రాఘవ నటనా కౌశలం | శ్రీ గోవిందు లక్ష్మీనరసింహారావు | 75 |
| తెలుగు సంగీత రూపకాలు | శ్రీమతి పద్మజాభూషణ్ | 84 |
| సురభి నాటక సమాజాలు | శ్రీ మల్లాది వెంకటకృష్ణశర్మ | 87 |
| సురభి | శ్రీ గుడిపూడి శ్రీహరి | 90 |
| స్థానం నరసింహారావు | శ్రీ పసల సూర్యచంద్రరావు | 94 |
| **నాట్యం** | | |
| శ్రీ వేదాంతం రాఘవయ్య | శ్రీ భాగవతుల రామకోటయ్య | 97 |
| క్షేత్రయ్య పదములు-అభినయము | శ్రీ నటరాజ రామకృష్ణ | 101 |
| కూచిపూడి నాట్యం-నవరసాలు | శ్రీ కోదాడ నరసింహారావు | 118 |
| **జానపద సాహిత్యం** | | |
| జానపద సంగీతం—శాస్త్రీయ సంగీతం | డాక్టర్ అనసూయాదేవి | 122 |
| జానపద వీరగేయాలు | డా॥ యె. రఘునాధరెడ్డి | 125 |
| **విశిష్ట సభ్యులు** | | 129 |
| **అకాడమీ బిరుదాంకితులు** | | 153 |

# సంపాదకీయం

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సంగీత, నృత్య, నాటక, జానపదకళల అభివృద్ధికి చేపట్టిన అనేక కార్యక్రమాలలో 'నాట్యకళ' ప్రచురణ ఒకటి. ఒకప్పుడు ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఆధ్వర్యంలో నిర్వహింపబడిన ఈ పత్రిక నిర్వహణ బాధ్యతలను ఆ తరువాత అకాడమీ స్వీకరించింది. ద్వైమాసిక పత్రికగా ప్రారంభింపబడి, మాస పత్రికగా ప్రగతిని సాధించిన "నాట్యకళ" వివిధ కళలపై వ్యాసాలను ప్రచురించడానికి, అకాడమీ, తదితర అనుబంధ సంస్థల కార్యకలాపాలను వెలువరించడానికి సమానమైన ప్రాముఖ్యాన్ని యిచ్చింది. కారణాంతరాలవల్ల 1977 జనవరినెల సంచికతో తాత్కాలికంగా ఆపుచేయబడిన 'నాట్యకళ'ను తిరిగి ప్రారంభించాలన్న ఉద్దేశ్యంతో నూతన సంపాదక వర్గాన్ని నియమించింది అకాడమీ.

ఇరవై సంవత్సరాలు నిండి వింశతి వార్షికోత్సవాలు జరుపుకుంటున్న ఈ సమయంలో 'నాట్యకళ' పునరావిర్భావం శుభసూచకం.

ఇప్పుడు మీముందున్న 'నాట్యకళ' సంచిక వింశతి వార్షికోత్సవ విశేష సంచిక. ఇందులో సంగీత, నృత్య, నాటక, జానపద కళలకు సంబంధించిన వ్యాసాలు, అకాడమీ పూర్వ, ప్రస్తుత కార్యక్రమాలకు సంబంధించిన నివేదికలు, ఛాయాచిత్రాలు ఉన్నాయి. కాగా, ఈ సంచిక తరువాత ప్రచురింపబడే త్రైమాసిక పత్రిక కేవలం పరిశోధనా వ్యాసాలకే ప్రాముఖ్యాన్ని యిస్తుంది ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లోని కళా వైశిష్ట్యాన్ని పాఠకులకు అందించడానికి "నాట్యకళ" ప్రయత్నిస్తుంది. తెలుగు నాటక, సంగీత నృత్య కళల్లో ఆంధ్రప్రదేశ్ సాధించవలసిన ప్రగతికి "నాట్యకళ" సైద్ధాంతిక విధానాలను సూచిస్తుంది. ఆ విధంగా సాంప్రదాయక, శాస్త్రీయ పద్ధతుల వైశిష్ట్యాన్ని పాఠకులకు తెలియ చెప్పడమే కాక, ఆయా కళల్లో వస్తున్న కొత్త పోకడలను ఆహ్వానిస్తుంది.

తెలుగు నాటక సాహిత్య విమర్శకు కృషిచేసే పత్రికలు తగినన్ని ఉన్నాయి. కాని సంగీత, నృత్య, నాటక, జానపదకళల పరిశోధనకు ఒక్క పత్రిక కూడా లేకపోవడం శోచనీయం.

నాట్యకళ-ఇప్పటి రూపంలో - ఆ లోటును పూరించడానికి ప్రయత్నం చేస్తుంది. అకాడమీ కార్యకలాపాలను, ఇతర అనుబంధ సంస్థలు నిర్వహిస్తున్న కార్యక్రమ విశేషాలను తెలియచెప్పడానికి సమాచార లేఖను ప్రచురించడానికి నిర్ణయం జరిగింది. అది త్వరలో అమలు జరుగుతుందని ఆశిద్దాం.

ఇరవై సంవత్సరాల అకాడమీ చరిత్రలో చరిత్రకెక్కతగిన కొన్ని ఘట్టాలు ఉన్నాయి. ఎన్నో కార్యక్రమాలు విజయవంతంగా నిర్వహింపబడ్డాయి. క్రొత్త కార్యక్రమాలు ప్రారంభించబడ్డాయి. ఈ కార్యక్రమాలన్నీ-ఇతఃపూర్వం-అకాడమీ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపచేశాయి. ఆ ఉన్నతే ఆదర్శంగా, ఆ సిద్ధాంతాలే ప్రాతిపదికగా 'నాట్యకళ'ను కొనసాగించాలని మా ఆకాంక్ష.

మా ఆకాంక్షను కార్యరూపంలో పెట్టడానికి కళా సరస్వతిని ఆరాధించే పరిశోధకుల, రచయితల సహకారాన్ని కోరుతున్నాను. వారి అమూల్యమైన పరిశోధనా విశేషాలను ఆయా కళల్లో అభినివేశం ఉన్న వారికి అందించడమే 'నాట్యకళ' ధ్యేయం.

—నాగభూషణశర్మ

# ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 20 సంవత్సరాల కృషి

కంభంమెట్టు వెంకటసుబ్బారావు
(కార్యదర్శి, ఆం.ప్ర సం.నా అకాడమీ)

**1957** చివరిభాగంలో స్థాపించబడినఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 20 సంవత్స రాలు నిండి మూడవ దశాబ్దంలో అడుగిడింది.

### ప్రారంభం

రాష్ట్రంలో సంగీత, నృత్య, నాటిక, చలనచిత్ర కళల అభివృద్ధికి కృషి చేసేందుకు రాష్ట్రప్రభుత్వంచేఈఅకాడమీ23-12-1957న లాంఛన ప్రాయంగా అప్పటి ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారిచే ప్రారం భింపబడి 2-6-58 న హైద్రాబాద్ పబ్లిక్ సొసైటీస్ రిజిస్ట్రేషన్ ఆక్టు క్రింద రిజిష్టరు కాబడింది.

### ఆశయాలు

భారతీయ నృత్య, సంగీత, నాటక, చలన చిత్రకళల వికాసానికి దోహదం చేయడం, ఈ కళలలో శిక్షణకు విద్యాలయాలు నెల కొల్పేందుకు నిర్వహించేందుకు సహాయపడ డం, ఈ రంగాలలో సమాచార సేకరణను పరిశోధనను ప్రోత్సహించడం, గ్రంథా లయాన్ని, మ్యూజియంను ఏర్పరచడం, ఈ కళలను గూర్చిన సాహిత్యం ప్రచురించడం;

నృత్య నాటక సంగీత చలన చిత్ర ఉత్స వాలను నిర్వహించడం.

జానపద కళలను పునరుద్ధరించడం;

కళారంగంలో విశిష్ట కృషిచేస్తున్న కళా కారులను గుర్తించి సన్మానించడం;

కళారంగంలో విశిష్ట కృషిచేస్తున్న సంస్థ లను గుర్తించి వాటికి ఆర్థికంగా సహాయ పడడం.

కళలకు విశిష్ట సేవచేసి నిస్సహాయస్థితిలో ఉన్న వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయం చేయడం.

సంగీత, నృత్య, నాటక, చలన చిత్ర రంగాలకు సంబంధించిన సాంకేతికపరిజ్ఞానాన్ని కళారీతులను వివిధ ప్రాంతాలమధ్య ఇచ్చి పుచ్చుకొనడానికి అవకాశం కల్గించడం.

ఒక రాష్ట్రంనుండి మరొక రాష్ట్రానికి నృత్య, నాటక, సంగీత, చలన చిత్ర రంగా లకు చెందిన సాంస్కృతిక బృందాలను పంపించే కార్యక్రమాలను ప్రోత్సహించడం.

ఈ లక్ష్యాల సాధనకు, భారతీయ సంస్కృతి సమగ్ర వికాసానికి ఇతర రాష్ట్ర అకాడమీల తోను, సంస్థలతోను సహకరించుట

ఈ అకాడమీకి నిర్దేశింపబడిన ఆశయాలు.

### చలన చిత్ర కళ

అయితే ఇతర రాష్ట్రాలలో ఉన్న తెలుగు చలన చిత్ర పరిశ్రమను మన రాష్ట్రానికి క్రమంగా తరలించటానికి, చలన చిత్ర కళ అభివృద్ధికి పెద్ద ఎత్తున కావలసిన నిధుల దృష్ట్యాను, ఈ కళాభివృద్ధికి కావలసిన కార్యక్రమాలను రాష్ట్ర ప్రభుత్వం తానే చేపట్టడంచేత సంగీత నాటక అకాడమీ నృత్య నాటక సంగీత జానపద కళలకే తన కృషిని పరిమితం చేసుకొంది.

### శిక్షణ సంస్థలు

నాటక కళ

నాటక కళలో శిక్షణ ఇచ్చేందుకు ప్రయోగాత్మకంగా గుడివాడ ఎ.ఎన్.ఆర్. కళాశాలలో ప్రముఖ నటుడు శ్రీ బసవరాజు వెంకట సుబ్బారావును అధ్యాపకులుగా అకాడమీ నియమించింది. వృద్ధాప్యకారణంగా ఆ పదవినుంచివారు విరమించుకొనగా1963లో ఈ ప్రయత్నం నిలిపివేయబడింది. 1963 నుంచి 1970 వరకు హైద్రాబాదులో ఆంధ్ర ప్రదేశ్ నాట్య సంఘం నాట్య విద్యాలయాన్ని నిర్వహించేందుకు అకాడమీ ఆర్థిక సహాయం చేసింది. 1964లో విజయవాడలోను 1966లో అనంతపురంలోను కూడా నాటక విద్యాలయాలను అకాడమీ ఏర్పాటు చేసింది. గాని విద్యార్థుల సంఖ్య ప్రోత్సాహకరంగా లేని కారణాన, అవసరమయిన అధ్యాపకులు లభ్యంకాకను ఈ విద్యాలయాలను 1968 లో నిలిపివేయవలసి వచ్చింది. తరువాత విశాఖ జిల్లా బలిఘట్టంలో సురభినాటక కళాసంఘం నిర్వహిస్తున్న నాటక విద్యాలయానికి వారు దానిని నిలిపివేసేటంత వరకు కొలది సంవత్సరాలు అకాడమీ ధన సహాయం చేసింది.

1973-74 ఆరువారాలు థియేటర్ వర్క్‌షాప్‌ను నిర్వహించి 40 మంది కళాకారులకు శిక్షణ ఇచ్చి 'త్రిజాకీ యమదర్శనం' అనే ప్రయోగాత్మక నాటకాన్ని తయారు చేసింది. ఈ నాటకం రాష్ట్రంలో పలుచోట్ల ప్రదర్శింపబడింది దీనికి శ్రీ చాట్ల శ్రీరాములు దర్శకత్వం వహించారు. నాటకాన్ని శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ రచించారు.

ఇటీవల హైద్రాబాదులో తిరిగి ప్రధానంగా నాటక కళలోను, పేరిణి తాండవ సంగీత నృత్యాది కళలలోను శిక్షణ ఇచ్చేందుకు ప్రదర్శక కళల విద్యాలయం (Institute of performing Arts) అనే పేరుతో ఒక సంస్థను స్థాపించుటకు ఒక పథకాని తయారుచేసి ఆర్థిక సహాయం కొరకు అకాడమీ రాష్ట్ర ప్రభుత్వానికి దరఖాస్తు చేసిం

సంగీత నృత్యాలలో

సంగీత నృత్య కళలలో ఉన్నత శిక్షణ అవకాశం కల్పించేందుకు ఈ కళలలో గ

కులాలను నెలకొల్పేందుకు అకాడమీ 1959 లో ఒక పథకాన్ని చేపట్టింది. దాని క్రింద విజయవాడలో శ్రీ చిలకలపూడి వేంకటేశ్వర శర్మ కులపతిగాను నెల్లూరులో శ్రీ రాళ్ళపల్లి నటేశయ్య కులపతిగాను, గాత్ర సంగీతానికి, గుంటూరులో శ్రీ టి.ఎన్.సి.వి నారాయణాచార్యులు కులపతిగాను, విశాఖలో శ్రీ వాసా కృష్ణమూర్తి కులపతిగాను వీణా గురుకులాలు, చిలుకలూరిపేటలో షేక్ ఆదంసాహెబ్ ఆచార్యులుగాను, ఈ గురుకులం నిలిచిపోయిన తరువాత నందిగామలో షేక్ లాల్ సాహెబ్ ఆచార్యులుగా నాదస్వర గురుకులాలు, తాడేపల్లిగూడెంలో శ్రీ నవుడూరి మునలయ్య కులపతిగాను. ఆ గురుకులం ఆగిపోయిన వెనుక తెనాలిలో శ్రీ కె. తిరుపతిస్వామి కులపతిగాను డోలు గురుకులాలు, హైదరాబాదులో కూచిపూడి నృత్యానికి శ్రీ భాగవతుల రామకోటయ్య అధ్యాపకులుగాను, భరతనాట్యానికి శ్రీమతి ఎస్. సామ్రాజ్యం అధ్యాపకురాలిగాను నాట్య గురుకులాలను, విజయనగరంలో శ్రీ వరద ఆది నారాయణ కులపతిగా భాగవత నృత్య గురుకులాన్ని అకాడమీ నిర్వహించింది. వీనిలో కులపతుల మృతి కారణంగాను కొద్ది సందర్భాలలో ఇతర కారణాల వలనను కొన్ని గురుకులాలను నిలిపి వేయడం జరిగింది. ప్రస్తుతం వీటిలో హైదరాబాదులోని నృత్య గురుకులాలు, డోలు గురుకులం మాత్రం నిర్వహింప బడుచున్నవి. ఇటీవల 4-3-79న తెనాలిలో శ్రీ ములుకుట్ల సదాశివ శాస్త్రి కులపతిగా హరికథా గురుకులాన్ని అకాడమీ ప్రారంభించింది.

### అభినయ పాఠశాల

రాష్ట్రి ముఖ్య నృత్య సంప్రదాయాలలో ఒకటైన అభినయ కళను ప్రోత్సహించే నిమిత్తం 1972-73లో శ్రీ నటరాజ రామకృష్ణ దర్శకత్వం క్రింద శ్రీమతులు అన్నాబత్తుల బులి వెంకటరత్నమ్మ, సరిదె మాణిక్యం అధ్యాపకురాండ్రుగా అకాడమీ ఒక అభినయ పాఠశాలను నడిపింది. అమెరికా దేశస్థురాలు ఒకరు, జర్మనీ దేశస్థురాలు ఒకరు, కర్ణాటక రాష్ట్రం నుంచి ఇద్దరు సహా 13 మంది విద్యార్థినులు ఇందులో శిక్షణ పొంది ప్రజారంజకంగా కొన్ని ప్రదర్శనలు కూడా ఇచ్చారు.

### పేరిణి శివతాండవం

13వ శతాబ్దిలో కాకతీయ గజసేనాని జాయప రచించిన 'నృత్త రత్నావళి' ఆధారంగా శ్రీ నటరాజ రామకృష్ణ రూపొందించిన పేరిణి శివతాండవం నృత్యాన్ని అభ్యసించేందుకు అకాడమీ ఒక విద్యార్థికి 73-74లో ఉపకార వేతనాన్ని ఇచ్చింది 1974-75లో ఈ విద్యలో క్రమపద్ధతిని తరిఫీదు ఇచ్చేందుకు అకాడమీ ఒక శిక్షణాలయాన్ని నిర్వహించింది. ఐదుగురు కళాకారులను నృత్యంలోను, ముగ్గురు కళాకారులను ఇందుకు ప్రత్యేకమైన మృదంగ వాదనంలోను, ఒక కళాకారిణిని గాత్ర సంగీతంలోను తయారు చేసింది. ఈ నృత్యం రాష్ట్రపతి మొదలుగా

గల దేశ పెద్దల యెదుటనేగాక హంగేరి దేశ ప్రధానమంత్రి వంటి ఇతర విదేశ ప్రతినిధుల యెదుట కూడా ప్రదర్శింపబడి అందరి ప్రశంసల నందుకొన్నది.

### సమాచార సేకరణ-ప్రచురణలు

1958,59 సంవత్సరాలలో రాష్ట్రంలో కళాకారుల గురించి సాంస్కృతిక సంస్థల గురించి సమాచారాన్ని సేకరించి "ఆంధ్ర ప్రదేశ్‌లో నృత్యం, నాటకం, సంగీతం" అనే పేరుతో ఇంగ్లీషులో ఒక గ్రంథాన్ని అకాడమీ ప్రచురించింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నియమించిన నాటకకళ పునరుద్ధరణ సంఘం సర్వే జరిపి తయారు చేసిన నివేదికను తెలుగు రంగస్థలాభివృద్ధికి తోడ్పడగలదనే ఉద్దేశ్యంతో 1959 లో అకాడమీ ప్రచురించింది.

వందల కొలది పల్లెపదాలను సేకరించి "త్రివేణి" అనే పేరుతో అకాడమీ వాటిని పుస్తక రూపంలో వెలువరించింది. "భామా కలాపం" ప్రామాణిక ప్రతిని తయారుచేయించి ప్రచురించింది. శ్రీ ముట్నూరి సూర్యనారాయణ శాస్త్రిచే సేకరింపబడిన నాట్యగ్రంథం 'నందికేశ్వరుభరతాన్ని' అకాడమీ అచ్చొత్తించింది. కళారంగాలలో ప్రమాణ గ్రంథాలను ప్రచురించే పథకం క్రింద సంగీతంలో శ్రీ సుబ్బరామ దీక్షితుల వారి 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'ని నాలుగుభాగాలుగా ప్రచురించింది. సంస్కృతంలోని సంగీత నృత్య గ్రంథాలను తెలుగు అనువాదంతో ప్రచురించదలచి శార్ఙ్గదేవుని 'సంగీత రత్నాకరం' ప్రథమభాగం, జాయసేనాపతి విరచిత 'నృత్య రత్నావళి' శారదా తనయుని 'భావప్రకాశనము' అనువాదాలతో ముద్రించింది. క్షేత్రయ్య పదాలను, రామదాసు కీర్తనలను స్వరసహితంగా ప్రచురించింది. శ్రీ ఇ.యన్.యస్.పురుషోత్తమన్‌చే ఆంగ్ల వ్యాఖ్యతో కొన్ని త్యాగరాజ కృతులను అకాడమీ ప్రచురించింది. 'ఆంధ్రడ్యాన్స్ స్కల్ప్చర్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక గ్రంథాన్ని రాష్ట్ర లలితాకళా అకాడమీతో సంయుక్తంగా వెలువరించింది. శ్రీయుతులు తిరుపతి వెంకటకవులు, చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, ఆదిభట్ల నారాయణదాసుల మోనోగ్రాఫులను, తబలా శిక్షణను గురించి 'తబలా బోధిని' అనే గ్రంథాన్ని కూడా అకాడమీ ప్రచురించింది. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా 'ఆంధ్రుల సంగీత కళ', 'ఆంధ్రుల నాట్యకళ' తెలుగువారిచలనచిత్రకళ 'వాగ్గేయకారులు', 'బుఱ్ఱకథలు,' 'జానపద సాహిత్యం,' 'యక్షగానం,' తొలిసంకీర్తనకవులు, Surabhi theatres, Kuchipudi Classical Dance, 'సంత్ త్యాగరాజ్' (Hindi) మోనోగ్రాఫులను కూడా అకాడమీ ప్రచురించింది. 'త్యాగరాజ ఉత్సవ సంప్రదాయకీర్తనలను' 'దివ్యనామకీర్తన'లను, శ్రీ శశాంక-పాలగుమ్మి విశ్వనాథంగార్లు సేకరించిన 'లలిత గేయాల'ను స్వరసహితంగాను, శ్రీ నటరాజ

రామకృష్ణ రచించిన 'ఆంధ్రులు-నాట్యకళ' శ్రీ యస్. సి. పార్థసారథి దంపతులచే సేకరించబడిన జావళీలు, శ్రీ ఆకెళ్ళ మల్లిఖార్జున శర్మ రచించిన, 'తాళ ప్రస్తార సాగరం'అచ్చుకు సిద్ధముగాఉన్నవి. శ్రీ శ్రీనివాస చక్రవర్తి రచించిన 'నాటకసర్వస్వం', కళాప్రపూర్ణ శ్రీమతిఅవసరాల అనసూయాదేవి స్వరపరచిన 'జానపద గేయాలు,' 'భావగీతాలు' ప్రచురణకు పరిశీలనలో ఉన్నవి.

## ప్రచురణలకు ఆర్థిక సహాయం

అకాడమీ తాను గ్రంథ ప్రచురణకు పూనుకోవటమే కాకుండా కళాకారులకు సంబంధించిన అనేక గ్రంథాల ప్రచురణకు ఆర్థిక సహాయం చేసింది.

## నాట్యకళ

నృత్య నాటక సంగీత శాస్త్ర విషయాలలో ఆసక్తి పెంపొందించే ఉద్దేశ్యంతో 'నాట్యకళ' అనే పేరుతో విలువైన వ్యాసాలతో అకాడమీ ఒక పత్రికను నడుపుతున్నది. అకాడమీ నిర్వహించే రాష్ట్ర కళోత్సవాల సందర్భంగాను, త్యాగరాజ ద్విశత జయంత్యుత్సవం. అఖిల భారతనృత్యోత్సవం, అకాడమీ దశాబ్ది ఉత్సవాలు, జానపద కళోత్సవాలు, అభినయ సదస్సు, పేరిణి శివతాండవం, చిలకమర్తి, హరిప్రసాదరావు, వీణా వెంకటరమణదాసు, బళ్ళారిరాఘవ మొదలగు విశిష్ట కళాకారుల సంస్మరణ సందర్భాలలోను నాట్యకళ ప్రత్యేక సంచికలను అకాడమీ ప్రచురించింది.

## సంగీత, నృత్య, నాటకోత్సవాలు

కళా ప్రచారానికి ఎంతగానో తోడ్పడే సంగీత నృత్య నాటక ఉత్సవాలను అకాడమీ నిర్వహించింది. 1958లో కర్ణాటక సంగీతోత్సవం, 1960లో నాటకోత్సవం అకాడమీ జరిపింది. 1964 లో ఈ కళోత్సవాలు ఏటేటా నిర్వహించదలచి ఇందుకు ఒక నూతన పథకాన్ని రూపొందించింది. ఈ పథకం ప్రకారం రాష్ట్రస్థాయి కళా సంస్థలను గుర్తించి ఉత్సవాలను అకాడమీ ప్రతిపాదించి ఆర్థిక సహాయంచేసి, నిర్వహణ ఆ రాష్ట్రస్థాయి సంస్థలకు నియోగించింది. సంగీత రంగంలో ఆంధ్రప్రదేశ్ సంగీత సభల సమాఖ్యను, నృత్యంలో రాష్ట్ర నృత్య కళాపరిషత్తును ప్రారంభించి దానిని, నాటక రంగంలో ఆంధ్రనాటక కళాపరిషత్తును, రాష్ట్రావతరణ ఉత్సవ సందర్భాన హైదరాబాదులో జరిగే నృత్యనాటక సంగీతోత్సవానికి ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘంను, ఉత్సవాల నిర్వహణకు అకాడమీ గుర్తించింది. సంగీత నృత్య నాటక రంగాలలో ఈ ఉత్సవాలు ఏటేటా జరుపుటకు, హరికథ, జానపదం వంటి కళలలో ఆర్థిక వనరులను బట్టి ఉత్సవాలు జరుపుటకు అకాడమీ నిర్ణయించింది. ఏటాటా జరిగే ఈ ఉత్సవాలకు ఆయాకళలలో విశిష్ట సేవచేసిన ఉత్తమ కళాకారులను అధ్యక్షులుగా ఆహ్వానించి వారిని ఆయా ఉత్సవకళను బట్టి, "గానకళాప్రపూర్ణ", "భరత కళాప్రపూర్ణ", "నాటక కళాప్రపూర్ణ" అను బిరుదులతో

గౌరవించింది. ఆయా కళలలో నిష్ణాతులైన కళావేత్తలచే వ్యాస పఠనాలు, సోదాహరణ ప్రసంగాలు పోటీలతోపాటు కళా ప్రదర్శనలు ఈ ఉత్సవాలలో భాగాలుగా ఉన్నాయి.

అకాడమీ నుంచి "గానకళా ప్రపూర్ణ" బిరుదు గ్రహించినవారు కీర్తిశేషులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, కృష్ణనారాయణ రతన్ జన్‌కర్, చిత్తూరు సుబ్రహ్మణ్యం, పర్వతనేని వీరయ్యచౌదరి, క్రోవి సత్యనారాయణ, షేక్ చినపీర్ సాహెబు, మహావాది వెంకటప్పయ్యశాస్త్రి, శ్రీయుతులు శ్రీ పాద పినాకపాణి, పింజమూరి వరదరాజ అయ్యంగార్, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, విజయరాఘవరావు, ఈమని శంకర్ శాస్త్రి.

'భరత కళా ప్రపూర్ణ' బిరుదు అందుకొన్నవారు కీర్తిశేషులు వేదాంతం రాఘవయ్య, చింతాకృష్ణమూర్తి, అన్నాబత్తుల బులి వెంకటరత్నమ్మ, శ్రీయుతులు నటరాజ రామకృష్ణ, శ్రీ కోరాడ నరసింహారావు.

'నాటక కళా ప్రపూర్ణ' బిరుదును స్వీకరించిన వారు కీర్తిశేషులు స్థానం నరసింహారావు, బద్దంకి శ్రీ రామమూర్తి, శ్రీయుతులు చుండి నాగభూషణం, పీసపాటి నరసింహమూర్తి. శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి "ఆధునికాంధ్ర నాటక ప్రయోగ విధాత" అనే బిరుదును స్వీకరించారు.

"కథాగాన కళా ప్రపూర్ణ" బిరుదుతో గౌరవింపబడినవారు శ్రీయుతులు పాతూరి మధుసూదనరావు, పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు.

## ప్రత్యేక సదస్సులు, ఉత్సవాలు

వార్షిక కళోత్సవాలు గాక అకాడమీ ప్రత్యేక సదస్సులను కూడా నిర్వహించింది. 1959లో కూచిపూడి నృత్య సదస్సు, 1962లో అఖిల భారత హిందూస్థానీ ఉత్సవం, 1964లో అఖిల భారత నృత్య ఉత్సవం, 1970లో అభినయ సదస్సు, 1976 లో రెండవ అఖిల భారత హిందూస్థాని సంగీతోత్సవం జరుపబడ్డాయి.

## సంప్రదాయ కళోత్సవాలు

1964లో ఏడు రోజుల హరికథా ఉత్సవము, 1969లో రెండవ హరికథోత్సవము, 1970లో రాష్ట్ర జానపద కళోత్సవం జరిగాయి. 1972లో తూర్పు భాగవత సదస్సును, 1975లో వీధినాటక సదస్సును కూడా అకాడమీ నిర్వహించింది.

## త్యాగరాజ జయంత్యుత్సవాలు

అకాడమీ, దాని అనుబంధసంస్థ రాష్ట్ర సంగీత సభల సమాఖ్య సంయుక్త ఆధ్వర్యంలో ఏటేటా విజయవాడలో త్యాగరాజ జయంత్యుత్సవాలు జరుపబడుతున్నాయి.

## సంస్మరణోత్సవాలు

కళారంగాలలో విశిష్టస్థాన మలంకరించిన వాగ్గేయకారుల, నాట్యాచార్యుల, నటుల, నాటక కర్తల సంస్మరణోత్సవాలను అకాడమీ నిర్వహించింది. అలా జరుపబడిన ఉత్సవాలలో స్వాతి తిరుణాళ్ 150వ జయంత్యుత్సవం, క్షేత్రయ్య త్రిశత జయంతి, త్యాగరాజు ముత్తుస్వామి దీక్షితుల ద్విశత జయంతులు, శ్యామశాస్త్రి 150వ వర్ధంతి ఉత్సవం, టాగూరు, వనారస గోవిందరావు, పండిట్ విష్ణు దిగంబర్ పలూస్కర్ల శతజయంతులు, వీణా వెంకటరమణదాసు బళ్ళారి రాఘవ, చిలకమర్తి లక్ష్మీనరసింహం, ద్వారం వెంకటస్వామి నాయుడు, స్థానం నరసింహారావుల సంస్మరణోత్సవాలు ఉన్నాయి. అంతేగాక ఆంధ్రనాటక పితామహులు ధర్మవరం రామకృష్ణమాచార్యుల జయంత్యుత్సవానికి అకాడమీ ఆర్థికసహాయం జేసింది.

## విశిష్ట సభ్యులు

నృత్య సంగీత చలనచిత్ర కళారంగాలలో విశిష్ట సేవచేసిన కళాకారులను అకాడమీ 'ఫెలో షిప్పు'లతో గౌరవించింది. ఈ గౌరవాన్ని పొందినవారు సంగీతంలో కీర్తిశేషులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, ద్వారం వెంకటస్వామినాయుడు, చిత్తూరు సుబ్రహ్మణ్యం, బాపురావు (సితార్), చింతలపల్లి వెంకటరావు, శ్రీ అంబా ప్రసాద్; నాట్యంలో శ్రీ ముట్నూరి సూర్యనారాయణశాస్త్రి, శ్రీమతి చిత్తజల్లు చిన వెంకటరత్నం, కీర్తిశేషులు అన్నాబత్తుల బులి వెంకటరత్నమ్మ; నాటకకళలో కీర్తిశేషులు స్థానం నరసింహారావు, బందా కనక లింగేశ్వరరావు, అద్దంకి శ్రీరామమూర్తి, పులిపాటి వెంకటేశ్వర్లు, గండికోట జోగినాథం, గిడుగు శీతాపతి, దామరాజు పుండరీకాక్షుడు, చలనచిత్రరంగంలో కీర్తిశేషులు బి. యన్. రెడ్డి, రేలంగి వెంకట్రామయ్య, చిత్తూరు వి. నాగయ్య, శ్రీమతి పసుపులేటి కన్నాంబ. అకాడమి పూర్వ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజును అకాడమీ ఫెలోషిప్పులతో గౌరవించింది.

అకాడమీ ద్విదశ వార్షికోత్సవ సందర్భమున ఈ గౌరవానికి సంగీత రంగంలో శ్రీయుతులు నోరి నాగభూషణం, షేక్ దావూద్, నృత్య రంగంలో శ్రీ వెంపటి సత్యం, శ్రీరామకృష్ణశుక్ల (కథక్) నాటక కళలో శ్రీయుతులు యన్. వి. యల్. నరసింహాచార్యులు, రొద్దం హనుమంతరావు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, మల్లాది సూర్యనారాయణ, శ్రీమతి అవేటి పూర్ణిమ, చలనచిత్ర కళలో శ్రీమతి శాంతకుమారి, ఆచార్య ఆత్రేయ ఎన్నుకోబడ్డారు.

## అనుబంధ సంస్థలు

నృత్య నాటక సంగీత రంగాలలో ఇతోధిక కృషిచేస్తున్న కళా సంస్థలను అకాడమీ గుర్తించి ఆర్థిక సహాయం చేస్తోంది. 1960లో ఉన్న 25 అనుబంధసంస్థలసంఖ్య క్రమక్రమంగా

పెరిగి ఇప్పుడు నూరు సంస్థలు అయినాయి. మొదటలో అప్పుడప్పుడు యివ్వబడిన ఆర్థిక సహాయం ఇప్పుడు ఏటేటా యివ్వ బడుతోంది.

### కళాశిక్షణాలయాలకు ఆర్థిక సహాయం

తెలంగాణా ప్రాంతంలో ఖమ్మం, జడ్చెర్ల, నాగార్జునసాగర్‌లోను, రాయలసీమ ప్రాంతంలోని కడపలోను నృత్య సంగీత పాఠశాలలకు, ఆంధ్ర ప్రాంతంలో గుంటూరులోని వీణ పాఠశాలకు అకాడమీ నెలవారీ గ్రాంటులను ఇస్తోంది.

### ఉపకార వేతనాలు

సంగీత నృత్య కళాశాలలో గాని, విడిగా నాట్యాచార్యులవద్ద గాని, విద్వాంసులవద్ద గాని విద్యనేర్చుకొనే బీద అభ్యాసకులకు అకాడమీ నెలకి రూ.100/-చొ॥న 20 మందికి ఉపకార వేతనములు ఇస్తున్నది. ఈ సంవత్సరం వీటిని నాటక కళలో కూడా ఇస్తున్నది.

### బిరుదు గ్రహీతలకు ఆర్థిక సహాయం

అకాడమీచే 'కళా ప్రపూర్ణ' బిరుదులను గ్రహించి ఆర్థిక యిబ్బందులకు గురి అయిన కళాకారులకు అకాడమీ నెలకు రూ.100/- చొ॥న ఆర్థిక సహాయం చేస్తూ వచ్చింది. ప్రస్తుతం ఈ సహాయాన్ని ఒకరు మాత్రం పొందుతున్నారు.

### వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయం

తమ జీవితాలను కళలకు అంకితంచేసి చరమదశలో ఆర్థిక బాధలకు లోనైన కళాకారులకు ద్రవ్య సహాయం చేయడం తన విధిగా భావించి, అకాడమీ ఇందుకు తన నిబంధనావళిని సవరించి ఈ కార్యక్రమాన్ని చేపట్టింది. 25 మందితో ప్రారంభించి ఇప్పుడు 50 మందికి ఈ సహాయం చేస్తున్నది. మొదటలో ఇచ్చిన నెలకి రూ 25/-లకు బదలు ఇప్పుడు రూ 50/- ఇస్తున్నది.

### యువ విద్వాంసులకు ప్రోత్సాహం

1976-77 సంవత్సరంలో సంగీత, నృత్య రంగాలలో యువ విద్వాంసులను ప్రోత్సహించేందుకు అకాడమీ ఒక నూతన పథకాన్ని రూపొందించింది. 18-30 సంవత్సరాల వయో పరిమితిలో ప్రతిభతో ప్రదర్శన యివ్వగల విద్వాంసులను కొందరిని ఏటేటా గుర్తించి, వారిచే అకాడమీ అనుబంధ సంస్థల ఆధ్వర్యాన ఆహూతులయిన సదస్సుల ముందు కొన్ని కచేరీలు చేయించి, వారి పారితోషికాలను అకాడమీయే ఇచ్చి అనుబంధ సంస్థలకు కూడా ఈ ప్రదర్శనల నిమిత్తం కొంత ధన సహాయాన్ని చేస్తున్నది. గత మూడు సంవత్సరాలలో 46 మంది విద్వాంసులను గుర్తించడం జరిగింది.

నాటకరంగంలో యువకులను ప్రోత్సహించేందుకు వర్కుషాపును రిపర్టరీ థియేటరును ఏర్పరచుటకు అకాడమీ నిర్ణయించింది.

ఈ పథకం 78-79లో అమలులోకి వచ్చింది. ఈ పథకం క్రింద రెండు నాటికలను రెండు నాటకాలను తయారుచేసి ప్రదర్శించటం జరిగింది.

### సాంస్కృతిక ఉపకార వేతనాలు

సంగీత నృత్య నాటక రంగాలలో ప్రత్యేక మైన ఉన్నత శిక్షణపొంది ఉత్తమ కళాకారులుగా రూపొందుటకు నెలకి రూ. 300/- చొప్పున ఉపకార వేతనాన్ని ఇచ్చే పథకాన్ని 78-79లో అకాడమీ చేపట్టింది. ప్రస్తుతం ఈ వేతనాలు ఆరుమందికి మాత్రం పరిమితం చేయబడ్డాయి.

### తోలుబొమ్మల కళలకు ప్రోత్సాహం

గ్రామీణ ప్రజలకే గాక పట్టణ ప్రాంతాలను సహితం ఆకట్టుకున్న తోలుబొమ్మలాట కళ క్రమక్రమంగా నిరాదరణకు లోను కావడం గుర్తించి ఈ కళను పునరుజ్జీవింపచేసి దానికి పూర్వ వికాసాన్ని కలుగజేసేందుకు అకాడమీ కొన్ని చర్యలు తీసికొన్నది. ఈ కళా ప్రోత్సాహానికి కేంద్ర సంగీత నాటక అకాడమీ సహకారాన్ని కోరుతూ ఒక పథకాన్ని సమర్పించింది. 1978-79లో బెంగుళూరులో జరిగిన దక్షిణ రాష్ట్రాల తోలుబొమ్మల సదస్సులో అకాడమీ పాల్గొని రెండు ఆంధ్ర బృందాల ప్రదర్శనలు ఏర్పాటుచేసింది. మరొక బృందాన్ని కలకత్తాలోని తోలుబొమ్మల ఉత్సవానికి పంపింది. రానున్న సంవత్సరంలో ఒక బృందాన్ని గుర్తించి రాష్ట్రంలో కొన్నిచోట్ల వారి ప్రదర్శనలు ఏర్పరచుటకును, సాధ్యమైనన్ని పురాతన తోలుబొమ్మలను సేకరించి భద్రపరచుటకును అకాడమీ నిర్ణయించింది.

### కళారంగంలో ఉత్తమసేవకు గుర్తింపు

నృత్య నాటక సంగీత జానపద కళలలో మెచ్చదగిన సేవచేసి గుర్తింపబడదగిన కళాకారులెందరో అట్టి గౌరవాలను అందుకోకుండానే కాలగర్భంలోకలిసిపోవడంవిచారకరమనే విషయాన్ని గమనించి అట్టి కళాకారులను కూడా గౌరవించడానికి 'వార్షిక బహుమతులు' అనే కొత్త పథకాన్ని కూడా అకాడమీ 1978-79లో రూపొందించింది.

### కేంద్ర సంగీత నాటక అకాడమీ సహకారంతో పథకాలు

రాష్ట్రంలో కూచిపూడి నృత్య సంప్రదాయం ఎక్కువగా ప్రచారంలో లేని తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో దానిని ప్రోత్సహించేందుకు కేంద్ర సంగీత నాటక అకాడమీ సహాయంతో 1977-78లో ఒక పథకాన్ని అకాడమీ అమలు జరిపింది. ఇందుకు శ్రీమతి నాగమణి బుద్ధదేవ్ (ఏలూరు) బృందాన్ని అకాడమీ గుర్తించి తన అనుబంధ సంస్థల సహకారంతో వారి ప్రదర్శనలు ఏర్పరచింది.

1978-79లో ఆదే పద్ధతిని తూర్పు భాగవత కళా ప్రచార పథకాన్ని కూడా అకాడమీ చేపట్టింది. శ్రీ బొంతల కోటి జగన్నాథం (శ్రీకాకుళం) బృందాన్ని ఇందుకు గుర్తించింది.

## సోదాహరణ ప్రసంగాలు

కళాప్రదర్శనలతో పాటు వాటివెనుక ఉన్న శాస్త్రంలో కూడా ఆసక్తి పెంపొందించేందుకు, నృత్య, నాటక, సంగీత జానపద కళలలో కొన్ని ప్రత్యేక విషయాలపై కళా వేత్తల సోదాహరణ పూర్వక ప్రసంగాలను అకాడమీ ఏర్పాటుచేస్తున్నది.

## గ్రంథాలయం-వస్తు ప్రదర్శనశాల

అకాడమీ నిబంధనావళిలో ఒక ఆశయాన్ని పురస్కరించుకొని నృత్య, సంగీత, నాటకాది కళలకు సంబంధించిన సుమారు 2500 పుస్తకాలతో అకాడమీ గ్రంథాలయాన్ని ఏర్పరచింది. ప్రఖ్యాత వైణికులు వీణా వెంకటరమణదాసు కుటుంబ సభ్యులచే బహూకరింపబడిన వారి రెండు వీణలతో ఒక వస్తు ప్రదర్శనశాలను కూడా అకాడమీ ప్రారంభించింది.

## టేపులు, గ్రామఫోను రికార్డుల సేకరణ

నాటక రంగానికిచెందిన పూర్వపు ప్రఖ్యాత గాయనీగాయక నటీ నటుల సంప్రదాయ సంగీతంగల 177 గ్రామఫోను రికార్డ్‌లను అకాడమీ సంపాదించి భద్రపరచింది. శాస్త్రీయ కర్ణాటక హిందూస్థానీ సంగీత సంప్రదాయాలలో ప్రముఖ ఆంధ్ర ఆంధ్రేతర కళాకారుల గాన వాద్యాలను అనేక టేపులలో పొందుపరచి పదిలంచేసింది.

## ప్రముఖుల చిత్రపటాలు

సంగీత నృత్య నాటక హరికథా కళా రంగాలకు చెందిన దివంగతులైన ప్రముఖ కళాకారుల, నాటక రచయితల పెక్కుతైల వర్ణ చిత్రపటాలు అకాడమీ గ్రంథాలయమందు ఆవిష్కృతమై యున్నవి. అకాడమీ వింశదుత్సవాల సందర్భమున శ్రీయుతులు పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, వేదాంతం రాఘవయ్య, డా॥ జి. రాజారావుల చిత్రపటాలు ఆవిష్కరించబడుచున్నవి.



# ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

## పదిసంవత్సరముల ప్రగతి

పసల సూర్యచంద్రరావు

ఆంధ్ర మాగాణులలో కళా సస్యముల పండించుటకై ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అను పేర ఈవిద్వత్సభను 23-12-57 సంవత్సరమున నాటి ప్రభుత్వాధినేతలు అగు విజ్ఞులు తమ విద్యుక్త ధర్మముగా భావన చేసి స్థాపించిరి.

కళలకు కాణాచిగా అనన్య సామాన్య మన్ననల గన్న తెలుగు నేలల మరల మరల దున్ని, ఎదచేసి, కళా బీజముల జల్లి మొల్కలెత్తించి, పండించి వివిధ రీతుల, వివిధ కళా లక్ష్యలక్షణ చమత్కార లావణ్య రాసులు రాసులుగా ప్రోవులు చేయు కాంక్ష దీని రూప కల్పనా సంకల్పము.

కళా కన్యకు యరోజనములు పాటమరించి రస హృదయులగు పిపాసకులను కికురించినది ప్రథమ దశలో. (10 సం॥ రములు) కాలములో పెరుగుచూ 2 వ దశలో ఉధుడ ద్యుతినందినది కదా? (20 సం॥రంలు). యవ్వన మధ్యస్తు రాలు కదా? సర్వాంగ కళారస సౌందర్యముల, మిస మిసల వెదజల్లు స్థితి! రసజ్ఞులు రసికులు పర్యాలోకించిన ఎన్ని నివ్వచ్చరువులో! నిరంతర రస సాహచర్య సమాలోకనమున గాని విశదములుగావు కదా? కాంక్ష లూరిన మా జోంట్లు దూరస్థులగుట ఈ వ్యవసాయాత్మక క్షేత్రమున యెత్తు పల్లముల రీతి యిదమిత్థమని చెప్పుట కష్టము. నుడువ జాలనిదికూడా. దశా స్థితుల తులనాత్మక పరిశీలనకు వర్తమానమున సన్నిహితులగు సభ్యులకు మాత్రము శుభోధకము. ఇప్పట్ల వాటియదోచిత స్థానపు సొబగొ బగుల ప్రశంసకు దొరకునుట అపరిశీలన మూలకమగు దొసగునకు తావీయును. శాస్త్రరీత్యాదశాచ్ఛిద్రములు అనివార్యములు. కళాశీలురు యిట్టివగు గ్రహచార ఫలములను సూక్ష్మ దృష్టితో పరిశీలించు ఆవశ్యకత ఎంతగానో అవసరము. కాలగతము లే సర్వులు- సర్వము. కళావిలసనమగు సర్వము సౌందర్యమునే చిందుచున్నను కాలగతమగుట వృద్ధి క్షయములు సహజములు: ఛిద్రముల మూలమున రూప సౌందర్యమును గోల్పోయిన సర్వము మరల నవోన్మిషిత మగుననుట సత్య దూరము కాదు. సౌమనస్కత - సహనశీలము అవసరము. కాలగతిలో కళల బాసిన చంద్రుడు మరల ఆగతియందే కళాపూర్ణుడుగా వెలుగుల ప్రచురించునుగదా! "కాలోహి దురతి క్రమః". కళా కృషీవలుడు తపనతో తాను పరిశ్రమించు తరి లభ్యమైన ఫలమునందుకాని, తనసుకర్మాచరణము ద్వారా వాసనాత్మకములును, వర్తమానోద్భూతములునగు కస్మలములు క్షాళన చేసుకొని- తదాది నిష్కల్మష హృదయగత సౌందర్య కళా శక్తి ద్వారా సమాజమును ఋజుమార్గమున పురోగమింపచేయవలయును. సంస్తవనీయులరగు కొందరు కళాభినివేశ హృదయముతో ఈ సంస్థను ప్రారంభించిరి. తొలుత ఈ సంస్థకు కళా సౌందర్య హృదయుడైన ఆర్. బి. రామకృష్ణంరాజుగారిని అధ్యక్షులుగా నాటి ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు ఉచితజ్ఞుడు - రసికుడునగుట, నియమించిరి. రామకృష్ణంరాజుగారు రాచఠీవి కళవాడు,

రసమెరింగిన ప్రౌఢ. వారితో సహకరించుటకు నియమితులైన సర్వులు, సరస హృదయుల గుటయు— వివిధములగు కళలయందు వేరు వేరుగా అభినివేశము కలవారగుటయు—ఆకాల మున నిధుల కొఱతను గూడా పరిగణించక “యితోధికమగు సేవలు చేసి ప్రగతిపథమున పయనించిరి. వారు పచరించిన బాటలు సుగ మములై నేటి కళాకాంతులకు మార్గదర్శక ములైనవి.

ముహూర్తబలము సంకల్పసిద్ధి కలదియగుట యెన్నెన్నో అసమంజస అవాంతరముల నధిగ మించి యిరువది రెండేండ్ల యవ్వనప్రాధుర్భా వమునంది నిలచినది, అకాడమీ యువతి. సర్వాంగ సుందరియయ్యు కృషీ భూతయై వాంఛాస్ఫూర్తి లేక కోరికలుతీరని వాంఛల తనియని కాంతులతో మధుర మంజుల సన్నివేశ ములు లేక మందగమనముతో ప్రశాంతముగ గమనమును శ్యందించుచు సాగించుచున్నది. మందగమనము యిందువదనలకు ఒకవిధమగు నందమేకదా? గంగకిద్దరి మేలు అద్దరి కీడు ఉండదు.

ఒక దళగడిచిన తరువాత 1968లో ప్రగతి పథంలో పయనించుచున్నట్లు అకాడమీ దశాబ్ద ఉత్సవము నొకదానిని జరుపుకొన్నది. ఇప్పుడు మరల రెండవ దళ గడిచిన రెండు వత్సరములకు మరల అదే మోజుతో ఒక ఉత్సవమును నెరపుకొన సంకల్పము బాగు న్నది. నిర్వాహకుల కాంక్షాస్ఫూర్తికై నెరప చూపు ఈ ఉత్సవ సందర్భమున చాలా విషయ ములు సాకల్యముగా సమాలోచన చేయ వలసిన అవసరము ఎంతగానో ఉన్నది. ఒకటి— రెండు—ఇట్లే ఎన్నిదళలు గడుచుచున్నను, గడవనున్నను ఒక విషయము మౌలికముగా, నిర్వాహకులగు కళాకాంక్షాపరులు దృష్టిలో నుంచుకొనవలసిన విషయము— అదెట్లు కళా పథములో గమ్యమును చేరుటకు, పథకముల రచన చేయవలయును అని. అకాడమీ బాధ్యత చాలా గురుతరమైనది. వివిధములగు కళా రీతుల గమనించి, ఉద్ధరించి, స్థగితపరచి కాలానుగుణ్యముగ నవీన రూపాలంకారముల రచించి— ఒకవైపు కళాకారుని మనోధర్మ మును నిర్ధరించుచు — వేరొకవైపు ప్రగతి పథంలో వివిధ మనస్తత్వాలతో, వివిధ వాతా వరణ పరిస్థితులలో ప్రయాణమునుసాగించుచు ప్రజాహృదయానందవమునకు రసోచిత స్థితికి దోహదపరచు రూప సౌందర్యముల కల్పించి అందించగలిగే ప్రణాళికలు తయారుచేయ వలసియున్నది. అకాడమీకి వివిధ కళల పోషణ బాధ్యత ఉన్నది. బహుళములైన, మన ఆంధ్రదేశమున, వర్ధిల్లిన కళలు అనేక స్థితులలో ఉన్నవి. బహుళాంధ్రీకృతము లైన బహుళములగు కళాప్రక్రియలు, ఒక్క మాటతో, ఒక్క సంకల్పముతో — ఒక్క ఉత్సవముతో ఉద్ధరించబడుటకు అలవికానిది. సంకల్పబలముతో, కళాకారుల అనవరత, అనితర వ్యవసాయాత్మక బుద్ధిబలముతో, నిరతిశయమగు కృషితో — ప్రభుత్వ వివేచ నాత్మకమగు వితరణ శీలముతో కూడిన ఆర్థిక సహాయముతో క్రమవికాసోన్నతుల నందగలదే కాని అలతిమాత్రమగు పని మాత్రము కాదు.

సమాజము నేటి పాశవిక ప్రవృత్తి నుండి బాహిరపడి, మానవుడు మానవునిగా సరళ

నిర్మల జీవితమును సాగించగలగవలెనను నిజమగు హృదయ పరివర్తన కలుగవలెనన్న, ప్రకృతి స్థితముగా వానిలో అణగియున్న విజ్ఞానము—సంస్కృతి ప్రకోపించగలగవలెను. అట్టి పరివర్తన మొక సక్రమ కళా విలసనము వలన మాత్రమే సాధ్యపడును. మానవ హృదయము, రాగ, ద్వేష, అసూయ, అహంకారస్వార్థ పరత్వములకతీతమై ప్రేమ ప్లావితము కాగల సాధనము ఒక కళ మాత్రమే. మానవుని పవిత్ర జీవన నిర్వహణకు యింతకన్న వేరు సులభతరమగు సాధన లేదు. ఆనంద విజ్ఞానముల సమ్మిళితములగు సుసాధ్య సాధనమీకళ. ఇట్టి అస్త్రామలక ఆనంద సాధనాన్ని కాల ప్రభావమున ఆంధ్రుడు మానవుడుగా విస్మరించటము జరిగినది. మేఘావృతమైన మానవ మేధస్సు ఈ విషమ పరిస్థితినుండి బయటపడి, తమస్సునుండి వెలుగుకు రావలె, కావున భ్రాంతిమయ జీవితమునకు స్వస్తి వాక్యములు పలికి- అలక్ష్యముగా విడిచిపెట్టిన కళాకేదారముల సాగుకు పరిపూర్ణ హృదయార్ద్ర సంస్కారముతో పూనుకొన్నచో, గ్లాని తొలగి దేశ పురోగతికి బాటలను పరచగలము. ఇట్టిదియ అకాడమీ బాధ్యత. ఇట్టిది ఉత్సవ నిర్వహణానంద సంకల్పము.

ముఖ్యముగ పరిశీలించవలసిన విషయము: అకాడమీ పాలన పోషణలో వుంచబడిన కళా సంపద చాల విపులమైనది. తలచిన మాత్రముననే చాల భారముగ తోచును. ఒకటొకటిగా పేర్కొన్నచో యిందలి బరువు బాధ్యతలు ఎవ్వరిపై ఎట్లు మోపబడినవో, యిందలి కష్టసుఖముల వైవిధ్యము ఏ రూపమున నుండునో, కళాకారులకు, కళాభిమానులగు మాన్యులకు సుబోధకమగును. ఈ సంస్థ ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అను నాఖ్యతో చెప్పబడుచుండుట సర్వులకు తెలుసు! సంక్షిప్తముగ పేర్కొనబడిన ఈ పదములో అనేకములగు కళలు యిమిడివున్నవి. సంగీతము— నాటకము- నాట్యము_హరికథ- జానపద నృత్యరీతులు-బుర్రకథలు-తోలుబొమ్మలు వీధినాటకము-వివిధ వాయిద్య రీతులు.యింకా, యింకా ఎన్నో! యిన్ని ప్రక్రియల పాలన, పోషణ, ఉద్ధరణ, బాధ్యతలు గల సంస్థ, ఈ అకాడమీ! విస్తృతములగు బాధ్యతలతోపాటు, వీటికిసరియగు, అవసరమగు నిధుల సహాయము ఆదినుండి కుంటువడి వుండుటచే చేయవలసిన, చేయగలిగినంత చేయలేకపోవుచున్నది.

ఈ జారుబాటులకు బాధ్యత చాలవరకు ప్రభుత్వము కళాసంపదయందు చూపుచున్న చిన్నచూపు! కళల ఉన్నత పథముల మలచి వాటి సౌందర్యరస సంపదలను పెంచుటలో రాష్ట్ర సంస్కృతీ సంపదలకు- ఋజువర్తనకు- సత్యశాంతులకు యెంతగా దోహదకారి కాగలదో ననుసత్యమును తెలుసుకొనలేకపోవుటయే. పాలకులు ఈ విషయమును సర్వదా, సర్వథా ఆలోచించుకొనవలసినదిగా మరియొకసారి జ్ఞాపకము చేయుచున్నాను.

అకాడమీ ద్వారా ప్రభుత్వము 1957 డిసెంబరు 23వ రోజున, కళల పునరుజ్జీవనమహోద్యమమునకు నాందీవాచికము పల్కుపనిలో స్థాపించబడి 1958 మార్చి 15వ రోజున మొదలు పెట్టి క్రమముగ అన్ని జిల్లాలలోను కళాకారులయొక్కయు సంస్థలయొక్కయు సర్వే

జరిపి ప్రతి పట్టణ, పల్లెలయందున నాటికి నెల కొనియున్న సంగీత, నాటక, నృత్య సంస్థలను గూర్చియు, కళాకారుల గూర్చియు, నాటక కర్తల గూర్చియు భోగట్ట చాలవరకు సేకరించి 1960 నాటికి శ్రీ శ్రీనివాస చక్రవర్తి, శ్రీ ఎ. ఆర్. కృష్ణలు కూలంకష ముగా పరిశీలన జరిపి, "మ్యూజిక్, డాన్స్ అండ్ డ్రామా యిన్ ఆంధ్ర ప్రదేశ్" అను ఒక పుస్తకమును ప్రచురించిరి. కాని, నాటికే అది సమగ్రమగు చరిత్ర కాదు. యిప్పుడు యిరువది ఒక్క సంవత్సరములు గతించినది, ఈ ప్రయత్నము జరిగి. సర్వకళా కళాకారుల సమగ్ర చరిత్ర మరల సేకరించి ప్రచురించ వలసిన అవసరము ఉన్నది. ఇది చాల బృహత్కార్యము. ప్రభుత్వ సహాయముతో అకాడమీ ఈ పనికి పూనకొనవలెనని అద్యతన భావిలో యియ్యది వెలువడవలెనని నేను కాంక్షించు చున్నాను.

అకాడమీ అంకస్తములై-తమ తమ సొబగులు దిద్దుకొని తారాడు నుత్కంఠతో అంకితములగు వివిధములగు కళా కాంతల పూర్వాపర స్థితిగతుల సమాలోచన క్రమములో మొదటిదిగ సంగీత ప్రసక్తికి ఉపక్రమింతము.

సంగీతము:— మానవాంతర్గతమై, పరమై యున్న శబ్దము (శక్తి) ఆధ్యాత్మిక సాధన వలన కికురించబడి క్రమ వికాసము చెంది వైఖరీ రూపగతమై అక్షరమై- శబ్దమై- వాక్యమై- రసయుతమై- రాగమై- సహానుగీతితో సంగీతమైనది. చతుర్వేదములు, వివిధరూపముల అంతర్నిహితమైన స్వర, తాళ, రాగ (రస), సాహిత్యసమ్మేళనమగు సంగీతము ఈ సంగీత జ్ఞాన సాంగత్యము వలన మానవునిబుద్ధిమతులు వికాసవంతములై - శక్తి సమన్వితములై - చైతన్యవంతములగుట చిరంతనమగు సత్యము ఈ సత్యమును, యిందలి రహస్య రీతులను ఏనాడో సమగ్రముగ గ్రహించి లాలించినది, మన ఆంధ్ర జనయిత్రి. ఇయ్యది శాస్త్రముగ పరిగణన నంది లక్షణాన్వితమైనది. ఎందరో మహానుభావులు ఈ లక్షణమునకు లక్ష్యమును అనేక రీతుల పచరించిరి. ఆపాతమధురమగు ఈ సంగీతము, గాంధర్వముగ పేర్కొనబడుట గమనించ, దీనిని సగీతజ్ఞులు, భౌతికానందమునకు పరిమితము చేయక ఆధ్యాత్మికానందమునకు సాధనముగ చేపట్టిరను సత్యము పొడగట్టుచున్నది. యిట్టిదగు, గాంధర్వ వేదము అత్యోన్నతికి పట్టుకొమ్మయని నిర్ణయించి నారు కాల ప్రభావములో, ఆంధ్ర దేశమున ఒకదశలో ఉన్నత సంప్రదాయము, స్థితుల నుండి కొంతజారిన ఈ కళామతల్లికి, సేవలొనర్చు బాధ్యత అకాడమీ చేపట్టి ఓపినంత సహాయ సేవా సహకారములనందించుటలో- సదస్సుల నడిపి, గురుకులముల నెలకొల్పి ఉన్నత విద్యకై ఉత్సాహవంతులగు యువ కళాకారులకు ఆర్థిక సహాయము చేసి, అనేకములగు, జంత్ర వాద్య గాత్ర కచేరీలను ఏర్పాటు చేసి, సంస్థలకు ప్రోత్సాహమిచ్చి, సమాజమును చైతన్యమునొనర్చినది. చాలినంత కాకపోయినను చేతనైనంత, ఓపినంత సేవచేసినదనుట సత్యదూరముకాదు. ప్రాచీన సంప్రదాయమునసనుసరించి, కొన్ని గురుకులములను నెలకొల్పిన ప్రతిష్ఠ విశిష్టముగా అకాడ

మికి దక్కినది. 1958 లోను తరువాతను ఒక టొకటిగా విజయవాడలో శ్రీ చిలకలపూడి వేంకటేశ్వర శర్మగారు కులపతిగా గాత్ర సంగీత సాధనకు గురుకులము- గుంటూరులో శ్రీ తిరుమల నల్లాన్ చక్రవర్తి వేంకట నారాయణాచార్యుల వారు కులపతిగా వీణా వాదన గురుకులము-తదుపరి నాదస్వరమునకు జన్మస్థానముగ పేర్కొనబడు చిలకలూరి పేటలో షేక్ ఆదమ్‌గారు కులపతిగా నాద స్వర గురు కులమును - తాడేపల్లిగూడెంలో శ్రీ నవుడూరి ముసలయ్య కులపతిగా డోలు గురుకులమును- నెల్లూరులో శ్రీ రాళ్లపల్లి నటేశయ్యగారు కులపతిగా గాత్ర సంగీతగురు కులమును-విశాఖపట్టణమున శ్రీ వాసా కృష్ణ మూర్తిగారు కులపతిగా వీణా గురుకులమును ఏర్పాటు చేసినది. నాటి గురుకులపతులందరు సాంప్రదాయ సంగీతపు తీరుతెన్నులు సమగ్ర ముగ ఆపోసన పట్టిన కళాస్రష్టలు.

అనేక సదస్సులను జరిపి ప్రముఖ గాన వాద్య, సంగీత కచేరీలను శాస్త్ర విషయము లపై వ్యాసంగములను వ్యాస పఠనములను చేయించి సంగీత రసజ్ఞులకు, విద్వాంసులకు ఉత్సాహమును కలుగచేసినది. యిచ్చట ప్రత్యే కముగ పేర్కొనునది సంగీత కళా తపస్వులకు "గాన కళా ప్రపూర్ణ" అను బిరుదు నొసంగి సత్కరించి తనప్రతిష్ఠను యినుమడించుకొన్నది అకాడమీ ఈ సుకార్యము వలన. 1960 లో కర్ణా టక సంగీత సదస్సు ఏర్పాటు చేసి ఆ సభా ధ్యక్షులుగా వాగ్గేయకారులును, సాహితీ వల్లభులును, సకల శాస్త్ర మర్మములనెరింగిన శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారిని ఆహ్వానించి వారిని "గాన కళా ప్రపూర్ణ" బిరుదుతో సత్కరించినది. యిది నాందిగా తరువాత 1962 లో హిందూస్థానీ సంగీత సదస్సు (విశాలాంధ్రలో హిందూస్థానీ సంగీత మున్నది.)ను జరిపి ఆ సభకు ప్రఖ్యాతులు, హిందూస్థానీ సంగీత వేత్త డాక్టర్ రతన్‌జనకరు గార్ని అధ్యక్షులుగా ఆహ్వానించి వారిని గాన కళా ప్రపూర్ణ" బిరుదుతో సత్కరించినది. 1964లో విజయవాడలో కర్ణాటక సంగీత సదస్సుకు అధ్యక్షులుగా ఆహ్వానింపబడిన శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్యంగారికి "గానకళా ప్రపూర్ణ"బిరుదమునొసగి సత్కారముచేసినది. 1966లో వరంగల్ లో జరిపిన సంగీతోత్సవ మునకు అధ్యక్షతవహించిన డాక్టర్ పినాక పాణిగార్ని "గాన కళా ప్రపూర్ణ" బిరుద ముతో సత్కరించినది. 1966లో విశాఖపట్టణ మున జరిగిన సదస్సులో శ్రీ పర్వత నేనివీరయ్యా చౌదరిగారిని "గాన కళా ప్రపూర్ణ" బిరుద ముతో సత్కరించినది. 1968లో తిరుపతి సద స్సులో శ్రీ క్రోవి. సత్యనారాయణ గారిని "గానకళా ప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్క రించినది.

ఏవం విధముగా సత్కారములు, సదస్సులు జరుపుటయే గాక, అనేక సంగీత శాస్త్ర గ్రంథముల ప్రచురణముకు పూనుకొని, సంగీత సంప్రదాయ ప్రదర్శినిని సరిచేసి సమగ్రముగ ముద్రించి ప్రచురించినది. అనేక సంగీత సంస్థలను గుర్తించినది. ప్రసిద్ధుల సంగీత మును టేప్‌రికార్డ్ చేయించినది మరుగున పడిన విశిష్ఠ తాళగతులలో చెప్పుకోతగ్గ మరపురాని మరువకూడని ఒక ప్రక్రియ అపూర్వ "పంచ ముఖ తాళవిద్య"ను శ్రీ ముట్నూరి సూర్య

నారాయణ శాస్త్రిగారివల్ల ప్రదర్శింప చేసి ప్రచారములు చేసి స్తగిత పరిచి వారిని అకాడామీ విశిష్ఠ సభ్యునిగా గౌరవించినది. యియ్యది చాల మంచిపని. వృద్ధకళాకారులకు భృతినొసంగినది. సంగీత కళోద్ధరణకై విశిష్ఠ సేవలొనర్చిన అత్యుత్తమ కళా తపస్వులకు- విశిష్ఠ సేవా పథకములనిచ్చి గౌరవించినది. వారు శ్రీయుతులు రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ, ద్వారం వెంకటస్వామినాయుడు, చిత్తూరు సుబ్రహ్మణ్యం, బాబూరావు, చింత పల్లి వెంకట్రావు, పంచముఖతాళ నిరుక్త ముట్నూరి సూర్యనారాయణ, అంబాప్రసాదు గారలు.

నృత్యం:- "దేవీ తుష్యతి లాస్యేనే, తాండవేనచ శంకరం." పరమాత్ముని కదలిక కళ ఆ కదలికే శక్తి. సృష్టికి కళమూలము. కళోపాసన వలన మానవుడు శక్తియుక్తుడగునను గమనార్హము. ఈ కళా (కదలిక) విన్యాసము నాట్యము ఇట్టి నాట్యము ఆంధ్ర దేశమున క్రీస్తు శకమునకు పూర్వమే, సుస్థిరత నేర్పరచుకొన్నట్లు నాట్య శాస్త్రమే చెప్పుచున్నది. దాక్షిణాత్య ప్రవృత్తికి సన్నిహితులగుట నృత్య - గీత, - వాద్య ప్రియులు ఆంధ్రులు అప్పటికే లలిత కళల యందు ఎంతయో అభినివేశమును కలిగి యుండిరి. ఆత్మ విశ్వాసమును-విజ్ఞానమును విశ్వవ్యాప్తము చేసిన హైందవ సంస్కృతికి నిలయమైనది నృత్యకళ. ఆంధ్రుల ఆలయ ప్రాంగణాలలో కాలకాలములలో విన్యసించి నది ఒక ప్రత్యేక తెగ, ఈ నృత్యములకంకితమై చరితార్థులైనారు. ఇప్పటిలో ఈ విద్య నందరూ అభ్యసించుచున్నారు. క్రమానుగతముగా, సంఘము నాట్య ప్రయోజనజమును గుర్తించుట యిందువల్ల వ్యక్తమగుచున్నది గదా? సుమారు నాలుగు దశాబ్దముల క్రిందట ఒకింత వెనుకబడిన నాట్యరీతులు మరల అకాడమీ చైతన్యవంతములగు ప్రణాళికల వల్లను, నెఱపిన సదస్సుల రూపమునను, ఉత్సాహమును పుంజుకొని మరల పూర్వ సౌందర్యముతో నలరారుచున్నది. ప్రతి కళా స్వరూపములు, ద్వివిధములుగ పేర్కొనబడుటయున్నది. మార్గ-దేశీయములు. ఏది సంప్రదాయ సిద్ధము? ఏది దేశీయము? ఈ విషయము బహు సున్నిత విషయము. ప్రతి కళా సౌందర్యము ఒకదానిపై నొకటి ఆధారపడి వర్ధమానములగును. ప్రాజ్ఞులగు స్రష్టలు వీటికి తమ లక్ష్యసాధనమూలముగా లక్షణముల నేర్పరచిరి. దేశ కాలములననుసరించియు, అచ్చటచ్చటి మానవ ప్రకృతి- సంస్కృతిని బట్టియు-ఆచార వ్యవహారముల పురస్కరించుకొనియు - వారల ఆధ్యాత్మిక ఉన్నత సాంప్రదాయములను అనుసరించియు ఈ విచక్షణలు తలెత్తుట. సర్వరీతులు వేద గతములే. చతుర్వేత నిర్గమములైనవియే. ఈ సంగీత-సాహిత్య-నృత్య-నర్తన-అభినయ తాళ రాగములన్నియు. వీటి కలయికల భేదములు, రీతులన్నియు. అకాడమీ ప్రథమ ప్రయత్నమే కూచిపూడి నృత్య కళోద్ధరణ. కూచిపూడి నృత్య సంప్రదాయము, సుమారు 500 సంవత్సరములనాటిది. నాటికి నాట్య కళా మార్గము ప్రచురింపబడియేయున్నది. నాటి సాంఘిక పరిస్థితి - మానవ మేధస్సు యొక్క తీరుతెన్నులు - నాటి మత ప్రభా

వము-కుల వ్యవస్థ-ఆర్థిక స్థితి - కాలావకాశము-విద్య-ఇత్యాదనేక విషయములను పురస్కరించుకొని కళలను మలచుకొనుట జరిగియుండవచ్చును. లోక వృత్తానుకరణము కదా నాట్యము. అట్టియెడ మార్గమున దేశీయ ఛాయలు అలముకొనుటకు అవకాశము అవసరములుంట సాంప్రదాయమునకు బాహ్యమైనది కాదుగదా! ప్రగతిపథములో పాత క్రొత్తల కలయిక - తప్పదుగదా! ప్రాంతీయ దురభిమానముల మూలమున విచక్షణా దృష్టి అనివార్యము. ఏ కళా రూపమైననూ మానవోన్నతికి దోహదకారియై-భావ వికాసమును చేకూర్చునో అది ఆలంబన యోగ్యమైనదే. కూచిపూడి భాగవత కళ శాస్త్రీయము-దేశీయము కూడా. శాస్త్రము లేనిది దేశములేదు. దేశీయము శాస్త్రీయమే. ఆ వాదుల వలన ప్రయోజనము లేదు. కళను నూతన రీతులలో, సంస్కారములతో, సంఘమునకు, అందించగలుగుట ఒకటే ప్రయోజనముగ రసజ్ఞులు భావన చేయవలయును. 1956 లో అకాడమీ కూచిపూడి నాట్య సదస్సును ఏర్పాటుచేసి కూలంకషముగా చర్చలుజరిపి ఈ నృత్యము శాస్త్రీయమైనదన్నారు. ఈ ఆంధ్రుల అభిమాన నృత్యకళ, భద్రతకు, ప్రాచుర్యమునకు, విస్తరణకు పూనుకొని, ఈ భాగవత కళకు జన్మస్థానమగు కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర నాట్యకళాశాలను - 1960 పూర్వార్ధములో ప్రారంభించినది. సిద్ధేంద్రునకు ఉనికియైన కూచిపూడి సమీపమున సుప్రసిద్ధ వాగ్గేయకారుడు, మధుర భక్తిని-సరస సంగీత నృత్యాభినయముల రంగరించిన పద సాహిత్యముతో-రసజ్ఞ శేఖరుల నుఱ్ఱూతలూగించిన క్షేత్రయ్య జన్మస్థలమగు మొవ్వలో వారి 300 ల జయంత్యుత్సవములను అకాడమీ జరిపి ఆ కళా కేదారమును చైతన్యవంతమొనర్చి బహుముఖ ప్రజ్ఞా పాటవము కల కవులచే, క్షేత్రయ్య మధుర మంజుల వాగ్విలాస నృత్య-నర్తనాభినయముపై ప్రామాణిక విషయ వ్యాసంగము చేయించి వ్యాసముల ప్రకటన చేసినది. ప్రదర్శనల నేర్పాటు చేయుటయు బహుళముగ జరిపినది. "క్షీరసాగర మథనము" అను నృత్యనాటకమును తయారుచేయించి ప్రదర్శనలనిప్పించినది జాయపసేనాని రచిత నృత్తరత్నావళిని శ్రీ రాళ్ళబండి వారిచే తెనుగుచేయించి ప్రచురించినది. 1964 లో అఖిలభారత నృత్య సదస్సు ఏర్పాటుచేసి భారతీయ నృత్య రీతుల నెన్నిటినో ఆహ్వానించి ప్రదర్శింపచేసి, ఆయా నృత్యరీతులపై ప్రముఖ కళాస్రష్టలచే వ్యాసములు వ్రాయించి ఒక ప్రత్యేక సంచిక [నాట్యకళ] ను ప్రచురించినది. ఆ అఖిల భారత నృత్యకళా సదస్సునకు అధ్యక్షులుగా ఆహ్వానింపబడిన ప్రముఖ కూచిపూడి కళావేత్త చిత్ర దర్శకుడు శ్రీ వేదాంతం రాఘవయ్య గారిని "భరతకళా ప్రపూర్ణ" బిరుదముతో అకాడమీ సత్కరించినది. నాటి ఉత్సవములో కూచిపూడి, ఒడిస్సి, మణిపూరి, కథక్, భరతనాట్యం - దేవదాసీ నృత్యరీతులుగా గల ఎన్నో బృందములు ప్రదర్శనలిచ్చినవి. అట్టిది నభూతో నభవిష్యతి రసజ్ఞులు వేనోళ్ళ ప్రశంసించిరి. నాటి సభలలో పాల్గొన్న, వివిధ కళా ప్రక్రియల రస మెఱింగిన ప్రౌఢ కళాకారులు, కూచిపూడి

సాంప్రదాయమగు కళగా, నిర్ణయించినారు 1966లో విజయనగరంలో జరిపిన నృత్యోత్సవములో అధ్యక్షులుగా శ్రీ చింతా కృష్ణమూర్తిగారిని ఎన్నుకొని వారికి "భరత కళా ప్రపూర్ణ" బిరుద ప్రదానముచేసి సత్కరించినది. 1967లో విజయవాడలో పర్చాటు చేసిన నృత్యోత్సవమున అధ్యక్షులు శ్రీ నటరాజ రామకృష్ణ గారిని "భరత కళా ప్రపూర్ణ" బిరుదముతో నలంకరించి సన్మానించినది. ఆంధ్రప్రదేశమునకు చెందిన తూర్పు ప్రాంతముగ పేర్కొనబడు శ్రీకాకుళము, వైజాగు జిల్లాలలో అత్యంత ప్రచారములోనున్న నొక విశిష్ట భాగవతా కళా రీతిని, మరుగునపడుతున్న దానిని, బహుళ ప్రచారమునకు చేపట్టి అచ్చటి ప్రముఖ కళాకారుడు ఆచార్యుడునగు శ్రీ వరదా వెంకట నారాయణ గార్ని గురుకులపతిగా నిర్ణయించి, ఈ నృత్యరీతికి దోహదము నొసంగినది. 1968లో జానపద నృత్యోత్సవమును అతి వైభవముగ జరిపినది. అందు బుర్రకథ, తోలుబొమ్మలు, తూర్పు భాగవతము, డప్పుల మేళము, పులివేషము ఇత్యాది ఎన్నో ప్రదర్శింపచేసి ప్రాచీన జానపద నృత్యరీతులకు ఉత్సాహ చైతన్యముల నందచేసినది. ఈ సదస్సు హైదరాబాదు నందు జరిగినది.

ఆల్లే ఆంధ్రమాగాణులలో చిరకాలముగా ఆదరణమునంది ప్రవర్ధమానమై, సార్వజనీనమై, సర్వులు పోషించిన దేవదాసీ నృత్యము క్రమవికాసమును కోల్పోవుట గమనించిన అకాడమీ అట్టి విశిష్ఠ కళ మాసి మరుగునపడు ప్రమాదమున్నదని గ్రహించినదగుట దాని గణ్యతను చూపి చాటి చెప్పుటకు నాటికి సంఘమున, కొన వూపిరితోనున్న, చాలా మంది వృద్ధ కళాకారులను ఆహ్వానించి, రాజమహేంద్రపురములో ఒక ప్రత్యేక సదస్సును జరిపి, ఆ కళా సౌందర్యమును రసజ్ఞులకు చవిచూపి ఈ ప్రాచీన అభినయ కళను పునరుద్ధరించుటవుసరమని, సర్వులచే ననిపించినది. కాని ఈ కళారీతుల ప్రచురించువారికి, కులాచార సంస్కరణ విషయవలయములో, సాంఘిక కట్టుబాట్ల పరిధిలోనికి లాగబడి కళపై ఒక అశనిపాతము పడినది. ఇదిజటిలమగుసమస్య. సూక్ష్మమగు, విశాల దృక్పథము అవసరము. ఈ కళోద్ధరణకు. ఆధ్యాత్మిక హృదయోన్నతికి బహుధా ఉపయుక్తమును - దోహకారులును అగు ఈ నృత్యరీతులలో, పూజా నృత్యము, కేళికలు, కథాభినయము, నాయికా నాయకుల లక్షణముల తెలుపు మధుర రీతుల, సర్వరసముల శృంగారమే విశిష్ఠ రసమగుట తద్రూపమున పరమేశ్వర ప్రాప్తికి సూక్ష్మ మార్గములు ప్రాప్తములగుటకు చాల అవకాశముంటచే ఈ ఆలయ ఆస్థాన నృత్యరీతి మరపురాని మరవకూడని రీతిగా నిలిచినది. ఈ సాంప్రదాయ స్వరూపముల విశిష్ఠతను చాటినవారిలో పేర్కొనదగిన వారిని అకాడమీ గుర్తించి ఉచితమగు రీతిని సత్కరించినది. వారు శ్రీమతులు చాటపర్రు సుందరి- చింతా భద్రం-దుగ్గిరాల శ్రీనిరంజితం-దుగ్గిరాల మాణిక్యం-కాళికనకం-సిలపల్లి నీలాచలం- చిత్తజల్లు వెంకటరత్నం-చిత్తజల్లు వైదేహి, ఇందువదన- కోటిపల్లి సుందరి- పిచ్చాయి- దుగ్గిరాల వెంకటరత్నం- ముగ్గళ్ళ

ముడు- అన్నాబత్తుల పెదవెంకటరత్నం-
ణిక్యం-చినవెంకటరత్నం-ఏలూరు శేషా
ం -జీవరత్నం-పారుజాత పుష్పావతి-వీరం
ా భాగవత దేవదాసీ సంప్రదాయ, భరత,
నయ విద్యలలో అఖండ ఖ్యాతినార్జించిన
న్యులు. ఇటీవలవరకు అకాడమీతో సన్ని
ం సంబంధము కలిగి అకాడమీ మన్ననల
ే "భరత కళా ప్రపూర్ణ" బిరుదముచే
రింపబడిన అన్నాబత్తులబులివెంకటరత్నం
ం ప్రత్యేకముగా ప్రశంసించ దగినవారు.
ము స్మరణీయులు.

నాటకము:— 1957లో ఆంధ్ర ప్రదేశ్
త నాటక అకాడమీ ప్రాదుర్భవించు
కే, నాటక రంగ పరిస్థితి దిగజారినది.
టికే నాటక రంగమును గూర్చి ఆందో
చెందుతున్న నాటక కళాభిమానులు,
పునరుద్ధరణ కొఱకు చాలా పథకములను
న చేసిరి. అందులో ప్రత్యేకమగు కృషి
బహుళాంధ్ర ప్రదేశముల పర్యటించి,
క సంస్థల తిలకించి అనేకులురగు
కళాకారులు అభిమానులను
, అభిప్రాయముల సేకరించి పూర్వ
ిను గూర్చి విషయముల సమగ్రముగ
ాహనమును చేసుకొని, తమ నాటి పర్య
నుభవములను క్రోడీకరించి, తమతమ అను
ములతోపాటు సమన్వయించి ఒక నివేది
1949 సంవత్సరములో ఉమ్మడి మద్రాసు
ంత్వము నియమించిన నాటక పునరుద్ధరణ
ంము. నాటికదొక విశేషము-ఆంధ్ర నాటక
ము నాటికే యశస్సును కోల్పోయినదను
యిది తార్కాణము. యీ నివేదికను

1957 తరువాత ఆంధ్ర అకాడమీ ముద్రింప
చేసినాడు కళావేత్తలు అందించిన కొన్ని
సూచనలు చేపట్టి రంగస్థల పునర్నిర్మాణము
నకు పూనుకొని సదస్సు జరిపి నాటక విద్యా
లయముల స్థాపించి నూతన నాటక రచనలకు
ప్రోత్సాహమునిచ్చి అనేక సంస్థలతో సహక
రించి ఒకచైతన్యమును కలుగచేసినది. అప్పు
టికే ఆంధ్ర దేశమున ముప్పదిసంవత్సరములుగా
నాటక కళకు దాని చైతన్య-వికాస-ప్రగ
తికి దోహదకారిగా సర్వతోముఖముగా వ్యవ
హరించుచున్న ఆంధ్ర నాటక కళాపరిషద్‌తో
అకాడమీ చేయికలిపి సంయుక్తముగా అచ్చ
టచ్చటి నాటక సమాజముల, నాటక కళా
ప్రియుల సహకారముతో బహు ప్రదేశముల
నాటక కళోత్సవముల నేర్పాటు చేసినది.
1960లో జరిపిన ఉత్సవమునకు శ్రీస్థానం
నరసింహారావు గారు అధ్యక్షులు. ఆ సదస్సును
ప్రారంభించుటకు వంగదేశపు మహానటుడు
అహీంద్ర చౌదరిని ఆహ్వానించిరి. నాటి సద
స్సులో పద్మశ్రీ స్థానం వారిని "నాటక కళా
ప్రపూర్ణ" బిరుదముతో సన్మానించి సత్కరిం
చినారు. ఆ సదస్సులో నాటక కళలో కాకలు
తీరి ఆరితేరిన ప్రముఖ కళాకారులు 5గురును
విశిష్ట సభ్యులు (ఫెలోషిప్)గా సత్కరించి
నారు. వారు: శ్రీ బండా, రేలంగి, అద్దంకి,
పులిపాటి, గండికోట జోగినాధం గారలు.
గుడివాడలో ఒక నాటక విద్యాలయము
ప్రముఖ కళావేత్త శ్రీ బసవరాజు సుబ్బా
రావుగారి పర్యవేక్షణమునను-శ్రీ శ్రీనివాస
చక్రవర్తిగారి ఆధ్వర్యమున విజయవాడలో
ఒక నాటక విద్యాలయమును, అనంతపుర
మున శ్రీ రొద్దం హనుమంతరావు గారి

నేతృత్వమున ఒక విద్యాలయమును నడిపిరి. నాటికే. ఆంధ్ర ప్రదేశ నాటక సంఘము ఒక విద్యాలయమును నడుపుచుండి నాటక కళకు సముచిత సేవ చేయుచుంటయు, ఆంధ్ర నాటక కళా పరిషత్ పొత్తుతోను, వాటి ఉభయుల తోను సహకరించి అకాడమీ నాటకోత్సవ ములు ప్రతియేటా నిర్వహించినవి. ఈ విధ ముగా కళాకారులతోను, కళా సంస్థలతోను కలిసి నాటక కళా సిద్ధాంత పరివ్యాప్తికి ఎంత గానో తోడ్పడి తెలుగు నాటక రంగమునకు అకాడమీ చాలా మేలు చేకూర్చినది. ఒక ప్పుడు-నాటక రంగ పునరుజ్జీవమునకు- పుష్టికి హంగుగా ఆంధ్ర నాటక కళాపరిషత్ ప్రారం భించిన "నాట్యకళ" త్రైమాసిక పత్రికను కొంతకాలము శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు అకాడమీ ఆర్థిక సహకారముతో మాసిక పత్రి కగా వెలువరించిన దానిని, ఇతోధిక ఉత్సాహ ముతో సర్వకళాభిమానులకు వీలుగానందుటకు విశిష్టముగ నడుపదలచి అకాడమీయే చేపట్టి ప్రకటనకు ఉపక్రమించినది. ఇదొక బృహత్తర విషయము. ప్రారంభమున నాట్యకళ త్రై మాసిక-కొంతకాలము ద్వైమాసిక--చాల కాలము అకాడమీ ఆధ్వర్యములో మాసిక_ మరల యిప్పుడు త్రైమాసికగా మొదటి స్థితికి వచ్చినది. "నాట్యకళ" ఎన్నో కళోత్సవ సందర్భములలో ప్రత్యేక సంచికల వెలువ రించినది. 1967లో ఏలూరులో జరిగిన నాట కోత్సములలో అధ్యక్షత వహించిన శ్రీ అద్దంకి శ్రీరామ మూర్తిగారిని "నాటక కళా ప్రపూర్ణ" బిరుదముతో సత్కరించి అకాడమీ ధన్య అయినది. 1966లో హైదరాబాదులో రవీంద్ర భారతిలో అకాడమీ ఆధ్వర్యమున ఆంధ్ర ప్రదేశ్ నాట్యసంఘ సహకారముతో నాటకోత్సవములను నిర్వహించినది. 1964లో నాట్యకళా ప్రపూర్ణ శ్రీ బళ్లారి రాఘవ సంస్మరణోత్సవమును పెద్దయెత్తున జరిపినది. నాట్య శాస్త్రమునకు శ్రీ పోణంగి అప్పా రావు గారికి, నాట్యవేదమునకు శ్రీ జమ్మల మడక మాధవరామశర్మగార్కి, శ్రీ రోహిణి గారి నాటక శిల్పమునకు, ప్రసన్న రాఘవ ప్రబంధమునకును, ఆర్థిక సహాయమునందించి నది. అన్ని కళలలోను ప్రామాణిక గ్రంథ ములను ప్రచురించు ఉత్కంఠతో అకాడమీ బహుళ ప్రయత్నముచేసి ప్రత్యేకముగా, ఆర్థిక సహాయమును ప్రభుత్వమునుండి పొంది సుమారు ఒక లక్ష రూప్యములు విలువచేయు ముద్రణాలయమును సంపాదించినది. అదియిప్ప టిలో అద్దెకివ్వబోవుట చింతించవలసిన విషయ ము. కాలగతి! ఈ ప్రగతి పథమున పేర్కొనవలసిన దొక విశిష్ట విషయ మును గూర్చి సగర్వముగా చెప్పవచ్చు. అయ్యదే "సంచార రంగస్థలం." (పోర్టబుల్ స్టేజ్) ను ఒకదానిని బహుళ ప్రయత్న మున అకాడమీ సమకూర్చుకొన్నది. అప్ప టిలో ముఖ్యమంత్రిగను, యిప్పటి రాష్ట్రపతి యును అయిన నీలం సంజీవరెడ్డిగారి కళాహృద యమునకు అది సూచి. దాని వ్యయమునకై వారు ప్రత్యేకముగ, దాని విశిష్టతను, ఆవశ్యకతను గూర్చి నేను చెప్పినంతనే ఆర్థిక సహాయమునందించిరి. ప్రత్యేకముగ! అయ్యది యిప్పుడు జడమైన స్థితిని దాసియున్నది! ఏ సంకల్పముతో దానిని నిర్మాణము చేయుట జరిగినదో ఆ ఆశయము సిద్ధించక పోవుట దురదృష్టము. సహృదయులు, మొద

టిలో ఎంతటి కళా సౌందర్యకారులై అకాడమీ రూపమును దిద్దినారో, అంత 1971వ నాటికి అకాడమీ ఉనికిలో, రూపములో, నడకలో, వ్యత్యస్త పదారవిందగా రూపొందినది. పాలకులు గదా—పోషించినా, నిరసించినా, ప్రజాస్వామ్యములో ఏనాటికెట్టి ఆధ్వర్యముల పాలబడునో రాజ్యపీఠము! దుశ్చింత, దురహంకారములకు కళాపీఠము బలికాకూడదు! సౌందర్యముతో కారాదు కళామతల్లిని చూచి ఏవగింపు పనికిరాదు! కళా సంపదే దేశ సంపద ! సౌభాగ్యము! కళా పీఠములపై విషాదచ్ఛాయలు అలమరాదు. కళ అంటే విషాదాన్ని మాధుర్యముగా మార్చగల మహా మంత్రము ! అశాశ్వత అధికారమును దుర్విని యోగ పర్చకూడదు.

ఏవం విధముగా సంగీత నాటక అకాడమీ బహుముఖాల తెలుగు నాటక రంగ పునరుజ్జీవనమునకు ఓపినంత ఇతోధిక దీక్షతో దోహదము చేసినది. సమగ్రమగు నాటక కళను వర్ధమాన, ప్రవర్ధమానము చేయుటకై అకాడమీతో సహకరించి సహాయము చేసి ప్రభుత్వము యిప్పట్ల తగిన శ్రద్ధ తీసుకొనవలెను. కానిచో నాటక కళామతల్లికి, తీరని, తీర్చలేని, అపచారము జరుగుననుట సత్యదూరముకానేరదు.

హరికథ:- ఈ విశ్వ సహానురక్తి, హాందిక, శ్రావ్యత, ఏకస్వనము పైననే మానవుని అనుపమానంద, అనుభూతి ఆధారపడి వుంది. సహానురక్తియే మానవుని యునికికి, వున్నతికి మూలము. మానవుడు కర్మబద్ధుడు. నిరంతరాయముగా కర్మల నాచరించవలయును. వాటిపైననే వాని ప్రగతి స్థిరత ఆధారపడివుండును. అందుచేతనే "యోగ: కర్మ సుకౌశలమ్" అన్నాడు పరమేశ్వరుడు.

ఈ సంపూర్ణమైన, లోపరహితమైన రచనా పద్ధతినే యోగులు 'కళ' అన్నారు. కౌశలమగు కర్మాచరణ 'కళ'. మూల సూత్రముగ కళాశీలి రెండు విధములు. పుట్టుకతో [బోర్న్] ఉపాధి [మిస్టిక్] గూఢమైన ప్రజ్ఞ [యోగము] రెండవది సెక్యులర్ [మేడ్] ఐహికమైనది

1. వాసనాత్మక జన్యమగు కళా విలసనము ఆధ్యాత్మికాయుతమగుట మూలమున, భగవద్విభూతిని, ప్రకృతి సౌందర్యమును-వాస్తవత్వమును విశదపరచునదిగా ఉంటుంది.

2. పరిశ్రమించుట మూలమున లభ్యమానమగునది ప్రాపంచికమై కేవలము ప్రకృతి సౌందర్యమునకే పరిమితమై మానవునకు ఇంద్రియానందమును మాత్రమే అందీయ గల్గుతుంది

కళా శ్రేణికి చెందినదే. ఈ హరికథ. యియ్యది వేదకాలమునాటిదే. సామగానమే కథాగానమునకు మూలము. యాగమున ఋత్విజులు ఎర్రని తలపాగాతో అగ్నిప్రకరణ మొనర్చునపుడు కన్యలు ఆడుచు, పాడుచు వేష భూషాదులతో వ్యవహరించుచుండెడి వారు. యిది కథా కథన రీతి!!! అప్పటి పూజా విధానములన్ని కథాకథనములే. రామాయణమును కుశలవులచే గానము చేయించినాడు వాల్మీకి. నారదుడు తన యితర వ్యాపకములతో సర్వకాలములలోనూ హరికథా గానమును జోడించినాడు. కథాక

ధకులు దైవిక పూజలనొనర్చి భాగవతులగుదురు.

సంస్కృతి అన్న నాగరికత కాదు. కానేరదు. మన భౌతిక సంపదంతా మన సంస్కృతితో యున్న సంబంధము బహుకొద్ది మాత్రమే. మానవుని మౌలిక విలువల వల్ల ప్రేరితమైన విలక్షణ జీవిత విధానమే వాని సంస్కృతి. మన ఆర్ష సంస్కృతిని దాని విలువలను అందు నిక్షింపబడిన మౌలిక విధానములను మన కథా కథనము ద్వారా ప్రచురించబడవలెను. కథా శ్రవణమనన రచన మూలమున సమాజము ప్రభావితము కావలసియున్నది.

సంఘము ఆధ్యాత్మిక విద్యా శూన్యము కాకూడదు! మన ఆర్ష సాహితీ సంస్కృతులే భారతీయమగు ఆధ్యాత్మికమగు సంపద. ఏ కళా సాంగత్యమున మానవత్వము దైవత్వ స్థితిని పొందగలదో అయ్యదే మన సంస్కృతి.

హరికథ గద్య, పద్య, గేయాత్మక, సంగీత, నృత్యకళా శ్లిష్టమగు ఒక రూపక ప్రక్రియ. "స్వయం తీర్ణః పరాం స్తారయతి" కథకుని లక్షణమిది. కథలు చెప్పువాడు కథకుడు. హరిని గూర్చిన కథలను గానము చేయువాడును హరి కథకుడు. హరిని గూర్చిన కథగానము చేయుచూ తన్మయుడై నాట్యము చేయువాడు హరిదాసుడు (నారదాదులు) ఇట్టివారు తాము తరించి యితరులను తరింపచేయగలరు.

భగవంతుని గూర్చి కథాగానము చేయువారు భాగవతులు. భాగవత కథాగానము చేయువారు భాగవతులు. హరిదాసులు, భాగవతులు. భాగవతులే హరిదాసులు. కావున వీరు భాగవతారులు. రసజ్ఞుడగు కథకునకు చాలా లక్షణములుండవలెను. కథకుడు నిర్దుష్టముగ హరిని గూర్చిన కథనే చెప్పవలయును. శ్రవణ పేయముగ సంగీతమును పాడవలయును. విశుద్ధమగు జీవితగాములుగా ఉండవలయును. కథా కథన విధానమున అన్యాలు ప్రస్తుత ప్రశంసలు చేయగూడదు. సామాజికుల భావ భంగకరమగు ప్రసంగ విన్యాసములు చేయకూడదు. భక్తుడైనవాడు భాగవతుడు.

కథాగానము, భక్తి ప్రపత్తితో కూడుకున్నది. తాననుభూతి నొందనిదే యితరులకు బోధించుట కూడదు. ఫలించదు. కథకుని చూడగానే దృష్టలకు భక్తి సముల్లాసము కలుగు రూపము, నడవడి, ఉండవలయును. భాగవతారు పచరించు ఆట, పాట, అభినయ పుష్టి సామాజికులను ఆకట్టుకొని ఆనంద ప్లావితులను చేయగలగవలెను. సంగీత, సాహిత్య, అభినయ, నృత్య, నృత్త, రీతుల సమగ్రముగ తెలిసిన ద్రష్టయై యుండవలయును. కథకుడు కవియై, లోక సంగ్రహ ధర్మ పరిజ్ఞానము కలవాడుగ ఉండవలయును. కథకుడు వాగ్గేయకారుడై యోగియై తన కథా కథన యోగము ద్వారా లోక కళ్యాణము కలుగచేయవలయును. యిది యొక యాగము. కథకుడు తపస్వి. తాను గానము చేయదలచిన కథకు సంబంధించిన దైవమును గూర్చిన మంత్రమును పునశ్చరణము చేయవలయును. విధిగా. యోగి కానివాడు

యాగమును నిర్వహింపజాలడు. ఫలము అందదు. యిట్టివగు ద్వాదశ లక్షణములు గల హరిదాసులకు లోకము బ్రహ్మ రథము పడుతుంది. ఇవి విజ్ఞుల అనుభూతులు. అభిజ్ఞులు పలికిన పలుకులు. యిట్టివగు విలక్షణములు గల హరిదాసులు అవ్యక్త మధురార్ద్రి ధర్మ ప్రభోధనినాదములు శ్రుతులై-స్మృతులగును. అంతనాతడు తపస్వి. తదర్ధ బోధ-సామాజిక శిరోధార్యములై కళా మర్యాదలను రచించ గలిగి సర్వులను తరింపచేయును.

ఇట్టిదగు హరికథా కళా ప్రక్రియను పోషింపవలసిన బాధ్యత అకాడమీకి ఉన్నది. దానిని గుర్తెరిగి అకాడమీ రెండు హరికథా సదస్సులను జరిపినది. 1964-65లో తాడేపల్లి గూడెంలోని స్థానిక సంస్కృతీ కళా క్షేత్రము సహకారముతో అకాడమీ హరికథా సప్తాహమును, సదస్సును నిర్వహించినది. నాటి సదస్సులకు యావదాంధ్రమున గల భాగవతారులను అందరినీ ఆహ్వానించి ఉచిత రీతిని సత్కరించినది. అదియును గాక తమిళనాడులో సుప్రసిద్ధులైన కళా కథనమున సర్వుల మన్ననలందిన శ్రీ బాలకృష్ణ భాగవతార్ గారిని ఆహ్వానించి వారిని తగురీతిని సత్కరించినది.

నాడు వారు తమిళమున త్యాగరాజ హరికథాగానముచేసిరి. నాటి కంఠా శ్రవణమున ప్రేక్షకులు తన్మయతతో ఒకానొక నూతనానుభూతి నందిరి. భాష నాడు సదస్సులకు ఏమాత్రము సమస్యగా పొడగట్టలేదు. రసప్లావిత హృదయము సర్వభాషల భాషార్థమును ఏకార్థముగ గ్రహించి లాలించగల సత్యము నాడు వ్యక్తమైనది.

1965 జనవరి 2వ తేదీన హరికథాపితామహ ఆదిభట్ల నారాయణ దాస వర్ధంత్యుత్సవములు నిర్వహింపబడినవి. నాటి సదస్సుకు అధ్యక్షులుగా నున్న కథక రత్న శ్రీ పాతూరి మధుసూదన రావుగార్కి అకాడమీ "కథాగాన కళా ప్రపూర్ణ" బిరుదమునిచ్చి సత్కరించినది తదుపరి భాగవతుల అభ్యర్థనపై అకాడమీ హరికథా గాన కళా పరిషత్ నొకదానిని నిర్మాణము చేసి దానికి శ్రీ మధుసూదన రావుగారిని అధ్యక్షులుగా నిర్ణయించి నాటి నుండి హరికథకు యితోధిక సహాయము అందించుచున్నది. మరల 1969 సం॥రం లో మరియొక హరికథా సదస్సును తాడేపల్లి గూడెంలో అకాడమీ జరిపి ఆ సదస్సునకు సుప్రసిద్ధులు కథకలు, శతాధిక కథలు వ్రాసిన శ్రీ దీక్షిత దాసుగారిని అధ్యక్షులుగా నాహ్వానించి వారిని "కథాగాన కళా ప్రపూర్ణ" బిరుదముతో సత్కరించిరి. నాటినుండి నేటివరకు మరల అట్టి సదస్సులు జరుగలేదు.

★



1957 డిసెంబరులో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రారంభించిన

అప్పటి ముఖ్యమంత్రి, నేటి రాష్ట్రపతి

గౌరవనీయులు శ్రీ నీలం సంజీవరెడ్డి



ఆంధ్రప్రదేశ్ గవర్నరు

గౌరవనీయులు శ్రీ కె. సి. అబ్రహాం



రాష్ట్రంలోని ప్రముఖ నాటకసంస్థలతో సన్నిహిత సంబ

కళాకోవిదులు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

గౌరవనీయులు డాక్టర్ మర్రి చెన్నారెడ్డి



వింశతి వార్షికోత్సవములను ప్రారంభము గావించిన
ఆంధ్రప్రదేశ్ విధానసభ అధ్యక్షులు గౌరవనీయులు
శ్రీ దివి కొండయ్యచౌదరి



వింశతి వార్షికోత్సవాలలో మార్చి 19 వ తేదీనాడు
ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
సాంకేతిక విద్యా శాఖామాత్యులు
శ్రీ టి. హయగ్రీవాచారి

# ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి పూర్వ అధ్యక్ష, కార్యదర్శులు



1957 నుంచి 1964 వరకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి అధ్యక్షులు

శ్రీ ఆర్.బి. రామకృష్ణరాజు



ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి
కార్యదర్శి 1961 నుంచి 1964 వరకు
అధ్యక్షులు 1964 నుంచి 1972 వరకు

శ్రీ పసల సూర్యచంద్రరావు

# ప్రస్తుత కార్యనిర్వాహక వర్గం



అధ్యక్షులు

శ్రీ కె.వి. గోపాలస్వామి



ఉపాధ్యక్షులు

శ్రీ మామిడిపూడి ఆనందం



కార్యదర్శి

శ్రీ కె.వి. సుబ్బారావు



సహాయ కార్యదర్శి

శ్రీ బి. కృష్ణంరాజు



ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాదమి కార్యదర్శి 1957-60

శ్రీ యల్.ఎన్. గుప్త



1965 నుండి 72 వరకు అకాదమి కార్యదర్శి

శ్రీ ఎం. ఎన్. పద్మారావు



1964-65ల మధ్య అకాదమి కార్యదర్శి 1975 నుంచి కోశాధికారి

డాక్టర్ పి.ఎస్.ఆర్. అప్పారావు

# సంగీత లక్ష్య లక్షణ సమన్వయాలు, సంప్రదాయాలు

డా॥ శ్రీరామమూర్తి

శ్లో॥ ఓంకారంచ పరబ్రహ్మ యావ దోంకారసంభవమ్।
అకారోకారమాకార, యేతేసంగీతసంభవాః ॥
"అ"కారోవిష్ణురూపంచ "ఉ"కారోబ్రహ్మరూపకమ్।
"మ"కారోభర్గరూపంచ, యావ దోంకారరూపకమ్॥

పై నుదహరించిన యనాది సిద్ధాంతమైన పరమ త్యాన్నే మన వాగ్గేయ కారుడైన త్యాగయ్య ప్రాణానల సంయోగము వలన ప్రణవనాదము ప్తస్వరములై బరగ" అనియు, "నాదోపాసనచే ంకర నారాయణ విధుల వెలసిరి ఓమనసా" నియు సూత్రప్రాయముగ పాడియున్నారు.

శ్లో॥ అకాశసంభవో నాదోయం, సో అనా ంత సంజ్ఞిత:॥ అనగా పృధివ్యాది పంచ భూత ంలలోని ఆకాశమునుండి నాదముపుట్టిన దని. ాచీన లక్షణకారుడైన నారదుడు తన "సంగీత కరందము" నందు చెప్పియున్నట్లు నాదము హతమని అనాహతమని రెండు విధములు. ంనాహతనాదము రక్తిహీనమైన ఋష్యాదు చే నుపాసింపబడి మోక్ష ప్రాప్తికి మాత్రమే ధన భూతమైనదనియును, అహతనాదము త్యాదీ ముఖముగ సప్తస్వరాలై ఉపాసింప ంతూ చతుర్విధపురుషార్థసాధనభూతమైన సంగీత స్త్రమనియు తెలియబడుచున్నది,

ఇంక యీ సంగీతోత్పత్తినిగూర్చి కొందరు బ్రహ్మ చతుర్వేదముల సారాంశము స్వరములే యని, అవి ప్రధానముగగల శాస్త్రమును, పంచమ వేదమను పేర యా చతుర్వేదార్థములు స్వర భ్రంశముచే దోషము గాకుండ సృష్టించినాడనియు, మరికొందరు మానవ సృష్టికి పూర్వమునుండి యున్నదనియు, చరిత్రప్రారంభమునుండి యున్న దనియు పలు తెఱంగుల చెప్పియున్నారు.

ప్రాచీన సంగీత లక్షణకారులు :— సదాశివ, పార్వతి, బ్రహ్మ - నందికేశ్వర-భరత-దుర్గ-శక్తి-శార్దూల - కోహల - వాయు- కశ్యప-హనుమంత-రంభ - అర్జున-తుంబురు-రావణ-విశ్వావసు దత్తిల-కంబల - అశ్వతరు - యష్టిక-దేవరాజు మొదలగు వారు. మరి కొందరు లక్ష్యలక్షణ కారులు, వారు రచించిన గ్రంథములు:-1.భరతుడు-నాట్యశాస్త్రం-2. శార్ఙ్గదేవుడు-సంగీతరత్నాకరము 3. అర్జున-అర్జునభరతము 4. అహోబలుడు - సంగీత పారిజాతము 5. రామామాత్యుడు - స్వరమేళకళానిధి

6. వెంకటమఖి–చతుర్దండిప్రకాశిక 7. రఘునాథ భూపాలుడు–సంగీతసుధ 8. దామోదరుడు– సంగీత దర్పణం 9. గంగారాముడు – సంగీత సేతువు 10. తుళుజామహారాజు – సంగీతసారామృతము. 11. భట్టాచార్యుడు–నాదదీపిక. 12. పుండరీక విఠలుడు–షడ్రాగచంద్రోదయము 13. నందికేశ్వరుడు తాళాభినయలక్షణము 14. నింబభూపాలుడు–సంగీత దీపిక 15. కల్లినాథుడు–సంగీత రత్నాకర వ్యాఖ్య, "కలానిధి" 16. పురుషోత్తమమిశ్రుడు–సంగీతనారాయణము 17. భరతాచార్యుడు–ఆదిభరతము 18. మతంగుడు–బృహద్దేశి 19. వేమ భూపాలుడు – సంగీతరాఘవము 20. సింహ భూపాలుడు – సంగీత సుధాకరము 21 సోమ నాథుడు–రాగవిబోధము, 22. హంసభూపాలుడు–సంగీతరత్నాకర టీక 23. హరిపాలుడు – సంగీత సుధాకరము 24. హరిభట్టు–సంగీతదర్పణము 25. నారదుడు – సంగీత మకరందము 26. సదాశివ దీక్షితుడు– సంగీత సుందరము 27. శ్రీరాముడు–రాగవిచారము–28. గోవింద– సంగీత సంగ్రహ చూడామణి 29. తచ్చూరు సింగరాచార్యులు–సంగీత–సర్వార్థసారసంగ్రహము 30. సుబ్బరామ దీక్షితులు–సంగీత సంప్రదాయప్రదర్శిని, మొదలైనవి.

ఈ పై నుదహరించిన సంగీత లక్ష్య లక్షణ కారుల గ్రంథములందు, మన కర్నాటకసంగీతమునకు ప్రామాణ్యములైనవాటిలో, నాట్యశాస్త్రము, సంగీతరత్నాకరము, సర్వమేళకళానిధి, చతుర్దండిప్రకాశిక, సంగీత సారామృతము ముఖ్యమైనవి.

"శాస్త్రేవాది భయం" అని భర్తృహరి చెప్పినట్లు యీ పైన చెప్పిన లక్ష్యలక్షణకారుల ప్రయోగములను, సాంప్రదాయాలను సమన్వయ పఱచుట, సమన్వయమగుట శంకా నివృత్తిగానిదై కొన్ని సమన్వయ సందర్భములు సాధ్యముగాకుం ఉన్నవి.

వారి గ్రంథస్థ సర్వసామాన్య విషయములు అనగా:— సంగీత శబ్దార్థము, సంగీత విభాగము నాద ప్రశంస, నాద శబ్దార్థము, సంగీతోత్పత్తి నాదవిభాగములవఱకు విశేష భేదాభిప్రాయ ములతో గూడిన విషయము గాకపోయినను, శ్రు ప్రశంస ప్రారంభమునుండి, శ్రుతి, జాతివిభాగము స్వరము, స్వరశ్రుతి నిర్ణయము, వాటి విభాగము ద్వావింశతి, చతుర్వింశతి శ్రుతులు, ద్వాదశ షోడశ, స్వరస్థానములు, గ్రామమూర్ఛనాపద్ధతి రాగవిభాగము, మేళముల నిర్ణయము, వా నామములు, రాగలక్షణము, వాని నిరూపణ వాని సంప్రదాయాలు. రాగముల నామములు వఱకు దాదాపు భేదాభిప్రాయములతోగూడి వివాదగ్రస్తమైన విషయముగానే నేటివఱ వస్తున్నది. మన ప్రాచీన సంస్కృత వాఙ్మయ మున సంగీతమును "కళావిద్య"గా పేర్కొని వ్య హరించుటచే, అక్షాంశాది, అక్షరసంబంధమైన వేద పురాణ, వేదాంత, గణితమంత్ర, తంత్ర, ఖగో ళాది శాస్త్రాదులవలె (నాదవిద్యయగు సంగీతము) విరివిగ ప్రచారము కాలేకపోయినది.

"గీతవాద్యం తథానృత్యత్రయిం సంగీ ముచ్యతే" యని యిందు గీతము (గాత్రగానము) ప్రధానమైనదై, వాద్యనృత్యములు గీతము నను సరించియుండిన నీ మూటచేరికకే సంగీతమనియు, తౌర్యత్రికమనియును, గీతవాద్యముల రెంటి చేరికయే సంగీతమనియును గూడ చెప్పబడు చున్నది.

ఇంకను సంగీతము, మార్గదేశీయములని రెండు విధములు. అందు మార్గసంగీతమును, బ్రహ్మ వేదములనుండి గ్రహింపబడి, నందికేశ్వర, భరత

ఆంజనేయ, నారద, మతంగ, యష్టిక, శార్దూల, కోహల, కశ్యపాదులచే ప్రచారము గాబడినదని యును, దేశి సంగీతము, ఆయాదేశములందు వేర్వేరుగ, వారి యభిరుచులకు యవసరములకు తగినట్లు రూపొందింపబడి, అభ్యసింపబడి, దక్షిణ, ఆంధ్ర, కర్నాట హిందుస్థానీ మొదలగు వ్యవహార నామములచే పిలువబడు చున్నవి.

## సప్త స్వరములు

"సామ వేదాదిదం గీత" అని సామగానము నుండి గ్రహింపబడిన సంగీతమును, సామగానమందు పాడబడు ఉత్కృష్ట-ప్రథమ- ద్వితీయ- తృతీయ చతుర్థ-మందర-అతిస్వర లేక స్వరితయను సప్తవిధ భేదములనే, మన సంగీతశాస్త్రమునకు మాతృకలుగ సరిగమపదని, యని సంకేతిక స్వరసప్తక ముగ (సప్త స్వరములుగా) వ్యవహరింపబడుతూ ఉన్నవి.

"సకారం ప్రాణనామాన దకారమనలం విదుః।

"జాతః ప్రాణాగ్ని సంయోగా త్తేననాదోభిదీ యతే" అనే మంత్రశాస్త్రపరమైన యర్థమును, "ప్రాణానల సంయోగము వలన ప్రణవనాదము సప్తస్వరములై బరగె' అని మన త్యాగయ్య చెపుతూ యింకను. 'శోభిల్లు సప్తస్వర సుందరుల భజింపవే మనసా' యని చెప్పినటులను, మన సంగీత మును ఉపాసనా యోగ్యమైనదిగ తలంచి, సరిగ మపదని యనే సప్తస్వరములకు వేర్వేరు వాని యుచ్చారణ స్థానములు, సా ప్రేక్ష్యధ్వనులు, వంశ ములు, జాతులు, వర్ణములు (రంగులు) వాని యుత్పత్తిద్వీపములు, వాట్లను చూచినవారలు, అధి దేవతులు, ఛందస్సులు, నక్షత్రములు, సప్తస్వర దేహ ములు, భోజనము, వస్త్రము, లేపనము-పుష్పాభర ణాదులు-ఆయుధములు, సప్తస్వర భార్యలు మొద లగునవి గలవని చెపుతూ, యా సప్త స్వరములను సుందర దేవతామూర్తులుగ, రూపకల్పన చేయుచు, వాటి యుపాసన చతుర్విధ పురుషార్థసాధమైనదని, అష్టాదశమహా విద్యలందు నొకటిగ సంగీతమును జెప్పియున్నారు.

"లక్ష్యప్రధానమ్ ఖలుశాస్త్రమ్'' అని పుండ రీక విఠలుడు చెప్పినట్లు మన సంగీతము లక్ష్య ప్రధానమైనది. అనగా, లక్షణబద్ధమైన లక్ష్యముగ మన పూర్వ ప్రసిద్ధలక్ష్యకారులు (వాగ్గేయకారులు) అభ్యాస క్రమముగ, సరళి, జంట, అలంకారము, గీతము, ప్రబంధము, రాయము సూళాది, చిట్ట తానము, స్వరజతి, స్వరపల్లవి, తానవర్ణం, పద వర్ణం, చౌకవర్ణం - కృతి, కీర్తన, పదము, జావళి, తిల్లాన, రాగాలాపన తానం పల్లవి వఱకు లక్షణ బద్ధమైన రాగసాంప్రదాయాలను గురుశిష్య పారం పర్యముగ మన కందించియున్నారు.

అట్టి లక్ష్యకారులందు ముఖ్యుల నీ క్రింద నుద హరిస్తాను.

1. జయదేవుడు-సంగీత రత్నాకర గ్రంథకర్త. శార్ఙ్గదేవునికి రమారమిసమకాలీనుడు-సరళసంస్కృ తమున అష్టపదులనే రచనలు చేసిన పరమ భక్తుడు. ఈయన పాడిన యదార్థ రాగ రూపములు యీనాడు ఈయన రచించిన యష్టపదుల గానము ద్వారా మనకు లభించలేదు.

2. తాలపాక్కం అన్నమాచార్యులు - తిరుపతి వేంకటేశ్వరస్వామి భక్తుడై వేలకొలది కీర్తనల ప్రాచీన సిద్ధరాగములందు పాడిన వాగ్గేయకారుడు. ఈయన పాడిన రాగములు కొన్ని నేడు మన వాడు కలో లేకుండా పోయినవి.

3. క్షేత్రయ్య :- క్షేత్రయ్య పదాలు లేక మువ్వగోపాల పదాలు, ప్రాచీన ప్రసిద్ధ రాగము లందు, రస, భావ సమన్వయముతో శృంగార రసపర మున, జానుతెనుగున పాడిన గోపాలదేవుని భక్తుడు.

4. పురందరదాసు - మన కర్నాట సంగీతమును క్రమశిక్షకు తగినట్లు, సరళి స్వరములు, అలంకారములు, పిళ్లారి, ఘనరాగ గీతము, సూళాదులు కీర్తనలు మొదలగు వివిధ రచనలు కన్నడ భాషను రచించి, పాడి కర్నాట సంగీత పితామహుడైన పరమభక్తాగ్రేశరుడు.

5. నారాయణ తీర్థులు-సంస్కృతమున కృష్ణ లీలాతరంగిణి యను పేర, నృత్యభజన పద్ధతి కనువగునట్లు రచనలుచేసిన భక్తుడు.

6. భద్రాచల రామదాసు - రామభక్తుడై, తెనుగున, వారికరాగములందు భజనకీర్తనలు రచించిన వాగ్గేయకారుడు.

7. వెంకటమఖి - చతుర్దండి ప్రకాశిక యనే ప్రామాణిక లక్షణ గ్రంథమును రచించి, సంగీత రత్నాకరమం దుదాహరించిన 264 దేశిరాగములు తన కాలమునాటికే వాడుకలో లేవని, యప్పటి వాడుకలో గల రాగములందు గీతప్రబంధ, తాయి ఆలాపములను రచనలుచేసిన లక్ష్యలక్షణ విద్వాంసుడు. ఈయనరచనలు, సుబ్బరామదీక్షితులు రచించిన సంగీత సంప్రదాయ ప్రదర్శినియందు విశేషముగ చేర్చబడినవి.

8. గిరిరాజకవి:— మన త్యాగయ్యగారి తాత. శహజి మహారాజుచే సన్మానములంది రామభక్తుడై వెంకటమఖి సాంప్రదాయమున తెనుగున కీర్తనలు రచించిన విద్వాంసుడు.

9. వీరభద్రయ్య - తంజపురి నేలిన ప్రతాపసింహుని కాలమున ఉత్తరదేశమునుండి వచ్చి "ప్రతాపరామ'' ముద్రతో ప్రసిద్ధ దేశీరాగములందు చిత్రగేయ రచనాపాటవముతో దరు, తిలాన. పదం మొదలగు రచనలుచేసి, దక్షిణదేశ సంగీతపద్ధతికి శోభ చేకూర్చిన లక్షణలక్ష్య విద్వాంసుడు.

10. అరుణాచల కవి:- తుళుజామహారాజుకాలమందుండి ద్రవిడభాషలో రామాయణమును కీర్తన రూపముగ నాటివాడుక రాగములందు రసస్ఫూర్తితో రచించిన మహామహుడు.

11. రామస్వామి దీక్షితులు:- మన సంగీత త్రిమూర్తులలోని ముద్దుస్వామి దీక్షితుని తండ్రి. ప్రజ్ఞావంతుడైన విద్వాంసుడు. మీనాక్షీదేవిమీద, నలుబదిరాగముల రాగమాలిక, రీతిగౌళ మనోహరి, పూర్ణచంద్రిక రాగములలో, జాతి వర్ణములు, పెక్కు కీర్తనలు, వెంకటకృష్ణ ముద్రతో రచించి హంసధ్వని రాగమును కల్పించి ప్రబంధమును రచించిన లక్ష్యలక్షణ విద్వాంసుడు.

12. పైడాల గురుమూర్తి:- రామస్వామిదీక్షితుని సమకాలీనుడు, చతుశ్శాస్త్ర పండితుడు. ఆనాటి ప్రసిద్ధరాగములందు, లక్షణబద్ధముగ, విశేషముగ గీతప్రబంధ కీర్తనలు రచించిన ప్రతిభగల లక్ష్యలక్షణ విద్వాంసుడు ఈయన రచించిన గీతములు నేడు ప్రామాణ్యములుగ ఉంటూ ఉన్నవి.

13. పచ్చిమిరియం ఆదప్పయ్య:- ప్రతాపసింహ, తుళుజామహారాజుల కాలమునందుండినవాడు. రక్తిదేశీ భాగములందు "శ్రీ వెంకటరమణ" ముద్రతో విశేషగమక జాతులతో కీర్తనలు రచించి, వీణభద్రయ్య మార్గము ననుసరించి రాగాలాపన, మధ్యకాల (ఘనం) పద్ధతుల ప్రకాశింపజేసి, నేడు ప్రసిద్ధమైన భైరవి ఆటతాళ "విరిబోణి'' వర్ణమును రచించిన ప్రతిభగల విద్వాంసుడు.

14. పల్లవి గోపాలయ్య - పల్లవి పాడుటయందు సమర్థుడు. నేడు మనకు వాడుకలో

మున్న ప్రసిద్ధ ఆటతాళవర్ణములైన, కల్యాణి, తోడి కాంభోజి, రాగములందు రచనలుచేసిన మేధావి. ఇంకను, "వెంకట" ముద్రతో, కీర్తనల నాయా రాగ లక్షణముల వెలయునట్లు రచించి, ప్రతాప సింహమహారాజు తుళుజామహారాజుల కాలము నందుండిన, లక్ష్యలక్షణ విద్వాంసుడు.

15. త్యాగరాజు:- ఇహపరసాధకములై, త్యాగోపనిషత్తులనేటట్లు, జానుతెనుగున, వెంకటమఖి గురుపరంపరకు చెందినవాడై, ఆదర్శప్రాయుడై సంగీత, సాహిత్య, శాస్త్రమర్మముల సూత్రప్రాయముగ తన కీర్తనలందు నుపహరిస్తూ, నేడు మన కర్ణాట శాస్త్రీయ సంగీతమును, చిరస్థాయిగ మిక్కిలి ప్రకాశింపచేసి, శ్రీరామభక్తుడై వేనవేలు కీర్తనలు రచించిన, ప్రముఖ వాగ్గేయకారుడైన, సంగీత త్రిమూర్తులలోనివాడు.

16. ముద్దుస్వామి దీక్షితులు- వెంకటమఖి సాంప్రదాయానుగత. రాగాంగోపాంగ, భాషాంగ రాగములందు, ఆయా రాగలక్షణముల ప్రకాశించునట్లు, సంస్కృతమున, 'గురుగుహ' ముద్రతో పలు దైవములమీద కీర్తనలు రచించి, కర్ణాట సంగీతమును, విశేషముగ, ప్రకాశింపచేసిన మహనీయుడైన, వాగ్గేయకారుడు-సంగీత త్రిమూర్తుల లోనివాడు.

17. శ్యామాశాస్త్రి-సంగీత త్రిమూర్తులలోనివాడు- సాంప్రదాయ రాగాలలోను, కలగడ, చింతామణి రాగములలోను, కీర్తనలు, స్వరజతులు, తానవర్ణములు తాళవిన్యాసములతో, కామాక్షిదేవి భక్తుడై, "శ్యామకృష్ణ" ముద్రతో కొలదిమాత్రమే రచనలుచేసిన స్వతంత్రుడైన, భక్తవాగ్గేయకారుడు.

18, స్వాతి తిరునాళ్ మహారాజు :- తిరువాన్కూరు సంస్థానాధీశ్వరుడు. సంస్కృతము, మలయాళము, అరవము, తెనుగు, మరాటీ భాషలందు, మణిప్రవాళమనే, కొత్త రచనలు, పలు కీర్తనలు, పదములు, పద్మనాభముద్రతో రచించి, పెక్కుమంది విద్వాంసుల నాదరించి పోషించిన మహారాజు.

పై వారు గాక యింకను. పరమేశ్వర భాగవతులు - ఇరవివర్మన్ తంపి - కంచి కాళహస్తి శాస్త్రి, మెరట్టూరు వెంకటరమణశాస్త్రి, తంజాపూరు పొన్నయ్య సోదరులు - అనయ్యా - పట్నం సుబ్రహ్మణయ్య - పల్లవి దొరసామి-అనంత గజపతి మహారాజు-గోపాలకృష్ణభారతి-సుబ్బరామ దీక్షితులు-భారతిత్రయం-కన్నడి కృష్ణయ్య-పీణ కుప్పయ్య - ధర్మపురి సుబ్బరాయశాస్త్రి- తిరువట్రూరు త్యాగయ్య-ఆదిభట్ల నారాయణదాసు- మైసూరు సదాశివరావు-వాసుదేవచారి-ముత్తయ్య భాగవతులు-వేదనాయకంపిళ్ళే - రామనాథపురం శ్రీనివాస అయ్యంగారు - తచ్చూరు శింగరాచార్యులు- కె. వి. శ్రీనివాసయ్యంగారు - మహావైద్యనాథయ్యరు-గర్భపురివారు -ఘనంపేనయ్యా- సుబ్రహ్మణ్యకవి (ఆధ్యాత్మరామాయణ కీర్తనలు రచించినవాడు) పాపనాశమ్‌శివన్ - కుప్పుస్వామి అయ్యరు-పరిమళరంగడు -శొంఠి వెంకటసుబ్బయ్య (త్యాగరాజుగురుపరంపరలోనివారు)సారంగపాణి- శంకరాభరణం నరసయ్య-తోడి సీతారామయ్య- చల్లగాలి వీరరాఘువయ్య-తంజావూరు పొన్నయ్య ధరూరు దక్షిణామూర్తిఅయ్య - రామానంద యతి - పట్టాభిరామయ్య - ముత్తుత్తాండవరు - గబ్బడయెగ్గెన్న శాస్త్రి -వాసాఅప్పయ్య-పురాణం కనకయ్యశాస్త్రి మొదలగు వారును-యిటీవల,వివిధ శైలుల,గీత,వర్ణ-పద, జావళి, దరు, కీర్తనలుమొద లగు సంగీతరచనలు చేసియు, పాడియు ప్రచారము చేసి యున్నారు.

పై విద్వాంసులందు, పుండరీకవిఠల్ -సోమనాధుడు - రామామాత్యుడు - వెంకటముఖి-రఘు

నాధ, తుళుజామహారాజుల, లక్షణ, లక్ష్య సంప్ర దాయగత, ప్రసిద్ధ సంప్రదాయ రాగములందు రచనలుచేసియున్న వారిలో క్షేత్రయ్య - త్యాగ రాజు - పురందరదాసు - ముద్దుస్వామిదీక్షితులు - శ్యామాశాస్త్రి - వీరభద్రయ్య ముఖ్యులు. నేడు మన కర్నాట సంగీతముయొక్క యదార్థస్థితి పై లక్ష్యములనుండి మనకు సంక్రమించినదే. అవియే మనకు నేడు లక్ష్య లక్ష్యణ సమన్వయా లైన, సంగీత రచనలను సంగీత సంపదయును. ఇంకను పై వారిలో సంగీత త్రిమూర్తులనబరగు, త్యాగయ్య. ముద్దుస్వామి దీక్షితులు, శ్యామా శాస్త్రి రమారమి 17వ శతాబ్దమువారై వారి కాలమునాటికే కాలమానపరిస్థితుల ననుసరించి, బహుముఖమై మిశ్రమమై శాస్త్రమర్యాదలనల క్ష్యముచేసే విషమ సమయమున, దివ్యాంశ సంభూ తులై, మన కర్నాట సంగీత రహస్యాలను, లక్షణ లక్షసమన్వయాలతో, సూత్రప్రాయముగ కీర్తనరూపముల ప్రపంచానికి అందించి, రక్షించి, ప్రచారము చేసిన మహనీయులైన సంగీత మూర్తులు. వారే మనకెపుడు ఆదర్శప్రాయులై సంగీత లక్ష్య లక్షణముల సమన్వయపఱచియిచ్చిన సంప్రదాయజ్ఞులు.

## మేళ - రాగపద్ధతి

ఇప్పుడు లక్షణ కారులైన, రామామాత్యుడు - వెంకటమఖి వీరిచేవారి గ్రంథములైన స్వరమేళకళా నిధి - చతుర్దండి ప్రకాశికల యందు వివరించిన, శ్రుతి. స్వరమేళ, రాగ పద్ధతుల గూర్చి యవి మన లక్షణ, సంప్రదాయాలకెట్లు సమన్వయమయినవో కొంచెము తెలుసుకొందాము. క్రీ. శ 1550 సం॥ నాటి రామామాత్యుడు - సప్తస్వరములకు 12 స్వరస్థానము లని, అనగా (స $^{1}$ రి $^{1}$ రి $^{2}$ గ $^{1}$ గ $^{2}$ మ $^{1}$ మ $^{2}$ ప $^{1}$ ధ $^{1}$ ధ $^{2}$ ని $^{1}$ ని $^{2}$) నిర్ణయించి వాటి ప్రస్తారముచే 32 మేళములు అయినవనియు అసలు ప్రసిద్ధమేళములు ముఖా మాలవగౌళ మొదలుసామంత, కాంభోజి వరకు మేళములనియును - రమారమి క్రీ శ 1660 సం నాటి వెంకటమఖి తన చతుర్దండి ప్రకాశికయం సప్తస్వరములను ప $^{1}$ రి $^{1}$ రి $^{2}$ రి $^{3}$

గ $^{1}$ గ $^{2}$ గ $^{3}$

మ $^{1}$ మ $^{2}$ ప $^{1}$ ధ $^{1}$ ధ $^{2}$ ధ

ని $^{1}$ ని $^{2}$ ని

మొత్తం రిషభమును మూడు విధములుగను శుద్ధ-రి-చతుశ్రుతి-రి-షట్స్రుతి-రి-అనియు గాంధ రమును 3 విధములుగను - శుద్ధ-గ-సాధారణ-గ అంతర (గ) అనియు, మధ్యమమును - 2 విధము గను శుద్ధ (మ) ప్రతి (మ) అనియు ధైవతమును - విధములుగను - శుద్ధ (ధ) చతుశ్రుతి (ధ) షట్స్రుతి (ధ). శుద్ధ (ని) కైశికి (ని) కాకలి (ని) అని నిష దమును - 3 విధములుగను - మొత్తం 16 స్వర స్థానములనియు వాట్లను ప్రస్తరించుటచే 36 + 36 మొత్తము డెబ్బదిరెండు మేళములయినవనియు కాని ప్రసిద్ధమేళములుముఖారి.సామవరాళి మొదల సింహారవము - కల్యాణివరకు మొత్తం19 అనియ చెవుతు.

శ్లో॥ యదికశ్చినాదుస్సీత మేళేత్వం ద్విసప్తతే నూనం వాప్యధికం వాపి, ప్రసిద్ధ శక్తాశసద్వారై

అనగా, ప్రసిద్ధమైన ద్వాదశ స్వరముల నుండి తనచే కల్పింపబడిన మేళకర్తలు 72 కన్న అధిముగ కల్పించుటకు శివునికైనను గూడ సాధ్యము గాదని చెప్పియున్నాడు.

రామామాత్యుని 32 మేళములను లఘుమేళ కర్తయనియు వెంకటముఖి 72 మేళములను, బృహ న్మేళ కర్తయనియు, ఇటీవలి కాలమునందున్న నరసింహ భాగవతులచే రచింపబడిన 505, త్యాగరాజస్వామి కీర్తనల రాగ వివరములు, నిర్ణయములు, వివరి చే

సందర్భమున. పై 505కీర్తనలందు 485 కీర్తనలు ఋషుమేళకర్తకు చెందినవనియును, మిగత 20 కీర్తనలు బృహన్మేళ కర్తకు చెందినవనియు రామామాత్య వెంకటమఖి ప్రస్తార మేళములకు పేరిడి యున్నారు.

రామామాత్యుని 32 ప్రసార మేళములకన్న వెంకటమఖి అదనముగ 40 మేళములు చెప్పియుండుటచే, నీ నలుబది అదనపు మేళకర్తలు, వివాదిదోషములు గలవని, అనగా శుద్ధరిషభము, శుద్ధగాంధారము, శుద్ధదైవతం, శుద్ధనిషాదం, వరుసగా వచ్చుటచే అవి పాడుట కష్టమనియు, అట్లువరుసగ పాడిన రంజకత్వము లోపించుననియు, అందుచే త్యాగయ్యగారి, "ప్రాణనాథ బిరాన బ్రోవ''అనే శూలినిరాగ కీర్తనను, వరుసగ షట్శ్రుతి దైవతం (కైశికి నిషాదస్థానం) కాకలి నిషాదం, వరుసగ వచ్చిన రాగమగుటచే పాడుట కష్టమని, శంకరాభరణరాగంలో అనగా చతుశ్శృతిదైవతం, కాకలి నిషాదం వచ్చిన రాగంలో పాడుతూ ఉన్నారని, ఈ వివాది దోషముగల రాగములు, పాడే సందర్భమున ఉదాహరణ యిచ్చియున్నారు.

అంతేకాకుండ, వెంకటమఖి ద్వావింశతి శ్రుతుల నాధారమున, షోడశస్వర స్థానములు ప్రస్తరించుచే 72 మేళములేకాని అంతకన్న యెక్కువగాని తక్కువగాని, ప్రస్తరించుట ఫాలలోచనునికి కూడ సాధ్యముగాదని, పై శ్లోకములో చెప్పి, సుబ్బరామ దీక్షితునిచే, తన సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో గుంట క్రియ రాగ గీతము వెంకటమఖిచే రచింపబడినదని ఆ గీతము చివరసాహిత్యమున, (తన మేళములకు కనకాంబర్యాది రసమంజరి వఱకు నామకరణం చేస్తూ) "శ్రుతిచతుర్వింశతి కనకాంబరి అరె, ఫేనద్యుతి రాజా' అని ముగించిన, సందర్భమును ఆధారముగ తీసుకొని, ద్వావింశతి శ్రుతులుగాక, చతిర్వింశతి శ్రుతులనే, ద్వ్యర్థ ప్రయోగాన్ని (రెండు విధములుగా చెప్పిన సంగతిని) అధిక్షేపిస్తూ, 'మేళాధికారలక్షణ' అని యూరు పేరు వివరములేని, అడయారు పుస్తకభాండారమున కనుగొనబడిన, యొక లక్షణకారుడు, చతుర్వింశతి శ్రుతులనుండి ప్రస్తరింపుచే 34 × 4 = 136 × 34 = 4634 మేళములు సంభవించవచ్చుననియు వెంకటమఖిని ఛాలెంజి చేసి యున్నాడు.

ఇవన్నియు చూడగ, శ్రుతినిరూపణం – రాగనామ నిరూపణం – మేళకర్తలు, వారి నామ నిరూపణము లు – గ్రామమూర్ఛనా, త్రయోదశ రాగ లక్ష్యలక్షణముల నిరూపణ, సాంప్రదాయాల పట్ల – యేకీ భావము, లక్షణ లక్ష్య సమన్వయాలు, పరస్పర భేదాభిప్రాయాలు, వాదోపవాదాలు అనివార్యమై అసాధ్యమేమో ననిపిస్తుంది.

వీని పరిష్కారము, సమన్వయాల సందర్భమున నేటికి సుమారు 36 సంవత్సరాలనుండి మద్రాసు మ్యూజిక్ అకాడమీ, ప్రత్యేక విద్వద్గోష్టులు, ప్రముఖ విద్వాంసుల, సమావేశముల, వారల నిర్ణయాలు అకాడమీ జర్నల్స్‌లో గ్రంథస్తము చేయబడినవేగాని, విద్వాంసుల ప్రదర్శనలలో కచేరీలలో మాత్రము, విద్వద్గోష్టి సమావేశములలో నిర్ణయింపబడినట్లు ప్రదర్శింపకపోవుట చూస్తూ ఉన్నాము.

ఇక మనఆంధ్రదేశములో పై వాట్ల సమన్వయాలు సంప్రదాయాల సందర్భమున వేరే అడగ నక్కఱ లేదు.

కారణము:– మన కర్నాట సంగీతమును, లక్ష్య లక్షణ సమన్వయంతో, సంగీత రచనలు చేసిన సంగీత త్రిమూర్తులైన త్యాగయ్య, ముద్దుస్వామి శ్యామాశాస్త్రి – వీరభద్రయ్య, పల్లవి గోపాలయ్య

మొదలగు ప్రముఖ విద్వాంసులు దక్షిణ దేశీయులై (దక్షిణదేశమందు నివాసముగలవారలై) యుండి విశేషముగ, తిరువాన్కూరు మొదలు మద్రాసు వఱకు ప్రచారమగుటచే, మనకు, ఆ యా రచనల, యదార్థ రూపాలు, గురుశిష్య పరంపరగా ప్రచారముకాలేక అందు బాటులో లేకపోయినవి.

రెండవది – ఆ కాలమందు తెనుగు దేశము నుండి దక్షిణదేశ సంగీత సంప్రదాయాలు నేర్చుకొనుటకు నేటివలె కళాశాలలు, మొదలైనవిలేక, గురుపరంపరమూలమున నేర్వవలసి యుండుటచే, యిచటి నుండి, ప్రత్యేకము వాటిని విశేష శ్రమల కోర్చి నేర్వనుద్దేశ్యమున వెళ్లేవారు బహు అరుదైనారు. అలా శ్రమకు సహించి వెళ్ళిన కొద్ది విద్వాంసులద్వారా మన దేశమందు విశేషము పైదాక్షిణాత్య విద్వాంసుల రాగ సాంప్రదాయాలు, కీర్తనల యదార్థరూపాలు, ప్రచారముకాలేకపోయినవి. ఈ సందర్భములో మద్రాసు ప్రాంతముల నుండి, ఒకరిద్దరు, హార్మోనియమ్ విద్వాంసులు, అచట ప్రచారమైన, సంగీత రచనలను, (అనగా, త్యాగయ్య ముద్దుస్వామి దీక్షితులు మొదలగువారి) కొన్నింటిని ఏదో తప్పుల తండగా తయారు చేసుకొని, మనదేశమందు కొన్ని ప్రాంతముల, వారి వారి పాండిత్యముల, బజారు వ్యాపారముగ ప్రచారము చేయ మొదలు పెట్టుటచే వారిచే అమ్మబడు కాబడిన కీర్తనలను మొదలైన రచనలను, మనవారు కొందరు కొనుక్కొని మనకు వినిపించి ప్రచారము చేస్తూ జీవనోపాధి కల్పించుకుంటూ వచ్చారు.

ఈ సందర్భమునే సద్గురు త్యాగయ్య, "తెలియని నటవిట శూద్రులు వనితలు స్వవశమవుట కుపదేశించి – సంతసిల్లి స్వరలయంబు లెఱుంగక నెశిలాత్ములై, సుభక్తులకు సమానమను" 'దుడుకుగల నన్నేదొర కొడుకు బ్రోచురా, యెంతో,' అని తన గౌళరాగ పంచరత్న కీర్తనలో భవిష్యత్కాలమున పవిత్రమైన సంగీత విద్యకు రాబో[...] దుస్థితిని, దైవాంశ సంభూతుడగుటచే గుర్తిం[...] కీర్తన రూపమున తెలియజేశాడు.

తరువాత క్రమంగా, తెనుగు దేశములో సంగీత రసికులైన లేట్ దివాన్ బహద్దూరు కొమ్ము రెడ్డి సూర్యనారాయణ మూర్తిగారు, మద్రాసు ప్రాంతముల జరిగే ప్రముఖ సంగీత విద్వాంసుల కచ్చేరీలు వినడము సంభవించి, తన స్వస్థలము (కాకినాడలో,) దాక్షిణాత్య విద్వాంసుల (Platform musicians) రప్పించి, శారదా నవరాత్రులసందర్భమున, తనకుగల పలుకుబడి ఆర్థికస్తోమతుల సహాయముతో, తెనుగువారి[...] వినిపించే సదవకాశము కల్గించుటచే క్రమంగ కొంచెముగ, క్రొత్త కీర్తనలు, రాగాలాపన పద్ధతులు, కచేరీ సాంప్రదాయాలు మొదలగున[...] మనకు వినడం, అలవఱచుకొనడం సంభవించింది. అయినప్పటికి తెనుగు దేశమున విశేష పరిశ్రమ చేసిన గాత్రజంత్ర సంగీత విద్వాంసులు, విశేషము[...] కాక పోయినను, ప్రాచీన రాగశుద్ధ సంప్రదాయా[...]లతో గీతం, తరంగం, పదం, తానం, రాగాలాపన పల్లవి మొదలగువాటిని ప్రతిభావంతముగ ప్రద[...] ర్శిస్తూ, బొబ్బిలి, విజయనగరం మొదలగు సంస్థానాధీశులచే పోషింపబడి, గౌరవింపబడుతూ యుండేవారు. కాని విశేషముగ త్యాగరాజాదుల సంగీత సంపద మనకు లేకపోయినది.

తరువాత, తెనుగుదేశంలో గూడా కొన్ని పట్ట[...] ములందు సంగీత సభలు మొదలుపెట్టడం, ఆల్ ఇండియా రేడియోస్థాపించి, తద్వారా ప్రముఖ విద్వాంసులచే ప్రదర్శన లిప్పిస్తూయుండడం, కళాశాలలు స్థాపించడం వగైరాల ద్వారా మనకు మంచో చెడ్డో విరివిగా ప్రచారంకావడం జరుగుతూ

ఉన్నది, కళాశాలల ద్వారానే కాకుండా, యో అన్నయ్యల, అక్కయ్యల ద్వారా కొద్ది పాలు సంగీత పాఠాలు నేర్పుతూ యుండడం, కొలది నిమిషాలలోనే కొంత మంది విని, ద్ధమో సుబద్ధమో పాడడం నేర్చి, ఇతరులకు ప్పుతూ జీవించడం, జరుగుతూ ఉంది ఈ విధ గ ప్రస్తుతమున, వివరించడానికి వీలులేనిదై త్తముమీన సంగీతం ప్రచారమవుతూ ఉన్నది.

పూర్వము సంగీత నాట్యాదులు, లక్షణ లక్ష్య నెఱింగిన మంచి సాంప్రదాయజ్ఞులగు గురువుల ద్వారా ముఖస్థముగ అర్హులైన శిష్యులకు నేర్ప తూయుండేవి. ఈనాడు ప్రభుత్వమేయీలాంటి కేతిక విద్యల అభివృద్ధి ప్రచారముల బాధ్యత ంచి, పూర్వము వలె సంస్థానాధీశుల ప్రమే ములేకుండ చేయుట ప్రశంసింప వలసినదే

ఇంకను ఈ సంగీతనాట్యాలను, ప్రాథమికవిద్య లు విశ్వవిద్యాలయాల స్థాయి వరకు క్రమ గ, విద్యాపాఠ్య ప్రణాళికలందు చేర్పించి, త్యేక కళాశాలలు గూడ స్థాపించి, వలయు న సంపత్తుల కల్పిస్తూ, ఆ యా కళా పాలకు నొక విధముగ ప్రజల సహకార, సానుభూతుల వసరమును లేకుండ చేస్తూ యుండుట, ఇంకను యోలద్వారా యభివృద్ధి ప్రోత్సాహముల ంచు సౌకర్యములు కల్పిస్తూ యుండట- గీత నాటక అకాడమీల ప్రత్యేకముగ రాష్ట్ర లవారీగానేర్పఱచి తద్వారాయభివృద్ధి ప్రచార ర్యక్రమముల కొనసాగిస్తూ యుండుట ప్రముఖ ద్వాంసులను తగు రీతి గౌరవ సత్కారముల రిస్తూ యుండుట మొదలైన విషయములు నించ వలసిన విషయములే.

కాని పై సౌకర్య సావకాశముల నుండి మన గీతము, ఆధారములైన తన మూల సూత్ర ములను, సత్సంప్రదాయాలను ఎంతవరకు కాపా డుకొంటూ యున్నది అనే నిర్ణయము పట్ల సత్యాసత్యాలు తగు మాత్రము నిష్పాక్షికముగ, ఉత్తమాదర్శముల దృష్టితో యుంచుకుని పరిశీ లిద్దాము. రమారమి 32 సం॥లకు పూర్వము మన భారతదేశము పరదేశీయుల పాలనచే స్వతంత్రము లేక, మన భారతీయ సంస్కృతీ, విజ్ఞానములవై వృ ద్ధి సరల్ప సావకాశము విశేషముగ లేకపోవు టచేను, పరదేశీయ నాగరికతా వ్యామోహముల భ్రాంతులమగుటచేతను 'పరమార్థమే మార్గ మెఱు గరు, ప్రభువులెల్ల నీచ సేవకులురా' యని ఛాయా తరంగిణిరాగ కీర్తనలో మన త్యాగయ్య చెప్పినట్లు మన సంగీతాదుల ప్రయోజనాలను, యదార్థము లను తిరిగి పునరుద్ధరించుకొనే కృషిలో యింకను, యీనాడు మన దేశాన్ని, ప్రజలను, మన హిందూ సంస్కృతిని విస్మరింపజేసి, కృంగతీసే పరస్పర ద్వంద్వ భావాలను, కుల, మత సాంఘిక పక్ష పాతది, స్వార్థాల విస్మరించి గీతాద్యక్షతోపని మత్సరభూత జీవన్ముక్తుడౌటకు 'సీతావర సంగీత జ్ఞానము ధాత వ్రాయవలెరా' యని దేవ గాంధారి రాగ కీర్తనలో మన ఆదర్శ సంగీత సాంప్రదాయజ్ఞుడైన త్యాగయ్య చెప్పిన సంగతి.సాహిత్యార్థాలను ఇంకను మన కృషిద్వారా ఎంతవరకు సాధింపగలమో? ఒకవేళ సాధ్యమా? అసాధ్యమా! సాధించే మార్గాలేవి? ఎందువల్ల మన కృషి ఉత్తమ ఆదర్శాలను సాధించే సందర్భముల వెనుకంజవేస్తూ, ఊరకే మన కార్యకలాపాలు, తాత్కాలిక కాలక్షేపపు కార్యక్రమాలుగ రూపొం దింపచేసుకొంటూ, యిదే మనం చేయగలిగిన, చేయవలసినదియని సంతృప్తి చెందుతూ యుండ వలసినదేనా? అనే సందర్భములుగూడ కొంచెము గమనించవలసిన యవసరముఉన్నది.

## సంగీత గ్రంథములు

నేడు చాలావఱకు ప్రామాణ్యములైన లక్షణ గ్రంథములు సంస్కృత భాషలోనున్నవి. మద్రాసు సంగీత అకాడమీ, మద్రాసు యూనివర్శిటీ, మొదలైన సంస్థలు వాటిలో కొన్ని గ్రంథములను, ఆంగ్లభాషలో అనువదించియున్నారు. కాగా పూర్వమునుండి మన కర్నాటక సంగీతము, గురుపరంపరగా నేర్చి ప్రవర్తించే లక్ష్య విద్వాంసులు పై రెండు భాషలందును గూడ విశేష పరిచయము లేకపోవుటచే గ్రంథగత లక్షణాలకు, వారు నేర్చిన లక్ష్యములకు, స్వానుభవముచే సమన్వయమవుతూ ఉన్నదో లేదో, విమర్శించుట సాధ్యము కాలేక పోయినది. అయినప్పుడు ఆనాటి విద్వాంసులు లక్ష్యలక్షణ సమన్వయ మేలాగున, రాగసంప్రదాయాల నిమిడ్చి, రచనలుచేసిన, ఉత్తమ సంప్రదాయాదులకు చెందిన గురు శిష్య పరంపరకు చెందిన వారగుటచేతను, ఈనాడు విద్వాంసుల వలె సంగీతమును కాలక్షేపము, వినోదము, అలంకారముల కొఱకనే బహుళ పామర ప్రజానీకమునకు, అందుబాటులో నుండేలా, సంగీత సత్సాంప్రదాయాలను విస్మరించి, పొట్టకై, పేరు ప్రతిష్ఠలకై, వ్యాపారముగ ప్రచారాదులు కొనసాగించక యుండేవారు. తరువాత క్రమంగా నేటి మన విద్యా నైతిక ప్రమాణాలతోబాటు, యా యుత్తమ తరహా సంగీతాల వైపు, వాని యదార్థ రూపాలతో ప్రవర్తించ గలిగిన విద్వాంసులవైపు – నేడు, శాస్త్రీయ సంగీతాన్ని ఉద్ధరిద్దాము. మంచి సాంప్రదాయ సంగీతాలను, ప్రజలలో వ్యాపింప చేద్దామనే వ్యాజమున, పనిచేసే సంస్థల కృషి దిగజారి, ప్రయోజనాన్ని సాధింపలేక పోతూ యున్నది.

తెనుగున మొట్టమొదట సంగీత గ్రంథ రచన సాగించిన వారు శ్రీమాన్ తచ్చూరు సింగరాచార్యులు – వీరి గ్రంథములు చూడ, వెంకట
ప్రస్తరింపబడిన 72 మేళములకు, సంగ్రహ
మణి ననుసరించే కనకాంగి రత్నాంగ్యాది
ములకు, జన్యరాగముల యనుబంధము చే
లోను, మన త్యాగయ్య కృతులకు, రాగనా
నిచ్చుటలోను వరుసగ జన్యరాగములను చేర్చు
ప్రాచీన లక్షణ సాంప్రదాయాదుల త్రో
సంపూర్ణ షాడవౌడవ, వక్రభేదములచే, లెక్క
రము, రాగ మూర్ఛనల కల్పించి, వాటికి
కరణం చేయుటలోకూడ తన పాండిత్యవైచిత్ర్య
ప్రదర్శించినట్టు కనిపిస్తూ యున్నది. ఇక త్యా
కీర్తనలలో ఆనాడు త్యాగయ్య కావ్యావేశ
శ్రీరామచంద్రునే, నాగరూపునిగ గుర్తించి,
నాడి రాజాశ్రయాలను నిరసించి, సమకాలి
రాజాశ్రయాది, గౌరవాడంబరాదులచే మ
సాటి విద్వాంసులచే యుపేక్షింపబడి, క్ర
సంగీతము నుద్ధరింప యవతరించిన దివ్యా
భూతుడని గుర్తెరుంగబడి, గంగా ప్రవాహ
యాశుధారగ యా వాగ్గేయకారుని ముఖమ
లిన, లక్షణబద్ధములైన లక్ష్యములను (కీర్త
గ్రహించి యథాతథంగా, పాడగలిగిన రమో
గ్రాహులైన, అనుయాయులగువారు ఎ
లేకపోవుటచేతను, గ్రంథస్థము కాకపోవుట
యా రచనలు, రాగరూపములు, రాగనామ
తారుమారైనట్లును ; ఈ యదార్థమును గ
వీలులేక కాబోలు మన ఆచార్యులవారు
గ్రంథములందు, త్యాగయ్య కీర్తనలకు
నామములు కల్పించినట్టు కనిపిస్తూ యున్న
వాత, శ్రీ ముద్దుస్వామి సోదరుడైన బా
దీక్షితుని కుమారుడైన మన సుబ్బరామ దీ
వెంకటమఖి సాంప్రదాయ ప్రదర్శినీ గ్రం
రచించారు. ఇందు విశేషము వెంకటమఖి 72
రాంగాంగోపాంగరాగము లందు, తన పెద
ముద్దుస్వామి, రచనలను చేర్చి, యీనాట

ర్నాట సంగీతమునకు ప్రామాణికమైన గ్రంథ
గ రూపొందించి యున్నారు, ఇందును, కొన్ని
నలను, తనే చేసి, పెద్దలవని నామకరణం చేసి
(యీనాటి కొన్ని త్యాగయ్య కీర్తనలవలె)
దక్షిణ దేశ పర్యటనలో పెద్దల నుండి వినడం
స్థించింది. తరువాత త్యాగరాజ హృదయం,
కీర్తన స్వరావళి, సుధాంబుధి, విద్యాదర్పణం,
దలు రకరకాల గ్రంథాలు బయలువెడలినవి.
ని తరువాత, సంగీతాన్ని విద్యా ప్రణాళిక
ందు చేర్చబడి, ఆ పాఠ్య ప్రణాళికకు సరిపడు
లు, ఆంగ్లములోను, దేశ భాషలందును, బహు
చారమగుటకై, బహు వ్యాప్తమై స్వరపాల కల్ప
న యీ నాటి చవకబారు, బజారు సంగీతమును
హుపటుచేలిగా తయారయినాయి.

ఇంకను, మొదటి నుండి దక్షిణదేశమునందువలె
ధ్రప్రాంతముల సంగీత గురువులు కూడ తక్కు
టచే, ప్రముఖ వాగ్గేయకారుల రచనలు,
నాటి మన సంగీతజ్ఞులు, గ్రంథములద్వారా, కీర్త
ు మొదలైనవి, తమరు చూచినట్లు, పాఠముచేసి,
పింపచేయడం జరుగుతుంది. అప్పైనను, విశేష
ంగాక, పాడినవే పాడటం, ఒకవేళ రెండు ఒకరిద్ద
నా పాడగలిగి పాడితే, రాగ సంప్రదాయాల
జంగిన పెద్దలకు, విమర్శనీయాంశముగానే
టుంది.

చివరి మాట:- సద్గురువు మన త్యాగయ్య చెంచు
ంభోజి రాగకీర్తన "స్వరజాతి మూర్ఛన భేద
ుల్, స్వాంతమందు తెలియక యుండిన వర
గ లయజ్ఞులు తామనుచు, వదరెదరయా" అని
ప్పినట్లు వర్తమానమున మన సంగీతము, పరిజ్ఞా
వాహుళ్యము చేయు తలంపుతో చవుకబారుగ
యారయి విశిష్ట లక్ష్య లక్షణ సమన్వయాలతో
ాడిన మంచి సంప్రదాయాలను, పరిజ్ఞానికమున
దించేసప్రయత్నములోయు పేక్షచేయుచున్నాము,

అట్లుగాక ఉత్తమ, మధ్యమాధమ తరగతుల వారిగా తేలిక సంగీతము (Light Music) శాస్త్రీయ సంగీతము (Neo - Classical and Classical Music) దివ్య సంగీతము (Divine and Emotional Music) అని యీనాడు నామకరణముచేసి వ్యవహరించే సంగీతాలను, ఆ యా తరగతుల శ్రోతల యభిరుచులకు తగినట్లు, వాటి వినియోగ ప్రదర్శనా సావకాశములను కల్పించుకుంటూ, ఉత్తమ సంగీత వ్యాప్తికై శ్రమ పడవలసిన తరుణము.

"సంగీత, శాస్త్రజ్ఞానము, సారూప్య మనసా" అనగా సంగీత జ్ఞానము, సంగీత శాస్త్రజ్ఞానము, ఈ రెండింటి సమన్వయములతో చేరిన సంగీతజ్ఞానము సారూప్యసాధనము అని మన త్యాగయ్య చెప్పినట్లు, అదే మన సంగీత లక్ష్య లక్షణ సమన్వయాల పరమార్థము. అలాంటి సంప్రదాయాల నెఱింగిన వారి ద్వారా, వాటి ప్రచారము సాగించవలసిన బాధ్యత, మన యీ సంగీత నాటక అకాడమీ, సంగీత కళాశాలలు మొదలైన సంస్థలకేగాక, తద్విషయమై యిక నుండైనను యీనాటి లౌకిక రాజకీయ పరివేశములకు తావీయక, నిష్పాక్షికముగ కృషిచేయవలసిన యవసర మెంతైనయున్నది.

"జంగమ స్థావర, యింద్రియాతీంద్రియాది, సర్వ ప్రకృతి గుండా పయనిస్తూ. యేకమై, అనేకమైన నాదోంకార ప్రణవ స్వరూపునిలో "నాదలోలుడవై బ్రహ్మానందమందవే"యని కల్యాణ వసంతరాగ కీర్తనలో మన త్యాగయ్య పాడినట్లు, లీన మవాలి.

అదియే మన కరాట సంగీత లక్ష్యలక్షణ సమన్వయాలు, వాటి ప్రయోగ, ప్రచార, ప్రయోజనములు ఉత్తమ సంప్రదాయలు.

# రాగము - చతుర్విధ ఫలములు

— శ్రీ ఇలపావులూరి కామేశ్వర

"ఓంకారంచపరబ్రహ్మ, యావదోంకార సంభవః
అకారోకారమాకార, ఏతే సంగీత సంభవాః"
(సంగీతరత్నాకరము)

అకార, ఉకార, మకార సమ్మేళనమైన ఓంకారమే ప్రణవనాదము. ఇది సప్తస్వరములకు మూలాధారమై సామవేదానికి సారమై, సంగీత శాస్త్రానికంతటికీఆలవాలమైనది. దీనినే బ్రహ్మస్వరూపమనీ, నాదబ్రహ్మమనీ అంటారు. జగత్తుకంతా నాదమేఆధారం. ప్రతివారు తమ చెవులు రెండూ మూసికొన్నచో ఒక శబ్దము ఘోషించడం వినబడుతుంది దీనినే ప్రాణఘోషమంటారు. నాడీస్పందనము, హృదయ స్పందనము, లయస్వరూపంగా ప్రతి ప్రాణిలో ప్రతిష్ఠితమైయున్నవి. పైన ఉదాహరించిన ప్రాణఘోషం శ్రుతిరూపంలో ప్రతి ఒక్కరిలో ఇమిడి ఉండటంకూడా అనుభవంలోని విషయమే. ఇలా శ్రుతిలయలు ప్రతి వ్యక్తిలోను, ప్రాణిలోను సహజాతములై ఉండటంచేతనే సంగీతం ప్రతివారికి ప్రీతికలిగిస్తుంది.

"శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తిగానరసం ఫణి"
అని గదా ఆర్యోక్తి.

సాధారణమైన ధ్వనులు, చప్పుడులకంటె విశిష్టమైనది స్వరములకు దోహదంచేస్తుంది,

దీన్నిగురించి ఛాందోగ్యోపనిషత్తు ఇలా
స్తుంది.

"ఏషాం భూతానాం పృథివీరసః
పృథివ్యా ఆపోరసః। అపామోషధ
ఓషధీనాం పురుషోరసః
పురుషస్యవాగ్రసః। వాచఋగ్రసః
ఋచః సామరసః
సామ్నఉద్గీథోరసః॥"

(ఛాందోగ్య-అ-ఖండ 1-2 మ

సృష్టిసారము భూమి. భూమిసారం నీరు
సారం ఓషధులు. ఓషధులసారం
మానవునిసారంవాక్కు. వాక్కుసారం
(సారస్వతం). ఈ ఋక్‌సారం సామగానం
తము). సామగానంయొక్క-సారం ఓం
దీనినే ఉద్గీథం అంటారు. ఈ ప్రణవాన్ని
యాజ్ఞవల్క్యస్మృతి కూడా ఇలా వివరిస్తుంది

"దేహమధ్యగతో జీవః
జీవమధ్యగతో ధ్వనిః
ధ్వనిమధ్యగతో నాదః
నాదమధ్యేసదాశివః"

(యాజ్ఞవల్క్య

[ బందరులో జరిగిన సంగీతోత్సవాల సందర్భంలో 1978 డిశెంబరు 11న చదివిన వ్యాసము ]

ఈ సారభూతమైన నాదము 'సదాశివమయము' అంటారు శ్రీ త్యాగరాజస్వామివారు. ఇది సప్త స్వరాలుగా వికసించి, రాగంలో పరిణమించి, మరల రాగాలాపనద్వారా ఉపాసించబడి, మరల నాదరూపంలోనే లీనమౌతుంది. అందుకే రాగాలు దేవతలుగా భావించినారు, నాదయోగులు. ఈ రాగాన్ని ఉపాసిస్తే ఐహికాముష్మిక ఫలాలు దక్కుతవనియు, జీవన్ముక్తి కలుగుతుందనీ శ్రీ స్వామివారు సెలవిస్తారు.

"యాగయోగ త్యాగభోగ ఫలమొసంగే
రాగసుధారస పానముచేసి
రంజిల్లవే ఓమనసా ॥రాగ॥
సదాశివమయమగు నాదోంకారస్వర
విదులు జీవన్ముక్తులని త్యాగరాజు
తెలియు ॥రాగ॥"

మనం సంగీతం వినేటప్పుడు ఏదో ఒక రాగ పరంగా వింటాము. సాహిత్యం కంటే రాగస్వభావం, మాధుర్యంపై ఎక్కువగా మన దృష్టి ప్రసరించడం సహజం. కీర్తన పాడకుండా అచ్చం రాగాన్ని పాడటం సూక్ష్మమైన ప్రక్రియ. సంగీత సాధనలో ఇది చాలా సున్నితమైన విషయము. ఇది కీర్తనవంటి స్థూలమైనది కాక అనిర్వచనీయమైన భావాలను ద్యోతకంచేసే ఉపాసనారూపము. కొన్ని కీర్తనలు పాఠంచేసి చక్కగా పాడగలిగితే గాని వ్యక్తికి రాగాలాపన సామర్థ్యం అలవడదు. కృతులు, వర్ణాలు, గీతాలు మొదలైనవి సుగుణోపాసనవంటివైతే రాగాలాపన నిర్గుణోపాసన వంటిది.

అవి స్థూలములు - రాగం సూక్ష్మము
అవి భావములైతే రాగం రసము
అవి సాధనములు - రాగం సాధ్యము
అవి మార్గాలైతే - రాగం గమ్యస్థానము.

సంగీతములో సరళీలు, జంటలు, పిళ్ళారి గీతాలు, వర్ణాలు, కృతులు పాఠంచేయవలసి ఉంటుంది. ఈ సాధనవల్లనే రాగాలాపన సామర్థ్యం కలుగుతుంది. పరమేశ్వరస్వరూపం నాదమే అని గీతలో శ్రీ కృష్ణపరమాత్మ స్పష్టం చేస్తాడు.

"ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖేపౌరుషం నృషు" అని తన తత్త్వాన్ని ప్రకటిస్తాడు. (గీత. అ7, శ్లో 22).

"వేదానాం సామవేదోస్మి (గీత 10-22) అనే మాటలలో వేదాలలో తాను సామవేదమని, వేదములన్నింటిలో ఓంకార రూపమని స్పష్టీకరించినాడు.

ఇట్లు ప్రణవనాద వికసితమై, సనాతన మహర్షుల ఉపాసనా ఫలితమై పరంపరగా వచ్చిన ఈ రాగమును త్యాగరాజు తనివిదీర గ్రోలి ఈ ఆనందమనుభవించమని అందరికి ఉపదేశించినాడు.

"రాగరత్నమాలికచే రంజిల్లునట
హరిశత ॥రాగ॥
బాగసేవించి సకల భాగ్యమందుదాము
రారె ॥రాగ॥
నైగమషట్ఛాస్త్ర పురాణాగమార్థ
సహితమట
యోగివరులు ఆనందమునొందే సన్మార్గమట
భాగవతోత్తములుగూడి పాడేకీర్తనములట
త్యాగరాజు కడతేరను తారకమనిచేసిన
శత ॥రాగ॥

అని రాగమహిమను, కొనియాడినాడు. "నాదోపాసన చేతనే శంకరనారాయణ విదులు (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు) వెలిసిరని గూడా సూచించినారు.

"తంత్రీస్వరలయ గాన వినోదులు, త్యాగరాజ వంద్యులు స్వతంత్రులు" అని పై కీర్తనలోనే చెప్పినారు. స్వతంత్రులనగా ప్రాపంచిక విషయలంపటం నుండి విముక్తి సాధించిన జీవన్ముక్తులని భావము. గానంవల్ల కలిగే ఫలితం ఇంత గొప్పది. దీనికి కారణం రాగమే. ఈ రాగంవల్ల యాగ, యోగ, త్యాగ, భోగ ఫలాలు ఎలా కలుగుతాయో సహేతుకంగా పరిశీలించవలె.

**యాగము:**

యజ్ఞం చేయడానికి, హోమద్రవ్యాలు, అగ్ని, యజ్ఞం చేసేవ్యక్తి, చేయించే అధ్వర్యుడు కావాలి. మంత్రాలు పఠిస్తూ హోమద్రవ్యాలను అగ్నిలో వేల్చడం జరుగుతుంది. ఇది లౌకికమైన యజ్ఞం. దీనికి చాలా సరంజామా అవసరం. డబ్బు లేనివారికి సాధ్యంకాదు. కాగా, నాదయజ్ఞానికి ఈ బాహ్యపరికరాల అవసరం లేదు. ఇది జ్ఞానయజ్ఞం. నాదయజ్ఞం. ఇందులో గాయకుడు యాజి; ప్రాణవాయువు హోమద్రవ్యం; అతనిలో దాగిఉన్న వైశ్వానరుడే అగ్ని. ఇతడే అన్నాన్ని జీర్ణంచేసే జఠరాగ్ని. ప్రాణాగ్నుల సంయోగంవల్లనే నాదం ఉద్భవిస్తుంది. ఇక ఆత్మస్వరూపుడైన భగవంతుడే దీన్ని చేయించే అధ్వర్యుడు. ఈ విషయాన్ని గీతాచార్యుడు తొమ్మిదవ అధ్యాయంలో సూచిస్తాడు.

"అహం క్రతురహం యజ్ఞః, స్వధాహమహమౌషధం మంత్రోహమహమే వాజ్యం అహమగ్ని రహం హుతం"

(9అ-16)

అని చెప్పాడు.

కామ్యకర్మలుగా చేసే యజ్ఞాలు ఈ నాద యజ్ఞంముందు దీపంక్రింద దివిటీ వంటివి. ఇవి కోరికలను పెంచేవే కాని తెంచేవికావు. అందుకే స్వామివారు వీటిని ఈసడించుకొంటూ ఇలా అంటారు.

"యజ్ఞాదులు సుఖమనువారికి సములజ్ఞానులు
కలరా, ఓమనసా।
సుజ్ఞాన దరిద్రపరంపరులు, అసురచిత్తులు
జీవాత్మహింసగల ॥యజ్ఞా॥

బహుజన్మంబుల వాసనయుతులై అహివిషసమ
విషయాసక్తులై
బహిరాసనులై త్యాగరాజు భజియించు
శ్రీరాముని తెలియక ॥యజ్ఞా॥

నాదయజ్ఞానికి ప్రణవస్వరూపుడైన పరమాత్మ ప్రసన్నుడౌతాడంటూ పలుచోట్ల సూచిస్తాడు.

"సంగీత శాస్త్రజ్ఞానము-సారూప్య
సౌఖ్యదమే"
"నాదసుధారసంబిలను నరాకృతిఆయె"
"రంగేశుడు సద్గంగా జనకుడు సంగీత
సంప్రదాయకుడు"

"వేదశిరోమాతృజ సప్తస్వర నాదాచలదీప" అనే దివ్యమైన సూక్తులు త్యాగయ్య వివిధ కృతులలో సూచిస్తూ రాగప్రాశస్త్యాన్ని నిరూపిస్తాడు. ఇక యోగఫలం ఎలా దక్కుతుందో చూడాలి.

**యోగము**

యోగమంటే అనేక నిర్వచనాలు కనబడతవి. పర్యవసానం ఒక్కటే

"యోగః కర్మసుకౌశలం" (గీత)
"సమత్వం యోగముచ్యతే" (గీత)

"ఆత్మ మనస్సం యోగో యోగః" (యోగ సూత్రాలు). యోగం సాధించినవారిని యుక్తు లంటారు. వారిస్థితిని 'యుక్తి' అంటారు.

సొగసుగా మృదంగ తాళము జతగూర్చినిను
చొక్కచేయు ధీరుడెవ్వడో ॥సొగ॥
నిగమశిరోర్థము గలిగిన
నిజవాక్కులతో స్వరశుద్ధముతో ॥సొగ॥
యతివిశ్రమ సద్భక్తివిరతిద్రాక్షారస నవ
రస యుతకృతిచే భజియించే యుక్తి త్యాగ
రాజుని తరమా ॥సొగ॥

ఈ కీర్తనలోని చివరిపాదంలో "యుక్తికి" సాధనాలుగా మృదంగ తాళము, నిగమశిరోర్థము గలిగిన వాక్కులు, సద్భక్తి మొదలగు వాటిని పేర్కొన్నారు. ఇవన్నీ నవరసయుతములేగాక అనంతరసమయములై గాయకునికి బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తవి. ఎంత త్యాగంచేసియైనా ఈ బ్రహ్మానందాన్ని పొందాలంటారు ఋషులు.

"బ్రహ్మామృతం పిబేత్; భైక్ష్యమాచరేత్ దేహరక్షణే.' ఉంఛవృత్తిచేసియైనా బ్రహ్మామృతం త్రాగవలెననే ఆర్షోక్తి త్యాగయ్యను మిక్కిలి ఆకర్షించింది. రాగసుధారసం పానంచేయడానికి రాముని సన్నిధిని వరించి, నిధిని వదలి, మమతా బంధన యుతమైన నరస్తుతినివీడి త్యాగరాజ నుతుని కీర్తనచేసి ధన్యుడైనాడు.

గాత్రం శ్రుతి పక్వం చేయడంలో సమత్వం సాధించబడుతుంది. సమత్వంఅంటే Balance. స్వరములనురంజకంగా సందర్భించడంలో కౌశలం (Skill)కావాలి. లౌకికమైనవాసనలువీడి శ్రుతిలో లీనమై పాడటంలో ఆత్మ మనస్సం యోగంవంటి యోగం సిద్ధిస్తుంది. ఇదే మహారాజయోగం అనాలి. యోగాభ్యాసంలో ప్రాణాయామం ప్రధానాంశము. గానంచేసేటప్పుడు, అందులోను ముఖ్యంగా రాగాలాపన సమయంలో పలుమార్లు వాయునిరోధం, నియంత్రణం చేయవలసివస్తుంది. దీన్నే "దమ్ము" అంటారు. ఈ దమ్మువల్ల ప్రాణ వాయువును దాచుకొన్నవారౌతారు, గాయకులు. అందుచేతనే

"స్వరలయాది సౌఖ్యముచే చిరాయువులు గల్గి నిరవధిసుఖాత్ములై త్యాగరాజాప్తులైన వారెందరో మహానుభావులు"
అంటాడు త్యాగబ్రహ్మ.

శ్రీరాముని కోదండమును రాగముతో పోల్చి ఉపాసిస్తాడు. సప్తస్వరాలు ఆ ధనువుకు అమర్చిన గంటలు అంటాడు. దురము, నయము, దేశ్యము అనే గానరీతులు త్రిగుణములు అంటాడు. అనగా మూడుపేటల అల్లెత్రాడు అన్నమాట. సరసమైన సంగతి సందర్భములు శ్రీరాముని పలుకులు. ఇటువంటి కోదండరామునిగొల్చి తరించమని ఉపదేశిస్తాడు. ఇటువంటి ఉపాసనకు మించిన యోగం మూడులోకాలలో లేదు.

## త్యాగము:

గానంవల్ల త్యాగఫలం ఎలా దక్కుతుందో ఆలోచించవలె.

"వేకువజామున వెలయుచు తంబురచేకొని గుణముల చెలువొంద పాడుచును. శ్రీకరునికి భక్త చింతామణికి ఆకలిదీరగ పాలారగింపజేసే" కొలువు తనకు దొరికిందని త్యాగరాజు ఆనందిస్తాడు.

"నిద్దురనిరాకరించి ముద్దుగ తంబురబట్టి శుద్ధమైనమనసుచే సుస్వరముతో పద్దుతప్పక భజించే'

భక్తులు ఎటువంటి త్యాగం చేస్తారో పరిశీలించాలి. అలసత్వం త్యాగం చేయనిదే వేకువ జామున లేవడం సాధ్యం కాదు. పోనీ ఒకరోజు ఎలాగో చేసినా నిత్యము చేయడం మహాత్యాగం. దీనికంటే మించిన త్యాగం చేయనిదే శుద్ధమైన మనస్సు కుదురదు. లౌకికంగా చేసే విషయచింతనలు త్యాగం చేయాలి.

"తలపులన్ని నిలిపి నిముసమైనా.
తారకరూపుని నిజమర్మములను
తెలిసి రామచింతనతో నామము సేయవే
ఓ మనసా"

అని తన మనస్సును ఉద్బోధించు కోడంలో త్యాగయ్యవంటి వాడికే ఈ పని ఎంత కష్టమని పించిందో స్పష్టమవుతుంది.

"మానస వనచరవర సంచారము నిలిపి" తేగాని "మూర్తిబాగుగ పొడగను"టకు వీలు లేదు. కాబట్టి ఐహిక చింతనలు, విషయాసక్తి త్యాగంచేసి శుద్ధమైన మనసుతో గానంచేసి తరించవలె.

"త్యాగాచ్ఛాంతిరనంతరం" —గీత.

త్యాగమువలన కలిగేది శాంతి. శాంతికోసమే ప్రతిజీవి తాపత్రయ పడుతూ ఉంటుంది. కాని లభించని చోట్లల్లా తిరుగుతుంది. సరియైనచోటు గానం అని గ్రహిస్తారు త్యాగయ్యవంటి యోగులు.

"Many of us have great possessions and the hardest of these is to surrender our own will and identity" అంటాడు ఆనందకుమారస్వామి తన "Indian Music" అనే వ్యాసంలో.

వ్యక్తిగతమైన సంకల్పాలు, గుర్తింపులు వర్జించడమే మహాకష్టం. ఇదే మహా త్యాగం కూడా. దీనివల్ల పరమేశ్వర తాదాత్మ్యం సులభంగా లభిస్తుంది.

"త్యాగేనైకే నామృతత్వమానశుః
నకర్మణా నప్రజయా ధనేన"
అనిగదా ఉపనిషత్తు స్పష్టీకరిస్తుంది!

"సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అని నాదస్వరూపుడైన కృష్ణపరమాత్మ అంటాడుకదా!

"అనన్యాశ్చింతయంతోమాం, యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహం"

అనడంలో ఇతర చింతలు త్యజించి ఏకాగ్రతతో నాదంద్వారా ఈశ్వరార్చన చేస్తే బ్రహ్మానంద ఫలం లభిస్తుందని భావము.

"కామాదుల తెగకో"యడం 'పరభాముల పరుల ధనములను రోయడం" త్యాగంకాక మరేది త్యాగమవుతుంది!

"కలిలో రాజసతామస గుణములు గలవారి చెలిమి కలిసిమెలిసి తిరగక" ఉండటానికి ఎంత త్యాగం (అనగా నిగ్రహం) కావాలి!

ఇలాటి ఉదాహరణము లెన్నెన్నో స్వామివారి కృతులలో కనిపిస్తవి.

## భోగఫలం

ప్రాపంచికమైన భోగాలకు ఫలితాలు రోగాలు. ఇట్టి భోగాలు తెలివిగలవారు ఆశించరు. ఇవి ఆద్యంతములుగలవి. ఆద్యంతములులేని శాశ్వత సుఖమేదో తెలుసుకొని అట్టివాటిని బుధులు అన్వేషిస్తారని కృష్ణపరమాత్మ సెలవిస్తాడు;

"యేహిసంస్పర్శజాభోగాః దుఃఖయోనయ
వతే ఆద్యంతవంతః కౌంతేయ, నతేషురమతే
ధః"

(గీత 5-22)

గానంవల్ల కలిగే భోగానికి హానిలేదు. పాడే క్తి తగ్గిపోయినా విని భోగానుభవం పొంద చ్చు. ఎంతమంది అనుభవించినా ఈ భోగంలో లు తగ్గవు. ఒక రాగం శ్రావ్యంగా పాడి ప్పుడు ఎందరో శ్రోతలు విని ఆనందిస్తారు. ఒకరు నందించినందువల్ల మరొకరి ఆనందం తగ్గదు. క్షయము ఇదే నిజమైన భోగము. ఇక ప్రాపం కమైన భోగాలు దుఃఖయోనులు అని పై శ్లో లో చెప్పబడింది. అవి భోగములుగా కనపడే గాలు. గానము మాత్రం త్యాగంతో కూడిన గము; యోగంతో కూడిన యోగము.

ద్గురు శ్రీ త్యాగరాజస్వామివారు రాగానికి చెప్పిన ఫలశ్రుతి బ్రహ్మసూత్రాలవలె సార్థకమై అధికారాన్ననుసరించి అవగతమవుతుంది. కేవలం గాయకులకే గాక శ్రోతలకు గూడా ఈ యాగ యోగ త్యాగ భోగఫలాలు దక్కుతవి. ఆనందం అనుభవించడానికి సరసమైన రసికమైన హృదయం ఉండాలి. గాయకులది నాదోపాసనకాగా శ్రోతలది చాకుష యజ్ఞము. అనగా చెవుల ద్వారా చేసే క్రతువు, గాయకులు తాముతరించి ఇతరులను తరింపజేసే ఋషులవంటివారు.

"సతరతి లోకాం స్తారయతి" అనికదా ఉపనిషత్తు చెబుతుంది. మహాత్ముడు తాను తరించడమే కాక లోకాన్ని గూడా తరింపజేస్తాడు. ఇట్టి నాదోపాసన ఇహపరతారకమై యాగయోగ త్యాగఫలాలనిస్తుందనడంలో సందేహమే మాత్రం లేదు.

—: నాదతనుమనిశం శంకరం నమామి మే

మనసాశిరసా :—



# రాగలక్షణము

—శ్రీ పి. వేణుగోపా

సంగీతంలో అనుభవ విజ్ఞానంతో బాటు శాస్త్రవిషయ పరిజ్ఞానం గూడా ఉంటేనే ఆ విద్య బాగా రాణిస్తుంది. ఏ మూలసిద్ధాంతాల మీద మన సంగీతం ఆధారపడి ఉన్నదో, ఈ సంగీత ప్రాకారానికి గల పునాదు లెలాంటివో తెలుసుకోవడం ఎంతైనా అవసరం. సంగీత శాస్త్ర లక్షణాలన్నీ విద్వాంసు లెరిగినవే గాని, నేటి విద్యార్థులచే బాగా విస్మరింప బడుతున్నాయి. వాటి విశిష్టతను గురించి వివరించి చెప్పడం గురువుల బాధ్యత.

శాస్త్రీయ తత్వాన్ని చాలవరకు నిర్లక్ష్యం చేయడం ఆధునిక విధానాల్లో విరివిగా కనుపిస్తున్నమార్పు. కవిత్వంలో ఛందస్సును దూరంగా పెట్టి, విరగ్గొట్టిన గద్యపు ముక్కలను పద్య రూపంలో చూపెట్టడం పరిపాటయింది. భావం ప్రధానం గాని ఛందోబంధీలెందు కంటున్నారుగదా! వ్యక్తి ప్రధానంగదా అని వేష భూషా లంకరణ లేకుండా కౌపీన వస్త్రధారణతో రాజుగారిని సింహాసనం మీద కూర్చోబెడితే, ఆ రాజరికం రక్తి గడుతుందా? నేటి చిత్రకళలో చిత్రమూ, రూపమూ రెండూలేని విచిత్ర రూపాలను సృష్టిస్తున్నారు. వైరూప్యంలోంచి మీయిష్టం వచ్చిన సాయాప్యాలను సృష్టించుకోమంటూ నల్ల బోర్డులు ప్రదర్శించే రోజులు గూడా వచ్చాయి. అలాగే, ఏదో బహురూపరాగం, గతిలేని తాళం పేరుతో ఆధునిక

సంగీతం అవతరించకుండా చూసుకోవడం కర్తవ్యం. విద్వాంసుల విద్యుక్త ధ గూడాను.

సంగీతానికి నాదం ప్రధానము. నకా ప్రాణమనీ, దకారము అగ్నియనీ, ప్రా సంయోగమే నాదమనీ చెప్పబడుతుంది. ఈ వల్లనే సప్తస్వరాలు, ఇరవై రెండు శృ ముపై నాలుగువేల ఎనిమిదినందల నలభై రాగాలు సృష్టించబడ్డాయి.

"స్వతో రంజయతి శ్రోత్రు చిత్తం ఉచ్యతే." వినేవారి చిత్తాన్ని స్వయంగా ర జేయునది స్వరము. "శ్రోయన్త ఇతి శ్రు శ్రవణమునకు వినబడునట్టిది శ్రుతి.

"యో సౌధ్వని విశేషస్తు, స్వరవర్ణ వి భూ
రంజకో జన చిత్తానాం, సరాగః కధితో బు

స్వరవర్ణములతో అలంకరింపబడి జనుల మన రంజింపజేయు ధ్వని విశేషమే రాగము. ఇ రెండు శృతులను పలికించుట ఆచరణలో సాధ్యముగనుక, వాడుకలో పన్నెండు శృత నిర్ణయించి, వాటి ననుసరించి 72 మే రాగాలను సృష్టించడం జరిగింది. ఒక్కొక కర్తకు 484 జన్యరాగాల వంతున 34848 లున్నాయి. ఇంకా "అనంతావై రాగాః" అ

క్కలేనన్ని రాగాలను సృష్టించే అవకాశాలు పోలేదు.

రాగలక్షణాలు పది: గ్రహము, అంశము, మంద్రము, తారము, న్యాసము, అపన్యాసము, సన్యాసము, విన్యాసము, బహుత్వము, అల్పత్వము వీటి పేర్లు. ఒకరాగమునుగానీ, సంగతులను నీ, మొదట ఏ స్వరముతో ప్రారంభిస్తామో అది హస్వరము. రాగంగానీ, సంగతులుగానీ, పాడేప్పుడు ఆరాగకళను చూపించడానికి మాటిమాటికి చ్చే స్వరము అంశ స్వరము లేక జీవ స్వరము. గచ్ఛాయా స్వరమని గూడా అంటారు. గ్గు స్వరాలతో పాడడాన్ని మంద్రము, ఉచ్ఛ స్వరాలతో పాడడాన్ని తారము అంటారు. ఒక గముగానీ, సంగతిగానీ పాడి ముగించు స్వరము న్యాసము. ఇది హ్రస్వ న్యాసము దీర్ఘ న్యాసము ని రెండు విధాలు. రాగంగానీ, సంగతులు గానీ పాడేటప్పుడు మధ్యమధ్య ముగించు స్వరాన్ని అపన్యాసము అంటారు. రాగాన్ని పలుఖండాలుగా విభజించి ఒక్కొక్క ఖండమును ముగించే స్వరము సన్యాసము. అదేవిధ గా పలు ఖండాలుగా విభజించి, ఆయా ఖండాల్లో రాగకళను చూపించడానికి మాటి మాటికి వచ్చే స్వరము విన్యాసము. రాగాన్ని పాడేటప్పుడు ఒకే స్వరాన్ని మాటి మాటికి గ్రహించి పాడడం బహుత్వము. ఇందులో అలంఘనము, అభ్యాసము అని రెండు విధాలు. ఒకే స్వరాన్ని విడువకుండా పాడడం అలంఘనము. ఒకే స్వరాన్ని మాటి మాటికి పాడటం అభ్యాసము. ఒకే స్వరాన్ని అధికంగా ఉచ్చరింపక పోవడం అల్పత్వము ఇది లంఘనము, అనభ్యాసము అని రెండు విధాలు. ఒక స్వరాన్ని ఉచ్చరింప కుండా దాని పై స్వరానికి దాటడం లంఘనము. రాగాన్ని పాడేటప్పుడు ఒక స్వరాన్ని మాటిమాటికి ఉచ్చరింప కుండా, ఏదైనా ఒక సమయంలో అల్పంగా ఉచ్చరించడాన్ని అనభ్యాసము అంటారు.

రాగాలు మార్గమనీ, దేశ్యమనీ రెండు విధాలు. ఈశ్వర ప్రణీతమై భరతమునిచే ప్రకటింపబడినది మార్గమనీ, ఆయా దేశరీతులను బట్టి పాడబడునది దేశ్యమనీ అంటారు. మార్గ రాగము ఆరు విధాలు. అవి గ్రామరాగము, ఉపరాగము, రాగము, భాష, విభాష, అంతరభాష. దేశ్యరాగములు నాలుగు విధాలు. అవి రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగ రాగములు. రాగాంగ రాగమనగా, జన్యరాగములకు జనక స్థానమై, సంపూర్ణమై, ఆరోహణ అవరోహణములలో ఒకే విధమైన స్వరములు గలది. 72 మేళకర్తరాగములు రాగాంగ రాగములు. ఉపాంగరాగము జన్యరాగము. తన మేళకర్తరాగములోగల శుద్ధ వికృతి స్వరములనే కలిగి ఔడవ, షాడవ, సంపూర్ణ వక్రములు గలిగి యుండును ఉదా॥ హంసధ్వని, మలహరి మొదలయినవి భాషాంగ రాగమనగా, తన మేళకర్తలోని శుద్ధ వికృతి స్వరములు కలిగి, అప్పుడప్పుడు ఇతర మేళకర్తలలోని స్వరములను లక్షణానుసారముగ చేర్చుకొని యుండునది. ఉదా॥ భైరవి, బిలహరి, బేగడ మొదలయినవి. ఆ విధంగా చేర్చుకొనబడే స్వరాలను అన్యస్వరాలంటారు. క్రియాంగ రాగమనగా, ఇంద్రియములకు ఉత్సాహము కలిగించునది. యుద్ధవీరుల కుద్రేకము గలిగించు పాటలు ఇందుల కుదాహరణములు.

మతంగముని సిద్ధాంతం ప్రకారం రాగాలు మూడు విధాలు. శుద్ధ, ఛాయాలగ లేక సాలగ, సంకీర్ణ లేక సంకర యని వీటి పేర్లు. శాస్త్ర ప్రకారము ఒకే రాగ కళతో స్ఫురించునది శుద్ధ రాగము. ఉ॥ శంకరాభరణము, శ్రీరంజని, మోహన మొదలయినవి. ఛాయాలగ మంటే ఇతర రాగచ్ఛాయలు కలిగినది. ఉ: భైరవి, ముఖారి,

సారంగి మొ॥. శుద్ధము, ఛాయాలగము గల అనేక రాగచ్ఛాయలను కలిగినది సంకీర్ణరాగము. ఉ॥ సౌరాష్ట్రము, ద్విజావంతి, భైరవము మొ॥

ఇంకనూ, పురుషరాగాలు, స్త్రీరాగాలు, పుత్ర రాగాలూ, మిత్రరాగాలూ ఉన్నాయి. రౌద్ర, శృంగార, భీభత్స, కరుణ, హాస్య, భయానక, అద్భుత, వీర రసములు వరుసగా కలిగిన భైరవి, భూపాలము, శ్రీరాగము, ఫలమంజరి, వసంత, మాళవము, బంగాళా, నాట రాగములు, పురుష రాగములు. ఈ ఎనిమిది పురుష రాగములకు ఎనిమిది రసములుగాక, మిగతా రాగములన్నీ శాంత రసము గలిగినవి గనుక రాగ రసములు నవ రసములని తెలియుచున్నది. దేవక్రియ, బిలహరి, ఆంధాళి, దేశి, రామక్రియ, గుండక్రియ, కళ్యాణి, కాంభోజి మొదలైనవి స్త్రీరాగములు. కాఫి, నీలాంబరి, సారంగ, కేదార, లలిత, వరాళి, సావేరి, యమున మొదలైనవి పుత్రరాగాలు. నామ భిన్నముచే వ్యవహరించబడునవి మిత్రరాగాలు. ఉ॥ ఆనంద భైరవి, వసంత భైరవి; నాగవరాళి, పున్నాగవరాళి; చెంచు కాంభోజి, యదుకుల కాంభోజి; మాళవ గౌళ, రీతిగౌళ మొదలయినవి.

జన్యరాగాల్లో ఔడవ, షాడవ, సంపూర్ణము లని మూడు విధాలు. ఆరోహణ అవరోహణము లందు అయిదు స్వరములు మాత్రమే గల ఔడవ రాగాల్లో, శుద్ధ ఔడవ, సంకీర్ణ ఔడవ, వక్ర ఔడవములని మూడు విధాలున్నాయి. శుద్ధ ఔడవంలో, ఆరోహణము, అవరోహణము రెంటిలోనూ ఒకే స్వరములుంటాయి. ఉ॥ మోహన, మధ్యమావతి, హంసధ్వని. సంకీర్ణ ఔడవంలో ఆరోహణ, అవరోహణములలో వేరు వేరు స్వరాలుంటాయి. ఉ॥ ఆందోళిక: స రి మ ప ని స - స ని ద మ రి ప స వక్ర ఔడవంలో ఆరోహణ అవరోహణ యందు గల అయిదుస్వరములు వరుసగా ఉండవు వక్ర ఉంటాయి. ఉదా॥ భోగిసింధు : స ప మ ప ద స ని ద ని ప మ స.

ఆరోహణ, అవరోహణలలో ఆరు స్వర మాత్రమే గలిగిన షాడవరాగములలో శుద్ధ, సంకీర్ణ, వక్రషాడవములని విధాలు గలవు. శుద్ధషాడవము ఉ॥ శ్రీర సంకీర్ణ షాడవము ఉ॥ కన్నడగౌళ. సరిగమ సనిపమగస. వక్రషాడవము : ఉ॥ గౌళ:- రిమపని-సనిపమగమరిస. ఏడు స్వరములు గ సంపూర్ణరాగము. మేళకర్తలోని రాగములు ఎల్లప్పుడు నియమస్వరములనే ఉంటాయి. జన్యరాగములోని సంపూర్ణ అప్పుడప్పుడు అన్యరాగాంగ, శుద్ధ, వికృతి ములలో నొకటిగాని, రెండుగాని కలిగి ఈ సంపూర్ణ రాగములలో వక్ర సంపూ గూడా గలదు. ఉ॥ కానడ :- గ రి స ప మ ద ని స స ని స ద ప మ ప గ మ

మరొక పద్ధతి ప్రకారం రాగాలు ఘన, దేశ్య అని మూడు విధాలు గా. శ్రీ శౌర్య వీరోత్సాహములను గలుగ జేయు ఘనరాగములు. ఇవి పది. నాట, గౌళ, ఆరభి, శ్రీరాగము, కేదార, నారాయణ రీతిగౌళ, సారంగనాట, బేళి. వినువారి చిత్త రంజింపజేయునవి రక్తిరాగములు. ఉ॥ శం భరణము, భైరవి, తోడి మొదలగునవి.

ఉత్తర దేశపు రాగకళలు గలిగినవి దేశ్య ములు. ఉ॥ ఫరజు, ఖమాసు, కాఫీ, దర మొదలైనవి.

ఇంకొక పద్ధతిని, ఉత్తమ, మధ్యమ, అ రాగములని మూడు విధాలున్నాయి.

సంబంధ, రాయ ఆలాపనలు జేయుటకు యోగ్యమైనది ఉత్తమరాగము. పై విధంగా యోగ్యమైనదిగా నుండియూ, అధిక ప్రచారములో లేని రాగము మధ్యమరాగము. గీత ప్రబంధాది ఆలాపనలు జేయుటకు యోగ్యము కానిది, సంకీర్ణమైనది, పామరులను రంజింపజేయుచూ ప్రచారములో గలది అధమరాగము.

వేరొక పద్ధతిని, పంచమాంత్య, దైవతాంత్య, నిషాదాంత్య రాగములని మూడు విభాలు. పంచమాంత్యము ఉ॥ నవరోజు : ప ద ని స రి గ మ ప - మ గ రి స ని ద ప : దైవతాంత్యము : ఉ॥ కురంజి: స ని స రి గ మ ప ద - ధ ప మ గ రి స ని స : నిషాదాంత్యము : ఉ॥ నాద నామక్రియ : స రి గ మ ప ద ని - ని ద ప మ గ రి స ని.

ఏయేరాగాలు ఏసమయంలో పాడితే రక్తి కడతాయో నిర్ణయించబడింది. డెబ్బైరెండు మేళకర్తరాగాల పేర్లనుండి మేళకర్త సంఖ్య తెలుసుకోవడానికి "కటపయాది" సూత్రం సృష్టించబడింది.

ఇంతకూ ఈ లక్షణ వివరాలన్నీ తెలుసుకున్నందువల్ల ఏదో పరీక్షలో మార్కులకోసం తప్ప ఆచరణలోను అభ్యాసంలోనూ ఉపయోగమేమిటని అడుగవచ్చు. మన పూర్వుల చరిత్రలూ, వారి జీవన విధానాలు, అసలు మానవజాతి పుట్టుక, మనుగడను గురించి తెలుసుకోవడం వల్ల కలిగే ఉపయోగం ఎలాంటిదో, అలాంటిదే ఇదిగూడాను. ఎంత ప్రయాసతో, ఎంతటి విశిష్ట విజ్ఞానంతో ఇంత విపులంగా రాగ లక్షణాలను మన పూర్వులు రూపొందించారో తెలుసుకొని, తద్వారా మన విజ్ఞానాన్ని పెంపొందించుకోవడం మన రక్షణ కర్తవ్యం.



# రాగములు --- మేళములు

—శ్రీ నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులు

భారతీయ సంగీతానికి స్వరముల కూర్పుచేత రంజకముగా నేర్పడిన రాగమే ప్రాణము. రాగ శబ్దానికి పూర్వులిచ్చిన నిర్వచనాలివి. “రంజకః స్వరసందర్భో రాగ ఇత్యభిధీయతే” “రంజనాద్రాగః” రాగశబ్దానికి ధాతు నిష్పన్నమయిన అర్థము రంజింపజేయునది అనియే.

రాగానికి రంజకత్వము ప్రధాన లక్ష్యము, లక్షణమును. లక్ష్యము పొసగట్టుట లక్షణజ్ఞానము చేతనే.

“రంజయంతి మనాంసీతి రాగాస్తే దశ లక్షణాః
నవతిలి మతంగాద్యైః ప్రాపితాస్తాని చక్రమాత్
లక్షణాని దశోక్తాని లక్ష్యస్తే తావదావేత్తః
గ్రహాంశౌ మంద్రతారౌ చ న్యాసాపన్యాసకౌ తథా
అథ సన్న్యాస విన్యాసౌ బహుత్వం చాల్పతా తథా”

1 గ్రహస్వరము = పాడుటను ఎత్తుకొను స్వరము

2 అంశస్వరము = తరచుగా ప్రయోగింపబడు స్వరము. ఇదే జీవస్వరము.

3 మంద్రము = ఒకదానికన్న ఒకటి అవరోహిగా వచ్చు స్వరము లేక మంద్ర స్థాయి.

4 తారము = ఒకదానికన్న ఒకటి ఆరోహిగా వెళ్ళు స్వరము. లేక తారస్థాయి.

5 న్యాసస్వరము = పాటనుగాని పాడుటను గాని ముగించు స్వరము.

6 అపన్యాసస్వరము = గీతముయొక్క గాని రాగముయొక్క గాని అవాంతర స్వర సందర్భమును ముగించునది.

7 విన్యాసస్వరము = గేయప్రబంధ ప్రథమ భాగమును ముగించుస్వరము.

8 సన్న్యాసస్వరము = గీతముయొక్క పూర్తి భావమును ముగించుస్వరము.

9 బహుత్వము = ఒకే స్వరసందర్భము సారెసారెకు ప్రయోగించుట.

10 అల్పత్వము = నిర్దిష్టమైన ఒక స్వరసందర్భము తక్కువగా ప్రయోగించుట.

(ప్రతి పదార్థము మాత్రమే పైన చెప్పబడినది) రాగమునకు పైన చెప్పబడిన పదిలక్షణములు ఉండవలెను. ఈ లక్షణములు రాగవ్యంజకములు.

సంగీత రత్నాకరంలో గ్రామరాగాలు, ఉప రాగాలు, భాషాంతర భాషావిభాషారాగాలు అను భేదములతో రెండువందల అరువదినాలుగు రాగాలు చెప్పబడినవి. ప్రస్తుతం అవి ఏవీ వ్యవహార ప్రచారాలలో లేవు కనుక వాటిని వదలి ప్రస్తుతము గాయకలోకంలో ప్రచారములోనున్న రాగాలను నిరూపిస్తాను అని వేంకటమఖి చతుర్దండి ప్రకాశికలో చెప్పినాడు. సంగీత రత్నాకర

డిసెంబరులో మచిలీపట్నంలో జరిగిన సంగీతోత్సవాల సందర్భంలో చదివిన వ్యాసము

రానికి చతుర్దండి ప్రకాశికకు మధ్యలోకూడ స్వర మేళకళానిధి, సంగ్రహ చూడామణి మొదలగు గ్రంథములున్నాయి

స్వర మేళకళానిధికర్త రామామాత్యుడు, వేంకటమఖికి పూర్వుడు. సంగ్రహచూడామణికర్త గోవిందాచార్యుడో, గోవిందామాత్యుడో, గోవింద దీక్షితుడో కాని మొత్తానికి గోవింద నామకుడు. ఈయన కాలాది వివరములు లభింప లేదు. కొన్ని కారణాలచేత వేంకటమఖికి పూర్వు డనిపిస్తుంది సంగ్రహచూడామణిలో వేంకటమఖ చేసిన నిర్దేశమని ప్రచారము గలిగిన "కనకాంబరి" మొదలయిన నామములున్నవి. వాటికి ముందున్న "కనకాంగి" అనే పూర్వ నిర్దేశములుకూడనున్నవి. కాని ఆ గ్రంథములోను వేంకటమఖి మొదలయిన లక్షణకర్తల ఉద్ఘాటనములేదు. కనుక పూర్వుడా అని సందేహము కలుగును. సంగ్రహచూడామణి కర్త చేసిన నిర్దేశాన్నే వేంకటమఖి పునరావృత్తం చేశాడా? ఒక విధమయిన ప్రాబల్యముచేత ఆ ఖ్యాతి వేంకటమఖికేవచ్చినదా? ఇన్ని ప్రశ్నలు కలుగవచ్చు. తాళపుచెవి మాత్రం దొరకదు.

ఏది ఏమయినా స్వరమేళకళానిధి, సంగ్రహ చూడామణి, చతుర్దండి ప్రకాశిక, ఈ మూడు గ్రంథములు మనకు దగ్గర గ్రంథములు. ఇవి ఉత్తరోత్తరముగా నేటి మన సంగీతవ్యవహారానికి దగ్గరగానుంటవి. రామామాత్యుడు స్వరమేళ కళానిధిలో కొన్ని వివరాలు ఇస్తూ ఇంకా వివ రాలు కావలసివస్తే సంగీత రత్నాకరాన్నే చూడ మనినాడు. సంగ్రహచూడామణిలో విపులంగా నున్నది. (లక్షణ గీతాలతోసహా) చతుర్దండి ప్రకా శిక కొంత వివరంతోగూడియున్నది అయినా పూర్తి ప్రబంధము లబ్ధముకాలేదని అభిజ్ఞుల అభి ప్రాయము, అయినను ఈ మూడు గ్రంథముల వలనను మనకు చాలా సంగీత శాస్త్ర సంబంధ విషయాలు తెలుస్తాయి.

ఈ గ్రంథములలో మేళప్రకరణము, రాగ ప్రకరణము వేరుగానుంటాయి స్వరమేళకళా నిధిలో "సర్వేషు రాగమేళేషు ముఖారీమేళ ఆది మంతః తతో మాలవ గౌళస్య మేలః" అని ఉన్నది. ఉత్తమేళములు, అనకుండ రాగమేళము లలో ముఖారిమేళము మొదటిది అని నిర్దేశించుట జరిగి నది. ఇక్కడ నా అభిప్రాయము వివరిస్తాను. ఇప్పుడు సాధారణంగా సంగీతసాధకులు 72 మేళ కర్తలు మొట్టమొదటి రాగాలని, ఒక్కొక్క మేళ కర్తనుంచి అనేక రాగాలు జన్యాలుగా ఏర్పడిన వనిన్నీ భావిస్తారు. ఈ అభిప్రాయము సరిఅయి నదికాదు. కాని దానిని పూర్తిగ తిరస్కరించు టకులేదు. కొన్ని పద్ధతులను అమలుపరచి ఇప్ప టికి ఈ విధంగా అనుకొండిఅని నిర్దేశించిన భావము. అది మనం స్వర మేళకళానిధిని పరిశీలిస్తే ఈ జన్య జనకభావము వ్యత్యస్తమవుతుంది. మన మిప్పుడు జన్యములని వ్యవహరిస్తున్న రాగాలే మనం జనకము లని భావించిన రాగములకు మూలకందములు. జన్యరాగాల నాధారం చేసుకొని మేళకర్తల నిర్ణ యం స్వరమేళకళానిధిలో జరిగినది. ఉదాహర ణకు కేదారగౌళమేళము, ముఖారీమేళము, హిందోళమేళము, రీతిగౌళమేళము, వసంతభైరవి మేళము పేర్కొనబడినవి. అంటే ఈ రాగములు పూర్వనిష్పన్నములు అయిన రాగములు. ఈ రాగములనుంచే మేళకరణ భావం కలిగినది. అందుకనే రామామాత్యుడు రాగమేళములు అని నిర్దేశించుట జరిగినది. అనగా రాగమేములనుండి జన్యములయిన మేళములు అని. ఇంకొక ముఖ్య విషయము. రామామాత్యుడు చెప్పినవి ఇరువది మేళకర్తలే

వేంకటమఖి చెప్పినట్లు ప్రచారములోనున్నవి డెబ్బదిరెండు మరి ఈ రెండింటి సంఖ్యకు పొస త్వములేదు. ముఖారిరాగమేళము నేటి కనకాంగి. ఆలోచిస్తే ముఖారిమేళములంటే ఒక్క కనకాంగి మాత్రమే కాదేమో. ఇప్పటికి చక్ర రూపములో ఉన్న కొన్ని మేళరాగములను కూడ అన్వయించుకొనవచ్చునేమో? మేళ శబ్దమునకు కొంత అర్థవ్యాప్తి కల్పించి చక్రము కొంత గ్రహింపవచ్చునేమో? హిందోళ మేళమంటే నేటి నటభైరవి మేళమే కాక తోడి మేళాన్ని కూడా గ్రహింపవచ్చును కదా! ఈ విధంగా ఈ ఇరువది మేళకర్తలలో ఇంకా కొన్ని మేళకర్తలను మననుపలక్షింపవచ్చును ఆనాటి వ్యవస్థ అది.

తరువాత వేంకటమఖి చతుర్దండి ప్రకాశికలో ఆయన అవసరమనుకొన్న తావులలో రామామాత్యుని శ్రీమంతము, తీవ్రనము సనిందముగా ఖండించి కొన్ని నిర్ణయాలుచేయుట జరిగినది. ఈనిర్ణయాలలో ముఖ్యమయినది డెబ్బది రెండు మేళకర్తల నిర్ణయము. వాటి నామకరణము ఇక్కడకొన్ని సందేహాలు ఉత్పన్న మవుతాయి. వేంకటమఖికి పూర్వము డెబ్బదిరెండు మేళకర్తలు లేకపోతేమరి కనకాంగి, రత్నాంగి, గానమూర్తి, వనస్పతి, మొదలయిన ఈ పేర్లతో డెబ్బదిరెండు మేళకర్తలున్నాయి. అవి ఎవరి నిర్ణీతములు? 'కనకాంగి' మొదలయిన వ్యవహారము వేంకటమఖికి తరువాత అనుకొంటే వేంకటమఖి చేసినట్లు ప్రచారంలోనున్న 'కనకాంబరి' మొదలగు నామకరణములో మొదటి వ్యవహారములోని కొన్ని లోపాలను తీర్చినట్లు కనబడుతుంది. ఉదాహరణానికి ఒకటి. చక్రవాకం అనే మేళకర్త మొదటి వ్యవహారానికి ఇది పదునారవ మేళకర్తకావాలి కటపయాది సూత్రానుసారంగా ఇందులో "క్ర" అనే ద్విత్వాక్షరములో క గ్రహించాలా? "ర" గ్రహించాలా? అనే ప్రశ్నకలుగుతుంది. వేంకటమఖి పెట్టిన పేర్లలో ఈ లోపము పరిహరింపబడినది దానికి "తోయవేగావాహిని" అనే పేరులో పై బెడద లేకుండ సరిగా పదునారవ సంఖ్యకు సరిపోయినది. ఈ విధంగానే చాలా ఉన్నాయి. ఉదా: "షడ్విధమార్గిణి"కి పేరు మార్చుటలో 'స్తవరాజము" అని మార్చినను పై బెడద వేంకటమఖి కూడ తప్పలేదు. ఈ విధంగా ఆలోచిస్తే కనకాంగి మొదలయిన వ్యవహారము మొదటిది, వేంకటమఖిది అని మనం అనుకుంటున్నది తరువాతది. మొదటి వ్యవహారములో వచ్చిన బెడదను తప్పించుటానికి అపవాద సూత్రం కూడా ఒకటి ఏర్పడినది. "చక్రవాకము" లో "క్ర" లో మొదటి అక్షరానికి ప్రాధాన్యము, "సూర్యకాంతము"లో "ర్య"కు రెండవ అక్షరమునకు ప్రాధాన్యము. ఇటువంటి గుర్తులతో కటపయాది కాఠిన్యము నెజ వేర్చుకొనవచ్చును. అంతకు తప్పితే వేంకటమఖి పేర్లకు ప్రయోజనాభావ మటుంచి మొదటి పేర్ల వలె అందమైనవికూడ కావు. 'రత్నాంగి' కన్నా 'ఫేనద్యుతి' అందమైనపేరుకాదు. ఏతావాతా మొదటి వ్యవహార మెవరిదో చరిత్రకందలేదు. అకలంకుని పేరొకటి కానవస్తుంది సంగ్రహచూడామణిలోని ఆంగ్లప్రవేశికలో. రామామాత్యుని నాటికికూడ మొదటి వ్యవహారం లేదనే అనిపిస్తుంది. వేంకటమఖికూడ మొదటి వ్యవహారాన్ని గురించి ఏమీ ప్రస్తావనము తేలేదు. ఒక విషయము వెంకటమఖి పెట్టిన కొన్ని పేర్లలో కొంత సార్థక్యము కనపడుతుంది. తరువాత దీని విషయమును రాగలదు. ముందుగా కొన్ని విషయములను ముచ్చటించుకోవలసి ఉంటుంది. డెబ్బది రెండు మేళకర్తలలో కొన్ని ప్రాచీన కాలము నుండి ప్రసిద్ధి ప్రచారాలలో నున్నవి, కొన్ని ఎక్కువ ప్రచారంలో లేకపోయినా ఉన్నవి. కొన్ని కేవ

కలో బి.ఏ. పరీక్షపాసయ్యారు.
గేడ్ ప్లీడరు పరీక్షకు మద్రాసు
కాలంలో తిరుకోడికావల్
తిరుచునాపల్లి గోవిందస్వామి
ణదేశంలో మహాప్రతిభావంతు
విద్వాంసులు. వాళ్ళను తన
ంగా ఎన్నుకుని వాద్య సంగీత
నాగభూషణంగారు. కోనేరి
ద్యనాథ అయ్యరు ఆనాడు
ంకశిఖామణి. ఆయనను కూడా
ననకు సహోదగురువుగా నాగ
ఎన్నుకున్నారు. లా కాలే
కాలంలోనే దక్షిణదేశంలోని
ాలలో జంత్రగాత్ర కచేరీలు
ల్లా, గాయకోత్తములచేతా
న్నారు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి
ణమూర్తిగారు నిర్వహించిన
ఆధ్వర్యంలో 1909 సంవ
దక్షిణదేశంనుంచి మహావిద్వాం
ఆహ్వానించేవారు. ఆంధ్రులలో
మణదాసుగారికీ, తుమరాడ
స్త్రిగారికీ ప్రముఖ స్థానం
ాగభూషణంగారి యశస్సు
ల్లులు దాటి ఆంధ్రలోకూడా
ల్ల 1910 సంవత్సరంలో వారిని
. తరవాత చాలాసార్లు
లు చేసారు. అశ్వథాటి రామ

మూర్తిగారి మృదంగవాదనంతో జరిగిన కచేరీ విన్న శతావధాన శిరోమణి తిరుపతి శాస్త్రిగారు చెప్పినపద్యం ఎంతో హృద్యంగా ఉంది—

"సంగీతమెరుగని సాలభంజికలైన
నింపుగా తలల నూగింపజేసె
లయశుద్ధిలేని లులాయంబునకునైన
సొంపుగా తాళమే యింపుజేసె
... ... ... ...
నాగభూషణు డితడు నంది రామ
మూర్తి యిద్దుంగూడ సభ్యులును
గూడ నాగభూషణులైరి యానందులైరి."

1912 లో మదరాసు నగరంలో నాగభూషణంగారికి గొప్ప సన్మానం జరిగింది. సుప్రసిద్ధ విద్వాంసులు తచ్చూరు సింగరాచార్యులుగారు నాగభూషణంగారికి బంగారు తోడా తొడగిగౌరవించారు. అంతగౌరవం ఆంధ్రగాయకులకు ఆనగరంలో అంతకు పూర్వం జరగలేదట.

1916-వ సంవత్సరంలో బరోడా మహారాజావారిచే ఏర్పాటు చేయబడిన అఖిల భారత సంగీత సభలకు నాగభూషణంగారు ఆంధ్రప్రతినిధిగా వెళ్లారు. "సంగీతము 22 శ్రుతులు" అన్న విషయంమీద demonstative lecture యిచ్చి పండితుల ప్రశంసలు, సన్మానం పొందారు. ఆ సభకు వెళ్ళడానికి

తనను ప్రోత్సహించి సహాయం చేసినవారు వల్లూరు ఎస్టేటు దివానుగారు శ్రీ వేమూరి సుబ్బారావు పంతులుగారని నాగభూషణం గారు చెప్పారు.

ఆనాటి మదరాసు రాష్ట్ర రసజ్ఞశేఖరుల పక్షాన "విశ్వదాత" కాశీనాథుని నాగేశ్వర రావుగారు అధ్యక్షులుగా ఆహ్వానసంఘం 1932 సంవత్సరంలో ఏర్పడి బందరులో నాగ భూషణంగారికి ఘనమైన సమ్మానం జరిపింది. ఆ సభకు ప్రొఫెసర్ పి. సాంబమూర్తి, శ్రీమాన్ ఎస్. విజయరాఘవన్ అయ్యంగార్ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కాశీ కృష్ణా చార్యులుగారు, మొదలైన పెద్దలు, విద్వాం సులు, మహాకవులు, రసజ్ఞులు ఎంతోమంది విచ్చేశారు. మైగరు వరదాచార్యులు ప్రతిపా దించిన "వాగ్గేయకార రత్న" అనే బిరుదును నాగభూషణంగారికి యిచ్చి గౌరవించారు. నాగభూషణంగారికి శ్రీరాముడుయిష్టదైవం; త్యాగరాజు సద్గురువు అంచేత వారి యిరు వుకి మూర్తులతోకూడిన బంగారు పతకం చేయించి "శ్రీరామ స్వర్ణ నవరత్న మాల" అన్న పతకసహిత మాలను నాగభూషణం గారికి బహూకరించారు

తిరువయ్యారులో శ్రీ త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు చూసి ప్రభావితుడై త్యాగ రాజ ఆరాధనోత్సవాలు తనయింట, స్వంత ఖర్చులమీద, అన్నిరకాల యిబ్బందులనూ సహిస్తూ, దాదాపు పాతికేళ్లు అతివైభవంగా జరిపారు నాగభూషణంగారు. భక్తపోతన, త్యాగయ్యలను వలె నాగభూషణంగారి కూడా సరస్వతి అనుగ్రహించింది. లక్ష్మీ కటాక్షంమాత్రం లభించలేదని ఈ సందర్భం మనం గమనించాలి. ఆంధ్రదేశంలో త్యా రాజ ఆరాధనోత్సవాలను ప్రప్రథమం ప్రారంభించిన కీర్తి ఆయనదే!

సంగీతం కళకాదు, అది ఒక మహాతపస్సు అని నమ్మిన నాదోపాసకుడు నాగభూషణ గారు. తన అభిప్రాయాలను వ్యక్తంచేస్తు అనేక పత్రికలలో వ్యాసాలు వ్రాశారు "Is Musie a Scince or Art?" "Th Idealism and Philsophy of Thya garaja" "Karnatik Music" అనే వ్యాసాలు "Triveni" పత్రికలో ప్రచు టించారు.

నాగభూషణంగారికి ఆదిశంకరుల యెడ అపారమైన భక్తి. వారిని గురించి విజయవాడ రేడియోలో నాగభూషణంగారు ప్రసంగి చారు. "వయలిన్" అనే ఆంగ్లపదానికి తెలు గులో "వాయులీనం" అనే మాటను సృష్టించి దానిని ప్రచారంలోనికి తెచ్చినవారు నాగ భూషణంగారు. నాగభూషణంగారికి పూర్వం ఆంధ్రదేశంలో జంత్ర గాత్రాలకు పేరుపొంది నవారు పాపట్ల కాంతయ్యశాస్త్రిగారు, గరిక పర్తి కోటయ్యదేవరగారు, గొర్తి లక్ష్మీనా రాయణగారు. అయితే ఆంధ్రదేశపు ఎల్లలు దాటి దక్షిణదేశంలో కీర్తిపతాకను నిలబెట్టిన ప్రతిష్ఠ నాగభూషణంగారికే దక్కింది. నాటికీ నేటికీ ఆయనను మించిన జంత్రగాత్రజ్ఞులు

దక్షిణదేశంలో లేరనడం సత్యదూరంకాదేమో!

నాగ భూషణంగారి సంగీతసాధన ఒక మహాతపస్సు. ఆయన సంగీతకచేరి ఒక రమ్య చిత్రం, ఒక అపురూప కల్పన. పరిపరి విధాల తన ఆరాధ్యదైవాన్ని, శ్రీరామచంద్ర మూర్తిని, అనేక కృతులలో కీర్తించి, ఆ దైవం తనను కటాక్షించాడని తృప్తితో అనుభూతితో తాదాత్మ్యం పొంది, ఆనంద భాష్పాలు రాల్చేవారు. రసజ్ఞులైన శ్రోతలు కూడా తమ్ముతాము మరచి, గాంధర్వ లోకంలో విహరించి, తమకుకూడా ఆ శ్రీ రామచంద్రమూర్తి లీలగా గోచరిస్తున్నట్లు భావించి, పులకించి, ఆనందభాష్పాలు వర్షించే వాళ్లు.

సంగీత కచేరీలలో సామాన్యంగా పాట కులు అందరూ సరిగమలతోనే స్వరంవేయడం సంప్రదాయం. అయితే నాగభూషణంగారు ఆ సంప్రదాయాన్ని అనుసరిస్తూనే భక్తితన్మ యత్వంలో సరిగమలతో బాటు రామనా మ తో కు డా స్వరంవేసి భక్తి ముక్తిప్రదా యకమైన శ్రీరామనామాన్ని జపించేవారు. ఇది నిజంగా అపూర్వమైన విషయం. నాగ భూషణంగారికే అది చెల్లింది.

నాగభూషణంగారు భాష్యాంతం అధ్య యనం చేసినవాడు సంస్కృతాంధ్రభాషలలోని రమ్యాలనూ, రహస్యాలనూ జీర్ణించుకున్న వాడు. అందుచేతనే త్యాగరాజ కీర్తనలలోని భావాలకు అనుగుణంగా భగవద్గీతలోనుంచీ, ఉపనిషత్తులలో నుంచీ, కాళిదాసు కావ్యా లలోనుంచీ శ్లోకాలను ఎన్నుకుని, వాటిని త్యాగరాజ కృతులతో మిళితంచేసి, శ్రోత లకు అందించేవారు. ఇది అనితరసాధ్యమైన పని, నాగభూషణంగారికి పూ ర్వ ం గా ని, ఆయన తరువాతగాని ఇలా శ్రోతలను ఆనం దింప చేసిన గాయకులు లేరు.

సభికులలో విద్వాంసులుంటే నాగభూ షణంగారు పొంగి పో యే వా రు." . . . మూపులు మూడగున్ రిపు చమూపుల గన్న పుడే కిరీటికిన్..." అని "విజయ విలాసం"లో పార్థుణ్ణి గురించి చేమకూర వేంకటకవి చెప్పింది నాగభూషణంగారి యెడ బాగా వర్తిస్తుంది. పూచి శ్రీనివాస అయ్యంగార్ గొప్ప విద్వాంసుడు. "విరుబోణి . . . "వర్ణం అతి దురితంగా పాడి ఒప్పించడం ఆయన ప్రత్యేకత, అయన కచేరికి ఇరవై ఏళ్ల వయసు గల నాగభూషణంగారిని వయొలిన్ వాయించ డానికి ఏర్పాటు చేశారు. చేతగాని ఆకుర్ర వాణ్ణి కూచోపెట్టి తనకచేరి పాడుచేయటానికి కార్యకర్తలు పూనుకున్నారని అయ్యంగార్ భావించాడు. తనపోకడను గమనించి తనకు నీడలా అనుసరించి వాయించిన నాగభూషణం గారిని సభానంతరం కౌగలించుకుని ఎంతో అభినందించారు అయ్యంగార్.

1928లో చల్లపల్లి రాజా శివరామప్రసాద్ గారి పెళ్లికి దక్షిణదేశంనుంచి దిగ్గంతులవంటి సంగీత విద్వాంసులు వచ్చారు. ఆసందర్భంలో ప్రఖ్యాతమృదంగ విద్వాంసుడు దక్షిణమూర్తి

పిల్లై కోరికమీద బందరులో నాగభూషణంగారి కచేరి జరిగింది. నాగభూషణంగారి ప్రతిభకు ముగ్ధుడై, మృదంగం వాయిస్తున్న దక్షిణామూర్తి పిళ్లై నాగభూషణంగారికి సభామధ్యంలో పాదాలపై పడి భక్తవరేణ్యుడని ఆయనను ఉగ్గడించారు.

1932 బందరులో నాగభూషణంగారికచేరీ ఆసాంతం విని, ప్రొఫెసర్ సాంబమూర్తిగారు —"కంజీవరం నాయనపిళ్లై బ్రతికి ఉండి ఈనాటి తోడిరాగ ఆలాపన విని ఉంటే నాగభూషణంగారికి సాష్టాంగపడి ఉండేవాడు" అని అభినందించారు.

మునగాల రాజాగారి ఆస్థానంలో త్యాగరాజస్వామి హరికథను నాగభూషణంగారు ఉదయం 7-30 నుంచి రాత్రి 9-30 గంటల వరకు చెప్పారన్నా, నాగభూషణంగారియింట ఆయన జరిపే త్యాగరాజ ఆరాధనోత్సవంలో కాంభోజిరాగకచేరి రాత్రి 9-20 నుంచి తెల్లవారి 5 గంటల వరకు చేశారన్నా ఈ నాటి సుకుమార రసజ్ఞులు నమ్మరేమో!

అన్నట్లు నాగభూషణంగారు యౌవనంలో నాటకాలుకూడా వేసేవారట 'చిత్రనళీయం'లో బాహుకపాత్రను నిర్వహించేవారట. హరిశ్చంద్ర వేషం బాగా వేసేవారు అయితే ఒకసారి నాటకంలో లోహితాస్యుడు పోయినప్పుడు పద్యాలను ఎంతో బాగా పాడి ప్రేక్షకుల "వహ్వా" లనుపొందిన వారం రోజులకే తనకుమారుడు చనిపోగా ఆవేశానికే కాక నాటకానికి కూడా అంతటి స్వస్తిచెప్పారు, ఆరోజులలో నాగభూషణం గారికి వెలమవీరులవలె మంచి మీసాలుకూడా ఉండేవి !

మూడు దశాబ్దాలకు పైగా దక్షిణదేశంలో సంగీత దిగ్విజయ యాత్ర సాగించి, సంస్కృతాంధ్రాలలో "త్యాగయోగం" అనే ముద్రతో అనేక కీర్తనలు రచించి, గానంచేసి పండిత పామరుల మెప్పును పుష్కలంగా ఆర్జించి మహా విద్వాంసుడు నాగభూషణంగారు 1941లో పక్షవాత వ్యాధికి గురి అయ్యారు. అంతబలవంతమైన వ్యాధికి ఆ సింహబలుడు లొంగతీసుకొనడానికి పద్దెనిమిదేళ్లు పట్టింది. వైదికోత్తముడు, ఆ మహాతపస్సంపన్నుడు ఆ శ్రీరామభక్తుడు జీవితాంతంలో తురీయాశ్రమస్వీకారంచేసి. శ్రీరామానంద భారతీ యతీంద్రుడై "సన్న్యస్తంమయ" అని నమస్కరిస్తూ, చివరి గడియవరకూ శ్రీ రామనామ స్మరణ చేస్తూ ప్రాణోత్క్రమణం చేసి మోక్షాన్ని పొందారు - 1959వ సంవత్సరం సెప్టెంబరు 7వ తేదీన.

"సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదె మనసా" అని త్యాగయ్యగారు సెలవిచ్చారు. నాగభూషణంగారి గానానికి ఆ సిద్ధిలభించింది. భక్తిరూపాన్ని సంతరించుకున్న వారి గానకళ ఉత్తమమైనది. తాను పరమదైవంగా ఎంచుకున్న త్యాగరాజు అడుగుజాడల్లో "నిధి చాల సుఖమా రాముని సన్నిధి సేవ సుఖమా నిజముగ బల్కు మనసా" అన్న

శ్రుతుల ప్రస్తారంచేత సంఖ్యను పూరిం
న్ని ఇప్పుడు జన్యములని వ్యవహరి స
ఔడవ షాడవ సంపూర్ణాది ప్రసిద్ధ రాగ
భావాన్ని గ్రహించి ఏర్పడినవి. ఈ
నాలుగు తరగతులుగా విభజించవచ్చును.
మూడవ దానిలోనిదే అనుకున్నా
ధములని ఎంచవచ్చును. మొదటి విభా
ఏర్పడినవి హనుమత్తోడి, మాయామాళవ
భైరవి, (ఇది నఠభైరవి కాని నఠ
రాగు. ఈ పొరపాటు బాగా ప్రచారమయి
హరికాంభోజి, ధీరశంకరాభరణము చల
ఘాలవరాళి, శుభపంతువరాళి వంటివి.
ప్రసిద్ధములు, సంపూర్ణములు. ఎందు
సంగీత రత్నాకరములో కూడ నాట,
శంకరాభరణము వంటి పేర్లున్నాయి. రగు
లంలో కొన్ని ఏర్పడినా అవి 72 వ్యవ
ందే ఏర్పడి ఉన్నవి, వీటి నన్నింటిని
వ్యవస్థలో కటపయాది సూత్రాన్ని
ట్టి దాని కనుగుణంగా పేర్లు మార్చవలసి
తోడి రాగము ఎనిమిదవ సంఖ్యకు రావాలి.
! అందు పూర్తి పేరు మార్చితే వ్యవ
కొంత ఇబ్బంది కలుగుతుంది. అందుచేత
రివడులాగున హనుమత్, శబ్దాన్ని కలిపి
తోడి అన్నారు. 'శంకరాభరణము' స్వర
రాల స్వభావాన్ని బట్టి 29వ సంఖ్యకు
రాదు కనుక, ధీర, అనే పదాన్ని చేర్చి
రాభరణము' అన్నారు ఇట్లే హరికాంభోజి,
ల్యాణి. కాంభోజి ప్రసిద్ధ రాగమయితే
ప్రాధాన్యంతో హరికాంభోజి ఏర్పడినది
కాంభోజియే ఉన్నది కాని హరికాం
దు హరికాంభోజికి సంపూర్ణ స్వరూప
త్యాగయ్యగారే.

హరప్రియను గూర్చి కొంచెము మూహిద్దాము.

72 వ్యవస్థకు ముందు కూడ ఈ స్వరూపంలో ఒక రాగము తప్పక ఉండి తీరాలి. ఎందుచేతనంటే చాలా ప్రాత రచనలు వైష్ణవ సంప్రదాయంలో తిరునామముల పేరిటివి ఉన్నవి. వాటిలో కొన్నిటిలో ఈ రాగచ్ఛాయే ఉన్నది. పేరు మాత్రము వేరే ఏదో వుంటుంది. నేటి సైంధవిలో ఖరహర ప్రియకన్న భేదమేమియు కానరాదు. వసు చరిత్రాది ప్రాచీన ప్రబంధములలో సైంధవి రాగ ప్రసక్తి కలదు. కనుక నిది ప్రాచీన రాగము. స్వర స్థానము విభజనను బట్టి 22వ సంఖ్యకు రావాలి. రెండు అక్షరములు చేర్చితే కాని రాదు ఆయా మేళకర్తలకు ఆయా అక్షరములను పంచి పెట్టగా "ఖర" అనే రెండక్షరములే మిగిలినవి. కేవలము కటపయాది సూత్రము కొరకు అర్థములేని డిద్ధడ పిద్ధాది శబ్దాల వంటివి పూర్వులు సృష్టింపనీయ కొనలేదు. అర్థముగల పదము 'ఖర' అనే మిగిలినది. సంప్రదాయ ప్రకారముగా దానికి 'ప్రియ' అనో 'క్రియ' అనో చేర్చ వలసి వచ్చినది. మొదటిది వినే వారికి తగిలి వచ్చేటట్లున్నది. రెండవది గాయకుని తగిలి వచ్చేటట్లున్నది ఇక 'ఖర సైంధవి' అనాలి. అపుడు గాడిదకు సంబంధించిన ఆడు గుఱ్ఱము అని అర్థమగుచున్నది. ఈ మేళ నామ కరణానికి ఇంత ఇబ్బంది కలిగినది.

రామామాత్యుని శ్రీరాగవ్యవహారం నచ్చలేదు. క్రొత్త పేరు పెట్టక తప్పలేదు అశ్లీలమయిన పేరును సుశ్లీలం చెయ్యాలి. ఖర ప్రక్కన హర చేర్చితె ఖరహర = ఖరాసురుని సంహరించిన రాముడు, ఆయనకు ప్రియ మయినదని అర్థాన్ని కూర్చి, 'ఖరహరప్రియ' అన్నారు. ఈవిధంగా ఆలోచిస్తే 72 మేళకర్తలు పూర్వగాయకులకు రావు అనుకొనుట పొరపాటు పూర్వులకు రానిది మనకురాలేదు. మనకురానిది రేపు వచ్చునా? ఇంకా కీరవాణి మొదలగు ఎన్నో సుస్వరూప రాగా

ంలో ప్రాచీన వాగ్గేయ కారుల రచనలున్నాయి. మేళకర్తలను పైవిధంగా విభగడిస్తే సంగీత విద్వాంసులు కొందరికి సృష్టిలో వివాదాద్యాది దోషములున్నవను కొన్ని మేళకర్తలు కొద్దిగా మాత్రమే ఉంటాయి. మిగిలినవి కొన్ని నామ భేదములతో వ్యవహరించి ఉండవచ్చును, గాయక విద్వాంసులు కొన్ని శాస్త్రప్రమాణములను, రంజకత్వాన్ని సృష్టిలో పెట్టుకొని వదలి ఉండవచ్చును "రాగము" అంటే దానిలో రక్తికి హేతువు అయిన మూర్ఛనాలంకారమయ కాదు లుండాలి. రసు ప్రియ అనే మేళకర్తకు శుద్ధరిషభ, శుద్ధగాంధార, ప్రతి మధ్యమ, పంచమములు, చరువాగ షట్ఛ్రుతి ధైవత, కాకలినిషాదములు. ధైవతనుంచి అంతరగాంధారము వరకు వ్యవధానము లేని స్థానములు. వీటి ప్రయోగము శ్రవణహితముగా నుండునా? ఈవరుసలో గమకానికి గాని స్థాయికి గాని స్వభావసిద్ధ మయిన అవరోహము కదా! ఈ కారణము చేత కొద్ది మేళములు కల్పించబడినా కొన్నిటికి సంగీత విద్వాంసులు తమ శక్తియుక్తుల చేత కొంత రంజకత్వాన్ని కల్పించి నిలువబెట్టక పోలేదు, ఏతావాతా 72 మేళకర్తలనున్ను పూర్వులు వాడలేదు అనుమాటకు అతివ్యాప్తి దోషమున్నది. పూర్తిగా వదలినవి 4, 5 వుండవచ్చును. వాటి స్వభావాన్ని కొంత మన్నించి సక్కన కొన్నిటిలో కొలది రచనలే చేయుట జరిగినది. శంకరాభరణాది ప్రముఖరాగములలో బహుళఖ్యాతములయిన రచనలు చేయుట జరిగినది. ఇంతే. ఈ విధముగా కొన్ని ప్రసిద్ధ రాగములు కూడా మేళము చోటు చేసుకొన్నవి. రాగములు మేళములే మేళము లన్నియు రాగములు కావు. ఒకో మేళమందు ప్రస్తారము చేత ఎన్నో జన్యరా లేర్పడినా అన్నిటికి ప్రచారము వచ్చుట కారణము అన్నిటికిని రంజకత్వము లేక టయే. మేళకర్తకన్నా ఒకప్పుడు జన్యభా కలిగినదే ప్రసిద్ధి ప్రచారము కలిగి యు పూర్వి కల్యాణి జన్యము, దాని మేళ గమనశ్రమ, వేంకటముఖి సంప్రదాయము 'గమకక్రియ". ముత్తుస్వామి దీక్షితులు దీ "మీనాక్షీ మేముదం" అను కీర్తన రచించి, పూర్వికల్యాణి గానే పాడుట కలదు గమకక్రియ అన్నా నిలిచినది సనిదస-గమపద -వంటి ప్రయోగములుగా నడచినదే. కనుక స్వరస్థానముల పంపకము చేత వచ్చిన మేళ కన్న తజ్జన్యములకే ప్రయోగబాహు కలదు. మొట్టమొదట వేంకటముఖి నామక ములలో కొంత సార్థక్యమున్నదని ఉటంకించి అది ఇప్పుడు వివరింపబడుతుంది. "గానమూర్తి ఆయన "గాన సామవరాళి" అన్నారు. అ సామవరాళి మొదటి రాగము. దానికి కుదురుటకు గాన చేర్చుట జరిగినది. ఇట్టి "గేయ హెజ్జజి". మొదటి పేరు గాయకప్రియ ధుని భిన్నషడ్జము కూడ నిట్టిదే. ధీరశంకరా రణము, మేచకల్యాణి వలె వీటి నూహిం కోవలసి యుంటుంది.



# "వాగ్గేయకారరత్న"

# శ్రీ హరి నాగభూషణంగారు

— శ్రీ భావరాజు నరసింహారావు

"... మూర్తి సౌమ్యతయు బాహుల దీర్ఘతయుం బటుత్వతత్వజ్ఞతయున్ గతిస్ఫురదుదాత్తతయుం..." అన్న అర్జునుణ్ణి గురించిన తిక్కన్నగారి పద్యం నాగభూషణంగారికి చక్కగా వర్తిస్తుంది. ఉన్నతమైన విగ్రహమూ, ఎత్తుకు తగిన పుష్టిగల దేహము, దీర్ఘమైన బాహువులూ, కోటేరువంటి నాసికా, చెవులకు స్వర్ణతాపిత రుద్రాక్షలూ, విశాల వక్షం మీద మునగాల రాజాగారు బహూకరించిన బంగారు తొడవుతో ఉన్న రుద్రాక్షమాల, కుంకుమబొట్టుతో బ్రహ్మవర్చస్సు వెలార్చే విశాలమైన ముఖమూ— ఇవి హరి నాగభూషణంగారి బాహ్యమూర్తికి చిహ్నాలు. తరతరాలుగా వస్తున్న సనాతన ధర్మదీక్ష, అరమరికలులేని అమాయిక హృదయమూ, సాక్షాత్తు ఆదిశంకరులే తిరిగి త్యాగరాజుగా అవతరించారన్న నమ్మకంతో పెంచుకున్న శ్రీ త్యాగరాజస్వామిమీది గౌరవమూ, "రామా నిన్నేనమ్మినాను। నిజముగా సీతారామా నిన్నే నమ్మినాను" అన్న శ్రీరామచంద్రునిమీద అకలంక భక్తి- యివన్నీ ఆయనలో సమపాళ్లుగా ఒదిగి ఉండేవి.

నాగభూషణంగారు బి. ఏ. పట్టభద్రులు. ఫస్టుగ్రేడు ప్లీడరుపట్టా కూడా పొందారు. వృత్తివల్ల వకీలు; ప్రవృత్తివల్ల నాదబ్రహ్మోపాసకులు. అంతేకాదు. శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శిష్టా నరసింహశాస్త్రిగారల వంటి మహాపండితులకు శిష్యుడై, సంస్కృతములోనూ, తెలుగులోనూ అనేకకృతులనూ, శతకాలనూ వ్రాసి సంగీతంలోనూ, సాహిత్యంలోనూ కూడా అసమాన ప్రతిభను గడించిన వాగ్గేయకార రత్నం. "త్యాగరాజ చరిత్ర" "శంకర విజయం" "పాదుకా పట్టాభిషేకము" మొదలైన హరికథలను రచించి భక్తజనాహ్లాదకరంగా గానం చేసిన భక్తవరేణ్యుడు పండిత పరిచర్య చేసి వేదాంతభాష్యం శాంతితో పాటు భగవద్గీతలోని కొన్ని అధ్యాయాలకు వ్యాఖ్యానం వ్రాసిన గోష్ఠీపరుడు ఆస్తికుడు. సపథయోగ్యుడు. ఇన్నిశక్తులూ,

సుగుణాలూ ఒకేచోట కేంద్రీకృతం కావడం బహు అరుదు.

అసలు హరివారి వంశానికే సంగీత ప్రపంచంలో ఒక విశిష్టస్థానం ఉన్నది. త్యాగరాజుల వారి గురువు శొంఠి వెంకటరమణయ్యగారని చరిత్ర చెబుతున్నది ఆ రమణయ్యగారి గురువు హరి రామయ్యగారని విఖ్యాత విమర్శకులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "భారతి" పత్రికలో విశదీకరించారు. రామయ్యగారు కృష్ణా జిల్లావారు. మహావిద్వాంసులు. ఆయన ఒక పెళ్ళిపందిరిలో కచేరీచేస్తూ, అగ్నిసంబంధమైన రాగాన్ని మైమరచి తన్మయంతో ఆలాపన చేస్తూండగా అగ్ని ప్రజ్వరిల్లి, పెళ్ళిపందిరి అగ్నికి ఆహుతి అయిపోయింది. శుభసమయంలో ఇలాంటి అవాంతరం జరగటం అందరికీ కష్టంకలిగించింది. ఆ కారణంగా రామయ్యగారికి ఆంధ్రదేశంలో ఉండటం కష్టమై, మైసూరు తరలివెళ్ళారట. అక్కడ ఒకరోజున సంధ్యావందనం ముగించుకుని ఒక తోటలో విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఇద్దరు రాకుమార్తెలు భయంతో పరిగెత్తుకుంటూ రామయ్యగారు కూర్చున్న చోటికి వచ్చారు. వాళ్ళను తరుముకుంటూ వస్తున్న నాగుపామును చూసి, రామయ్యగారు వెంటనే పున్నాగవరాళి రాగం ఆలపించారు. పాము పడగవిప్పి ఆడింది. అలా కొంతసేపు దానిని ఆడించి, చివరకు గరుడధ్వని రాగం పాడారు. అప్పుడు ఆ పాము వెళ్ళిపోయింది. ఈ విషయం అంతా ఆ రాచకుమార్తెలు తమ తండ్రిగారైన మైసూరు మహారాజావారికి చెప్పారు. రాజు మహావిద్వాంసుడైన రామయ్య తమ ఆస్థాన విద్వాంసులుగా నియమిం తాంతము ఎంతో గౌరవించారు. ఆ శొ శొంఠి వెంకటరమణయ్యగారు ఆయన లైనారు.

నాగభూషణంగారి తాతగారు అ రామయ్యగారు కూడా మహావిద్వాం ఆంధ్రదేశం రెడ్లపాలనలో ఉండగా ఆస్థాన విద్వాంసులుగా ఆయన రాణిం ఆయన కుమారుడు నరసింహంగారు గొప్ప సంగీత విద్వాంసుడు. నరసింహం త్యాగయ్యగారి ప్రియశిష్యులైన పట్నం హ్మణ్య అయ్యరుగారి ప్రియశిష్యుడు. ఆ కుమారుడే నాగభూషణంగారు.

కృష్ణా జిల్లా, దివి తాలూకా హరిపుర 1884 సంవత్సరం డిసెంబరు 24-వ నాగభూషణంగారు జన్మించారు. తండ్రి సింహంగారు శిష్యులకు చెప్పే సంగీత లను శ్రవణమాత్రంచేతనే గ్రహించి ప్రాయం రాకపూర్వమే పిళ్ళారి గీతాలు, రాగగీతాలు, చిన్నచిన్న గేయాలు యుక్తంగా పాడటమే కాకుండా, వాయించడంలో కూడా సామర్థ్యం యించారు నాగభూషణంగారు.

ఇంగ్లీషు చదువుకి నాగభూషణంగా బందరు చేరారు. చురుకైన విద్యార్థికావ చేత మొదటినుంచీ ఫ్రీ స్కాలర్‌షిప్

మాటలలోని రహస్యాన్ని అర్థం చేసుకొని, అలాఆచరించి తరించినధన్యులు నాగభూషణం గారు. త్యాగరాజు తరవాత యింత కాలానికి తెలుగు గడ్డలో జన్మించిన వాగ్గేయకార రత్నం నాగభూషణంగారు.

చెళ్ళపిళ్ళ మహాకవి చెప్పినట్టు —
"త్యాగరాజ పదాంభోజరాగి యితడు
ఆగమాంతాంగనామణీభోగి యితడు
వాగగోచరాత్మానందభాగి యితడు
ఆగ మెరుగని మేటి విరాగి యితడు

ఇటువంటి అసాధారణ ప్రజ్ఞాధురీణుడు, పండితుల ప్రశంసలూ పామరుల జేజేలూ అందుకొన్న వాగ్గేయకార రత్నము రచించిన కృతులు చాలా ఉన్నాయని మనవి చేసాను. "త్యాగరాజ చరిత్ర" శంకర విజయం" పాదుకా పట్టాభిషేకం" వీరు వ్రాసిన హరికథలు. "శ్రీరామ రాఘవస్తవ రాజము" మొదలైన సంస్కృతాంధ్ర శతకాలు. భగవద్గీతకు వ్యాఖ్యానము, ఇవిగాక ఎన్నోకీర్తనలు వీరు రచించారు. ఆ వ్రాత ప్రతులు మన అదృష్టంవల్ల వారి కుమారులు జాగ్రత్తచేసి ఉంచారు. మన గానకళకు, నాటకరంగానికి విశిష్టమైన సేవచేస్తున్న ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు నాగభూషణంగారి రచనలను ఉద్ధరించి, వాటిని ప్రచురించవలసినదిగా అర్థిస్తున్నాను. అది నాగభూషణంగారి స్మృతిని గౌరవించడం మాత్రమేగాక మన సంగీత ప్రపంచానికి అసమానసేవకూడా కాగలదని మనవి చేస్తున్నాను.

[ డిసెంబరు 1978 లో బందరులో జరిగిన సంగీతోత్సవాల సందర్భంలో చదివిన వ్యాసము. ]



# త్యాగరాజు :
# సంగీత సాహిత్య సంయోగము

—ఇ. యస్. పురుషోత్తమన్

త్యాగరాజులవారి సంగీతం ద్రాక్షాపాక మంటారు పెద్దలు. ఈ తియ్యదనానికి కారణం ఏమిటి? త్యాగరాజులో రాగ భావాన్ని, సాహిత్యభావాన్ని అత్యద్భుతంగా మేళవించే ఏ దైవశక్తో దీనికి కారణం అని నేననుకుంటాను. ఆయన వ్రాసిన, ఆల పించిన ఏ కీర్తన అయినా పరాకాష్టనందు కొన్నప్పుడు, అక్కడ ఒక గొప్ప సాహిత్య భావాన్ని ప్రస్ఫుటంచేసే ఒక పదమో, పద సంయోగమో మనకు తప్పక కన్పిస్తుంది. అందువల్లనే ఆయనకు సాహిత్య, సంగీత భావాలు తాదాత్మ్య విషయాలు; ఒకటి శరీరం రెండవది ఆత్మ. ఈ సంగీత, సాహిత్య సంయోగ భావం శ్రోతల మనస్సులకు హత్తు కోవాలంటే సంగీతాత్మను, సాహిత్యాత్మను రెంటినీ సాక్షాత్కారం చేసుకొన్న ఏ మహా గాయకుడో వాని మేళవింపును మనకు సాక్షాత్కరింప చేయాలి. నిజానికి ఇది ఉప న్యాసాలలో వివరించేదీకాదు; వ్యాసాలలో వ్రాసేదీకాదు. ముఖ్యంగా ఈ ఉత్తమ భావంలో ఏ కొద్ది అంశాన్ని కూడా మా
వ్యక్తం చేయలేవు.

ప్రతి పదం ప్రాణభూయిష్టం. పదా
పొందిక, అర్థం ఉన్నాయి. అవి రస
రకాలు, సంగీతాత్మకాలు. కవిత్వంలో రస
కతఅంతా పదాల పొందికవల్ల ఏర్పడ
ప్రఖ్యాత పాశ్చాత్య ప్రాచ్య కవుల
పద సముచ్చయాల కూర్పుతో ఏర్పడిన స
భావుకతను గురించిన కీర్తిగానం చేసినవా
వర్డ్స్ వర్త్ అన్న "flood of harmon
షెల్లీ చెప్పిన "rain of melod
కీట్స్ పేర్కొన్న "pouring forth
soul in such an ecstacy" —
భావాలన్నీ రసాత్మకతకు మారు వే
త్యాగరాజు సంగీతం - ఇట్టి భావావే
రసాత్మకతను వెలువరించే స్వచ్ఛంద
సాహిత్యాన్ని, 'రాల్ కరిగించే' సంగీ
సమిష్టిగా వ్యక్తం చేస్తుంది.

తెలుగులో పోతన భక్త కవు
ప్రథమశ్రేణికి చెందిన కవి. ఆయన వ్రా

మహా భాగవతం అలతి అలతి మాటలతో రమ్యంగా సాగే కవితావాహిని. త్యాగరాజు పోతన భాగవతాన్ని ప్రతినిత్యం ఔపోసన పట్టినట్లు కనిపిస్తుంది. పోతనను తలచుకోగానే ఎన్నో మధురాతి మధురమైన ఖండికలు మన మనోఫలకాలపై ప్రతిఫలిస్తాయి.

బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్య
కన్యకన్

... ... ... ...

మందార మకరంద మాధుర్యమున గ్రోలు

... ... ... ...

వంటి పద్యాలు గమనిస్తే త్యాగరాజుపై ఆయన ప్రభావం ప్రస్ఫుటం కానమానదు.

త్యాగరాజు సంగీత, సాహిత్య వేదాంతాల త్రివేణీ సంగమం వంటివాడు. తాను భగవంతుడని నమ్మిన రామునకు ఆయన కీర్తనల మాలికల్లో అలంకరించాడు.

నామకుసుమములచే బూజించే
నరజన్మమే జన్మము

రాముణ్ణి పూజాకుసుమాలు ఆయన పాదాల చెంత వేసి స్మరించడం కన్న ఆయన నామాన్ని జపించే జన్మ ధన్యమైనది — అన్న త్యాగరాజు భావనలో కవితా సంగీత కళల ధర్మంతోపాటు ఆత్మపరమైన తన్మయతాభావం కూడా రంగరించ బడ్డది.

ఈ సందర్భంలోనే మరో విషయం ప్రస్తావించక తప్పదు త్యాగరాజు సంగీతంలో మాధుర్యం ఆయన కష్టతరమైన కీర్తనలలో కాక, తేలికగా, అలవోకగా పాడిన కీర్తనల్లోనే ఎక్కువగా కానవస్తుంది. ఆయన సంగీత మాధురిలో ఆశ్చర్యకరమైన విషయం అదే! గొప్పసంగీత పాటకు లందరూ ఈ తేలిక కీర్తన లన్నింటినీ తమ కచేరీలలో అదను తెలిసి తమ శ్రోతలను రంజింపచేయడానికి తరుచు గానం చేస్తూనే వుంటారు. ఈ విషయం గ్రహించిన రసగ్రహణ పారీణులైన శ్రోతలు తేలికైన కీర్తనలను విని కూడా ఎంతో ఆనందించడం నాకు తెలుసు.

ఈ రసామృతానికి మచ్చుకు కొన్ని ఉదాహరణలను పేర్కొంటాను.

సీతాపతి చరణాబ్జము విడుకొన్న
వాతాత్మజునికి బాగ తెలుసురా॥

సురటి-కర్ణాటక రాగాలలో అత్యుత్తమమైన వానిలో ఒకటి, అలాగే

"గీతార్థము సంగీతానందము
నీ తావున చూడరా ఓ మనసా"

అన్న ఈ కీర్తనకూడ త్యాగరాజు అత్యుత్తమమైన కీర్తనలలో ఒకటి. ఈ కీర్తనలో ముఖ్యమైన భావం "వాతాత్మజు"నకు సంబంధించినది. వాతాత్మజుడు ఆంజనేయుడు. భారతీయుల పురాణగాథల్లో ఆంజనేయుడు సాటిలేని మహిమాన్వితుడు. అట్టివానికే సీతాపతి చరణములలోని మాహాత్మ్యము తెలుసు ననడంవల్ల త్యాగరాజు పదగుంఫనలోని అర్థమాధుర్యము వ్యక్తమౌతున్నది. వెనుకటి తరంలోని గొప్ప గాయకులందరు ఈ "వాతాత్మజు" అన్న పదాన్ని వివిధ రీతుల్లో ఆలపించి ప్రతి

అక్షరం అక్షరానికి మధ్య కొంత విశ్రాంతి నిస్తూ ఆ పదం యొక్క ప్రత్యేకతను వెల్లడించేవారు.

అలాంటిదే మరొక కీర్తన :

"భూభారము గాని సుర –
భూసురులై జనించిన"

"నీ భక్తి భాగ్య సుధా నిధి"అన్న ఈ ప్రఖ్యాత కీర్తనలోని ముఖ్యమైన భావం ఈ ప్రాకృతిక జగత్తులో భక్తి శూన్యులైన వారు మరణించినవారితో సమానం- అని. అందువల్ల జయమనోహరి రాగంలో పాడే ఈ మధుర మైన కీర్తనకు ఆలంబనమైన భావం "భూభారము" అన్న ఒక్క పదం మీద ఆధారపడిఉంది. మొత్తం కీర్తనను గమనిస్తే అనుపల్లవిలోని "భూభారము గాని ......" అన్న పాదంలోని విషాదచ్ఛాయలు తప్పక వ్యక్తమౌతాయి. అయితే రాగభావం అంతా కూడా "భూభారము" అన్న ఈ ఒక్క పదం మీదనే ఆధారపడి ఉండటంవల్ల గాయకులు ఈ పదవిన్యాసంలో ప్రత్యేకమైన శ్రద్ధను కనబరచటంలో ఆశ్చర్యం లేదు.

"ఎవరికై అవతారమెత్తితివో" అన్న దేవ మనోహరి రాగంలో పాడబడే కీర్తన మాధుర్య, ఉదాత్తభావాల సమన్వయము. "ఏ మహత్తరమైన ఆత్మ నిర్దేశిస్తే నువ్వు ఈ భూమి మీద జన్మించావో"— అని త్యాగ రాజు రాముణ్ణి ప్రశ్నిస్తాడు. అటువంటి మహనీయునకు నా ప్రణామాలు అంటాడు. "అవనికి రమ్మని" అన్న పదం ఈ రాగంలో ఉన్న ఉదాత్తతను ఎలా తెలియు చేస్తు అలాగే "మోద సదనము" అన్న పదం లోని మాధుర్యాన్ని వ్యక్తం చేస్తు "మోదము" అంటే సంతోషము. ఆ షం నివసించే చోటు మానవునికి ఆలంబ ఒకే ఒక్క స్థానము అని త్యాగరాజు ఈ కీర్తనలో సంగీత సాహిత్యాల సమ్మే అతి సమర్థవంతంగా నిర్వహించారు రాజు.

గొప్ప గొప్ప నర్తకీమణులు, న ఎంతగానో ఆదరించి తమ నాట్య ప్ర లలో ఉపయోగించుకొనే కీర్తన "రార రమణీ మనోహర" అన్నది. హిం వసంత రాగంలోని ఈ కీర్తనలోని ప గమకం, నడక ఎంతో ఉత్తమంగా న నృత్యానికి కావలసిన 'రిథిమ్' ను స్వతః కీర్తనలోనే ఇనుడ్చుకొన్నది. "నీరజనేత అన్న అనుపల్లవిలోని పదం రాగం యొ ఉదాత్తతను చూపుతున్నది. అలానే అ చరణంలో "వేరేగతి" కీర్తనకారుని మా స్థితిని తెలియచెబుతున్నది. "నీరజనయన" పద సముచ్చయంలోని వివిధార్థలలో చ బడిన కారుణ్య భావన మాటలకు లొం హావభావ ప్రదర్శనకు ఆలవాలం.

"ఎవరని నిర్ణంచిరిరా" అన్న దేవామృ వర్షిణి కీర్తన అత్యంత రమణీయమైం ఇందులో చూపబడిన సాహిత్య సంగీ వేదాంత భావాల పరమోదాత్త వ్యక్తీకర చేయడానికి త్యాగరాజే సమర్థుడు. ఇందు

సామాన్య భారతీయునికి కలిగే అనుమానాలను వ్యక్తంచేశాడాయన. భగవంతుడు ఒక్కడా, పలువురా? ఈ ప్రశ్నార్థకతలోనే రాగం కూడా ఒక ఉత్కృష్టతను సాధించింది. ఈ కీర్తనలోని అనుపల్లవి ప్రఖ్యాతమైనది. "శివుడనో, మాధవుడనో, పరబ్రహ్మమనో..." ఈ రాగానికి గలరక్తి "మాధవుడనో'' అనే పదంమీద ఆధారపడివుండడం త్యాగరాజు రామభక్తుడు కావడం సూచిస్తుందేమో? ఇందులో నిబిడమై ఉన్న సంగీత మాధుర్యం శ్రోతలకు తెలిసినదే. కాని పదాల పొందికను భావవిన్యాసాన్ని, వేదాంత భావనను కూడా శ్రోతలు అర్థంచేసుకోగలిగితే ఈ కీర్తన పరమోదాత్తమైన అనుభూతిని ఇవ్వగలదు.

ఇట్టిదే మరొక కీర్తన - "మనసా ఎటు లోర్తునే.'' మలయమారుతంలో వ్రాయ బడ్డది. మలయాద్రినుంచి ప్రసరించే మలయ మారుతాన్ని తలపుకు తెచ్చే ఈ రాగం ఒడు దుడుకులు ఉదాత్తానుదాత్తాలు లేక మంద్ర గతిలో సాగుతుంది. కాని అది మనసులో ఒక ఉదాత్త భావనను, వేదాంతాత్మకమైన ఒక ఆలోచనను రేకెత్తిస్తుంది. "కలిలో రాజస తామస గుణములు గలవారి చెలిమి''ని గురించి ఎంతో గంభీరమైన భావం వెలి బుచ్చాడు త్యాగరాజు. వారి సాహిత్యభావం అర్థం చేసుకోకుండాఉంటే ఈ కీర్తన అందం చాలవరకు తగ్గిపోయినట్లే! "జగమేలే పర మాత్మ ఎవరితో మొరలిడుదు'' అన్నది అభేరి పరమార్థాని సూచించే పాదం. ఇందులో త్యాగరాజు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఏ ఒక్కరినో ప్రార్థించక జగమేలే "పర మాత్మ''కు తనమొర ఆలకించమని, నీవు ఆలకించకపోతే మరినాకు దిక్కు లేదని చూపినభావం ఆయన అంతరాంతరాలలోని ఉద్వేగ వ్యక్తీకరణం. మొదటి చరణంలోని గజేంద్రుని మొర విష్ణువును వైకుంఠంనుంచి క్రిందకు దింపింది. ఈ కరిరాజు మొర— నీవు అందరిలో ఉన్నావని చెబుతారు, ఉన్నావాలేవా — అన్నబాధపై పాదంలో ఎంతో సునిశితంగా వ్యక్తీకరింప బడ్డది. ఈ కీర్తన, దానికి ఎన్నుకో బడిన రాగం కూడా కరుణరసాత్మకం. ఈ కీర్తన ప్రారంభం "నగు మోము'' — వినగానే శృంగార రసాత్మకమైన దనిపిస్తుంది. దానిని కూడా కరుణ రసాత్మ కంగా మలచాడు తన రాగ ప్రభావంతో.

"(శ్రీ)దమా నాతో వాదమా నే భేదమా ఇది మోదమా రామ'' - అన్న కీర్తనలో త్యాగరాజు చేసిన పరస్పర విరుద్ధ భావస్ఫో రకాలైన పదాలసొంపు, అలంకారం చాల కొద్ది కీర్తనలలో చూడగలము. ఇది శహానాలో వ్రాయబడ్డది. "వింటిని నమ్ముకొంటిని, శర ణంటిని రమ్మంటిని'' అన్న పాదం చూస్తే - మనసు రామునిలో నిమగ్నమై ఆయనే సర్వ స్వమని భావించి ఆయనను తన దగ్గరకు పిలిచే. మాధుర్య భక్తి భావమంతా దీనిలో పొదిగి నట్లు తోస్తుంది. శహనారాగం మామూలుగా శృంగార భావ వ్యక్తీకరణకు ఉపయోగిస్తారు. త్యాగరాజు దీనిని శృంగార భావం నుంచి జనించిన మధురభక్తిని వెలువరించడానికి ఉప యోగించాడు.

ఈ విధంగా త్యాగరాజు కీర్తనలను సంగీత సాహిత్యాల దృష్ట్యా పరిశీలిస్తే ఆయన ఎంత గొప్ప సంగీతజ్ఞుడో అంతకుమించిన సాహిత్య వేత్తగాను, వేదాంతిగాను గోచరింపక మానడు.

లించుట లాభదాయకమా? ఇన్ని ప్రశ్నలను మనసులో నుంచుకొని ఈ రెండు భారతీయ సంగీత రీతులను అన్వయము చేసుకొను గొప్ప ప్రయత్నమును ఉభయ సంగీత పద్ధతులకు సమానమయిన ఎల్లలయి వర్థిల్లునట్టి హైదరాబాదు, ధార్వారు మొదలగు నగరములందు ఉత్తమశ్రేణిలో - ఉభయ పద్ధతులందు పాండిత్యమును గడించిన విద్వాంసులతో పరిశోధనలు, పండిత గోష్టులు జరుపుట అవసరం.

హిందుస్థానీ సంగీతము విరివిగా వ్యాప్తిచెందిన ప్రదేశములందు కర్ణాటక సంగీతము అంతగా వ్యాపించలేదన్న అదేమి అతిశయోక్తి కాజాలదు. కర్ణాటక సంగీతము యొక్క చరిత్రను కొద్దిగా పరికించిన హిందుస్థానీ పద్ధతియొక్క ప్రభావము గోచరమగును. విజయనగర సంస్థానమందు నాలుగు శతాబ్దములకు మునుపు శ్రీ వ్యాసరాయల శిష్యులయిన పురందరదాసులవారు నేటి కర్ణాటక సంగీత బోధనా పద్ధతిని ఏర్పరచి, సూళాదులనబడు తాళమాలికలను, లక్షణ గీతములను, మామూలు ప్రజలు పాడుకోగల పదాలనబడు సంకీర్తనలను ప్రసాదించిరి. వీరు దాసత్వమును స్వీకరించుటకు మునుపు పూనా నగరమునందు రెండు పద్ధతులూ అమలులో నుండెడివి. పురందరదాసులకు రెండు పద్ధతులందునూ పరిచయముండినది. వారి పదాల మూలముగా కానడ, బేహాగ్, జెంఝూటి, ద్విజావంతి, పంతువరాళి, మోహన, భీంపలాసు (కర్ణాటక దేవగాంధారి), కాపి, భాగేశ్రీ, బృందావన, సారంగ, ఖమాస్, సింధు భైరవి ఇంకా అనేక రాగాలు సామాన్య ప్రజలకు అందినవి. విజయనగరం పతనమయిన తరువాత తంజావూరు సంస్థానంలో మహారాష్ట్ర నాయకుల పరిపాలనలో మహారాష్ట్ర భక్తిగేయములు, తుకారాం అభంగులు ఇంకా మహారాష్ట్ర విద్వాంసుల ధృపద్‌లు, లావణీలు, వారి తబలా, వారి శ్రుతిపక్వమయిన అభిరుచులు కర్ణాటక సంగీతమునకు ఆట పట్టువయిన తంజావూరిలో కలసి మెలసి విరాజిల్లినవి. మహారాష్ట్ర పద్ధతిలోని 'కీర్తన్' అనబడు హరికథ ప్రజలకు ఆహ్లాదకరమయిన వర్ణమట్లను అందించినవి; హిందుస్థానీ రాగాలు, భజన్లు, తోహరా, శాకీ, దిండి మొదలగు ఛీజులు వందలాదిగా వాడుకలోకి వచ్చినవి. వారి తరానాలు, నామావళులు, దేశావి మిశ్రచాపు తాళాలు, తానప్రధానమగు తబలా నడకలు, రాగముల అందచందముల విస్తరణ అన్నింటిని క్రమేపి కర్ణాటకపద్ధతి అలవర్చుకొని నేటి సంస్కరితమయిన 'తంజావూరుబాణిగా' రూపొందినది. ఇట్టి మార్పు (refinement) రెండు పద్ధతుల కలయికవల్లను హిందుస్థానీ రాగముల మాధుర్యమును గుర్తించి కర్ణాటక పద్ధతికి విరుద్ధము కాని రీతులలో వాటి శైలిలోని రసజ్ఞతను గుర్తించినందువల్ల తనంతటదే క్రమంగా లభించిన వాంఛనీయమగు మార్పు. కర్ణాట పద్ధతితో నేడు సగానికి సగం హిందుస్థానీ రాగములనుండి సంగ్రహించినవే. ఏ పద్ధతియూ తన విశిష్టతను కోల్పోవక పెరుగుచే శ్రేష్ఠమయిన మార్పు. ముత్తుస్వామి దీక్షితులు, కొంతవరకు త్యాగరాజస్వాములు ఇట్టి సంగ్రహణను ఉత్తమ శ్రేణిలో చేకూర్చిరి. అనేక హిందుస్థానీ రాగాలను కాశీ క్షేత్రమందు బాగా అభ్యసించిన దీక్షితుల కీర్తనలు, బాణీయందును సంచారము లందును అంలు హిందుస్థానీ శైలిలోనే నడచినవి. అట్టివి 'దాక్షిణాత్య ధృపద్‌లు' అనదగు ముత్తుస్వామి దీక్షితుల కీర్తనలు. ఆ రాగాలు, కీర్తనలు కొన్నింటిని పేర్కొనుట ఉచితము.

1. యమున్ రాగము - 'జంబూపతే' అనే పంచలింగ క్షేత్రకీర్తన.

2 బృందావన సారంగ-రంగపుర విహారా;
సౌందరరాజం

3. శుద్ధవసంతు వరాళి-శ్రీ సత్యనారాయణం
వాతలోడి)

4. హామీరు-పరిమళ రంగనాథం

5 ఖమాస్-సారసదళనయన

6. హిందోళ-నీరజాక్షి కామాక్షి

7. ద్విజావంతి-చేతశ్రీ

త్యాగయ్యగారు యమున్‌లో 'మానము లేదా' ఖమాసులో 'సీతాపతే', 'సుజనజీవనా', జింగ్లాలో 'అనాథుడను గాను' హిందుస్థానులో 'బంటురీతి' అను కీర్తనలు; అఫాటీస్తాల్ అనదగు నడకలోని అతితాళపు అమరికలను ప్రవేశపెట్టిరి. జింగ్లా, హమీ నారం అన్న రాగాలు హిందుస్థానీ జోన్పురి, శుద్ధకళ్యాణి రాగములను బోలినవి. త్యాగయ్య గారి నాట్యశైలి హిందుస్థాని పద్ధతిని అంతగా అను సరించలేదు. తరువాత వచ్చిన రీతులు విపరీతము లయిన తుఫానుల లాంటివి. గతయాభయి సంవ త్సరములలో పార్సీమట్లు, బాల గంధర్వ గారి నాటకపు పాటలు ఆంధ్రావనిని గాలించినవి. ఇటీ వల హిందీ ఫిల్మ్ గీతాల ప్రభావము మెండుగా సాగినది అలిండియా రేడియో అన్న దివ్యసాధనం వచ్చిన తరువాత వంగదేశము నుండి రవీంద్ర గీత అను పాటలు తెలుగింటలు, సుగమ సంగీ తము అనబడు Light Music ప్రభావం చెంది రేగినది. ఇట్టి పరిస్థితిని ఎందుకు సంగీత శాస్త్ర వేత్తలు సృష్టి పరిగణించ లేదన్న-అటు హిందు స్థాని సంగీతములోని లోతుపాతులూ దెలియక, ఇటు కర్ణాటక సంగీతము నందు కూడా పాండిత్య మును గడించని – లేక గడింపజాలని రసికులు సృష్టి చేసికొనిన పోకడలు కాబట్టి, శాశ్వ తంగా రసహృదయులకు మేలురకపు ఆనందము నివ్వగల సంగీత సృష్టికి మారుగా చౌకబారు సం తము ప్రబలి, అసలు సంగీతపు రుచులను ప్రవ ర్తింపించి చవిజూచు దీక్షను సడలింప జేయుటచే యీ రకముపట్ల గల నిరసనకు మూలహేతువు అనవచ్చును. అదొక మబ్బు. అది తొలగిన రేడియో నుండి ఉత్కృష్టమయిన శాస్త్రీయ సం తము అందరికీ – యావద్భారతము కవ సి మయినది. రెండు పద్ధతుల లోని బాగోగులు తరచు విని, పరిశీలించు అవకాశములు ఇప్పు డేర్పడినట్లు మన భారతదేశ చరిత్రలో నెన్న న్నడూ అబ్బియుండ లేదు. రెండు పద్ధతులను బాగా అలవాటు చేసుకోగల గాయకుల ఆసక్తి దీక్ష, ప్రయత్నము క్రమంగా పెరుగుతున్నవి కనుక యీ రెంటి కలయిక మునుపటికన్న విరివిగా పెద్ద అంతస్థులలో బుద్ధి పురస్కృత మయి ప్రయత్న ఫలితంగా కొనసాగి రానున్న రోజులలో 'భారతీయ సంగీతము' అనదగు ఒక సంగీత భావ చక్కని రూపమును దాల్చు సూచన లున్నవి. కొన్ని సులువయిన భజన్లు కాశీ-రామేశ్వరము లందున్న భిన్నపద్ధతుల గాయకులూ పాడవచ్చును "జనగణమన" అట్టి పాటకు మంచి తార్కాణము రెండు పద్ధతులకూ సమానమైన గుణములను పర్చి తీర్చి అందమయిన నడకలలో సులువయిన సంగీతపు మట్లలో అమరిన గేయాలు సుమారు నూరింటి నయిన భారతదేశము నందన్ని ప్రాంతము లందున్న ప్రజలు పాడగలిగి యుండుట భారత సంస్కృతి సమీకరణకు పునాది వంటిది. భారతీయు లందరు కలిసి ఆడు మాట, పాడు పాట ఒక తీరుగా నుండుట జాతీయ ఐక్యతకు గొప్ప సాధన. ఇట్టి జాతీయతా గేయములు, భక్తిగీతాలు, ప్రకృతి వర్ణనల గీతాలు, చరిత్ర గాథలను చిత్రించు పాటలు- సమూహగానమునకు అనువగు రీతిగా తయారు కావలసినది ఎంతయినా అవసరము. అప్పుడు ప్రతి భారతీయుడు - కలిసి కంఠమిచ్చి

కదను త్రొక్కి పాడగలిగినంత తేలికగాను, రమ్యముగాను, ఆకర్షణీయముగాను ఆ పాటలను రచించి, సంగీతానికి జోడించ వలయును. Community Singing అనబడు జనతాగాన శైలి బాగా వ్యాపించిన రోజు ప్రతి భారతీయునికి సంగీత రసజ్ఞత, కొంత రాగతాళమందు ఆసక్తి తప్పక అలవడ గలవు. నేడు వాడుకలో నున్న త్యాగయ్యగారి దివ్య నామ కీర్తనలు, పురందర దాసుల పదాలు, తుకారాం మీరాబాయి మొదలగు మహాభక్తుల కీర్తనలు, ఆధునిక కవుల గీతాలు అన్నీ జనసూర్చన ఇట్టి భారతీయ గానము ఏర్పడుట తేలిక. వీటితో అందరికి వర్తించు కొన్ని చిందులు, జానపద గేయాల మట్లు బాగా కలసి పోగలవు. బళ్ళలో ప్రతి బాలుడు, బాలిక తాను తలచుకున్న పాడగల పాటలు నేర్పు ఏర్పాట్లు బాగా కొనసాగ వలసియున్నది. కొంత చెవికి నాద రుచి అందవలెను. అటుపిమ్మట మంచి శారీరము, రాగ తాళము లందు జన్మాంతర వాసనా బలము గల వారికి హైస్కూలు, కాలేజి లలో శాస్త్రీయసంగీతమును, గాత్రమో లేక వీణ, వయొలిన్, వేణువు, మృదంగం లాంటి వాద్య ములను నేర్పు చు బోధనా సౌకర్యములు ఏర్పడ వలయును. ఇట్లు మూడు మూలల నుండు గ్రామము లందంతట సంగీత విద్యాబోధన సాగిన నాడు త్యాగరాజు 'భృంగి నటేశ మతంగ నారదాదు లుపాసించిన' సంగీత మహిమ తెలియ గలరు. శాస్త్రీయ సంగీతము పక్క బాగా పెరిగి మహో న్నత దశకు వచ్చుటకు ఇట్టి విద్యావ్యాప్తి తప్పని సరి యని నా దృఢ విశ్వాసము. ముఖ్యముగా ఆంధ్ర దేశము నందు బాలబాలికల పాఠశాల లందంతటా సంగీత విద్యను గరపు నేర్పరులని నియమించుట మరీ అవసరము. సరియయిన బోధ కులు లేనందు వలననే అనేక బాలబాలికలు సంగీతము నందు తమకున్న సహజమయిన అభిరుచిని బాగా అభివృద్ధి చేసుకొన జాలకున్నారు. ఆంధ్ర దేశము నందున్న సంగీత కళాశాల లందు ఉత్తీర్ణు లయిన వారికి ఇట్టి ఉద్యోగము లిచ్చిన త్వరలో పెద్ద సంగీత సంచలనము రాగలదు.

హిందుస్థానీ పద్ధతిలో నుండి కర్ణాటక విద్వాంసులు గ్రహించ తగిన ముఖ్యాంశములనుగురించి క్లుప్తంగా సూచించుట అవసరము. రాగ ప్రధానం "సంగీతం" అన్న సూక్తి నిర్వహణ రెండు పద్ధతులకూ ఏకైక లక్షణము రాగ స్వరూపమును బాగా పోషించు దీక్ష, రాగమునకు బహుముఖ్య మయిన వాది సంవాది స్వరముల పొందికలు, రాగ ఛాయను గమనించి కూర్చిన ప్రయోగాలు, మందర మధ్య తారస్థాయి లందు విలంబముగాను, తరువాత క్రమంగా త్వరితగతిలో వేయు "తాన్లు" మన గాయకులకు గుణపాఠములు. ఇచ్చట కేవలము ఆరోహణ, అవరోహణ స్వరము పట్టి ఇచ్ఛానువర్తిగా విలంబమునకు, మంద్రస్థాయికి స్వస్తి చెప్పి కేవలము కంఠ స్తంభితమయిన స్వర కోలాహలపు పలుకులతో రాగములను విస్తరించు దురలవాటు నాటుకొని పోయినది. శాంతరసము, గాంభీర్యము, నాదపోషణ, శ్రుతి పక్వత, ఆత్మానందము - విలంబంగా, రాగ స్వరూపమును అవగాహనం చేసుకొని, హిందుస్థానీ గాయకుల శారీర సాధనతో - మన శైలి విశిష్టతను కొంతయిన వదలక పాడుట శ్రేయస్కరము. శారీర సాధన, వాద్యముల సాధన– వాటితో లభించు ఆకర్షణీయ మయిన నాదపు సొత్తు - హిందుస్థానీ గాయకుల నుండి మనం తెల్సుకో దగినవి. వారి పద్ధతిలో ధృపద్, ఖ్యాల్, టుమ్రీలు అన్నీ వాటి నియమిత కాలప్రమాణంలో నుండును. ఇక్కడ దీక్షితుల కీర్తనలు, త్యాగయ్య కీర్తనలు అన్నీ పాడేవారి

గొంతుకు తగిన రీతిగా దిద్ది తీర్చబడుతున్నవి. తబలాలోని అనుసరణ, ప్రధానమగు గాయకునికి, వాద్యముల పై కచ్చేరి చేయువారికి తాళముల గొడవలు లేక హాయిగా తమ మనోధర్మమును [illegible]దుపాయమునిచ్చును. మన మృదంగము నందు అట్టి అనుసరణ కన్న వ్యాఖ్యానయుత మయిన ఎదురు నడకల జోడింపు బలసినది. తాళ రూపము తబలాలో ప్రస్ఫుటముగా నుండును. ఇక్కడ లెక్క మాత్రమే ముఖ్యము. ఆయా తాళముల కని ఏర్పడిన కొనిపింపు ముక్కలు "బోలు" మలలో తేవనవచ్చు. తబలాలోని నాద పోషణ. శ్రుతిదీక్ష, భజన్లు, ఖజరీలు పాడునప్పుడు అతి జాగ్రత్తగా అమర్చు నడకలు మనకు మంచి తార్కాణములు. భాషకు మన మిచ్చు ప్రాముఖ్యతను రాగ ప్రధానమయిన హిందుస్థానీ సంగీత కచ్చేరీలో ఇవ్వరు. వారిది ఆత్మకింపయిన రాగ రసాస్వాదన. భజనలు పాడునప్పుడు ఠుమ్రీలో

బోల్ తాన్ అను నెరవలు నిర్వహించు సాహిత్యమును అందముగా ఉచ్చరించి, సంగీ ఆ సాహిత్య భావమును పెంపొందించునట్లు దురు. భక్తిగీతములందు జావళి, పదం, మున్నగు వాటియందు సాహిత్యమునకు మా ప్రాముఖ్యతను అపేక్షించినా, రాగ ప్రధా బైఠక్కులులాంటి "కచ్చేరి"లలో సాహిత్యము వేచియుండు దురలవాటును మన శ్రోతలు వేయకున్న అప్పటి సంగీతరుచి అరు పోవును. మంచి ఎక్కడున్నా గ్రాహ్యమే సంగ్రహణను చేయు దక్షిణాత్య గాయ కొంత బాధ్యతను వహించి హిందుస్థానీ సం మూలసూత్రముల నయిన బాగుగా తెలు వలయును వీలున్న. ఆ సంగీతము న తర్ఫీదు పొందుట మంచిది. ఆ రెండు శా బాగా పుష్పించి ఫలవంత మయిన గాయ శ్రోతల పాలిట కల్పవృక్షము కాగలడు.



# ందుస్థానీ - కర్ణాటక సంగీత సంప్రదాయాలు

— చేతన్ కర్నానీ

స్థానీ సంగీతజ్ఞులు కర్ణాటక సంప్ర క, కర్ణాటక సంగీత శాస్త్రజ్ఞులు సంగీతం ఎడ చూపించే అనా స్తే భారతీయ సంగీతం మొత్తా ప్రాథమిక ధర్మం ఉన్నదా, ండూ వేరువేరు సంప్రదాయాలా మానం రాకమానదు. ఈ రెండు ఒకదానికొకటి పరిపూరకాలు. ప్రాథమికమైన ధర్మం ఒక్కటే! తీయాత్మ అనే సూత్రం కట్టే పరస్పర సహకారభావం, ఒకరి నొకరు అర్థంచేసు కోవడం జరిగి తాదాత్మ్యత సిద్ధిస్తుంది. భారతీయ ఆస్వాదించడం అటు కర్ణాటక పాడే తోడిరాగంలోని మనసుల కరచే కారుణ్య భావాన్ని, హిందూ ్వరీ రాగం ప్రపంచించే గాంభీ దాత్తను గ్రహించినప్పుడే—సాధ్య

దేశ సంగీతశాస్త్రవేత్తలు దక్షిణాది సరిగ్గా అర్థం చేసుకోలేదనడానికి జి.హెచ్. రెనడే వ్రాసిన "హిందూస్థానీ సంగీతం" అన్న గ్రంథం చదివితేచాలు. "హిందూస్థానీ రాగాలాపన పద్ధతిలోనే ఒక ఉద్వేగ భావం నిబిడీకృతమైవుంది. అందువల్లనే హిందూస్థానీ రాగం సంక్లిష్టంగా ఉన్నా మాధుర్యంగా ఉంటుంది. దక్షిణదేశ కర్ణాటక సంగీతం ఇలా కాదు. త్వరితగతిని నడిచే తాళ ప్రస్తారంతోను, క్లిష్టమైన గణితశాస్త్ర పద్ధతిలో నడిచే రాగప్రస్తారాలతోను ఆ సంగీతం పాడేవానికి భయానకమైన యాంత్రిక ప్రస్తరణంగాతోస్తుంది" అంటాడు రెనడే. ఉద్వేగ ప్రేరణా"న్ని కేవలం ఉత్తరదేశీయ సంగీత లక్షణంగానే రెనడే పేర్కొన్నాడంటే ఆయనకు బాలమురళి రాగప్రస్తారంలోని సౌమ్యత, డి.కె పట్టమ్మాళ్ రాగ లయభావనలలోని మార్దవం ఏమాత్రం అర్థంకాలేదనే భావించాలి. ఇటువంటి అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్న సంగీతశాస్త్రజ్ఞులు రెండు పద్ధతులలోని పధానాలను చక్కగా అవగాహన చేసుకోవడం ఎంతైనా అవసరమని రెనడే విమర్శ మనందరినీ హెచ్చరిస్తున్నది. .... ...

హిందూస్థానీ, కర్ణాటక సంగీత విధానాలలోని తరతమ భేదాల్ని జాగ్రత్తగా గమనించాలంటే మద్రాసు వంటి నగరంలో జరిపే ఒకసంగీతోత్సవానికి హాజరు కావాలి, ఉత్తరదేశ సంగీత గాయకులకు మొట్టమొదట అచ్చెరువు కలిగించే విషయం—కర్ణాటక సంగీత కచేరీలలో కనిపించే క్రమశిక్షణ. ఉదాహరణకు మద్రాసులోని మ్యూజిక్ అకాడమీ నిర్వహించే కార్యక్రమాలను తీసుకోండి. అవి అన్నీ ఎంతోముందుగా జాగ్రత్తగా ఆలోచించి ఒక పద్ధతిలో నిర్ణయించిన సంగీత కార్యక్రమాలు. పాశ్చాత్య సంగీత కచేరీలలో ముందుగానే గాయకులు ఒక కచేరీలో ఏయే రాగాలు ఆలపిస్తారో, ఒకసంగీతదర్శకుడు ఒక కచేరీలో 'బా' పాటలనో, "డెబూసే" పాటలనో ఏదో ఒకదానిని నిర్ణయించుకొని ఆ పాటలవివరాలను ఏవిధంగా "ప్రోగ్రాంషీట్"లో ముద్రించి శ్రోతలకు అందిస్తాడో, అదేవిధంగా మ్యూజిక్ అకాడమీ సంగీతకార్యక్రమాలలోకూడా ఒక గాయకుడు లేదా గాయకురాలు ఒక సాయంత్రం కచేరీలో ఏఏరాగాలలో ఏఏకీర్తనలను ఆలపిస్తారో ఆవివరాలన్నీ ముందుగానే ప్రచురించి శ్రోతలకు అందచేస్తారు. ఒక్కొక్క రోజున నాలుగు సంగీత కచేరీలు ఉండవచ్చు. అన్నీ సకాలానికి ప్రారంభం కాక తప్పదు. సాధారణంగా ప్రతి కచ్చేరీ 'హంసధ్వని' రాగంతో ప్రారంభమై 'మధ్యమావతి'తో అంతంకావడం జరుగుతుంది. "హంసధ్వని" ప్రారంభంలో పాడడానికి అనువైనరాగం.

కర్ణాటక సంగీతంలోని క్రమశి
మరొక ప్రముఖ నిదర్శనం దాని శి
విధానంలో కనిపిస్తుంది. ప్రతివారు 'మా
మాళవగౌళ'[హిందూస్థానీలో 'భైరవ్'
నికి దగ్గర] రాగంతోనే శిక్షణ ప్రారంభి
ఉత్తరదేశంలో ఈ శిక్షణా విధానాలలో
అనైక్యత, విభిన్నత కానవస్తుంది.
హరణకు క్రొత్త విద్యార్థి తన సంగీత శి
యమన్, బిలవాత్, భైరవ్, భూపాలి
లలో దేనితోనైనా ప్రారంభించవచ్చు.
tatonic భూపాలిని ముందుగా నేర్చుకో
సులువా, Septatonic యమన్ నేర్చు
డం సులువా అనే విషయంమీద ఇంకా
ఛర్జనలు సాగుతూనే వున్నాయి. దక్షి
సంగీతంలో, అందరూ ఒక్క రాగంతోనే
ప్రారంభించడమేకాక, అదే స్వరావళి,
స్వర, గీత, అలంకార, వర్ణాలను
కొంటారు. ఇవి అన్నీ పురందరదాసు
మహానుభావులు నాలుగువందల సంవత్సరా
పూర్వం వ్రాసినవి. అలాగే, ఒక వైణి
ఒకకృతిని వీణపై వాయించేటప్పుడు
కర్త తాను ఏ రాగంలో, ఒక విన్యాస
తిని నిర్ణయించాడో, ఏ గాయకుడు దా
పాడేటప్పుడు ఏ విన్యాసాన్ని ఆశ్రయించా
అదే పద్ధతిని, గాయక విన్యాసక్రమాన్ని
చ. తప్పకుండా అనుసరిస్తాడు.

ఇదే క్రమశిక్షణను స్థిరీకరణ (Standar
izatios) విధానంలో కూడా మ
గుర్తించవచ్చు. మ్యూజిక్ అకాడమీవ

సంస్థలు కొత్త కృతులను, కొత్తవిధానాలను స్థిరీకరించి వానిని ఇతరగాయకులకు అందుబాటులో ఉంచుతాయి. ఒక కొత్త కృతి కర్త తాను కొత్తగా వ్రాసిన కృతిని మ్యూజిక్ అకాడమీవంటి సంస్థకు దాని అభిప్రాయంకోసం నివేదిస్తాడు. శ్రోతల అభిప్రాయాలకు వదిలిపెట్టరు. నిజానికి పెండర్‌స్కీ వంటి కంపోజర్ దక్షిణదేశంలో పుట్టివుంటే చాలా ఇబ్బందులను ఎదుర్కొవలసివచ్చేది.

ఈ స్థిరీకరణ విధానంవల్ల సంగీతాన్ని సామూహికంగా ఆనందించే గొప్ప వరాన్ని దాక్షిణాత్యులు పొందగలిగారు. హిందూస్థానీ సంగీతంలో కృతికర్త సాధారణంగా అనామకుడు, కర్ణాటక సంగీతంలో కృతికర్త సర్వాధినేత. పూజనీయుడు. ఆయన చూపిన దేశికతలో గాయకుడు నడుస్తాడు, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితర్, శ్యామశాస్త్రి వంటి కృతికర్తలకు పాశ్చాత్యదేశ సంగీతకర్తలైన బా, బెథోవిన్, మోజర్ట్‌ల కున్నంత కీర్తి ప్రఖ్యాతు లున్నాయి. కృతికి ఒక నిర్దిష్టమైన ప్రస్తార విధానం ఉంది. ప్రతి గాయకుడు ఆ ప్రస్తార విధానాన్నే అనుసరించాలి. గాయకుని ప్రతిభ దానిని విశ్లేషించడంలో, Interpret చేయడంలో ఉంటుంది. బెంగాల్ సంగీత ప్రపంచంలో రవీంద్ర సంగీతానికి ఎంత ప్రాముఖ్యం ఉందో, దక్షిణదేశంలో 'కృతి'కిఅంత ప్రాధాన్యం ఉంది. ప్రతి సంగీతజ్ఞునికి అందుబాటులో ఉండే నిధి అది. దాదాపు ప్రతి శ్రోతకు అందులోని సాహిత్యం కంఠోపాఠంగావచ్చు. ఆరాగచ్ఛాయలు చాల మంది అనుసరించగలరు. అందువలన ఒక గాయకుడు ఈ రాగాన్ని ఎలా ప్రస్తారం చేస్తాడో అనే ఉత్కంఠ ఎక్కువగా కనిపిస్తుంది. సాహిత్య సంగీతాలు తెలిసినవే కనుక క్రొత్తదనానికి ఎక్కువ అవకాశం లేకపోవచ్చు. కాని ప్రస్తార విధానంలోని వినూత్నత నిత్య నూతనం. ఇలా నియమితమైన "పాఠం" దక్షిణాత్య సంగీతానికి ప్రాణం కనుక, దాక్షిణాత్యులకుఉత్తరదేశ సంగీతం పునరావృతంగా కనిపిస్తుంది.

నిజానికి హిందూస్థానీ సంగీతంలో కర్ణాటక బాణీలో కన్న స్వేచ్ఛ ఎక్కువ, flexibility ఎక్కువ. అందులోని ఘరానాలలో ఎంతో వైవిధ్యం ఉంది. ఉదాహరణకు ఆగ్రాఘరానాకు చెందిన గాయకులు "చంద్రకాంస్" రాగాన్ని పంచమ, కోమల రిషభంలో ప్రస్తారంచేసి 'బార్వా', 'ఘూరా' రాగాల ఆలాపనలో ప్రత్యేక శ్రద్ధ చూపుతారు. కర్ణాటక సంగీతంలో అలా కాక, రాగాలాపన పద్ధతిలో భిన్నత్వం ఉండే అవకాశం లేదు.

హిందూస్థానీ సంగీతంలో ఉన్న స్వేచ్ఛకు మరో నిదర్శన అందులోని వైవిధ్యం. 'భైరవ్' రాగం ఒక్క-దానిలోనే ఇరవై విభిన్న పద్ధతులు ఉండవచ్చు. అయినా మరోకొత్త రాగచ్ఛాయను అందులోనుంచి కల్పించే అవకాశం ఉన్నది. ఉదాహరణకు మల్లికార్జున్

మన్సూర్ సృష్టించిన "కబీరి భైరవ్" ను పేర్కొనవచ్చు. కర్ణాటక బాణీలో ఆ విధంగా ప్రాథమిక రాగలక్షణాన్ని అతిక్రమించడానికి వీలులేదు.

ఈ రెండు బాణీలలోను కన్పించే మరొక భిన్నత్వం ప్రేక్షకులు గాయకుని పాటకు అందించే సహకారంలోను, అందులో వారు నిమగ్నులు కావడంలోను కనిపిస్తుంది. ఉత్తర దేశీయుడిగా నేను మ్యూజిక్ అకాడమి సంగీతోత్సవాలలో పాల్గొన్నప్పుడు ఈ బృంద 'ప్రేక్షక అవధానం' నాకు ఎంతో అచ్చెరువు కొల్పింది. దాదాపు ప్రేక్షకులందరూ గాయకునితోపాటు తాళం వేయడం కేవలం ప్రేక్షకులు తమకు కూడా సంగీతం వచ్చునన్న విస్పష్ట ప్రదర్శన కాదు. అది 'సహకారిత్వం'. నిజానికి కర్ణాటక సంగీతంలో తాళం ఐదు సంక్లిష్టమైన జతుల్ని అనుసరించి ఉంటుంది. శ్రోత ప్రతిసారి తాళాన్ని లెక్కించుకుంటూ ఉండకపోతే ఎక్కడో తప్పుపడుతుంది. ఉత్తరదేశ సంగీతంలోని తాళంకంటే ఎంతో జటిలమైనది ఇది. అంతేకాదు. ప్రఖ్యాత మృదంగ విద్వాంసుడు పాల్‌ఘాట్ టి. యస్. మణి అయ్యర్ కన్నడచాపు, ఆది తాళంలో చేసిన మృదంగ వాదనం వింటే [TMAE 503] అహ్మద్ జాన్ తిరక్వా వాదనం కంటే ఇది ఎంత విభిన్నమైనదో ఎంత క్లిష్టమైనదో తెలుస్తుంది.

కర్ణాటక సంగీతంలో హిందూస్థానీలో కంటే క్రమపద్ధతి (Organization) ఎక్కువగా ఉన్నదనడానికి మరొక నిదర్శనం రాగమాలిక. స్వాతితిరునాళ్ పాడిన 'భావయామి'కి మిగిలిన అన్ని కృతులకు వలె ఒక విన్యాస క్రమం ఉన్నది. ఈ క్రమ పద్ధతిలో ఒకస్థాయికి చేరుకొన్న తరువాత మరొక రాగానికి మారడం కనిపిస్తుంది. హిందూస్థానీలో రాగమాలిక ఎంత అసంబద్ధంగా, క్రమరహితంగా ఉంటుందో ఉస్తాద్ అలీ అక్బర్ ఖాన్ పాడిన 'పిలూ' వింటే తెలుస్తుంది (EALP 1274) ఇందులో గాయకుడు ఒక రాగంనుంచి మరొక రాగానికి తన ఇష్టానుసారం గెంతడం కనిపిస్తుంది. హిందూస్థానీ రాగమాలికకు ఒక నియమితమైన నిర్మాణం లేకపోవడమే దీనికి కారణం. ఎం. ఎస్. సుబ్బలక్ష్మి, ఎం. ఎల్. వసంతకుమారిలు ఇద్దరూ గానంచేసిన 'భావయామి' రాగమాలికను చూడండి. ఈ ఏడురాగాల సంకలనం వీరిద్దరి విన్యాసంలో ఎంతో భిన్నంగా కనిపిస్తుంది. షూబర్ట్ "Unfinished Symphony"ని గైడో కాంటెల్లి, యెహూదీ మెనుహిన్‌లు ఇద్దరూ ఎంత భిన్నంగా నిర్వహించారో అలానే సుబ్బలక్ష్మి, వసంతకుమారి గార్లు ఇద్దరూ 'భావయామి'ని అంత భిన్నంగానూ గానం చేశారు. కాని ప్రాథమికమైన రాగాల నిర్మాణం మాత్రం ఒక్కటే! ఈ విషయంలో పాశ్చాత్య సంగీత నిర్వహణకు, కర్ణాటక సంగీత నిర్మాణానికి దగ్గరతనం కనిపిస్తుంది. కర్ణాటక బాణీలో రాగం-తానం-పల్లవి ఒక్కదానిని మినహాయిస్తే మిగిలిన అన్ని పద్ధతుల గానానికి

ఉండడంతో, వినూత్నతకు,
:ion కు ప్రాధాన్యం తక్కువ.

కు విధానాలలోను ఏది ఎక్కువ
ాను సారంగా ఉంది అన్న ప్రశ్న
ి నా అభిప్రాయం. ఆటువంటి
్యాలు 'live art' అయిన సంగీ
ంలో అనవసరమని నా ఉద్దేశ్యం.
టక సంగీతం 72 మేళకర్తలకు
నుసరిస్తున్న విషయాన్ని గమనిస్తే
ిధానం సంప్రదాయాన్ని జాగ్ర
ుసరిస్తూ వస్తున్నదని ఒప్పుకోక
ఉత్తర భారతదేశంలో యీ విధా
దాయిక శైలికి చెందిన "ద్రుపద్"
మే మిగిలి ఉంది. కర్ణాటక బాణీ
ూన్ని అనుసరిస్తున్నదని చెప్ప
ా బాణీలో ఇంకా ప్రయుక్తం
ృదంగం మరో నిదర్శనం. ఉత్తర
నికి బదులు తబలను ఉపయోగిస్తు
అమీర్ ఖుస్రో పక్వాజ్‌ను రెండు
విడకొట్టడంతో తబల ప్రారంభ
ెబుతారు. అలానే వీణకు దగ్గరగా
ర్ ఖుస్రో నిర్మాణమే! పర్షియన్
ఉత్తర హిందూదేశ సంగీతంమీద,
సంగీతం మీదకన్న విస్పష్టంగా
ది. ఉత్తర, దక్షిణ బాణీలు మహ
లు ఉత్తర దేశాన్ని ఆక్రమించు
6 స్థిరపడిపోయింది.

క బాణీలో Innovation అంతగా
). ఎప్పుడో ఒక ఎం. ఎస్.

గోపాలకృష్ణన్ వంటివాడు ఉత్తరదేశబాణీని అనుసరించడమో, ఒక చిట్టిబాబు రొమాంటిక్ బాణీలో వీణ వాయించడమో, చౌడయ్య వంటివాడు తన వయొలిన్‌ను తానే నిర్మించు కోవడమో జరిగినా, అది సంప్రదాయ విరుద్ధంగా భావింపబడుతుంది. నిజానికి ఒకసారి చిట్టిబాబు నియమితమైన కృతినుంచి తప్పుకొని కొంచెం స్వతంత్రత చూపినప్పుడు సాంప్రదాయికమైన ఒక సంగీత విమర్శకుడు దక్షిణాది బాణీని విడిచిపెట్టి హిందూస్థానీ బాణీని అనుసరించ వలసిందిగా ఆయనకు సలహా చెప్పాడు. స్థిరీకరింపబడిన ప్రస్తార పద్ధతిని అనుసరించకుండా తన మనసుకు నచ్చిన కొత్తపోకడ పోయాడని ఆయనమీద విమర్శ. త్యాగరాజు పాడిన పంచమంలో కాక చిట్టిబాబు షడ్జమంలో ఒక సంగతి అంటే అది సాహసం అనీ, త్యాగరాజుల వారి కృతికి ఇది వికృతి అనీ ఆ విమర్శకుడు అభిప్రాయపడ్డాడు. ఆ విమర్శకుడు 'స్వచ్ఛత'ను తప్పక అనుసరించాలనే సంగీత వేత్తల వ్యక్తిగతమైన ఊహలకు ఇక్కడ తావులేదని ఆయన విశ్వాసం.

కర్ణాటక గాయకులు అంతగా 'స్వరసాధన' చేయడంలో శ్రద్ధచూపరు. బాలమురళి, మధురమణి అయ్యర్ వంటి ప్రఖ్యాతులను మినహాయిస్తే కర్ణాటక గాయకులందరూ రాగాలాపనలో, సంక్లిష్టతకు సంప్రదాయానికి ఇచ్చినంత ప్రాముఖ్యం స్వర మాధుర్యానికి

గాత్రసౌలభ్యానికి ఇవ్వరు. అమెరికన్ జాన్ హిగ్గిన్స్ గానం అంతగా ఆకర్షింప బడడానికి కారణం ఆయన "స్వర" గాత్ర సాధనే! స్వరాన్ని ఆలపించడంలో ఉన్న సౌలభ్యం, మాధుర్యంకన్న, దానిలో ఉండే ఉదాత్తానుదాత్తాలే (Convulsions of notes) ముఖ్యం. హిందూస్థానీ సంగీత గాయకుడు కచేరీ ప్రారంభంలో ఒక రాగంలో తాదాత్మ్యం చెందడానికి ప్రయత్నిస్తే, కర్ణాటక గాయకుడు ఒక రాగం చుట్టూ Vibrato నో, tremolo నో సృష్టిస్తాడు. హిందూస్థానీ గాయకుడు సౌలభ్యానికి ప్రయత్నిస్తే, కర్ణాటక గాయకుడు సంక్లిష్టతకు ప్రయత్నిస్తాడు. బహుశః ఎల్లోరా గృహారామాల్లోని బుద్ధుని ఉదాత్త ప్రతిమకు, నృత్యం చేస్తున్న నటరాజ ప్రతిమకు ఉన్నంత అంతరం ఈ హిందూస్థానీ, కర్ణాటక గాయకుల గానంలో ఉన్నదనిపిస్తుంది.

స్థూలంగా పరిశీలిస్తే, హిందూస్థానీ సంగీతంలో విశ్రామ భావ స్ఫురణ ఎక్కువ. కర్ణాటక సంగీతంలో సంక్లిష్టాత్మకమైన tenseness ఎక్కువ. కర్ణాటక సంగీతంలోని సంక్లిష్టత అంతా ఇదః పూర్వం నిర్మించబడ్డదే. అందువల్ల కర్ణాటక సంగీతంలోని స్వర ప్రస్తారాలు చాలవరకు పూర్వం శ్రోత్రుపరిచయాలే. అయినా ఆ ప్రస్తారణలో స్వర గతి (frequency of notes) వల్ల ఒక వేగం ధ్వనిస్తుంది. హిందూస్థానీ గాయకులు అలాకాదు వారు వారికి యిష్టం వచ్చిన రాగాన్ని వారికి ఇష్టమైన పద్ధతిలో గానం చేయవచ్చు. అమీర్ ఖాన్ తన సరగమ్ లతో తనకు ఇష్టంవచ్చినంత స్వాతంత్ర్యాన్ని స్వీకరించవచ్చు.

స్థాయీసాధనలో కూడా ఈ రెండు పద్ధతుల్లో ఎంతో భేదం ఉంది. విలంబిత స్థాయి కర్ణాటక సంగీతంలో లేనే లేదని చెప్పవచ్చు. 'ఏక్ తాళ్' 'ఝూమ్రా' లను సరియైన కర్ణాటక సంగీతంలో కన్పించవు. హిందూస్థానీ సంగీతంలో విలంబిత్ నుంచి మధ్యలయకు, మధ్యలయంనుంచి ద్రుత్ కు క్రమవికాసంతో కూడిన స్థాయీ భేదం కనిపిస్తుంది. కర్ణాటక సంగీతంలో ఇటువంటి భేదం కనబడదు. త్వరిత గతిలో నడిచే గానాని విలంబితంలో అనుసరణ వాద్యం నడిపించవచ్చు. ఈ విషయంలో కూడా కర్ణాటక సంగీతానికి పాశ్చాత్యా సంగీతానికి దగ్గర పోలికలు కన్పిస్తాయి. ఈ విషయం తెలియక పోవడం వల్లనే శ్రీ గోస్వామి తన 'The Story of Indian Music' అన్న గ్రంథంలో రాగాలాపన విధానాలను గురించి రాస్తూ "రాగాలాపనకు హిందూస్థానీ సంగీతంలో ఉన్నంత కాలమానం కర్ణాటక సంగీతానికి ఉండదు. హిందూస్థానీ సంగీతంలో స్వచ్ఛత ఎక్కువ. కర్ణాటక సంగీతంలో గమకాలు ఎక్కువ కావడంవల్ల వారు అంతగా స్వచ్ఛతకు ప్రాముఖ్యం ఇవ్వరు." అన్నారు.

గోస్వామిగారి విమర్శకూడా రెనాడీగారి విమర్శమాదిరిగానే ఉంది. దీనికి కారణం

దానిమీద సానుభూతి లేక
ోక్', 'రొకోకో' శిల్పవిధా
న్న అంతరం లాంటిది హిందూ
ంక సంగీత బాణీల మధ్య
ర్ణాటక బాణీలో స్వచ్ఛత లేద
దేవాలయ శిల్పంలో స్వచ్ఛత
టిది. ఉత్తరదేశం గాయకులు
ిధానం అభిమానిస్తే దక్షిణ
ు సంక్లిష్ట విధానాన్ని అభి
అభిమానం ఒక్కొక్కప్పుడు
ాభిమానానికి దారితీయడం

ర్ణాటక సంగీత పద్ధతి హిందూ
పద్ధతికన్న ఎక్కువ తర్కబద్ధ
తప్పదు. హిందూస్థానీ సంగీతం
ాట్' పద్ధతికన్న కర్ణాటక
ధారభూతమైన మేళకర్తల
ంజసమైనది. ఈ రాగాలన్నీ
ఎంతో తర్కయుక్తంగా నియ
ు. మొదటి 36 రాగాలు శుద్ధ
తరువాతి 36 తీవ్రమధ్యమం
ు. ఈ విధమైన జన్య, జనక

రాగాల పద్ధతి 'థాట్' పద్ధతి కన్న ఎంతో ఉత్తమమైనది. థాట్‌కంటే పద్ధతి శాస్త్ర దృష్టాంతానికి నప్పుతుందేమోకాని శాస్త్రీయపద్ధతిలో రాగవిన్యాసానికి ఒప్పదు.

కర్ణాటక బాణీకి ఉత్తరదేశంలోను, హిందూస్థానీ బాణీకి దక్షిణదేశంలోను ప్రచారం, ప్రజానురక్తి కలగకపోవడానికి ఆల్ ఇండియా రేడియో తన విధిని సరిగా నిర్వర్తించకపోవడం కొంతకారణమని నేననుకుంటాను. 1973 వరకు సంగీత సమ్మేళనాలలో దక్షిణాదివారికి దక్షిణాత్య సంగీతము, ఉత్తరాదివారికి హిందూస్థానీ సంగీతము మాత్రమే ప్రసారంచేయడంవలన ఒకరి పద్ధతిని మరొకరు చక్కగా అవగాహన చేసుకొనే అవకాశం కలగలేదు. ఇటీవలి రేడియో సంగీత సమ్మేళనాల వల్లనే కాఫీరాగం ఖరహరప్రియకు, జోగియా సావేరికి, బాగెశ్రీ శ్రీరంజనికి, అహీర్ భైరవ్ చక్రవాకానికి దుర్గ శుద్ధసావేరికి సన్నిహితంగా ఉంటాయని మనంతెలుసుకున్నాం. ఇటువంటి పరస్పర అవగాహన ఈ రెండు బాణీలకు, భారతీయ సంగీత ఐక్యభావదృష్టికి ఎంతో ముఖ్యం.

అనువాదం : శరత్

# "గాయక సార్వభౌమ"

# శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు

డాక్టర్ బాలమురళీ

"సద్గురు లేక ఎటువంటి గుణికి తెలియగ బోదు"- సద్గురువు లభించుట, మంచి శిష్యుడు లభించుట, గురు శిష్యుల అదృష్ట విశేషం. గురుశిష్యుల అవినాభావ సంబంధం జీవాత్మ పరమాత్మల సంయోగముతో పోల్చనగును.



పంతులుగారు గాన విద్యలో కాకలు తీరిన మహారధి ఆంధ్ర దేశంలో ఆయన పేరు వినని వారుండరనడం అత్యుక్తి కాబోదు. ఈనాడు సాంప్రదాయక సంగీతం ఇంత మాత్రంగా బ్రతికి ఉందంటే అందుకు కారణం ఆయన చెప్పిన పాఠంలో ప్రాణం మూలం గానే, నశించిపోతున్న గురుకుల సాంప్రదాయాన్ని పునరుద్ధరించి, ప్రాణ ప్రతిష్ఠచేసి నవ చైతన్యంతో ముందుకుపురోగమించేలా చేసిన పుణ్యం ఆయనదే. అసలు దక్షిణాపథంలో సంగీతం శిరోధార్యం కావడానికి, మహానుభావులైన ఆంధ్రులే మూలకారణం కా

మన అదృష్ట విశేషం. అదే కోవకు చె

పంతులుగారుకూడా అనుచానిక స

సాంప్రదాయం

అమితమైన వైశి

మేళవించి అనంత

కీర్తి ప్రతిష్ఠల నార్జి

కొన్నారు. అ

పూర్వమూ అని

పరమూ అయి

ఆయన సాధన మా

సుప్తజీవితాలనై

సప్తస్వరాలతో పుల

జేసి పలికింపజేసే గ

మాధుర్యం ఆయనసొ

ఆయనలో దీక్ష,

గ్రత. నిరంతరపరిశ్ర

దిక సద్గుణాలు ప్రజ్ఞాసమ్మిళితాలై వెలుగుల

మూర్తీభవించిన సుసంప్రదాయం రా

కృష్ణయ్యగారి వ్యక్తిత్వం, పూంజీభవి

సౌజన్యం రామకృష్ణయ్యగారి ఔన్నత్యం.

పంతులుగారు 1883 సం॥ము దివిసీమల

శ్రీకాకుళంలో డిశంబరు 5 వ తేదీన జని

చారు. తండ్రి పారుపల్లి శేషాచలంగారు. తల్లి మంగమాంబగారు. పంతులుగారికి 13 వ యేట వడుగయింది. ఆమీదే అడివి చిన వెంకట పట్టాభిరామయ్యగారివద్ద-ముసద్దీ-పని నేర్చుకొని పెద కళ్ళేపల్లిలో-ఠాణేదారు-గా పనిచేశారు. ఉద్యోగకాలంలోనే వారికి త్యాగరాజ ప్రశిష్యులైన శ్రీ సుసర్ల దక్షిణా మూర్తి శాస్త్రిలవారి పరిచయ భాగ్యం కలిగింది. అంతర్లీనంగా ఉన్న సంగీతం తాలూవాణీ ప్రబోధంతో పంతులుగారు 1898 సం॥రం నుండి దక్షిణామూర్తి శాస్త్రిలుగారివద్ద గురుకుల సాంప్రదాయంలో పన్నెండేండ్లు సంగీతాభ్యాసం చేశారు. గురు భక్తి పరాయణులైన పంతులుగారి సౌజన్య, సౌకుమార్య, సౌహార్ద్రితలు, బుద్ధిసూక్ష్మత దక్షిణామూర్తి శాస్త్రిలువారి ఆదరాభిమానాలకు పాత్రుల్ని చేశాయి.

దక్షిణామూర్తి శాస్త్రిలవారి సాన్నిధ్యంలో ఉండగానే పంతులుగారు కాకినాడ సరస్వతీ సభలను చూస్తూ, కృషి సాఫల్యతకై అనేక విధాలకృషి చేశారు. తిరువయ్యారు త్యాగరాజారాధన ఉత్సవాలలో మొట్టమొదటగా వాయులీన వాద్యంతో తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శించారు. 1915లో తెనాలిలో జరిగిన, సంగీతకచేరీలో శ్రీ పిఠాపురం ప్రభువు స్వర్ణ పతకం, 1916లో బరోడా సంస్థానంలో విశిష్టగౌరవ బహూకృతులు, 1921 త్యాగరాజగానసభలో మహావిద్వాంసుల ప్రశంసలు, 1923 కాకినాడలో అఖిలభారత గాయకసభలో స్వర్ణపతకం, 1927లో మద్రాసులో స్వర్ణ పతకం వారికి లభించాయి. 1929వ సం॥రం ఆంధ్రసారస్వత పరిషత్తుకు అనుబంధంగా నడుపబడ్డ సంగీత పరిషత్ వార్షిక సభకు పంతులుగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. అదే సంవత్సరం ఆంధ్ర రీసెర్చి యూనివర్సిటీ వారు ఆయనకు "భారతీ తీర్థోపాధ్యాయ" పట్టప్రదానం చేశారు. 1931 వ, సంవత్సరం నరసారావుపేటలో సంగీత దిగ్గజాలు అనదగ్గ మహనీయుల సమక్షాన ఆ సభవారు పంతులుగారి స్వర, రాగ, తాళ, భావ ప్రవృత్తులలోని ఉపజ్ఞను శ్లాఘించుచూ, "గాయక సార్వభౌమ" బిరుద ప్రదానం చేశారు. ఆనాటి నుంచీ పంతులుగారు ఆంధ్రసంగీత సామ్రాజ్యంలో సార్వభౌములుగానే ప్రకాశించారు. కీ.శే. నండూరి సుబ్బారావుగారి ఎంకి పాటలకి మొట్టమొదటగా పారుపల్లి వారు స్వరరచన చేశారు. ఇటు, శాస్త్రీయ సంగీతంలోనే గాక, జానపద సంగీతానికి కూడా స్వర రచన చేయడం ఆయన సర్వజ్ఞత్వాన్ని చాటుతోంది. వైలిన్ వాద్యంలో నిష్ణాతులు. అంతేకాదు కచేరీలు చేయకపోయినా వేణువాద్యంలో గూడా పంతులుగారు ప్రవీణులు.

సద్గురు శ్రీ త్యాగరాజుని ప్రశిష్యులైన శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు కేవలమూ వారి శిష్యులకు మాత్రమే గురువుగారు కాదు. వారితో పరిచయ భాగ్యమందిన ప్రతి ఒక్కరూ వారిని గురువుగానే పిలిచెడివారు.

మేరుసమానధీరుడు,సంగీతలోకనాయకుడు, అత్యంత ప్రతిభాశాలి, సద్గుణశాలి, రాజశీవి,

పండువెన్నెల వర్చస్సు, వాగీశ్వర తేజస్సు, అనాయాసేనమరణం, దినాదైన్యేన జీవనం. విద్యాదాన నిరతత్వం, గురుభక్తి, మహోన్నతమైన గుణసంపత్తి. ఇవన్నియూ కలిసి ఒక స్వరూపముగా ఉద్భవించిన వ్యక్తి మా గురుదేవులు. సంగీతములో వారికి తెలిసిన రహస్యములు అనన్య సామాన్యములు. శృతి లయ విశారదులు, సప్తస్వరముల గురుతు లెరింగినవారు, లక్ష్యలక్షణ పారంగతులు, ఆధ్యాత్మిక తత్త్వజ్ఞులు, మితభాషి, సహనము వారి సొమ్ము. వారి హృదయస్థమైన సంగీత సరస్వతిని అత్యున్నత స్థాయిలో నిల్పి గౌరవించిన మహామనీషి. వారి గృహము విశ్వవిద్యాలయాలకు విశ్వవిద్యాలయము. నిత్య కృత్యము సంగీత బోధనమే. కాలకృత్యము తీర్చుకున్న వెంటనే పాఠములు ప్రారంభమగును. శిష్యులు వందలకొలదీ ఇంటిలో ఉందురు. కొంతమందికి వారివారి గ్రాహ్యస్థితిని బట్టి తరగతులు నిర్ణయింపబడును.

శిష్యునకు తగినట్లు గురువు ఒక ప్రణాళిక రూపొందించవలయును. ఒకే రకమైన ప్రణాళిక అందరికీ అనుకూలించదు ఇదివారి బోధనా రహస్యము. ఈ రహస్యము తెలియకనే, ఎవరో రూపొందించిన ఒకే రకమైన ప్రణాళికను ప్రవేశపెట్టి అట్టిప్రణాళిక ప్రకారం బోధనలు జరుగుచున్నందునే సంగీత కళాశాలలలోనూ, పాఠశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ, నేర్చుకొను విద్యార్థినీ విద్యార్థులకు సంగీతమును గూర్చి తెలియుచున్నదిగాని సంగీతము తెలియుటలేదు.

జీవితములో సంగీతమేరాదు అని నిర్ణయింపబడిన వానికి, వానికి తగినట్లు ప్రణాళిక నేర్పరచి, సంగీత శిక్షణ ఇచ్చి, వానిని గాయకునిగా చేసి, జీవనోపాధి తత్సంగీతము ద్వారానే లభించేటంత శక్తిని ప్రసాదించ గల్గినవారు శ్రీ పారుపల్లి. వారివద్ద శిష్యత్వముపొంది జీవనోపాధికి కష్టపడుచున్నవారు ఎవ్వరూ లేరు. ప్రతీ శ్రీవారి శిష్యుడూ ఉన్నతమైన స్థాయిలో ఉంటూ సద్గుణాలతో క్రమశిక్షణతో మెలగి జీవితాన్ని సుగమంగా సుఖంగా తీర్చుదిద్దుకోగలుగుతున్నారు.

మా గురుదేవుని శిష్యులమైన మేమంతా 'అయ్యవారు' అని పిలుస్తాము. శ్రీవారి సతీమణిని 'అమ్మగారు' అంటాము. శిష్యునికి ఏమి కావలె! సంగీత బోధన మాత్రం చాలునా? కాదు. నడవడికల తీరు తెలిసికోవలెను. సంగీత రచనలలోని అర్థమును, భావమును గ్రహించుకోవలెను. శిష్యుని ఆరోగ్యమును గూర్చి అయ్యవారికున్న తహతహ శిష్యుల తల్లి తండ్రులకుకూడా అంత ఉండదు. ఎంతోమంది శిష్యులకు అన్నము పెట్టి, బట్టలిచ్చి ఉండుటకు గదినిచ్చి, సాధనకు వీలుగా చోటునిచ్చి, తలంటిపోసి, విద్యాదానము చేసినారు. ఈషణ్మాత్రము ప్రతిఫలాపేక్ష లేనివారునూ గురువర్యులు. అదిఒకయుగము. స్వర్ణయుగము. ఏ పదవికి ఆయన ఆశించలేదు. కచేరీలుచేయవలెనని ఆశించలేదు. అయినాఅన్ని గౌరవపదవులు వారికివరించినవి. వారినిర్యాణ కాలము నాటికీ షుమారు పది కచేరీలకు అడ్వాన్సులు తీసుకొనియున్నారు

వారి గురుభక్తి ఆదర్శప్రాయము. గురుదేవుల సంస్మరణ వారికి తారకనామము. ప్రతి సంవత్సరము సద్గురువుల ఆరాధనోత్సవములు చేయుచు శిష్యుల కచేరీలు ఏర్పాటు చేసి, కచేరీలు చేయు విధమును, అందుగల సాధక బోధకముల అవగాహనా శక్తి అలవాటు

చేసిరి. అట్టి సద్గురు ఆరాధనోత్సవముల మధ్యలో ఒకనాడు అనగా 7-7-1951 న వారు ఇంటికి వెళ్ళి స్నానముచేసి సంధ్య ముగించి మడిబట్టలతో నుండి గురుప్రసాదసేకర ణకై ఉత్సవములు జరుగుచోటికి రాబోయే టంతలో శ్రీవారి మనుమడు "తాతా, ప్రతి రోజు ఒక పంది వచ్చి క్రింద అంతా పాడు చేయుచున్నది. అది ఇప్పుడు వచ్చినది" అని చెప్పగా వెంటనే మేడమెట్లు దిగివచ్చి చూడ గా ఆ పంది మాయమైనది. ఒక్క నిము షములో, శ్రీవారి సతీమణీ, శిష్యులము మేమంతా క్రిందికి వచ్చుసరికి, చిరునగవు మోముతో కుడిచెవిపై నుంచి ఒత్తిగిలి పరుండి శరీరమును విసర్జించినారు. సాక్షాత్తు కూర్మావతారుడు ప్రత్యక్షము కాగా వారిలో ఐక్యమైనది మా గురువర్యుని జ్యోతి. అంతా నిమేషమాత్రమే. అదే మొదట చెప్పినాను. "అనాయాసేనమరణం" పుణ్యాత్ములకు మహాత్ములకు గాని అబ్బదు. ఇల్లు పరిసర ములు, హృదయము పరిశుభ్రముగా నుండ వలయును. అప్పుడే జీవితము శృతి శుద్ధముగా నుండగలదు. ఇది శ్రీవారి యందు నిదర్శ నము. ఒకరిని గురించి ఎన్నడూ నిందా వాక్యములు పలుకలేదు. ఒకరిని ద్వేషించ లేదు. ఒకరి అభివృద్ధిని గాంచి ముచ్చట పడి నారేగాని ఏవగించుకోలేదు. మిత భాషణ త్వము. అనవసరముగా ప్రసంగించి వాగ్దేవికి ప్రయాస కలిగించలేదు.

మహతీ మంద్రసుగాత్రి మా గురువు. వారి కచేరి వినుట, లేక వారివెనుక పాడుట, లేక వారికి ప్రక్కవాద్యము వాయించుట, వారితో కలిసి ప్రయాణించుట, వారు పరు లతో సంభాషించునపుడు వినుట. ఇవన్నియూ మానసికోల్లాసమునూ జ్ఞానమునుకల్పించును. సద్గుణములను పెంపొందించును.

మొట్టమొదటిసారిగా మా గురువుగారితో మద్రాసు ప్రయాణము గావించితిని. అది 1939 వ సం ము. విజయవాడ నుండి మద్రాసు పాసింజరులో 3 వ తరగతిలో ప్రయాణము. అంతదూరము రైలులో ప్రయాణము అదే మొదటిసారి. నాకు కిటికీ వద్ద కూర్చొనవలెనని ఆశ. మా గురువుగారు నన్ను కిటికీవద్ద కూర్చోనీయలేదు. కారణం బొగ్గునలుసులు కంటిలో పడును. అట్లు పడుట గాత్రమునకు హాని కలిగించును. అదీ గాక కిటికీ తలుపులు పైనుంచి పడును, చేతి వేళ్ళు నలుగును అంటిరి. నా ఆశ అడు గంటెను. నా కళ్ళ వెంబడి నీళ్ళు వచ్చెను. అది చూసి వారి వెండి చేతికర్రను కిటికీ తలు పుకు ఆనించి సాయంత్రం 6 గం॥ల నుండి రాత్రి 11 గం॥ల వరకు తిరిగి ఉదయం7 గం॥ల నుండి 10 గం॥ల వరకు మద్రాసు వచ్చువరకు ఆ కర్రను కిటికీ తలుపులు క్రింద పడకుండు నట్లు ఆనించి నన్ను వారివడిలో కూర్చోబెట్టి, నా ఆశను నెరవేర్చిరి.

ఒకానొక కచేరీలో నేను సాహిత్యము అర్థము తెలియక పాడినాను. వారు మరు నాడు నన్నుపిలిచి అర్థము చెప్పి, అర్థరహి తము గాను సాహిత్యమును స్పష్టముగా ఉచ్ఛరించక పాడతగదు అని చెప్పినారు. నేను గాత్రమును పాడునప్పటినుంచీ వైలను వాయించితిని. నాకు శ్రీ ద్వారం వారి violin బాణీ నచ్చును. వారి కల్యాణిరాగం, తానం పల్లవి అచ్చంగా అచ్చుగుద్దినట్లు వాయించితిని. అది నేను వాయించునప్పుడు నాయుడుగారు వాయించినట్లే యుండును

అది (శ్రీ)వారి తక్కిన శిష్యులకు ఒకనాడు వాయించి చూపించితిని. అందరూ ఆనందించిరి. గురువుగారు నన్ను మాత్రము లోనికి పిలిచిరి. "చక్కగా వాయించితివి, ఎంత చక్కగా వాయించినను నీవు నాయుడుగారు కాలేవు. అందరిలోని మంచినీ గ్రహించి నీ బాణీని నీవు స్వంతముగా రూపొందించుకొనవలెను. అప్పుడే నాయుడుగారివలె రాణించ గలవు" అని ఉద్బోధించిరి. అవును. ఒకరిని అనుసరించుట వ్యక్తిత్వముగాదు. స్వంతముగా బాణీని అలవరచుకోవలెనన్న ఆకాంక్ష నాడు నాకు కలిగెను. ఇటువంటి సద్బోధనలు చేయుచు జీవితమును ఆదర్శ ప్రాయముగా గడిపినారు (శ్రీ) అయ్యవారు. వారికి జరగని గౌరవములేదు. Madras music Academy Expert Committee memberగా వుండి సదస్సులలో పాల్గొని అనేక సంగీత రహస్యములను గూర్చి ప్రసంగించి ప్రశంసలు పొందిరి. 'భారతీ తీర్థోధ్యాయ' బిరుదమును బడసిరి. గండపెండేరాది గౌరవములు పొందిరి. తిరువయ్యూరు త్యాగరాజ ఉత్సవ కమిటీలో Executive Memberగా నుండిరి. (శ్రీ)మతి బెంగుళూరు నాగరత్నమ్మగారు గురువుగారిని గురువుగారనే పిలిచేవారు. (శ్రీ)మతి నాగరత్నమ్మగారు (శ్రీ) గురువుగారి వద్ద కొన్ని కృతులను నేర్చుకున్నారు కూడా.

వారి అంతేవాసిగా ఉండి వారివద్ద విద్యా రహస్యములు తెలిసికొను అదృష్టమునకు నోచుకొన్న నా జన్మ ధన్యము. వారి ఆశీర్వాదప్రభావం అనిర్వచనీయం, కేవలం అనుభవైకవేద్యం. అట్టి అదృష్టశాలినైన నాకేమి లోటు!

మహతి—రూపకం

మహనీయ మధురమూర్తే
కమనీయ గానమూర్తే
సహన సౌశీల్యాది సద్గుణోపేత సత్కీర్తే
మహతీ మంత్రసుగాత్రే మాంపాహి గురుమూర్తే
అహరహమానందమయ గాన బోధనానురక్తే
ఆశ్రితమురళీకృత మృదు సంగీత సుధాసక్తే
మాంపాహి గురుమూర్తే

ఈ సదవకాశము నాకు లభింపచేసిన "ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ" వారికి నా కృతజ్ఞతలు.

# డాక్టరు గరికిపాటి రాజారావు

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి



క్రీడ కళకోసం కాదనీ, కళ వ్యక్తుల సొత్తు కాదనీ అది ప్రజలకు చెందిన ఆస్తి అనీ, కళ ప్రజలకు ఉపయోగపడాలనీ. ప్రజాసమస్యలు ప్రతిబింబించని కళ నిరర్థకమనీ, చాటిన కళాకారుడు డాక్టరు రాజారావు గారు.

డాక్టరు రాజారావు రాజమండ్రిలో 1915 ఫిబ్రవరి, 5 వ తేదీన, శ్రీ గరికిపాటి కోటయ్యా దేవర, శ్రీమతి సోమలింగమ్మ పుణ్యదంపతులకు జన్మించారు.

రాజారావు గారు విద్యార్థి దశలోనే స్కూలు ఉత్సవాలలో చిత్రవిచిత్ర వేషాలు ధరించి బహుమతులు అందుకున్నారు.

తండ్రి ఉద్యోగంలో పాటు ఆయా పట్టణాలలో చదువుసాగినా 1933 లో విజయనగరం కాలేజీలో, ఎస్. ఎస్. ఎల్. సి. ఉత్తీర్ణుడై నాలుగు సంవత్సరాలు రైల్వేలో గుమాస్తా ఉద్యోగం చేశారు.

1937 లో మద్రాసు ప్రభుత్వ మెడికల్ కాలేజీలో ఎల్. ఐ. ఎం. పట్టా పొందారు.

మద్రాసులో వైద్య విద్య అభ్యసిస్తున్నప్పుడే డాక్టరు కొమ్మపాటి గంగాధరరావు గారిచేత నాటకాలు వ్రాయించి ప్రదర్శిస్తూవుండేవారు.

షాజహాను నాటకంలో ఔరంగజేబు పాత్రను ధరించి తండ్రిని బంధించే సన్నివేశంలో అత్యద్భుతంగా నటించి మద్రాసు ఆంధ్రుల ప్రశంసలను అనాడే అందుకున్నారు.

1943 లో విజయవాడ సమీప గ్రామాలైన పోరంకి, పెనమలూరు గ్రామాలలో ప్రాక్టీసు పెట్టి వైద్య వృత్తిలో ప్రజాదరణ పొందడమే కాక, బాలుర నందరినీ చేర్చి బాలసంఘాలనూ, యువకులను చేరదీసి యువజన సంఘాలనూ స్థాపించి, జాతీయ ప్రబోధాన్ని కావించేవారు. వారిచేత వైజ్ఞానిక ప్రదర్శనాలను ప్రద

ర్శింపచేసేవారు. ప్రజా వైద్యశాలను స్థాపించి, ప్రజావైద్యుడుగా సేవచేయడమేగాక ఒక నాటక సమాజాన్ని స్థాపించి, ఖిల్జీ రాజ్యపతనం మొదలైన చరిత్రాత్మక నాటకాలను ప్రదర్శించేవారు. 'పరితాపమనే' నాటి సమస్యలను ప్రతిబింబిస్తూ నాటకం వ్రాసి ప్రదర్శించి ప్రజా మన్ననలను పొందారు.

ఆ రోజుల్లో 1943 నుండి 1950 వరకు ఆంధ్ర నాటక రంగ చరిత్రలో ఒక నవ్యయుగం నడిచింది. అదే ఆంధ్ర యువకళాకారులు నిర్మించిన వైజ్ఞానిక ఉద్యమం. అదొక గడిచిపోయిన స్వర్ణయుగం. ఉత్సాహంకొద్దీ నిర్మించింది కాదు. ఆ వైజ్ఞానిక ఉద్యమం. అదొక ఉధృత వాతావరణంలో ఏర్పడింది. వేలాది యువకులను సమీకరించి ప్రజానాట్య మండలి స్థాపకుల్లో ఒకరుగా నిలబడ్డారు రాజారావు గారు. కేవలం ఆర్థిక లాభాలకొరకు నిర్మించింది కాదు ప్రజానాట్యమండలి. అది ఒక ఉన్నతాశయ ప్రబోధంతో దేశానికీ ప్రజలకూ సేవ చేయడానికి పుట్టిన మహాసంస్థ.

పోరంకిలో ముమ్మరంగా ప్రాక్టీసు చేస్తున్న రోజుల్లో ఆయన ప్రజానాట్యమండలికి అర్గనైజరుగా నిర్ణయించబడ్డారు. ఆ సమయంలో రాష్ట్ర దళం ఏర్పాటు చేయబడింది. ఆ దళంలో మిక్కిలినేని, మాచినేని, నాజరు, ఉమామహేశ్వరరావు మొదలైనవారంతా ప్రముఖ బాధ్యతలను నిర్వహిస్తూ వుండేవారు. రాష్ట్రదళానికి డాక్టరుగా, డైరెక్టరుగా నియమింపబడ్డారు. ప్రజానీకాన్ని కళాయుధంద్వారా చైతన్యవంతులుగా చేయడానికి ఒక నూతన ఉత్సాహాన్నిచ్చారు.

రాజారావు మంచి నర్తకుడు. ఆయననృత్యం ఉద్వేగాన్ని కలిగించేదిగా ఉండేది. ఆనాటి ప్రదర్శనాలలో ఆయన హిట్లరు, వీథి భాగవతంలో ఎర్రసైనికుడుగా, కత్తీ, సుత్తీ తీసుకుని హిట్లరును చివరి దృశ్యంలో హతమార్చేటప్పుడు ప్రళయతాండవ నృత్యం చేసేవారు.

ఆయన ఎంత మంచి నర్తకుడో అంత మంచి నటుడు కూడా. పరివర్తన నాటకంలో ఫ్యాక్టరీ యజమాని బాబుగా, మాభూమి నాటకంలో పట్వారీగా, సిమ్లా వీథినాటకంలో స్టాఫర్డు క్రిప్సుగా, "భయం"నాటకంలో ప్రొప్రయిటరుగా, ఈ నాడులో "రహీంగా", అల్లూరి సీతారామరాజులో రూధర్ ఫర్డుగా, షాజహాన్ నాటకంలో ఔరంగజేబుగా, ఖిల్జీరాజ్య పతనంలో ఖిల్జీగా అద్భుతంగా నటించి, ప్రేక్షకుల మన్ననలను అందుకున్నారు.

ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రదళం బొంబాయి, పూనా, షోలాపూర్, అహమ్మదాబాదు నగరాలలో 'మాభూమి' నాటకం ప్రదర్శించినప్పుడు బలరాజ్ సహానీ, అబ్బాస్ వంటి ప్రముఖులు రాజారావు రంగస్థల ప్రయోగ నిర్వహణను ఎంతగానో ప్రశంసించారు. ఢిల్లీలో ఆయన ప్రదర్శించిన "భయం" నాటకం అంతర్జాతీయ ప్రశంసలందుకుంది. అల్లూరి సీతారామరాజు నాటకం దేశభక్తి ప్రపూరితమై ఆంధ్రదేశాన్ని ఉద్రూతలూగించింది. చైనా దురాక్రమణ సందర్భంలో హైదరాబాదు రవీంద్రభారతిలో రాజారావు నిర్వహణలో ప్రదర్శించిన జైభవాని నాటకం, సర్. రాధాకృష్ణన్ ప్రశంస లందుకుంది.

ప్రజానాట్యమండలి మీద 1948 లో నిర్బంధాలు ఎక్కువైన కాలంలో రాజారావుగారు రాజమండ్రి వెళ్ళి డాక్టరుగా ప్రజలకు సేవచేయడం ద్వారా, ప్రజావైద్యుడుగా ప్రశంసించ బడ్డారు.

రాజమండ్రిలో ఉన్నరోజుల్లోనే, రాఘవ కళాసమితిని స్థాపించి "భయం" "గుడ్డిలోకం" "భవబంధాలు", మొదలైన నాటకాలకు దర్శకత్వం వహించి, పాత్రలు

ి అనేక కళా పరిషత్తులలో ప్రదర్శించి ఉత్తమ
ుగా బహుమతుల నందుకున్నారు.

953లో మద్రాసువెళ్ళి, రాజా ప్రొడక్షన్స్
ంచి "పుట్టిల్లు" చిత్రం తీశారు. చిత్రం ఆద
గా తీసినా ఆర్థికవిజయం కలగకపోవడంతో
రాజమండ్రి వెళ్ళిపోయారు.

1956 లో రాజమండ్రిలో వారంరోజులపాటు
ాంధ్ర సాంస్కృతిక ఉత్సవాలను బ్రహ్మాండంగా
హించారు.

రాజారావు ఆంధ్రదేశంలో ఆదర్శప్రయోక్తగా
పొందారు. ఔత్సాహిక నాటక సంఘాలకు
క న ప్రయోగాలను ప్రసాదించారు. నాటకం
ర్సల్సును ఆదర్శవంతంగా నడిపేవారు. నాటకం
ర్శన యోగ్యంగా ఉండేందుకు నటీనటులందరినీ
వేశపరిచి వారి అభిప్రాయాలను తీసుకునేవారు.
ర్సల్సు సమయంలో ప్రముఖనటుల్నీ, విమర్శ
, రచయితలనూ ఆహ్వానించి అమూల్యమైన
అభిప్రాయాలను తీసుకునేవారు. ఈ విధంగా
ష్టి కృషితో జయప్రదంగా ప్రదర్శనాన్ని సాగించే
. ఆయన దర్శకులుగా, అనేక నాటకాలను
ారుచేసి ప్రదర్శించడమే కాక, అనేక సమాజా
దర్శకత్వ బాధ్యతను వహించారు.

ప్రజా నాట్యమండలి మీద ప్రభుత్వ నిర్బంధాలు
ువైన రోజులలో ఆయనను నానా చిత్రహింస
గురిచేశారు.

ఆయన డాక్టరుగా కొన్నివేలమందికి ఉచిత
త్స చేశారు. ఆయన డబ్బుకోసం జబ్బును
సాగదీసే డాక్టర్ కాదు. మందస్మిత వదనంతో మందు
లిచ్చి పంపించే మంచి డాక్టర్. ఆయన వైద్యాన్ని
దేశసేవకూ, ప్రజాసేవకూ వినియోగించారు.

ఆయన అఖిలభారత ప్రజానాట్యమండలి కేంద్ర
సంఘానికి కార్యవర్గ సభ్యులు. ఆంధ్ర ప్రజా నాట్య
మండలి నిర్మాతల్లో ఒకరు. రాజా ప్రొడక్షన్సు, నాట్య
భారతి ప్రొడక్షన్స్ నిర్మాత. రాజమండ్రిలో థియే
టర్స్ ఫెడరేషన్ సంస్థను స్థాపించి, నాటకరంగ
ప్రయోగ శిక్షణాలయాన్ని నడిపారు. ఎల్.ఐ.ఎమ్.
డాక్టర్ల సంఘ కార్యనిర్వాహకులుగా పనిచేశారు.

ఆయన రచయితగా, నాటకాలనూ, నాటికలనూ,
కొన్ని ప్రబోధ గేయాలనూ, చిన్న కథలనూ రచిం
చారు. అనేక పత్రికలకు నాటక ప్రయోగం మీద
వ్యాసాలు వ్రాశారు. అనేక గోష్ఠులలో నాట్యకళ
మీద ఉపన్యాసాలిచ్చారు. ఆంధ్రనాటక కళాపరిషత్తు
లోనూ, ఇతర పరిషత్తులలోనూ ఉత్తమ నటులుగా
బహుమతులందుకున్నారు.

సుప్రసిద్ధ రంగస్థల నటుడూ, ప్రజా నాట్య
మండలి నిర్మాత, ప్రజావైద్యుడూ అయిన డాక్టర్
రాజారావు తమ 49వ ఏట 1963 సెప్టెంబరు నెల
ఎనిమిదవ తేదీ సాయంత్రం మేమందరం చూస్తూ
ఉండగానే మద్రాసు జనరల్ ఆసుపత్రిలో కన్ను
మూశారు.

సమకాలికులుగా ప్రజానాట్యమండలి ఉద్య
మాన్ని నిర్మించాం. మా తరం వారిలో ఒక ఉజ్వల
నటరత్నం రాలిపోయింది. నాటక రంగంలో రాజా
రావు కళాసేవ చిరస్థాయిగా ఉంటుంది. ప్రజా
వైద్యునికీ, ప్రజా నటునికీ ఇవే నా జోహారులు.



# గత రెండు దశాబ్దాలలో తెలుగులో నాటక ప్రయోగం - కొత్త పోకడలు

చాట్ల శ్రీరాములు

అనుకున్నంత ప్రగతిని సాధించలేకపోయినా గత రెండు దశాబ్దాలలో తెలుగులో నాటక ప్రయోగం కొత్తపుంతలు తొక్కిందనడం నిర్వివాదాంశం.

1972 లో అమెరికన్ రచయిత Myron Matlaw రూపొందించిన Modern world Drama Encyclopedia లో బెంగాల్, హిందీ, మరాఠీ నాటక రంగాలతోపాటు ఆంధ్ర నాటకరంగ ప్రగతిని కూడా స్తుతించారు.

1960-62 ప్రాంతాల్లో రాచకొండ విశ్వనాథశాస్త్రి గారు ఆధునిక నాటక రచనలో ఒక నూతన పోకడని సృష్టించారు. "తిరస్కృతి", "నిజం", "విషాదం" నాటకాలు-రచనలో ప్రయోగంలో-అవి out and out విశాఖజిల్లా ప్రాంతపు వాతావరణాన్ని కళ్ళకు కట్టినట్లుగా చిత్రిస్తాయి. ఆ పాత్రలు అచ్చు విశాఖ జిల్లా ప్రాంతపు వాతావరణంలో పుట్టి పెరిగి ఆ ఊపిరి పోసుకుని కాళ్ళూ, చేతులూ, వమ్ములూ వున్న పరిపుష్టమైన పాత్రలుగా మన కళ్ళకు కనిపిస్తాయి.

ప్రఖ్యాత రంగస్థల నటుడు,దర్శకుడు,కీర్తిశేషుడు కె. వెంకటేశ్వరరావు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో వృత్తిరీత్యా రంగస్థల దర్శకుడు కావడంతో ఆ ప్రాంతపు విద్యార్థులకు శిక్షణ యివ్వడంలో ఉన్న simitations దృష్టిలో పెట్టుకునిగాని, రా.వి.శాస్త్రి మంత్రి శ్రీనివాసరావు లాంటి వారిద్వారా ప్రాభావితుడై గాని "లాభం", "పావలా", "కొడుకు పుట్టాల" (గణేష్ పాత్రోరచనలు) విశాఖ గ్రామీణ వాతావరణాన్ని యథాతథంగా మాటలో, మాండలిక శబ్దంలో పాత్రల ప్రవర్తనలో తీర్చిదిద్దాడు. ఈ నాటికలు చూస్తుంటే విశాఖ జిల్లాలోని సముద్రతీర ప్రాంతంలోకో, ఓ గ్రామంలోకో, Urban area కో ప్రేక్షకుడు విసరివేయబడతాడు. (అయితే యీ కోవలో యింతకు యిరవై ఏళ్ళ ముందు నెల్లూరు వాసి పులుగుండ్ల రామకృష్ణయ్య "తుఫాను" అనే నాటిక నెల్లూరు మాండలికంలో రాయడం జరిగింది కాని దాని ప్రభావం ఆనాటి రచయితలపై సోకలేదు).

ఈనాడు అత్తిలి కృష్ణ రచించి ప్రయోగించిన "తూర్పురేఖలు" నాటకం naturalistic play అనవచ్చు. ఈ నాటకంలో పాత్రలు శ్రీకాకుళం జిల్లాలోని సవర్లు, జాతాపులు అయిన గిరిజనులు. శ్రీకాకుళం గిరిజన పోరాటాన్ని దృష్టిలో ఉంచుకొని భూషణంగారు రచించిన "కొండగాలి" ఆధారంగా మలచబడ్డ యీ నాటకం రచనలో ప్రయోగంలో గిరిజనులు నిత్యజీవితంలో ఎదుర్కొన్న, ఎదుర్కొం

సమస్యల్ని, ఆ సమస్యల్ని వారికి వారు పరి ుచుకొంటున్న రీతిని అత్యంత హృద్యంగా వారు దర్శక ప్రయోక్తలు.

పైనచెప్పిన రచనల ప్రయోగం ఆంధ్రదేశంలో మారు మూలైన ఏ అదిలాబాద్, నిజామాబాద్, జిల్లాలలో జరిగినప్పుడు ప్రేక్షకులను Spo- word అర్థంచేసుకోవడంలో యిబ్బంది హనదు. భాష ఒకటైనప్పటికీ రెండు వేర్వేరు లకు సంబంధించిన సమాజపువ్యక్తుల భాషలో, గో, మాండలికంలో వున్న వైవిధ్యం, ప్రత్యే Gapని సృష్టించక తప్పదు. తెలుగు సినిమా హ అని తెలుగు భాష ఎంత కృత్రిమంగా వ్వాల్లో అంత కృత్రిమంగా తయారయ్యింది. mercial line లో ఆలోచించని, తెలుగు లోనైనా ఓప్రాంతపు Purity ని Preserve పోతే అది బాధ్యత నెరుగని రచన, ప్రయోగ ంది.

ండలిక భాష ప్రయోగించి యీ ప్రాంతంలో పదర్శించినంత విరివిగా యితర ప్రాంతాలకు ంచిన రచయితలుగాని ప్రయోక్తలుగాని ంగంలో తగు ప్రయోగాలు చేయకపోవటం యం.

64లో యస్. ఆర్. సంది రచన "మరో ంజోదారో" ఓ కొత్త శకానికి నాంది పలి అనేక భారతీయ భాషల్లోకి అనువదింపబడ్డ యిది. "వారే ఇన్‌సాన్" అనే పేరుతో లోకి అనువదింపబడి ఢిల్లీలో అనేకసార్లు ంపబడింది కూడా. ఆనాటినుండి గత పదిహే కొన్ని డజన్ల రచయితలు తమ నాటకాల్లో orm ను ఉపయోగించారనడం ఏ మాత్రం యోక్తికాదు. నిన్న మొన్నటి "పలురే బంగార " (రచయిత-దాడి వీరభద్రరావు)లో యీ శిల్పం ్పినట్లు కనిపిస్తుంది. "మరో మొహెంజోదారో" నాటక రచనకి వాడిన Canvas చాలా పెద్దది. ఆ కారణంగా ఓ ప్రత్యేకమైన శిల్పం యీ నాటకానికి అవసరమైంది. ఈ నాటక రచనలో అమెరికన్ రచ యిత Thorenton wilder రచన "Our town" పోకడలు కనిపిస్తాయి. నిన్నమొన్నటి వరకూ తెలుగు దేశంలోకి అడుగుపెట్టని బెర్టోల్డ్‌బ్రెష్ట్ Aliena-tion సిద్ధాంతం యీ నాటక రచయితని అతనికి తెలియకుండా ప్రభావితుణ్ణి చేసింది. రంగస్థల సామాగ్రి లేకుండా ఉందని ఊహించుకుని నటించడం — ఎదు రుగా లేని వ్యక్తులు వున్నట్లు ఊహించుకు నటించడం యీ నాటక ప్రయోగంతో ప్రారంభమైంది. సిని మాల్లో "Freeze" అనీ "Stop Block" అనీ యీరోజు పిలవబడే technique రాకముందు "మరో మొహెంజోదారో" ద్వారా తెలుగు నాటక రంగంలోకి "Freeze" ప్రవేశించింది. (నాటినుండి నేటివరకు అనేకమంది రచయితలు తమ రచనల్లో యీ "Freeze" అవసరం ఉన్నా లేకపోయినా చొప్పించడం మాత్రం క్షమించరాని నేరం. అది వేరే విషయం.)

గొల్లపూడి మారుతీరావు ఓ మధ్యతరగతి కుటుం బంలోని ఓసమస్యకు "ఈడిపస్ కాంప్లెక్స్" జోడించి రచించి ప్రయోగింపబడ్డ నాటకం "కరుణించని దేవ తలు". ఇది నాటక రంగంలోఓవినూత్న ప్రయోగం. ప్రేక్షకులకు ఓ చిన్న shockని యిచ్చింది. ఆ తర్వాత "కళ్ళు" నాటిక రచనగా ప్రయోగంగా ఒక సంచలనాన్ని సృష్టించింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడెమీ ఎవార్డు ఉత్తమ నాటకానికి ఓ సంవత్సరం యీ నాటికకు లభించింది. మనిషిలో అధికారం లేన ప్పుడు ఉన్న మానవత్వం అధికారంలోకి రాగానే రాక్షసత్వంగా మారుతుంది. మళ్ళీ పదవీచ్యుతుణ్ణి చేస్తేగాని యీ రాక్షసత్వం అంతంకాదా అన్న విష యాన్ని "కళ్ళు" symbols ద్వారా చెప్పాడు రచ యిత. అలాగే "లావాలో ఎఱ్ఱ గులాబీ" నాటకంలో Man and his possessive temperamentని

ఒక కాళ్ళులేని, wheel chair తో తిరుగాడుతుండే పాత్రద్వారా project చేసి నాటకంలో నటుడికీ దర్శకుడికీ కొత్త challenges సృష్టించాడు రచయిత. గులాబీలన్నింటిలోకి ఎఱ్ఱగులాబీ చాలా మృదువైంది. అలాంటి ఎఱ్ఱగులాబీని ఒక లావాలో-ఓ అగ్ని పర్వతం మధ్యలో పడేస్తే ఏమవుతుంది. ఇది ఒక దోమను చంపడం కోసం ఒక మెషీన్ గన్‌ను వాడడం లాంటిది. లావాలాంటి కథానాయకుడు ఎఱ్ఱ గులాబీలాంటి కథానాయకి మధ్య కలిగిన మానసిక సంక్షోభాన్ని ఒక విభిన్నమైన stage craft కి జోడించి యీ నాటకం ద్వారా ప్రయోగించాడు రచయిత.

1969-70 మధ్య ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం మరో నూతనాధ్యాయాన్ని సృష్టించింది. నాట్య విద్యాలయ రిపర్టరీ థియేటర్ "మృచ్ఛకటిక", "ప్రతాపరుద్రీయం", "కన్యాశుల్కం" వంటి epic proportions వున్న నాటకాల ప్రయోగంద్వారా ఆంధ్ర నాటకరంగంలో సశాస్త్రీయ దృక్పథాన్ని సృష్టించింది. తెలుగులో మొట్టమొదటిది (ఇప్పటి వరకూ చివరిది కూడా) అయిన అనిబద్ధరూపకం "సంరక్షకుడు" (హెరాల్డ్ పింటర్ రాసిన "care taker" కు అనువాదం) శ్రీ AR కృష్ణ రచించి ప్రయోగించారు. ప్రాంతీయ నాటకోత్సవాల ద్వారా ఇతర భాషల్లోని కొన్ని ఉత్తమ నాటకాలను తెలుగులోకి అనువదింపజేసి నాటకసంస్థలు ప్రయోగించే అవకాశాన్ని కల్గించిన ఘనత ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘానికి దక్కుతుంది. (ఉదా॥ బాదల్ సర్కార్ రచన "బాకీ ఇతిహాస్" "మిగిలిన చరిత్ర"గా శంభుమిత్ర "కాంచనరంగ్" "బంగారు లేడి" గా, విజయ్‌తెండూల్కర్ "శాంతతా కోర్ట్ చాలూ ఆహే" "నిశ్శబ్దం కోర్టు నడుస్తోంది" గా తెలుగులో ప్రదర్శింపబడడానికి ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం దోహదం చేసింది.)

ఆర్థిక నష్టాన్ని దృష్టిలోకి తీసుకోకుండా హైద్రాబాద్‌లో "నిజం" నాటకాన్ని "weekend Theatre" programme క్రింద వారాల తరబడి ప్రదర్శింప జేసిన సంస్థ ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం.

గత నాలుగేళ్ళలో నూరుకు మించి ప్రదర్శనలిచ్చిన "మాలపల్లి" నాటకం తెలుగు నాటక రంగ చరిత్రలో మరో చెప్పుకోదగ్గ మలుపు. ఉన్నవలక్ష్మీ నారాయణ గారి నవల "మాలపల్లి" ఆధారంగా నగ్నముని రచించి AR కృష్ణ ప్రయోగించిన యీ నాటకం పన్నెండు రంగస్థలాల్లో జరిగే HAPPENINGSని ఏకకాలంలో చిత్రీకరిస్తుంది. దాదాపు 50 మంది పాల్గొనే యీనాటకంలో Total Theatre ఛాయలు కనిపిస్తాయి.

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు "యథాప్రజా తథా రాజా" నాటకం ద్వారా నిజజీవితంలో జరిగిన ఓ సంఘటన ఆధారంగా చేసిన ప్రయోగం. ఆ నాటకానికి ఉత్తమ రచనగా సంగీత నాటక ఎకాడెమీ, సాహిత్య ఎకాడెమీ బహుమతులు లభ్యమవ్వడమే కాక అంధ్రదేశంలో పలుచోట్ల విరివిగా ప్రదర్శింపబడింది.
అలాగే శ్రీ సి. యస్. రావు రచన "ఊరుమ్మడి బతుకులు" నాటికరచనలో ఓ కొత్త ఒరవడిని సృష్టించడమేగాక Art film గా తయారై అఖిల భారత స్థాయిలో ప్రథమ బహుమతినందుకొంది.

యం. వి యస్. హరనాథరావు "జగన్నాథరథ చక్రాల్", "క్షీరసాగర మథనం", "అంతంకాదిది ఆరంభం", "యక్షగానం" రచనల ద్వారా Reactionary Plays రాసి ప్రయోగించడంలో సిద్ధహస్తుడనిపించుకున్నారు.

యండమూరి వీరేంద్రనాథ్ "చీమకుట్టిన నాటకం" ద్వారా తెలుగు పోటీనాటకంలోని కుళ్ళునీ చవకబారుతనాన్ని బహిర్గతం చేశాడు. ఈ నాటిక రచన ద్వారా ప్రయోగం ద్వారా అనేకమంది రచయితలు ప్రయోక్తలు నటులు ..బుజాలు తడుముకు న్యరు, పద్ధతులను మార్చుకున్నారు. (చీమకుట్టిన నాటకం

క్రంతే ఓ దశాబ్దం ముందు డాక్టర్ గంగాధరరావుగారు యిలాంటి ప్రయోగం తమ ''పోటీ నాటకం" ద్వారా చేసి కృతకృత్యులయ్యారు.) ఈ రచయిత మృణాల్ సేన్ "మృగయా" ద్వారా ప్రాభావితుడై రాసిన నాటకం "ఆర్తి" పోటీ నాటకాల స్థాయికి ఎదగలేని కారణంగా ఎంత ప్రయోగాత్మకమైన నాటకమైనప్పటికీ ఎలా ఎక్కువ ప్రదర్శనలకి నోచుకోలేదో తెలియజెప్పటానికి ఒక ఉదాహరణ.

పీటర్ షాఫర్ ఇంగ్లీషు నాటకం "బ్లాక్ కామెడీ" ఆధారంగా రాయబడ్డ నాటకం "డామిట్ కథ అడ్డం తిరిగింది '' వస్తువు దృష్ట్యా Restoration comedy of manners ని సూచించే నాటకం. శిల్పం దృష్ట్యా పెద్ద సంచలనాన్ని సృష్టించిన నాటకం. ప్రేక్షకులకు చీకటైతే, పాత్రలకు వెలుగు, పాత్రలు వెలుగులోఉంటే ప్రేక్షకుల దృష్ట్యా చీకటి అన్న విషయాన్ని establish చేసింతర్వాత వెలుతురు వుండీ లేనట్లు నటించడం is a new challenge to the actor and director. ఈ అవకాశం నటుడికీ దర్శకుడికీ కల్గించిన నాటకం "డామిట్ కథ అడ్డం తిరిగింది"

ఇదే రచయిత రాసిన ''కుక్క" (తెలంగాణా మాండలికం) కొన్నివందల ప్రదర్శనలివ్వబడి చాలా పాప్యులర్ నాటికగా తయారైతే ''నిశ్శబ్దం నీకూ నాకూ మధ్య" (ఇనెస్కో CHAIRS ఆధార్యంగా రాయబడ్డ నాటిక) ప్రేక్షకులను చేరలేకపోయింది.

1973లో ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక ఎకాడెమీ స్పెషల్ ఆఫీసర్ శ్రీ కె. ఆర్. పరమహంస ఆదేశం మేరకు ఎకాడెమీ ఆధ్వర్యంలో యీ వ్యాసకర్త నిర్దేశకత్వంలో ఆరువారాలపాటు నడిపిన ''థియేటర్ వర్క్‌షాప్'' ద్వారా వెలుగులోకి వచ్చిన నాటకం ''త్రిజాకీ యమదర్శనం". 40 మంది ఔత్సాహికులకు నాటకరంగంలోని అన్ని శాఖల్లోనూ వర్క్‌షాప్ శైలిలో శిక్షణ యివ్వడమేగాక ఆ కాలంలో యీ నాటకం అభ్యసించబడి ఆంధ్ర దేశంలోని వివిధ ప్రాంతాల్లో పన్నెండుసార్లు ప్రదర్శించబడింది. ఈ ప్రదర్శనలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సబ్సిడీనిచ్చి ప్రోత్సహించింది. గత ఇరవై ఏళ్ళలో 40 మందికి పైగా నటులు పాల్గొన్న రెండు మూడు నాటక ప్రయోగాల్లో ఇది ఒకటి. ఈ నాటకం తర్వాత వచ్చిన అంగర సూర్యారావుగారి రచన ''చంద్రసేన'' పలుసార్లు విజయవంతంగా ప్రదర్శింపబడడమే గాక ఉత్తమనాటకంగా యీ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడెమీ బహుమతినందుకొంది ''మృచ్ఛకటిం" నాటకం ఆనాటిస్థితిగతులు ఆనాటివేషభాషల్లో చెబితే యీరెండు నాటకాలు యీనాటి స్థితిగతుల్ని ఆనాటి వేషభాషల్లో చెప్పడం ఒక విశిష్ట ప్రయోగం.

సంగీత నాటక ఎకాడెమీ థియేటర్ వర్క్‌షాప్ కార్యక్రమం ద్వారా తెలుగుదేశం నాటక ప్రయోగంలో రంగోద్దీపనానికి వున్న ప్రాముఖ్యాన్ని మొట్టమొదటి సారిగా గుర్తించింది. గత ఆరేళ్ళల్లో రంగోద్దీపనంలో తెలుగు దేశంలో సాధించిన ప్రగతికి యీ వర్క్‌షాప్ నాందీ వాక్యం పలికింది.

ఈ సంవత్సరంలో మొట్టమొదటిసారిగా బెర్టోల్ట్ బ్రెఖ్ట్ నాటకం ''EXCEPTION and the RULE"ని శ్రీ డి. ప్రభాకర్ తెలుగులోకి స్వేచ్ఛానువాదం చేయగా విద్యానగర్ కల్చరల్ ఎసోసియేషన్ వారిచే ప్రదర్శింపబడింది. [గుంటూరులో ఓ దశాబ్దం క్రితం ప్రదర్శింపబడ్డ Good women of Setznan తెలుగుసేత ''మంచిమనిషి'' లెక్కలోకి తీసుకుంటే బ్రెఖ్ట్‌ని తెలుగులో ప్రదర్శించడం యిది రెండోసారి] బ్రెఖ్ట్ శైలికి కావలసిన ప్రయోగపు అవసరాలు దృష్టిలో ఉంచుకుని రాయబడి ప్రదర్శింపబడ్డ నాటకం యిది. ఇంత ఆలస్యంగానైనా బ్రెఖ్ట్ నాటకం తెలుగులో వెలుగుచూడ్డం ఒక healthy symptom. Nativity ని దృష్టిలో ఉంచుకుని తెలుగు చేయబడ్డ యీ నాటకాన్ని చదివి శ్రీ శ్రీ లాంటి మహాకవి ప్రభావితుడై యీ నాటక ప్రయోగం కోసం కొన్ని

గేయాల్ని రాయడం ఓ విశేషం. దీనికి ఆద్యులు గరిమెళ్ళ రామమూర్తి, డి ప్రభాకర్‌లను యీ సందర్భంలో ప్రశంసించక తప్పదు.

హిందీ, మరాఠీ, బెంగాలీ నాటకరంగాల జోలికి పోకుండా దక్షిణాదిన ఉన్న కన్నడ నాటక రంగంతో మనం పోల్చుకుని చూసుకుంటే వారికంటే మనం ఓ అడుగు వెనక వున్నామో ముందువున్నామో తెలుసుకోవడం అవసరం అనుకుంటాను.

కన్నడ నాటక రంగానికి ఆద్యుడయిన ఆద్య రంగాచార్య యీనాటికీ 75 ఏళ్ళ వయసులో యీనాటి సామాజిక స్థితిగతుల్ని దృష్టిలో ఉంచుకుని నాటకాల్ని రాయడం, National School of Drama లాంటి విద్యాలయంలో సుశిక్షతులైన ఓ డజనుమంది గ్రాడ్యుయేట్లు కన్నడ నాటకరంగంలో active గా కృషిచేయడం, నటుడిలో దర్శకుడిలో DISCIPLINED APPROACH ఉండడం కన్నడ నాటక రంగంలో చూస్తున్నాం. National School of Drama లో చదివిన ఏ నటుడు, ప్రయోక్త తెలుగు దేశంలో లేడు సరికదా ఉన్న ఏ ఒక్కరో యిద్దరో భుక్తి కోసం ఆంధ్రదేశం ఎల్లలు దాటి వెళ్ళిపోయారు. అమెరికాలాంటి ప్రగతిని సాధించిన దేశాల్లో సుశిక్షితులై తిరిగివచ్చిన వారు తెలుగు దేశంలోఉండి కూడా యిటు సినిమారంగానికో అటు ఇంగ్లీషు నాట కరంగానికో చేరువయ్యారు.

తెలుగు నాటకరంగానికి NEW LOOK, NEW IMAGE రావాలంటే సుశిక్షితులైన కార్య దీక్షగల ప్రయోక్తల అవసరం యీనాడు తెలుగు దేశంలో ఎంతైనా వుంది. *



# తెలుగు ఏకాంకిక:
# పుట్టుపూర్వోత్తరాలు

పోరి విజయరాఘవరెడ్డి

దాపు ఏబది సంవత్సరముల క్రితం వెలువడిన
తెలుగు ఏకాంకిక వికాసమునకు, అంతకు
దు పరిపూర్ణ వికాసము చెందియుండిన తెలుగు
కము, రంగస్థలము అత్యధికముగా సహకరించి
తెలుగు ప్రదేశమున రంగస్థల నాటకముల
ంకకు, వికాసమునకు పారశీ నాటక కంపెనీలు
కముగా తోడ్పడినవి. ఈ నాటక కంపెనీలు
రాష్ట్ర, కర్నాటక ప్రదేశముల నుండి గత
ద్దపు ఉత్తరార్ధాన ఆంధ్రప్రదేశమున ప్రవేశించి
. ఈ కంపెనీల ద్వారా మరాఠీ, కన్నడ భాష
ప్రదర్శింపబడు, సఫల నాటకాలు ఆంధ్ర నవ
వకులను తెలుగులో నాటకములు వ్రాయుటకు
దర్శించుటకు ప్రేరేపించెను. ఈ ప్రేరణకు
థమ ఫలితమా అన్నట్లు 1860న శ్రీ కోరాడ
యచంద్రశాస్త్రిగారి "మంజరీ మధుకరీయం"
ుగున వెలువడెను. 1860 నుండి ఇప్పటివరకు
ఈ సుదీర్ఘకాలమున తెలుగు నాటకము, రంగ
ము అనేక క్రొత్త ప్రయోగముల ద్వారా, ప్రజ
అనన్య ఖ్యాతినార్జించుకొన్నది. పాఠశాల
్యార్థి మొదలుకొని ప్రధానోపాధ్యాయునివరకు,
లేజి స్టూడెంటు మొదలుకొని ప్రొఫెసరు, విశ్వ
విద్యాలయ రిజిస్ట్రారువరకు, ముద్దాయి మొదలు
కొని వకీలు, హైకోర్టు చీఫ్ జస్టిస్ వరకు, సామాన్య
ప్రజ మొదలుకొని జమీందారు, ముఖ్యమంత్రివరకు
సంఘమందలి ప్రతివర్గపు సభ్యులు తెలుగు నాటక
రచనయందు, నాటకాభినయమందు ప్రధాన పాత్ర
వహించి పాల్గొనిరి. యునెస్కో ద్వారా 1960
ప్రాంతమున జరిపించిన యొక సర్వే లెక్కల ప్రకారం
ఆంధ్రప్రదేశమునందు వెయ్యికి పైగా నాటక
కంపెనీలు పనిచేయుచున్నవి. ఆరువేలకు పైచిలుకు
రంగస్థల కళాకారులున్నారు. ప్రదర్శించుట కర్హ
ములగు నాటకములు రెండువేలకు పైనున్నవి.
ఇలాంటి దివ్యమైన పృష్ఠభూమి కలిగియున్న తెలుగు
ఏకాంకిక గత ఏబది సంవత్సరాలలో తన్ను తాను
ఏ విధంగా తీర్చిదిద్దుకొన్నది, ఎట్లు అలంకరించు
కొన్నది, ఏయే తొడుగులు తొడుగుకొన్నది, ఏయే
తత్వములను తనయందు జీర్ణించుకొన్నది, ఎట్లు
తెలుగు పాఠకులను ప్రేక్షకులను రంజింపచేసినది
మొదలగు నీ వృత్తాంతము అంతులేనిది. ఈ వృత్తాం
తములన్ని తెలియజేయుటకు ఇచ్చట సాధ్యముగాదు.
కావున తెలుగు ఏకాంకిక ప్రవృత్తి గత విశిష్టతల
సంక్షిప్తమైన రూపు రేఖలను, తెలుగు ఏకాంకిక

యందలి కొన్ని క్రొత్త ప్రయోగములను మాత్రమే ఈ ఉపన్యాసమునందు చర్చింపదలచుకొన్నాను.

తెలుగులో ఉన్నట్లుండి 1920 ప్రాంతమున ఏకాంకిక ఊడిపడలేదను విషయం ఇచ్చట గుర్తింప వలసినది. 1920నకు పూర్వము కూడ తెలుగులో ఏకాంకికలు వెలువడినవి. కానీ అవి వర్తమాన ఏకాంకిక పరిభాషలో సంపూర్ణముగా ఇమడవు. అందువల్ల 1920నకు ముందటి కాలమును ఏకాంకిక పూర్వయుగము లేదా ప్రారంభయుగ మనుకొని తెలుగు ఏకాంకిక సాహిత్య చరిత్రను ఈ క్రింది విధంగా విభజింపవచ్చును.

1. 1900 నుండి 1920 వరకు – పూర్వయుగము (లేదా) ప్రారంభయుగము
2. 1920 నుండి 1929 వరకు – ప్రథమదశ
3. 1929 నుండి 1943 వరకు – ద్వితీయదశ
4. 1943 నుండి 1960 వరకు – తృతీయదశ
5. 1960 నుండి ఇప్పటివరకు – సమకాలీనయుగము.

ప్రారంభయుగమున శ్రీ వీరేశలింగం పంతులు గారు సాంఘికోద్ధరణను దృష్టియందుంచుకొని కొన్ని ప్రహసనములు వ్రాసిరి. వీరి ప్రహసనములందు ఆంగ్లభాషా నాటకాల ఛాయలు కూడగలవు. పంతులు గారి సమకాలికులగు శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు సంస్కృతమునుండి కొన్ని ప్రహసన ములను, వ్యాయోగములను ఆంధ్రీకరించి తెలుగు వారికి సంస్కృత ప్రహసనములను పరిచయము చేసిరి. వీరి రచనలలో 'నరకాసుర విజయ' వ్యాయో గము ముఖ్యమైనది. శిల్ప సౌందర్యము దృష్ట్యా ఈ కాలపు రచనలు అధిక ప్రసిద్ధములు కావు. ఇదే కాలమున తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు కొన్ని ప్రహసనములు వ్రాసిరి. శాస్త్రిగారి "పద్మావతి చరణచారణ చక్రవర్తి" అధిక ప్రసిద్ధమైనది. చారిత్రిక పౌరాణిక ఇతివృత్తము లను తీసికొని రచనలు గావించినప్పటికిని శాస్త్రిగారు తమ ప్రహసనములకు యొక క్రొత్తదనము చేకూర్చు టకు ప్రయత్నించిరి.

ప్రథమ దశయందు మద్రాసు హైకోర్టు ప్రథమ భారతీయ ప్రధానన్యాయ మూర్తియగు డా॥ పి. వెంకట రాజమన్నారు, చింతా దీక్షితులు, అబ్బూరి రామకృష్ణా రావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, గుడిపాటి వెంకట చలం, ముద్దుకృష్ణ మొదలగువారు సాంఘిక ఇతి వృత్తములను తీసికొని ఏకాంకికలు రచించిరి. వీరి ఏకాంకికలు, నవీన ఏకాంకి నాటకాల పరిభాషలకను గుణంగా యున్నవి. రాజమన్నారు సంపాదకత్వాన వెలువడిన "కళ", ముద్దుకృష్ణగారి 'జ్వాల' పత్రికలు ఏకాంకిక రచనలకు అధికముగా తోడ్పడినవి. 'రాజ మన్నారు' వ్రాసిన "తప్పెవరిది?" తెలుగులో వెలు వడిన మొదటి సఫల ఏకాంకికగా పేరుపొందినది. భాషా సౌష్ఠవమునకు, తెలుగు నుడికారమునకు "చింతా దీక్షితుల" ఏకాంకికలు అధికముగా ప్రసిద్ధి కెక్కినవి. వీరి "చక్రవాక మిధునము" ఇందుకు తార్కాణము. పౌరాణికతతో, కల్పనాశీలత సమ్మిశ్రణ మునకు శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారి ఏకాంకి కలు అనుపమ ఉదాహరణములు. సుకోమల రచనా కౌశలము, సుమధురభావ తీవ్రత, వాతావరణ నిర్మాణచాతుర్యము మొదలైన వైశిష్ట్యములవలన వీరి "నదీ సుందరి", "మేల్బంతి" మొదలగునవి ఈనాడుకూడ ప్రదర్శింపబడుచున్నవి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "కలంపోటు" ప్రేక్షకులను అధికముగ ఆకర్షించిన ఏకాంకికలలో ఒకటి. చలం గారి వ్యక్తిత్వము, వారి రచనలు వివాదాస్పదము లైనవి. వీరు తమ రచనలయందు ఫ్రాయడీయ మనోవిశ్లేషణమునకు అనుగుణంగా సెక్సుకు ప్రధాన స్థానమిచ్చిరి. వీరు హెడోనిజమ్ ప్రచారకులని కొందరి వాదన. శారీరక మానసిక పరిధులను దాటి ఆధ్యాత్మిక దశయందుకూడ వీరు హెడోనిజమ్‌ను

ంచిరి. ఈ దశయందు వీరు వ్రాసిన ఏకాంకి ముఖ్యమైనవి "శివం", "చిత్రాంగి", "హరి ద" మొదలగునవి.

ండవదశ తెలుగు ఏకాంకిక సాహిత్యమందు విధంబుల మహత్వపూర్ణమైనది. 1929 వరకు ధ రంగస్థలమునందు ఒక విధమైన అవరోధక ఏర్పడినది. తమ పురాతన పరంపరానుగుణంగా ూక్టు నాటక కంపెనీలు నిమ్నస్థాయిలోని ుక నాటకములను, ఏకాంకికలను ప్రదర్శించు డివి. ఈ సంవత్సరమందే విశ్వ విఖ్యాత శిరోమణి "బళ్ళారి రాఘవాచార్యులు" విదేశయాత్ర నుండి ఆంధ్రదేశమునకు తిరిగి రి. విదేశాలలో గ్రహించిన తన అపూర్వాను ల ఆధారంగా వారు ఆంధ్ర రంగస్థలమున త్త ఉద్భావనలను ఆవిష్కరించిరి. ఉత్తమ కాలను, ఏకాంకికలను వ్రాయుటకు, పురి ప్పుటకు రచయితలను, రంగస్థల కళాకారులను త్సహించుటకు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు ృతుల ప్రయత్న ఫలితంగా 1929న ఆంధ్ర క కళా పరిషత్తు స్థాపించబడెను. అప్పటినుండి త్తు ప్రతి సంవత్సరము పలుచోట్ల నాటక, ంకికల పోటీలు ఏర్పాటుచేయుచు వచ్చెను. వీటి అనేక అమెచ్యూరు నాటక కంపెనీలు వెలు టయేగాక వందలకొలది క్రొత్త క్రొత్త నాటక ు, ఏకాంకికలు రచింపబడి ప్రదర్శింపబడటొడం . కొంతకాలము తర్వాత పరిషత్తు అధ్వర్యాన ట్యకళ" అను పత్రిక వెలువడెను ఇప్పుడు నాట్య ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమి తరపున సపత్రికగా వెలువడుచున్నది. 'నాట్యకళ' అనేక త్తరచయితలను, క్రొత్త రచనలను వెలుగులోనికి ెను.

ఈకాలపు ఏకాంకికలపైన ఆంగ్ల ఏకాంకికల భావము అత్యధికము. ఆంగ్లము నుండి కొన్ని ఏకాంకికలు అనువదింపబడెను. ఇబ్సన్, మొరిస్, మెటర్‌లింగ్, గోగోల్ మొదలగు నాటకకారులను అనుకరించి అనేక రచయితలు సాంఘిక దురాచారాలను వ్యంగ్యాత్మక దృష్టితో అనేక ప్రభావోత్పాదకములగు ఏకాంకికలు వ్రాసిరి. 'దొంగాటకము', 'దొంకలో షరాబు', 'వైవాహికము', 'సంసారము' మొదలగు అనేక నాటికలు ఈ కోవకు చెందినవిగా పరిగణింపబడుచున్నవి.

ఈ కాలమందే తెలుగులో రేడియో ఏకాంకికలు అవతరించెను. ముద్దుక్రిష్ణ వ్రాసిన 'అనార్కలి' ప్రథమ తెలుగు రేడియో ఏకాంకికగా పేరుపొందినది. ముద్దుక్రిష్ణగారి ననుసరించి ఈ కాలమున అనేకులు రేడియో ఏకాంకికలను రచించిరి. భావకవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు సుకోమల భావములతో కూడిన "ధనుర్దాసు" మొదలగు ఏకాంకికలను వ్రాసి రేడియో ఏకాంకికలకు యొక క్రొత్తమార్గమును చూపిరి. ఈ దశయందే శ్రీ బాలాంతరపు రజనీ కాంతరావు 'చండీదాసు' వ్రాసి గేయ ఏకాంకికలకు శ్రీకారము చుట్టిరి.

ఎన్నోచోట్ల ప్రదర్శింపబడి అనేకుల మన్ననలను పొందిన 'బుచ్చిబాబు' గారి 'తిష్యరక్షిత' 'ఉమర్ ఖయ్యాం' చారిత్రక ఘట్టములను తీసికొని వ్రాసిన ఏకాంకికలు. మరియు ఇదే కోవకు చెం న శ్రీ ఆమంచర్ల గోపాలరావుగారి "మల్లమదేవి ఉసురు" ఈ దశలో వెలువడిన మహోన్నత రచన.

ఈ కాలముననే తెలుగున సాంకేతిక ఏకాంకికలు కూడ వెలువడెను. చలంగారి 'మృత్యువు' ఈకాలపు సాంకేతిక ఏకాంకికలో అగ్రస్థానము వహించెను. దుర్యోధనుని భార్య భానుమతిని ముఖ్యపాత్రగా గైకొని చలంగారు వ్రాసిన "భానుమతి" ఏకాంకికలో భానుమతి ద్రౌపదికంటే ఉత్తమురాలిగా చిత్రించబడింది. ఆమె స్త్రీజాతి ముక్తికొఱకు ప్రయత్నిస్తూ

పురుషుల పాశవిక బంధములనుండి స్త్రీని ఉద్ధరించుటకు ఉద్బోధిస్తుంది. జి. వి. క్రిష్ణారావు గారి "భిక్షాపాత్ర", డా. చిలుకూరి నారాయణరావుగారి 'అశ్వత్థామ', గోరాశాస్త్రిగారి "దూర తీరాలు", పాలగుమ్మి పద్మరాజుగారి "ఖూనీ", మల్లాది అవధానిగారి "ఖడ్గతిక్కన" మొదలగునవి ఈ కాలపు ఏకాంకికలలో ప్రదర్శింపబడి ప్రజల మన్ననల నందుకొన్నవి.

తెలుగు ఏకాంకిక సాహిత్యమున తృతీయ దశ ఒక విధమైన క్రాంతినే లేవదీసిందని చెప్పవచ్చును. ఈ దశయందలి ప్రథమ సంవత్సరమే ఏకాంకిక రచనా ప్రక్రియయందు, అభినయ కళయందు గొప్ప మార్పువచ్చెను. 1942వ సంవత్సరమున జపానుద్వారా విశాఖపట్టణముపై బాంబులు వేయుట వలన ఆంధ్ర విశ్వవిద్యాలయము అక్కడనుండి గుంటూరు తరలింపబడింది. అంతకుముందే గుంటూరు పట్టణము నాటక ఏకాంకిక రచనలయందు ముందడుగు వేసి యుండెను. విశ్వ విద్యాలయము అక్కడికి తరలింపబడుటచే నాటక, ఏకాంకిక రచనా ప్రదర్శనములు చాలా ఎక్కువయ్యెను. అభినయకళా మర్మజ్ఞులు అనేక నాటక, ఏకాంకికల సంకలనకర్తయగు అప్పటి విశ్వవిద్యాలయపు రిజిస్ట్రారు డా. కూర్మా వేణుగోపాలస్వామి గారి ప్రయత్నమూలంగా కాలేజీలలో నాటక ఏకాంకిక రచన మరియు అభినయ ప్రతిస్పర్థలు ప్రారంభింపబడెను. పట్టణములలో ఈ విధముగా ఏకాంకిక రచనా ప్రదర్శనలు జరుగుచుండగా ఇటు డా. రాజారావుగారి నేతృత్వమున ప్రజానాట్య మండలాలు గ్రామీణ ఇతివృత్తముల నాధారముగా గైకొని రచించిన ఏకాంకికలను ప్రదర్శించుచూ గ్రామసీమలయందు ప్రవేశించెను. ఈ కారణంగా ఈ దశయందు ఆంధ్రప్రదేశమందు కాలేజీలందు ప్రతి చిన్న పెద్ద పట్టణములందు రజన్లకొలది నాటక కంపెనీలు, రంగస్థలాలు, ఏకాంకిక రచయితలు పనిచేయుచుండిరి. ఇదేవిధంగా దరిదాపు పది పదిహేను గ్రామాలలో ఒక్కొక్క రంగస్థలము స్థాపించబడి కొన్ని నాటకసమాజాలు కొంతమంది రచయితలు ఉదయించిరి. గ్రామ ప్రజలలో రాజనైతిక, సాంఘిక చైతన్యమును పురికొల్పుటకై రచించబడిన నార్ల వెంకటేశ్వరరావు గారి ఏకాంకికలు గ్రామాల్లో అధికప్రచారము లోనికి వచ్చెను. వీరి పదునాల్గు ఏంకాకిక నాటికలు 'కొత్తగడ్డ'యను సంకలనమున సంకలింపబడినవి. ఇవి "నయీ ధరితీ" యనుపేరున హిందీలోనికి అనువదింపబడి ప్రచురింపబడినవి.

శిల్పద్రష్టాయేకూడ నార్లవారు ఏకాంకికలందు క్రొత్త ప్రయోగములు చేసిరి. వీరి 'ప్రారబ్ధం' 'శకునపక్షి', 'భంగపాటు' మొదలగు ఏకాంకికలు అనేకచోట్ల ప్రజలచేత వేనోళ్ళ పొగడబడినవి. ఇక్కడ ప్రత్యేకంగా గుర్తుంచుకోవలసిన ఏకాంకికల్లో ముదిగొండ లింగమూర్తిగారి "వెంకన్న కాపురము" అత్యంతప్రముఖమైనది. కథా విశిష్టత కారణంగా ఇది పల్లెలందు, పట్టణములయందు సమాన ఖ్యాతి నార్జించుకొన్నది.

ఈ కాలముననే ఆచార్య ఆత్రేయ ఏకాంకికలను వ్రాసి యొక ప్రత్యేక స్థానము నేర్పరచుకొనెను. మార్క్సిజంను ప్రచారముచేయుట ముఖ్యలక్ష్యంగా ఉంచుకొని వీరు ఇరువదివరకు ఏకాంకికలను రచించిరి. ఇవి శోషిత ప్రజలలో అధిక ప్రచారము లోనికి వచ్చెను. ఆత్రేయగారు స్వతహా, మంచి అభినేత. వీరు "ఎవరుదొంగ" యను నాటక ప్రదర్శనలో యొక క్రొత్త ప్రయోగమును ప్రవేశపెట్టెను. ఇందులో దొంగ పాత్రధారి రంగస్థలము నుండి పారిపోయి దర్శకులలో తలదాచుకొనును. ఈ విధంగా ప్రత్యేక దర్శకుడు కూడ ఆ నాటక

యగును. ఆత్రేయ చూపిన మార్గము కొంతమంది నవయువకులు నూర్లవరకు రచించిరి. పినిశెట్టి, అనిశెట్టి, బెల్లం మదాసు, వేదాంతకవి, డి. వి. నరస దలగువారు ఆత్రేయ స్కూలు రచయిత రిగణింపబడుచున్నారు. 'మా వూరు', కలు', 'పల్లెటూరి పడచు', 'స్త్రీ', యన్న', 'ఆకలి' మొదలగునవి ఈ రి ఏకాంకికలలో గణనీయమైనవి. ఇదే న డా. రాజమన్నారుగారి 'నాగుబాము', గవాళ్ళు ?", 'వయ్యాల లంక' మొద ంకికలు చాలా ప్రఖ్యాతిగాంచినవి. ఇదే తెలుగున కొన్ని ఏకాంకికల సంపుటములు చురింపబడెను. 'భారతి', 'స్వాతి', త్రిక' మొదలగు పత్రికలనేకముగా ఏకాంకి మరించి ఏకాంకి సాహిత్యాభివృద్ధికి అధిక కరించినవి.

యందే తెలుగు ఏకాంకిక తన హద్దుల చి తన పరిధిని విస్తృతము జేసుకుంటూ ములందు ప్రవేశించెను. రచనా ప్రయోగ కూడ ఈ నవీనత కనుపించెను. దీని పరి తెలుగున అనేక ఏకపాత్రాభినయ నాట్యరూపకములు, ధ్వనిరూపకములు, రూపకములు, సాంకేతిక ఏకాంకికలు, ఏకాంకికలు, సాంకేతిక రేడియో మొదలగునవి వెలువడెను. ఈ విధమగు ప్రాయువారిలో కొప్పరపు సుబ్బా ఆరుద్ర, రజనీకాంతరావు, క్రిష్ణమూర్తి, . గిడుతూరి సూర్యం, తిలక్, బోయి నారాయణరెడ్డి, పోతుకూచి సాంబశివ ఖ్యులు.

సమయమునసే మహాకవి శ్రీ శ్రీ వస్తుగత ల్పగతములైన క్రొత్త క్రొత్త ప్రయోగ ములద్వారా ఏకాంకిక సాహిత్యమున ఒక క్రాంతిని లేవదీసెను. శ్రీ శ్రీ ఏకాంకికలలో సర్ రియలి జమ్, బేర్టాల్ట్ లు బ్రెక్ట్ ప్రతిపాదించిన నాట్య సిద్ధాం తముల ప్రయోగములు కానవచ్చును. ఈ ఏకాంకికల వాటి ప్రదర్శన ప్రయోజనములందే కాదు, వాటి రూప శిల్పములందుకూడ అమూలపరివర్త నపు స్థితి ఏర్పడినదనిన, సత్యదూరముకాదు. వీరి కొన్ని ఏకాంకికలు ఏ ఇజమునకు సంబంధించినవి కావు. ఒకవిధమైన క్రొత్తదనము estrangement లేదా Making strange స్థితి వీటిలో చూడ నగును. ప్రయత్నపూర్వకంగా అజ్ఞానతావస్థలోనికి చొరబడుట వీటియందు ఒక ప్రత్యేకలక్షణంగా కనుపించును. రజ్జు-సర్ప భ్రాంతిని మార్చిన, ఏ స్థితి ఏర్పడునో ఆ స్థితిలోనికి తీసికొనిపోయి ఏ వస్తువునైనను నిరీక్షించుట పరిశీలించుట వీనిలో ప్రేరేపింపబడినవి.

ఐక్యత్రయము (Three unities) మొదలగు అన్యోన్య శిల్పముల ద్వారా, ప్రేక్షకులను, పాఠకు లను ఏకాంకికలయందు, వాని పాత్రలయందు తల్లీనులై, తన్మయత్వముజెందు స్థితినుండి బైటకు లాగి హార్దిక, అహ్లాదప్రాప్తినుండి విముక్తుల గావించి వారిని బౌద్ధిక చింతనాయుతులు గావించు టకు, ప్రేరేపించుటకు ఇవి సహకరించును. ఈ స్థితియందు ప్రవేశించినపుడు పాఠకులుగాని ప్రేక్ష కులుగాని ఏకాంకికల సంఘటనలను యుక్తాయుక్త ముగా వివేక్షించి వానిపై తమ అకాట్య నిర్ణయ ములను తెలుపగలరు. సాధారణీకరణము ద్వారా రసానుభూతిని కల్గించుటకు బదులు బౌద్ధిక శక్తులను ప్రేరేపించుట వీనియందు కాననగును.

సంవాదముల పునరుక్తి, మధ్యమధ్యలో గేయ ములను ప్రవేశపెట్టుట, ప్రేక్షకులను సంబోధించుట, మానవత్వపు నగ్నసత్యాలను బట్టబయలుజేసి వాటి పైన సరియైన అభిప్రాయాలను వెలిబుచ్చుట వీని యందు కాననగును.

శ్రీశ్రీ గారు వ్రాసిన ఏకాంకికలు మొత్తం పదకొండు. ఇవి యన్నియు రేడియో కొఱకు వ్రాసినవే. అయినప్పటికిని వీటిలో కొన్ని రంగస్థలములందుగూడ ప్రదర్శింపబడి మంచిపేరు తెచ్చుకొన్నవి. వీరి ఏకాంకికలను మూడు వర్గములుగా విభజింపవచ్చును.

1. కావ్యాత్మక ఏకాంకికలు, 2. అభ్యుదయ, యదార్థవాదములకు సంబంధించినవి. 3. అలౌకికములై బ్రేక్టు సిద్ధాంతాలను అనుసరించినవి.

మొదటి భాగములో పేర్కొనదగినవి. 1. సుప్తాస్థికలు 2. వంటరిబావి 3. భూతాల కొలిమి.

సుప్తాస్థికలలో మూడు పాత్రలు కలవు. అవి సంధ్య, అంధకారము, నక్షత్రము. ఇవి మృత్యువు విలాశ, ప్రేమకు సంకేతములు. గాంధీజీ మృత్యువును ఇతివృత్తముగా గ్రహించి ఈ ఏకాంకిక వ్రాయబడింది. దీనిలో గాంధీజి మృత్యువు హింసా-అహింసల మధ్యనున్న యుద్ధముగా చిత్రించబడినది.

"వంటరిబావి" లో సంఘముచేత, నిష్కారణముగా అపనింపలపాలైన పది సంవత్సరముల యొక బాలిక చిత్రించబడినది. ఇందులో బావి పాత్ర చాల భయంకరంగా బీభత్సకరంగా వర్ణింపబడినది.

"భూతాల కొలిమి" లో హత్య గావింపబడిన, ప్రియుని పిలుపుగొని దృఢనిశ్చయురాలై ఎందరడ్డగించినా ఆగక నిర్భయంగా శ్మశానవాటికకు పరుగిడిపోవు ప్రియురాలికథ ఇతివృత్తంగా తీసికొనబడినది. ఆ ప్రియురాలి మనోవేగములు, ఆ మనోవేగములననుగమించి ఆమె నడక, ఆమె నడకవలె ఈ ఏకాంకిక నడచినది.

రెండవ విభాగములో 1. గవేషణ 2. విదూషకుని ఆత్మహత్య 3. గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు 4. గుమస్తాకల 5. మరోప్రపంచంను చేర్చవచ్చును. వీనిలో మానవతను మానవత్వము వలె నడచుకొనవలయుననియు ఎల్లప్పుడు ఇతరులను నవ్వించు విదూషకుని హృదయవిదారక స్థితి, వాని ఆత్మహత్య - ఒక గుమస్తా ఒకనాడు రాత్రి కలలో అమెరికాలో తన సన్మానము, జర్మనీ సబ్‌మేరికలో కమాండర్‌గా తన అధికారము, ఒక విశ్వసుందరిలో తన ప్రణయకలహమువంటి మధురానుభూతులను గనుట, కానీ మధ్య మధ్యలో భయమువలన వాటి సంతోషానందమును అనుభవించలేకపోవుట, ఉద్యోషం, 21 వ శతాబ్దాన భావి మానవుని స్థితి మొదలగునవి మార్మికముగా చిత్రింపబడినవి.

1. చతురస్రము, 2. అనంతరయాత్ర, 3. బలి, మూడవ శ్రేణికి సంబంధించిన ఏకాంకికలు. శ్రీశ్రీ చతురస్రమునకు 1 + 1 = 1 అనికూడ పేరు పెట్టుటయేగాక తన ఏకాంకిక సంపుటములకు గూడ ఆ పేరే పెట్టెను. చతురస్రములో నాలుగు పాత్రలున్నవి 1. జ్ఞానము-డెబ్బది సంవత్సరాల వైజ్ఞానికుడు. 2. రాజ్యం-ఏబది సంవత్సరాల స్త్రీ 3. కళ-పది సంవత్సరాల బాలిక 4. సిరి - ముప్పది సంవత్సరాల కవి. వీరు నలుగురు విజ్ఞానము, రాజనీతి, కళ, కవిత్వమునకు సంకేతములు. వీరి నలుపురితో కలిసి యొక విషమబాహు చతురస్రము ఏర్పడుతుంది. 31-12-1999 న మానవుడు చంద్రమండలమునుండి అమృతము తెస్తాడు. దాన్ని ఇంజెక్షన్ల ద్వారా అందరికి ఇస్తారు. దీనివల్ల ప్రతి వాడు ముప్పది సంవత్సరముల వాడౌతాడు. ఈ విధంగా మునుపటి విషమబాహు చతురస్రము సమబాహు చతురస్రంగా మారుతుంది. కవి వయస్సులో ఎలాటి మార్పురాదు. అతని వయస్సు ముందూ ముప్పది సంవత్సరాలే. ఇప్పుడు కూడా అంతే. ఇందు శ్రీశ్రీ కవిని కాలజయునిగా, మానవుని ద్వారా, కాలమును జయించిన సూచన గావించు ప్రథమ వ్యక్తిగా సృష్టించెను. ఇందు భావతీవ్రత

వ్యక్తపరచుటకు శ్రీశ్రీ రచనా ప్రక్రియను తన దాసిగా చేసుకొనెను. ఈ ఏకాంకికలో ప్రతి అంశము శిల్పచాతుర్యముతో కూడియున్నది

అనంతరయాత్ర కాలాన్ని ఇతివృత్తంగా తీసికొని వ్రాసిన ఏకాంకిక, కాలము ఒకటే. కానీ అది అందరికి సమానముకాదు. సమయమును గురించి ఏర్పడిన జిజ్ఞాస, ఆ జిజ్ఞాస తీరిపోకుండుట ఇందు కలదు.

'బలి' యను ఏకాంకికలో స్వర్గముకంటె నరకము ఉత్తమమని నిరూపింపబడినది. దుష్టులతో కూడిన స్వర్గముకంటె సజ్జనులుండు నరకము మేలని రచయిత అభిప్రాయము.

1960 నుండి మొదలగు నవీనదశలో తెలుగు ఏకాంకిక సాహిత్యమున అనేక క్రొంగ్రొత్త ప్రయోగములు ప్రవేశపెట్టబడినవి. వేలకొలది ఏకాంకికలు ఈ కాలమున రచింపబడినవి, ప్రదర్శింపబడినవి. వీనిలో ఒక సరిక్రొత్త ప్రయోగమునిట ఉల్లేఖించి నేనీ వ్యాసమును ముగించెదను. కుందుర్తి ఆంజనేయులుగారి 'ఆశ' ఏకాంకిక రచనలకు వాని ప్రదర్శనలకు యొక క్రొత్త ప్రయోగమునకు దారి చూపినది. సంపూర్ణముగా 'ఫ్రీవర్స్' లో రచించబడిన ఏకాంకిక 'ఆశ'. దీనిలో మూడు పాత్రలున్నవి. 1. సమయము 2. ఆశ 3. చరిత్ర. తాము కవిత్వములో సంభాషణలు చదువుచున్నామని, వినుచున్నామని పాఠకులు, ప్రేక్షకులు అనుభవించకుండునట్లు వారు ఏకాంకికను చదువుచూ చూస్తుయున్నామని భ్రమ కల్పించునట్లు ఇందు సంభాషణా సన్నివేశములు ప్రవేశపెట్టబడినవి. దృశ్యమాధ్యమును బౌద్ధికమాధ్యముగా రూపొందించుటకు చేసిన ప్రయత్నముగా ఇది తోచును. రంగస్థలమున కిరువైపుల ప్రేక్షకులను కూర్చుండబెట్టి ఒకమారు 'ఆశ' ప్రదర్శింపబడినది. ఇటు ప్రదర్శన రీతిలోకూడ ఇదియొక క్రొత్తదనమునకు దారి చూపినది.

వర్తమాన ఏకాంకిక సాహిత్యములో పొడచూపుతున్న క్రొత్తక్రొత్త ప్రయోగములనుబట్టి చూడ తెలుగు ఏకాంకిక రచయితలకు, ప్రయోక్తలకు, తమ ఏకాంకిక రచనలు, వాటి ప్రదర్శనములు సంతృప్తి కలుగజేయకున్నట్లు తోచుచున్నది. వారు తమ అభివ్యక్తులను పాఠకులు, దర్శకులవరకు సంప్రేషించుటకు ఏకాంకిమాదిరి క్రొత్తదగు, లేదా మరియేదైనా నవీన సాహిత్య రూపాన్వేషణలో నిమగ్నులై యున్నట్లు తెలియుచున్నది. ఇట్టి పరిస్థితులల్లో తెలుగు ఏకాంకిక సాహిత్యము భవిష్యత్తులో అనేక నవీన ఉద్భావనలతో కూడుకొనియుండగలదనుటలో సందేహములేదు. రాబోవు కాలమే దీనికి సాక్షి కాగలదు.



# తెలుగు నాటకం

అత్తిలి కృష్ణారావు

"కళ నిజం కాదు, కళ అబద్ధం చెపుతూ నిజాన్ని బయట పెడుతుంది" అని క్రమ్మెల్ప్ ఉవాచ.

జీవిత ప్రతిబింబమే నాటకం అనే వాదనకు ప్రతి వాదన బహూ తక్కువ. జీవితంలోంచి కళపుడుతుంది అనే వాదనకు అనేకానేక దృష్టాంతాలు అనాదినుంచీ వస్తున్నాయి. వేటాడి జీవనం గడిపే ఆనాటి మానవ మనుగడకు, కళ ఎంతో అవసరమైంది. ఆ వేటాడే కార్యాన్నే ఆదిమానవుడు తీరిక సమయాల్లో తన తోటి మానవులకు ఒక కళగా రూపాంతరీకరించేవాడు. కష్టాలలో, సుఖంలో, ఆనందంలో, అనురాగంలో, హృదయంలో రగిలే వేదనలే కళగా మార్చుకునే వాడు. అనేక రూపాల్లో ఆ బాధల్నీ గాథల్నీ, కన్నీటికథల్నీ చక్కగా శిల్పీకరించుకునేవాడు. జీవితంలో మెదిలే కష్టసుఖాలే కళగా పుడతాయి అనేందుకు, అనాది కళారూపాలు మనకు నిదర్శనం. అలాంటి జీవితం తెలుగు భాషలో 'కన్యాశుల్కం''లో కనిపించింది. అది యివాళకూ ఉత్తమమైన నాటకంగా నిలిచివుంది.

సమాజశ్రేయస్సు దృష్ట్యా నాటకం ప్రదర్శించాలనే వాదనతో ప్రఖ్యాత రచయిత శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులు ఎన్నో నాటకాలు రచించి "సారంగధర" వంటి నాటకాలు 1902 ప్రాంతంలో "సుమనోరమసభ" ద్వారా ప్రదర్శించేరు. అది ఆనాటి సాంఘికాభ్యుదయమే లక్ష్యంగా పెట్టుకొని రచనలు చేస్తున్నారని మనకు తెలుస్తూనేవుంది. అయితే ఆయా రచయితలకు సాంఘిక సంస్కరణపై ఎంతవరకూ సదభిప్రాయం ఉండి నాటకర ప్రదర్శిస్తున్నారు? ఏయే నాటకాలు సాంఘిక సంస్కారాన్ని నిజంగా ప్రతిబింబిస్తున్నాయి? అని ఒక్కసారి ప్రతి నాటక రచయితా, ప్రతినాటక ప్రయోక్తా, ప్రతినటుడూ ఆలోచించడం అవసరం. నాటకం అంటే కిరీటాలు, కృష్ణులూ, చెమ్కీకోటులూ, 'వన్స్‌మోర్' పద్యాలూ అనే అనుకుంటున్నారు. ప్రజలు అలా అనుకోడానికి అవకాశం ఉంది కూడా. ఎందుచేతనంటే ఆ పౌరాణిక నటులూ, ఆ పద్యాలూ, ఆ సంగీతం, ప్రజాహృదయాల్లో కలగలసిపోతూ నాటకాలు ప్రదర్శించేరు. నేటి సాంఘిక నాటకానికి ఆ పరిస్థితి రావాలంటే అదే స్థాయిలో వాళ్ళతో కలసిమెలసి వాళ్ళ కష్ట సుఖాల్ని ప్రతిబింబించే సాంఘిక నాటకాలు ప్రదర్శించనిదే నాటకరంగానికి సామాజిక స్వర్ణయుగం రాదు.

మధ్యతరగతి సమస్యలతోనూ, ఆ తరగతి నటీనటులతోనూ, ఆ తరగతి మాత్రమే నాటకాలు ప్రద

ర్కిస్తూ వస్తున్న మన తెలుగు నాటకరంగం, ఆ బంధాల నుండి విముక్తి పొందాలి. మధ్య తరగతి వాళ్ళు విశ్వసించే ధర్మాలూ, నియమాలూ, డబ్బు, అధికారం పోలీసులూ, సంస్కారం గురించీ నాటకాలు చూపిస్తున్నాం. ఆ కళల్ని భగ్నంచేసే నాటకాలు చూపించడంలేదు. మధ్య తరగతివాళ్ళ ధర్మాలనూ, నగ్న జీవితానికీ ఉండే సంఘర్షణా చూపించే అవసరం ఈరోజున ఎంతైనా ఉంది. ఆ నగ్న జీవితం కావాలంటే కళలో నైపుణ్యం ఉన్న ఏవర్గం వ్యక్తికైనా సమాజంలో కలుపుకొని అతని కళాజ్యోతికి అజ్యం పోసిననాడే అట్టడుగున ఉన్న ప్రజానీకంలోంచి మంచి కళాకారులు రాగలుగుతారు. ఆ వర్గానికి ఈ సమస్యల సమగ్ర స్వరూపం నాటకంగా ప్రదర్శింపజేసిననాడే నాటకం అనే సాంఘిక చైతన్యం ప్రజలలో పుట్టుకొస్తుంది.

"కళ కళకోసమే" అనే వాళ్ళనందర్నీ పలాయనవాదులనాలి. మన కళ్ళల్లో కారంకొట్టి ఒక అందమైన అబద్ధాన్ని సృష్టించి మాయచేయ చూస్తున్నారు అని గ్రహించాలి. అది జీవిత ప్రతిబింబం అని గానీ, జీవిత చిత్రణ అనిగానీ కళమీద అభిమానం ఉన్నవాడు ఎవడూ అనడు.

మానవుడు శిలాయుగం నుంచి బయటపడ్డాడు. సమాజాలు నిర్మించాడు. అనేక కులాలనూ, వర్గాలనూ ఏకంచేసి సామాజిక వ్యవస్థ ఏర్పాటు చేసుకున్నాడు. ప్రకృతి శక్తులను అదుపులోనికి తెచ్చుకున్నాడు. మంత్రాలతో చింతకాయలు రాలవు గనక శాస్త్రీయమైన విధానాలతో సామాజిక కృషిని కొనసాగిస్తున్నాడు. అందుచేతనే యివాళఉన్న వాతావరణంలో కళస్వభావం సాంఘిక ప్రయోజనం వైపు పురోగమిస్తుంది. ఆ ప్రయోజనంతోనే ఈనాటి సాంఘిక నాటకాలు ధారాళంగా ప్రదర్శింపబడుతున్నాయి. అయితే 'ఏ కళనుగానీ ప్రేమించనివాడు ఆ కళ ప్రదర్శించి ఇతరులు దాన్ని ప్రేమించేటట్టు చేయలేడు' అంటారు శ్రీ కొడవటిగంటి. కానీ, ఆ లక్ష్యం లేకుండానే కేవలం బహుమతుల కోసమే ఆరాటపడే నాటక రచయితలూ ప్రయోక్తలూ, నటులూ, ఈనాడు మనకు నిత్య పరిషత్తులో నిలయ విద్వాంసుల్లా కనిపిస్తున్నారు. అందుకు కొంతవరకూ పరిషత్తులు కూడా కారణం. పరిషత్తులకన్నా మరో వేదిక సాంఘిక నాటకానికి లేదనే దురభిప్రాయం కూడా కొంత కారణం ఈ పరిస్థితికి. మరో ప్రాంతంలో తన ప్రతిభను చూపాలని అభిలషించే కళాకారుడికి పరిషత్తులు 'వడ్డించిన విస్తరి' అయితే దాన్నిబట్టి ఏమీ రుజువు కాదు. ఆ నాటకానికి, ఆ నటులకూ, ఆ నాటక రచయితలకూ అనుమానాస్పదమైన కీర్తి తప్ప ఇంకేమీ దక్కకపోవచ్చు. మరో పరిషత్తులో 'విస్తరి' కూడా వేయకపోవచ్చు. అందుచేత ప్రజానీకానికి అర్థం పర్థంలేని నాటకాలు ప్రదర్శించి భయపెట్టడం చాలా అన్యాయం. అది ఒక రకంగా సామాజిక దోపిడీ.

ఈ దోపిడీ నుండి కాపాడవలసిన బాధ్యత ప్రతి కళాకారుడికీ ఉంది. ముఖ్యంగా థియేటర్ ఆర్టిస్టులకు వుంది. ఊసుపోక నాటకాలాడ్డంగానీ, సరదాకి కళాసేవ చేయడం అంటూ ఉండదు. ప్రతి రచయితా, ప్రతి ప్రయోక్తా, నటుడూ తమ కాలాన్ని వృధాగా పాడుచేసుకునేందుకు యిష్టపడరని నేను విశ్వసిస్తాను. అందుచేతనే కళాకారుడు నాటకాలు వేయడం సామాజిక పరమైనదిగా భావిస్తాను.

"సాంఘికదురన్యాయాలను తుడిచిపెట్టేందుకే కళ" అంటున్నాడు ప్రఖ్యాత నటుడు రిచర్డ్ బర్టన్. అందుకు నాటకం కన్నా గొప్ప సాధనం మరొకటిలేదు.

అయితే సరైన నాటకరంగం లేదనీ, ప్రభుత్వం యేమీ చెయ్యడంలేదనీ విచారించి కూచునేకన్నా, ప్రజాసమస్యలను సమగ్రంగా చిత్రించే నాటకాలను ప్రజల దగ్గరకే తీసుకుపోయి ఎందుకు ప్రదర్శించ

కూడదు? మన ప్రాచీన కళాస్వరూపాలు స్వాతంత్ర్యం రాకపూర్వం యిదే ప్రక్రియలో ప్రదర్శించి ప్రజలకు అతి సన్నిహితులయ్యారు. ఆ ప్రజల ఆటపాటలనూ, కష్టసుఖాలనూ, కలగలిపి జక్కులపాటలనీ, జముకుల కథలనీ ప్రక్రియలలోనూ, హరికథలుగా, కొమ్మదాసరులుగా, భామాకలాపంగా, వీధిభాగవతంగా జానపద కళాప్రక్రియల్ని పండిత పామరులు సైతం ప్రభావితమైన ప్రదర్శనలుగా రూపొందినట్లు చారిత్రక సత్యాలు చెప్తున్నాయి. అందుకే ప్రజలని థియేటర్‌కి ఆహ్వానించేకన్నా – థియేటర్ ప్రజల మధ్యకు వెళ్ళి నాటకాలు ప్రదర్శిస్తే ప్రజల్ని సులువుగా నాటకం వైపు ఆకర్షించవచ్చుననీ, ఆలోచిస్తే ప్రతి ఆర్టిస్ట్‌కి యిట్టే తెలుస్తుంది. ఆ విధంగా ప్రదర్శించి ప్రజల అభిమానం, ఆదరణ పొందిన ప్రదర్శనలు ఈమధ్య వెలిశాయి కూడా. మానవ జీవితంలోనే ట్రాజిక్ కామెడీలు ఉన్నట్టు ఈ రోడ్ సైడ్ ప్రదర్శనల్లోనూ, ఆర్థికమైన సమస్యలూ, ట్రాఫిక్ వారి ఆటంకాలు ఉన్నాయి. అవి అధిగమించి, సామాన్య ప్రజలను సమాయత్తపరచుకొని వారి జీవిత ప్రతిబింబాలూ, జీవన్మరణ సమస్యలూ, చూపించాలంటే –యివాళ థియేటర్‌ను ప్రజలమధ్యకు తీసుకువెళ్ళనిదే నాటకానికి మరో మనుగడ లేదు. నాటకానికి పరిపుష్టి కావాలంటే వ్యక్తులూ, వ్యవస్థలూ ముఖ్యం కాదు. నాటకానికి కావల్సింది ప్రజాదరణ, ప్రజాభిమానం, ప్రజాశీస్సులు.



# రాఘవ నటనాకౌశలం

గోవిందు లక్ష్మీనరసింహారావు

కీర్తిశేషులైన శ్రీ టి. రాఘవాచార్యులవారు చిర స్మరణీయులు. దివ్యమంగళ విగ్రహం, స్ఫురద్రూపి, "ఆజానుబాహు మరవింద దళాయతాక్ష" మన్నట్లు, ఆజానుబాహు స్వరూపుడు. ఆకర్ణాంత విశాల నేత్రములు. ఆయనను స్మరించినంతనే ఆయన విగ్రహం కళ్లకు కనబడుతుంది. ఆయనను అనుసరించుకొని ఉండే వాళ్లకు, అభిమానులకు, పరివేష్టితులకు, శిష్యులకు, అప్పుడప్పుడు కొన్ని విషయాలు పాత్ర పోషణను గురించి చెబుతూ ఉండేవారు. వారి అభినయం చూచిన తరువాత ఎటువంటి నటునికైనను అది అచ్చుగుద్దినట్లు మనస్సులో చిత్రింపబడి ఉండేది. శిష్యులకు ప్రత్యక్షంగా నేర్పకపోయినా, ఆయన మూర్తిని మనసా ధ్యానించి, భావించుకొన్నచాలును. ఏకలవ్యుని ప్రతిభ ననుసరించి, నూతన ఉత్సాహంతో, ద్విగుణీకృతమైన నటనాకౌశలం చేకూరుతుంది. ఇది నా అనుభవం. ఆయన శిష్య కోటిలో నేనొకడను. ఆయన నటించిన పాత్రలను కొన్ని నేను నటిస్తూ ఉండేవాడిని. శ్రీ రాఘవాచార్యుల వారి యెడల మా కుటుంబానికంతా వారియెడల ఆచార్యాభిమానం గలదు. 1920 నుంచి వారి పరిచయం మాకు గలదు. నా మేనమామగారైన కీ॥ శే॥ శ్రీ గూడూరి లక్ష్మణరావుగారు వారికి ముఖ్య స్నేహితులు. వారి సఖ్యత మూలముననే శ్రీ ఆచార్యులవారు యీ సర్కారు ప్రాంతములకు రావడము, ప్రథమమున బెజవాడలో నాటకములు వేయడము జరిగినది. మనమందరము ప్రేక్షకులుగా వారిని చూచు భాగ్యం కలిగినది. ఈ విషయమును ఇదివరలో శ్రీ బసవరాజు వెంకటసుబ్బారావుగారుగూడ వెల్లడించి యున్నారు. స్వర్గీయులైన శ్రీ గూడూరి లక్ష్మణరావు గారికి మన ఆంధ్రప్రదేశ నాట్య కళారాధకు లందరు కృతజ్ఞులు. విజయవాడకు ఆచార్యులవారిని తీసుకువచ్చి, నాటకములు వేయించి, ఆంధ్ర జింఖాన క్లబ్‌కు ఆర్థిక సహాయము సమకూర్చి అత్యున్నత దశకు తీసుకువచ్చిన మూలపురుషులు వీరు.

శ్రీ రాఘవాచార్యులవారు తెలుగు ఇంగ్లీషు, కన్నడం, హిందీ భాషలలో, పౌరాణిక, చారిత్రిక, సాంఘిక, నాటకాలలో వివిధ పాత్రలు నటించి, ప్రఖ్యాతిగాంచిన ఉత్తమ నటుడు. ఏ పాత్ర నటించినను, అద్వితీయ ప్రతిభను ప్రదర్శించిన ఆదర్శపురుషుడు. వీరి హిరణ్యకశిపుడు, పఠాన్, రుస్తుం, శివాజి, దుష్టబుద్ధి (చంద్రహాసలో, కుంభీనసుడు పాత్ర) రాజరాజ నరేంద్రుడు, కీచకుడు, బాహుకుడు, చాణక్యుడు, రామదాసు, దశరథుడు, Othello, Hamlet పాత్రల వేషధారణ, అభినయం చూసే భాగ్యం నాకు లభించింది. నా అనుభవంలో కొన్ని పాత్రల నిక్కడ చూపిస్తాను :-

1. ప్రహ్లాద-హిరణ్యకశిపుని పాత్రలో ఆయన చూపించే పుత్రప్రేమ, శత్రువుమీది క్రోధం, అసూయ మిళితం చేయడం, తరువాత ఆయన ప్రయత్నం ఫలించకపోవడం తెలుసుకొంటూ, ఒక చిన్న పిల్లవాణ్ణి లోబరచుకొనలేకపోతినే అన్న ఆవేదన, విస్పృహత్వాన్ని, అశక్త దుర్జనత్వాన్ని వెలిబుచ్చుతూ, చక్కగా భావగర్భితంగా నటించేవారు. పిల్లవాడైన ప్రహ్లాదుణ్ణి దండనకు పంపునప్పుడు, వాని దీన వదనాన్ని చూచి, అద్భుతంగా ప్రేమ భావం వెల్లడించి, ఎత్తుకొని బుజ్జగించడం చూచి ప్రేక్షకులు తన్మయులయ్యేవారు. కోపోద్రేకం, ప్రేమరసం సాత్వికభావం ఒక్కసారిగా ఆయన నేత్రాల్లో ముఖభావాల్లో మారుతూ కనిపించేవి. పిల్లవానికి శిక్ష విధించిన తరువాత భార్యయైన లీలావతిని ఓదార్చడం తాను ఏకాంతంగా చింతిస్తూ పరితపించడం కనబర్చేవారు. గురువులను శంకించి, వారు శత్రువు పరంగా విద్యలు గరిపినారేమో అన్నవిషయం చక్కగా భావప్రకటన చేసేవారు. భాగవతంలోని పద్యం "పటుతర నీతిశాస్త్ర చయపారగుచేసెద నంచు" చదువుచు, చండామార్కులను తీవ్ర దృష్టితో చూచుచు, కొన్ని అడుగులు ముందుకు నడచి, తరువాత ఆయన బ్రాహ్మణుడు గురువు గనుక, ఏమీ చేయలేని స్థితి అని గుర్తించి, కోపాన్ని అణచుకొంటూ, తన విస్పృహయతను, శత్రుత్వాన్ని వెలిబుచ్చుతూ ఉన్న దృశ్యమైన ముఖభంగిమ, ఆ నటనా కౌశలం అద్భుతం. బ్రహ్మను వరము అడిగినప్పుడు ఆ దర్పంతో, ఠీవిగా, గంభీరంగా, స్ఫుటంగా ఉచ్ఛరిస్తూ నటించేవారు. నారద సమావేశమైనప్పుడు గూడ, నారదుని మనోభావం గుర్తెరిగి చమత్కారంగా నటించేవారు. ఇంద్రుణ్ణి రాజ్యచ్యుతిని జేసినప్పుడు, ఇంద్రపదవి తాను ఆక్రమించినప్పుడు, ధీరోదాత్తుడైన ఉత్తమ పురుష లక్షణాలను ప్రదర్శించి వానికి తగిన ప్రతీకారం చేయ శక్తి కలిగినను శిక్షించకుండా విడిచివేయును. ఇచ్చట ఆచార్యుల వారు చక్కగా నటించి, గంభీరంగా తమ ఔదార్యాన్ని, దండితుడైన యింద్రునివద్ద వెలిబుచ్చుతారు. సానుభూతి చూపి క్షమించి పొమ్మంటారు. ఒకప్పుడు బెజవాడలో ప్రహ్లాద నాటకం రిహార్సల్సు సందర్భములో ఆచార్యులవారు హిరణ్యకశిపుని పాత్ర నటన గురించి, ప్రస్తావించుచు ఛలోక్తిగా, అందరు నవ్వేటట్లు (శ్రీ గోటేటి లక్ష్మీనారాయణ గారి మేడమీద) తన స్నేహితులైన లక్ష్మణరావు గారితో యిట్లా అన్నారు. "Mr. Lakshmana Rao, give me spring shoes, I will jump from this end of the stage to the other end, and that is the conception of హిరణ్యకశిపుడు here" అనగా యిక్కడమనకందరకు, హిరణ్యకశిపుని పాత్ర అంటె, రాక్షసత్వం ప్రకటిస్తూ పెద్దగా అరుస్తూ, బుగ్గమీసాలతో ఉండడం చూచుట అలవాటు పడినట్లుగా ఆయన భావించి హేళనగా అలా అనేవారు. ఎందుకనగా ఆయన నటనలో గాని, వేషంలోగాని, ఆ వికృతాలు ఏమీ ఉండవు గనుక, సాత్విక భావ ప్రకటనతో, ప్రేక్షకులు రంజింపబడరేమో నన్న ఉద్దేశం వెలిబుచ్చేవారు. ఆయన నటనాకౌశలం ఎప్పటికప్పుడు నూతన చైతన్యం కలిగి వెల్లివిరిసేది. ఆఖరులో హిరణ్యకశిపుడు విరక్తితో విష్ణుసాయుజ్యం కోసం పరితాపపడి ఆయనవల్ల మృత్యువు కోరినట్లు గూడ నటించే, వారు. అమరత్వం కొరకు, నృసింహమూర్తి వల్ల తన మరణాని కాశించి, తానే వారికి చిక్కినట్లుగా (లోబడినట్లు) చూపేవారు. ఇది వారి హిరణ్యకశిపుని పాత్రాభినయం.

2. దుష్టబుద్ధి (కుంభీనసుడు) పాత్ర :- వీరి దుష్టబుద్ధి వేషంలో గూడ బిడ్డయైన విషయ మీదను అల్లుడైన చంద్రహాసుని మీదను, క్రోధం, అసూయ వెళ్లబుచ్చుతు, మరల వివాహానంతర దృశ్యములు తన యింట్లోనే పెండ్లి పందిళ్ళు అన్నీ తిలకించి కొమారుణ్ణి, తాను వ్రాసిన జాబు తెమ్మని, చదివి,

సంగతి గ్రహించి, మనోభావం మరుగుపరచి, కుమారుని పంపివేసి, అక్కడ వంటరిగా తన ప్రయత్నం విఫలమైనందుకు దైవఘటన ప్రతికూలమైనందుకు క్రోధం, విచారం, వెలిబుచ్చుతు, కూతురు జాబు మార్చిన విషయం గమనించి దానిపైన ప్రేమను గూడ విస్మరించి, తీవ్రకోపాన్ని వారిపై వెలిబుచ్చుతూ, నటిస్తున్న ఉద్రేకసమయంలో, అల్లుడు కూతురు ఇద్దరు హఠాత్తుగా అచ్చటికి రావడం తటస్థిస్తుంది. వచ్చిన నూతన దంపతులు, నమస్కారము చేయుటకు రావడము చూచి, వెంటనే అసూయ క్రోధావేశములు మార్చి, ప్రేమరసపూరితంగా వారిని సంబోధించి లోని క్రౌర్యం వెలిబుచ్చక "చంద్రహాస కుమారా రమ్ము నాయనా" అని అల్లుని కౌగలించుకొన్న నటన ప్రేక్షకులను ముగ్ధులను చేసినది. కామార్తెను గూడ లాలిస్తూ "విషయా! నీ కోరిక ప్రకారం జరిగించితిని కదా! బిడ్డలక్షేమం, తండ్రులకు తెలియదా?" అంటూ సహజ దుష్టస్వభావాన్ని గుప్తపరచి పలికేవారు. రాజైన పుళిందకుని లోబరచుకొని, తానును దుష్టబుద్ధిగా ప్రవర్తించినందులకు చివర పుత్రమరణమప్పుడు ప్రదర్శించిన దుఃఖము, పశ్చాత్తాపము వర్ణనాతీతం.

పఠాన్‌రుస్తుం, బృహన్నలలో కీచకపాత్రలు గూడ వర్ణనాతీతం.

పఠాన్‌రుస్తుం :-

3. ప్రప్రథమమున ఆయన నటించిన పఠాన్ రుస్తుం పాత్ర ఆంధ్రప్రేక్షక లోకాన్ని ఆకర్షించింది. ప్రథమరంగంలోనే వారు తీవిగా, గంభీరభావాలు వెలిబుచ్చుతూ తందానతాన పాటవింటూ, నటించడం చాలా గొప్పగా యుండెను. ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. పాత్ర ఔచిత్యం చక్కగా నిరూపించారు. అద్వితీయంగా నటించారు.

4. కీచకపాత్ర :- కీచకపాత్ర కూడా చక్కగా ఉన్మాదావస్థ, సైరంధ్రిపై తనకు ఉద్భవించిన ప్రేమ మైమరచిన శరీరంతో, సైరంధ్రి ఉన్నట్లు భావిస్తూ నటించడం అమోఘంగా యుండేది.

5. రాఘవశివాజి :- 1927 లో మద్రాసులో ఆయన శివాజీగా నటించినప్పుడు నాకు చూచే అవకాశం కలిగినది. వారి శివాజి నాటకములో, కొప్పరపువారి రోషనార నాటకం మాదిరి గాకుండా శివాజి, ఔరంగజేబుతో సంఘర్షణ, ఖైదీగా పట్టుబడుట, ఔరంగజేబును మోసగించి బుట్టలో దాగి, తప్పించుకొని పోవుట, యీ కథంతా గూడ ప్రదర్శించేవారు. ఇదంతా జరిగిన తరువాత రోషనారతో సమావేశం వస్తుంది. (రాయిగడ ప్రాంతంలో) కొప్పరపు వారి రోషనారలో యిక్కడనుంచే మొదలవుతుంది. ఈ చారిత్రక నాటకంలో ఆచార్యులవారి నటన వర్ణనాతీతం. శివాజి, ఔరంగజేబును ధిక్కరించి, తృణీకరించి, సంభాషించటం, అక్కడ ప్రదర్శించిన దర్పం, ఠీవి, వానిపైన జూపిన నిర్లక్ష్యభావం, అమోఘంగా ఉండేవి. రోషనారవద్ద ఆయన వెలిబుచ్చిన గౌరవాభిమానములు, తెలియకుండా ఒక స్త్రీని చెరబట్టి తెప్పించిన జిజ్ఞాస, తన తప్పిదమునకు నొచ్చుకొనుట ప్రేమతిరస్కరణ గొప్పగా మెచ్చుకొనదగినవి. ఒంటరిపాటున పడకగదిలో, నిశీధ సమయమున అందమైన ప్రాయపు జవరాలు, లావణ్యరాశి, కోమలాతి కోమలంగా, తన్ను ప్రేమభిక్ష పెట్టమని కాళ్ళపైనబడి ప్రార్థిస్తూ ఉంటే, తాను వయస్సులో నుండియు, ధీరుడివలె, కరడుగట్టిన యోగిపుంగవుని వలె, అపర ప్రవరాఖ్యుని రీతి సహజసోదరీ గౌరవ ప్రేమపూరితములైన పదములతో సంబోధించి, ఆ నారీప్రేమను భగ్నంచేసి, చలించని నిశ్చలత్వాన్ని ప్రకటించిన నటన అతి గంభీరమై, సాత్వికంగా అమోఘమైన కౌశలాన్ని, ధీరత్వాన్ని చాటుతూ, ప్రేక్షక జనాన్ని ముగ్ధులను జేసేది.

ఇచ్చట ఒక సంగతి వెలిబుచ్చాలి–శివాజి నాటకం పూర్తిఅయిన తరువాత ఆయన ఇంటికి వచ్చినప్పుడు కొంతమంది స్నేహితులు కలసి యిట్లా అన్నారు. మీ భావప్రకటన ప్రత్యేకం, శివాజి రోషనారవద్ద మానవత్వానికి అతీతమైన నటనగా ఉన్నదే. అట్టి సందర్భములలో ఎట్టివాడైన యువకుడుగా యున్న మగవాడు, రూపసియైన భామిని ఒంటరిపాటున ప్రేమపాత్రయై అర్థించుచుండగా మానవత్వాన్ని అనుసరించి ఆయన కొంత స్త్రీ ప్రసంగానికి చలించినట్లుగా భావాన్ని కనపరచి, వెంటనే ధీరత్వాన్ని ప్రకటిస్తూ, తన దృఢమైన మనోభావాన్ని వెలిబుచ్చితే బాగుండేదేమోనని చర్చిస్తే, ఆయన దానికి నవ్వుతూ, "ఔను. నిజమే అట్లే చేసిన బాగుండును. సహజంగా యీ ప్రేక్షకులను ఆకర్షించే నాటకరంగానికి కావలసిన నటన అది. సామాన్య భావాలను మానవునిలో పురస్కరించుకొని–అయితే చారిత్రకంగా శివాజి అట్లు సులభంగా చలించే స్వభావంగా చిత్రింపబడలేదు. శివాజి గొప్ప యోధుడు, ధీరుడు, మతాభిమాని. సహజమైన ప్రేమ, దయగల గుణములు కలిగిన వాడు. పరస్త్రీలను మాతలవలె భావించి, ఎంతో ఆదరణ చూపుచుండెడివాడు. అట్టివాని పాత్ర నేను నటించిన సంగతి, మీరు జ్ఞప్తియందుంచుకొనవలెను. సామాన్య మానవునివలె భావించరాదు. అందుకని, ఘనీభూతమై, ధీరత్వాన్ని ప్రకటించే భావాన్నే, నారీ హృదయ సౌకుమార్యాన్ని, సౌలభ్యాన్ని గుర్తిస్తూ నొప్పిగలగకుండా, మోటుతనం గాకుండా, శత్రుపక్షం స్త్రీయైనా, తూలనాడక, ఆమె ప్రేమ సంబోధనాన్ని, తిరస్కరిస్తూ నటించాను" అని అన్నారు. ఆయనను ప్రశ్నించిన వారందరు చాలా బాగుందని మెచ్చుకొని యంత భావస్ఫూర్తిలో మునిగి, ఆ పాత్రను దీర్ఘంగా ఆలోచించి నటించిన మహానటులు మీరొక్కరే అని ఆచార్యులవారిని అభినందించారు. ఆయన ఏ యొక్క పాత్ర నటించినా, దానిలో పూర్తిగా లీనమై, లోతును శోధించి, ఆ పాత్రలో పరకాయ ప్రవేశం చేసినట్లుగా భావం కలుగుతూంటుంది.

6. పాదుకలో ఆయన దశరథ పాత్ర :– అద్వితీయంగా ఉండేది. ఆయన ఒకప్పుడు మాతో "You have seen my Ramadas, but not Dasaratha, where varying emotions will be expressed entirely in a different aspect", ఆయన రామదాసు నాకు అభిమాన పాత్రగా ఎంచుకొనేవాడిని. వారికి ఆ విషయం తెలుసు. అందువల్ల ఆయన దశరథ పాత్రగూడ నేను చూడవలెనన్నారు. నాకు ఎప్పుడైనా అవకాశం కలుగుతుందా అనుకొనేవాడిని. చివరకు మద్రాసులోనే ఒకసారి ఆ భాగ్యం కలిగింది. దశరథపాత్రను, అద్దంకివారు యింకా కొందరు నటిస్తే చూచియున్నాను. బాగానే ఉంటవి. కాని, ఆచార్యులవారి నటనా ప్రతిభ అందుకోలేని అంతస్తులలో సంచరిస్తుంది. పద్యముల పాటల ప్రాముఖ్యము గాదు. రామదాసు నాటకంలో భక్తుడుగా భక్తి భావం ప్రకటిస్తే, దశరథలో పుత్రప్రేమలో మగ్నమైన, ఒకవిధమైన భక్తి ప్రకటితమయ్యేది. అందుకనే వారు నన్ను వారి దశరథ పాత్రను ముఖ్యంగా చూడమన్నారు. వీరు ఆడే నాటకం శ్రీ బళ్ళారి కృష్ణమాచార్యులవారు రచించిన పాదుకగాని, పానుగంటివారి పాదుక కాదు. దానికి దీనికి చాలా వ్యత్యాస మున్నది. పాత్ర పోషణలోనే చాలా భేదం కనిపిస్తుంది. మంధర కైకకు బోధచేయుటలో, భరత పట్టాభిషేకము మొదటి వరంగా అడుగుమని నిర్బంధిస్తూ, కష్టం మీద కైకను ఒప్పిస్తుంది. కృష్ణమాచార్యులవారి కైక పాత్రను, భరత పాత్రను, అద్భుతంగా పోషించియున్నారు. పానుగంటివారి పాదుకలో, కైకను ఒక సామాన్య వనితలాగా, భర్తను చాలా నీరసంగా ఎత్తిపొడుస్తూ, యీసడిస్తూ, తూలనాడుతూ ఒక తెగించిన సామాన్య వనితలాగ చిత్రించారు. వరము

లను వెంటిని ఒక్కసారిగానే గొడ్డలిపెట్టువలె అడుగుతుంది. ఇక కృష్ణమాచార్యులవారి పాదుకలో మొదటి వరమునకు ఎట్లాగో కైకను మంథర ఒప్పించిన మీదట, తరువాత చల్లగా బోధపరచి, రామవనవాసం అడగమంటుంది. రెండవ వరంగా యీ విషయం వినీవినడంతోనే, కైక తోకత్రొక్కిన త్రాచులాగ, తీవ్ర కోపంతో లేచి, మంథరపై విరుచుకు పడుతుంది. నా కొడుకునకు రాజ్యము కోరమంటివి. స్వలాభ ప్రేరితురాలనై, కౌసల్య అధిక్యమునకు లోబడకుండ, అడిగెదను గాని, పాడు ముండ! రాముని వనవాసం కోర మనెద వెందులకె? అని చీదరించుకొని, విసుక్కొని, మంథరను తిట్టి, అఖరుకు, ఒక కందపద్యంలో కైకయొక్క సహజ సద్భావం, రామునిపై నుండు అపారమైన ప్రేమ వెల్లడిస్తారు. పద్యం కం॥ అయ్యోద రాజ్య బహిష్కృత, నయ్యోవ కౌసల్య దాసినైన నయ్యోద, నా వెయ్యింపుసుతుని కానలకయ్యోవనుపంగ నెట్టులందు గుదు నబలా ॥ ఇంతకన్న కైక పాత్రపోషణ కేమి కావలెను? కైకను మరల తన త్రోవకు మరల్చుకొని, రామ వనవాసం కోరుకొంటేనే గాని, భరతునకు రాజ్యం చేకూరదని బోధించి, రెండవ వరము గూడ కోరుకొనుటకు కైక సమ్మతించినట్లు చేయుటకు, మంథరకు తలప్రాణం తోకకు వస్తుంది.

ఆ తరువాత దశరథుని ఆగమనం-కైక, పడకటింటిలో తల విరబోసికొని, అభరణములను తీసి, నేలపైన పరుండును. ఇక యిక్కడ ఆచార్యులవారు, దశరథ పాత్రను ధరించి వచ్చుట గోచరమవుతుంది. ముసలి భర్త పడుచు భార్యకోసమై, ఉబలాట పడుతూ వచ్చినట్లుగా తోస్తుంది. అందులో తనకు ప్రియమైన, పెద్దకుమారుని పట్టాభిషేకమైన సుతోషవార్త, మిక్కిలి ప్రేమపాత్రయైన కైకకు, ముద్దు యిల్లాలుకు చెబుతామనే అనందంలో వచ్చి, అచ్చటి పరిస్థితి గమనించేసరికి అయన చకితుడై, విషసర్పమును చూచినట్లుగా భీతిల్లి, ఏదో అనర్ధము మూడునని భావించి, కైక వద్దకు జంకుతూ మెల్లగా చేరి, బుజ్జగించుచు, సంబోధించెడి సందర్భమున, పడిన సంతాపము చూడవలసినదే కాని, వర్ణించుటకు సాధ్యముగాదు. కైకను లాలిస్తూన్న పదగుంభవ తీరు యిది-"కైకా, నయనప్రభాకారిత సారంగపాకా, సరోజాత సమంచిత బిబ్బోకా......మహిమాస్తోకా, విగతశోకా, నవరోకా, కైకా, కైకా, ఏటికే నీకీ కాక". అన్న మాటలు, సంబోధించే తీరు, ఆచార్యులవారి నోట గద్గదస్వరముతో, అతి దీనంగా, జాలిగా కైకను వేడుట ప్రేక్షకులను కరగించివేయును ఉచ్ఛ్వాస నిశ్వాసములతో, హెచ్చుతగ్గుల స్థాయిలతో, కంఠస్వరము మార్చుచు, ఆయన కైకవద్ద నటించిన కోపము, కారుణ్యము, దీనభావము, వర్ణనాతీతము. అంతట రామలక్ష్మణుల సమావేశమై, అడవులకు వెళ్ళునప్పుడు, సీతతో వారు ముగ్గురు నిష్క్రమించేటప్పుడు, వారు చూపిన దుఃఖావేశం, ధర్మమూర్తియైన రామచంద్రమూర్తి, నిరపరాధి, అన్యాయంగా ఒక్క అడుదాని మాటకు లోబడి, కానలపాలు చేయుచుంటినే, అనే వ్యాకులత, అస్వస్థత, మనోవేదన, నిస్సహాయత, రాముడిని అడవికి వెళ్ళకుండా అపివేసే ఉపాయం తోచక, పరితాపపడుట చక్కగా నిరూపించేవారు.

రాముడు వనవాసమున కరిగిన పిమ్మట, పానుగంటి పాదుకలో-దశరథుని అంత్యమే. "రామా, రామా, సుమంత్రా రథమాపుము" అని కేకలు వేస్తూ, పడిపోతాడు. ఇంతటితోనే దశరథ పాత్రధారణ ముగింపు. ఇంక కృష్ణమాచార్యులవారి పాదుకలో, దశరథునికి రెండు సీన్లు అదనంగా కల్పించారు. ఈ సీన్లలో దశరథుడు అస్వస్థుడై పండుకొనుట, చుట్టూ, కౌసల్య, సుమిత్ర, వసిష్టుడు మొదలగువారు, పరివేష్టించి యుందురు. కైక, హృదయవేదనతో వస్తూ పోతూ ఉంటుంది.ఈ రంగాల్లో ఆచార్యుల వారి,

imaginative faculty in despair, as a father of a lost son గోచరిస్తుంది. భిన్న భావాలతో దుఃఖ సముద్రంలో మునిగి తేలుతూ, delirium stage కనపరుస్తూ, మరల తెలివికి వస్తూ, నటించడం చాలా అద్భుతంగా ఉంటుంది. నాటకంలో సీనులే ! పుస్తకంలోని రచనయే ! అయితేనేమి-అంత సంజీవంగా, ఆయనతో పాటు ప్రేక్షకులను గూడా, ఆ రంగంలో, ఆ పాత్రలతో లీనమైపోయేటట్లు, భావప్రకటన చేసేవారు. తాను delirium stage (ఉన్మాదావస్థ)లో ఉన్నప్పుడు, "రామా సురక్షితముగా వచ్చితివా, అబ్బా అరణ్యములో ఎంత బాధపడితివి నాయనా ! ఏదీ మనుమలు-నీ రూపు తీసితీయక అచ్చుగ్రుద్దినట్లున్నారు. సీతా, నీకు అడవిలో కానుపెవరుపోసిరమ్మా ? ఎంత ముద్దుగారుచున్నారమ్మా నీ కొడుకులు ! అడవిలో కంటకములు గ్రుచ్చుకొని ఎంత బాధపడితివో; మీరు వెళ్ళిన తరువాత కైక మృతిచెందెను. భరతుడవృశ్యుడయ్యెను-అదేమే కౌసల్యా ? నీకేమి చేటు కాలమే ? మనుమలను ఎత్తి ముద్దాడకున్నావు. అంటూ మనుమలను ఎత్తుకొన్నట్లు, ముద్దాడినట్లు నటించి, మరల తెలివి వచ్చినప్పుడు కైకను తిట్టుచు, దాని ముఖం చూడనని శపథం చేస్తూ, చక్కని భావాలు ప్రకటించేవారు. కౌసల్య తన భర్త ఉన్మాదావస్థలోనైనా, మనుమలను ఎత్తి ముద్దాడినట్లు తృప్తిపడే భాగ్యం కలిగిందే, నాకా ప్రాప్తమైన లేదాయెనని, దుఃఖించుట చూడవలసిన దృశ్యం. వసిష్ఠునితో తెలివిలో నున్నప్పుడు, భరతుని పిలిపించవద్దని చెప్పుట-ఆఖరులో తన మృతి కారణమైన ముని శాపము జ్ఞప్తికి వచ్చి, అచ్చట నున్న వారితో తన పూర్వశాప వృత్తాంతము ముచ్చటించి రామచంద్రునిపై ఏకాగ్రభావం కనపరుస్తూ, వెఱ్ఱి చూపులతో, "రామా, రామా" అంటూ పుత్రప్రేమ, మార్దవ మిళితమైన భక్తితో, ఆవేశ పూర్వకమైన ఉచ్ఛారణతో ప్రాణం విడిచినట్లు పడిపోయేవారు.

ఆ దశరథపాత్రలో అంతర్లీనమై పరకాష్ఠను కనుపరచిన వారింకొకరుండరు. ఇతరులకు సాధ్యము గానిది. ఆయనకు ఆయనే సాటి. అయోధ్యలో నున్న ఆనాటి దశరథ మహారాజు మరల యీనాడు మనకు స్ఫురించెనా అన్నట్లుండును. ప్రేక్షకులు ఆఖరులో కరుణరసంలో, ద్రవీభూతులై నిశ్చేష్టితులయ్యేవారు. అట్టిది వారి దశరథ ప్రాతాభినయం. ఇంక ఎంతయిన వ్రాయవచ్చును గాని యిప్పటికే పరిమితి మించినది.

7. ఇంక వారి చిత్ర నళీయంలో బాహుక పాత్రాభినయం వివరించెదను. బాహుక వేషదారులను కొంతమందిని చూచి వున్నాము. డి. వి. సుబ్బారావుగారు, మద్దాలి శేషగిరిరావుగారు, బెల్లంకొండ సుబ్బారావుగారు యింకా యితరులు యీ పాత్ర నటించేవారు. గాని ఆచార్యులవారి నటనలో, జీవకళ, విశిష్ఠత, స్వభావసిద్ధమైన (Natural feelings) భంగిమలు, మార్పులు వీరికి ఎందును అందరావు. శ్రీ డి. వి. సుబ్బారావు బాగా నటించేవారు. కొన్ని సందర్భములలో విపరీత నటన కొంతమంది కనబరచేవారు. ఏ సందర్భంలో ముఖ్యంగా మరుగు పఱచవలెనో; అచ్చట యింక కొన్నిచోట్ల, సందర్భము లేకుండా పాత్ర ఔచిత్యాన్ని గమనించక, విస్మరించి నటించేవారు. ఇంద్రసేన, బాహుక సమావేశంలో, భారతి వచ్చినప్పుడు దానితో, మతిపోయిన పిచ్చివానిలాగ, ఒకరిద్దరు బాహుక పాత్ర ధారులు నటించేవారు. ఈ నటన బాహుకుని భావానికే వ్యతిరేకం. అక్కడకు భారతి ఎప్పుడు వస్తుందో, వెంటనే తాను పిల్లవానియందు కనబరిచే ప్రేమభావం మఱ్ఱపెడుతూ, భారతితో యింకేదో ధోరణిలో సంభాషణ మార్చుట సమంజసమయిన నటన, యిది అసలు కవి హృదయం. ఈ సీను చాటున నుండి బాహుకుని చర్య గమనించి, నలుడీతడే అని నిర్ణయించుటకు ఏర్పడినది. అది తెలిసిన

ఆచార్యులవారు చాలా భావగర్భితంగా, బాహుకుని పాత్ర నిర్వహించేవారు. కుమారునిపై ప్రేమ భారతి తెలుసుకుంటుందేమో ననేభీతి, అనుమానం, దమయంతి యందు ద్వేషం, మరల కారుణ్యమైన ప్రేమ, ఆతురత, యిన్ని మిళితం జేసి, భావ ప్రకటన చేసేవారు. బాహుకుని మనోవ్యాకులత, ఆ భీమరాజు లేఖ, ఋతుపర్ణుని సమక్షమున చదువుచున్న ఘట్టమున, లోపల భీభత్సమయి, రేగుచుండిన ఆందోళన, ఊహలు, తలపులు, పైకి కానరాకుండా అణుచుకొంటూ, అచ్చటి వారికి తెలియరాక, ప్రేక్షకులకు గోచరిస్తూ, సుదేవునికిచ్చిన ప్రత్యుత్తరములు, మహా భావగర్భితంగా గోచరించేవి. అటు పైని జాబు చేతపుచ్చుకొని, ఒంటరిగా soliloque scene లో, "ఆహా యిది కలయో, కల్లయో తెలియజాల" అన్న రెండు ముక్కలు ఉచ్చరిస్తూ, ఆయన నటించిన భావాలు వర్ణనాతీతం. Hamlet లో, "To be or not to be" అనే సంఘర్షణా భావాలోకంలో మగ్నులయ్యేవారు. ఆఖరున, ఉద్రేకపూరితంగా, యీ రంగంలో ప్రేమ క్రోధములను వెలిబుచ్చుతూ, ప్రాణాలపై నాశ వీడినట్లుగా నటించి, క్రిందపడేవారు. అంతగా ఆ పాత్రాభినయంలో లీనమై, పరాకాష్ఠ చెంది, మైమరచినట్లుండేవారు. ఆఖరు రంగంలో భీమరాజు భవనంలో, సుదేవుడు బాహుకుని సూచించి, నటనగా నిరూపించుచు, సంబోధించి, ఫలాక్షత లిచ్చినప్పుడు, ఆయన నటించిన ముఖ భావాలు (feelings) చెప్పనలవిగాదు. అశ్రుపూర్ణుడై, తాను కురూపినని హేళన చేయుచున్నట్లు ఋతుపర్ణునితో విన్నవించుట, అతి దీనమై, ప్రేక్షకులు కన్నీరు కార్చనివారుండరు. చివరలో దమయంతి సమావేశమైనప్పుడు, ఆమె వేడుకొన్నప్పుడు గంభీరంగా ప్రక్కకు తిరిగి ఆమెతో "తరుణీ, యీ స్వయంవరము నందు" అనే తేటగీత పద్యం చదివి, విముఖత్వం, ధీరత్వం, ఉత్తమ పురుష లక్షణం ప్రకటించేవారు. ఇది కడు రమణీయంగాను, ధీరోధాత్త లక్షణాని కనుగుణ్యంగాను ఉండేది. రాఘవ బాహుకకు ఆయనకాయనే సాటి. ఈ సంఘర్షణలో యితర నటులు, భావ విరుద్ధంగా నటించేవారు. దమయంతి మీద క్రోధావేశాలు ప్రదర్శించి, కాలితో గూడ తన్నిన నటన సందర్శించాము. ఇది చాలా కంటకంగా కనుపించేది. భావానికే వ్యతిరేకమైన నటన ధీరోదాత్త ఉత్తమ లక్షణంగా చూపట్టదు.

8. రాఘవ రామదాసు:- ఇది నా అభిమానపాత్ర. ఈయన రామదాసు పాత్రాభినయంలో భక్తిభావం చక్కగా వెల్లడించేవారు. రామదాసును dynamic character గా నిరూపించేవారు భక్తిభావం క్రమేణ వృద్ధి పొందినట్లు నటించేవారు. మొదట దేవాలయ సీనులో కబీరును కలసినప్పుడు, చక్కగా నటించి తమ గురుభక్తిని ప్రదర్శించేవారు. ఆ తరువాత పుత్రయోగం సీనులో, బ్రాహ్మణ సంతర్పణ సమయంలో, భార్యను ఓదారుస్తూ, తన దుఃఖమును అణుచుకొనుచు, ఒక ప్రక్క బ్రాహ్మణ సంతర్పణ భంగమునకు వెరుస్తూ "బ్రాహ్మణులు భుజించుచున్నారు. ఊరుకో" అని భార్యను ఓదారుస్తూ "రామచంద్రా" అని యివతలకు వచ్చి రంగస్థలంలో ఆవేదనతో, తిరుగుతూ నటించేవారు. ఆ తరువాత బంధిఖానా సీన్‌లో అద్భుతంగా భక్తి ఆవేశంలో రాముని దీనంగా వేడుకొంటూ, ప్రేమతో పిలుచుచు, తుదకు నిస్పృహ కలిగి, నిరుత్సాహంతో, రామదర్శనం కాలేదని కోపంతో, నిష్ఠురంగా సంబోధిస్తూ, solioque speech చెబుతూ నటించేవారు. ఆయన ఒకప్పుడు ఎల్లోరా, అజంతా గుహలను దర్శించినప్పుడు, అక్కడ గోడల మీద అంతయు వ్రాయబడి ఉండుట చూచినారట. అది పురస్కరించుకొని, ఆయన రామదాసు జైల్‌సీన్‌లో, రామనామం పలకమీద వ్రాయుట, నేలమీద వ్రాయుట చూపిస్తూ నటించేవారు. రామదాసు చివరిలో రాముని నిందిస్తూ, తీవ్ర ఉద్రేకంతో, రాముని శపించేటట్లు సగం ఉచ్చరించి, వెంటనే రాముని మూర్తి ప్రత్యక్ష

మైనట్లుగా భావించి, భంగిమ మార్చి "రామా, వచ్చితివా, కరుణ కలిగెనా, అయ్యో నేనెట్టి నిష్ఠూరము లాడితిని" అని సంబోధించి, దీనంగా రాముని వేడుకొనును. తానీషా కబీరు మరల జైలులో కలిసినప్పుడు గూడ, ఆయన గొప్పగా ఆ సమావేశ సంభాషణలో నటించేవారు.

ఒకప్పుడు ఆయన Nandyal Ametuers troopeతో రామదాసు వేయుటకు నిశ్చయించుకొని, ఏర్పాట్లు జరిగి, అంతా సిద్ధమైన తరువాత, వారికి వచ్చుటకు వీలులేదని వారికి టెలిగ్రాంయిచ్చినారు. నేనప్పుడు కర్నూలులో Agricultural Demonstratorగా పనిచేయుచుండెడివాడను. వాళ్ళప్పుడు నాకు తెలిసిన సంఘమై యుండుటచేతను, ఆచార్యులవారి స్థానే, నన్ను నిరూపించుటచేతను, నేను గూడ రామదాసు పాత్రను, ఏకలవ్యుని రీతి, వారి ననుసరించి నటించే అలవాటై యుండుటచేతను, వెంటనే వాళ్ళు కర్నూలు వచ్చి నన్ను తీసుకువెళ్ళి వారికి బదులుగా రామదాసు పాత్రను ప్రదర్శింపజేసినారు. ఇది నేనొక అతిశయోక్తిగా జెప్పుటగాదు. నా భాగ్యంవల్లనే, వారిస్థానే నేను నటించే అవకాశం కలిగినది. అదిగాక, నేను అప్పట్లో అనగా (1925 నుండి 1929) కర్నూలులో ఉన్నప్పుడు Nandyal Ametuers (అంతా Club members ఉద్యోగస్థులు, pleaders) తోను, ద్రోణాచలం Ametuers (Club members) తోను, కర్నూలు Ametuers (Club members) తోను యీ మూడు చోట్ల అప్పుడప్పుడు వాళ్ళతో కలసి నాటకములు ప్రదర్శించేవాణ్ణి. ఆ పరిచయం గూడ వాళ్ళతో నాకు ఉండుటవల్ల, వెంటనే నాటకం ఆగిపోకుండా నన్ను తీసుకువెళ్ళి ప్రదర్శనం జరిపారు. ఇంకొకసారి నంద్యాల Ametuers తో ఆచార్యులవారు, రెండు నాటకములు ఏర్పాటు చేశారు.

1. సారంగధర, 2. బృహన్నల. సారంగధరలో శ్రీ స్థానం నరసింహారావుగారు చిత్రాంగి పాత్ర నటించారు. ఆచార్యులవారు రాజనరేంద్ర పాత్ర నటించారు. నాటకం బాగానే జరిగిపోయింది. మర్నాడు కీచకవధ (బృహన్నల) నాటకం రిహార్సల్సు జరుగుచున్నవి. అక్కడకు నేనుగూడ వెళ్ళినాను. శ్రీ స్థానం నరసింహారావుగారు కూడ యున్నారు. సుమారు 12½ గంటల సమయం — మధ్యాహ్నం-అప్పుడు rehearsel ముగిస్తూ స్థానం వారిని, శ్రీ ఆచార్యులవారు "మీకు నిన్న చిత్రాంగి పాత్రలో, మూడుతూర్లు once more వచ్చినదే. ఆ పద్యం ఒక్కమారు చదవం"డని అన్నారు. వెంటనే శ్రీ నరసింహారావుగారు, రంగస్థలంమీద ఏధోరణిలో అయితే చదివారో ఆ మోస్తరుగానే మోహనరాగంలో, ఉద్రేకభావం స్ఫురింపజేలాగ "నామాట వేదమంత్రము గాగ" అనే సీసపద్యం చదివారు. పద్యం పూర్తి అయిన పిమ్మట శ్రీ నరసింహారావుగారితో, ఆయన యిట్లా అన్నారు: "చిత్రాంగికి నిజంగా సారంగధరుణ్ణి చంపించే అభిప్రాయంగాని, ఉద్రేకంగాని, కోపంగాని, చూపించవలసిన అవసరంలేదు. అది ప్రణయ కోపంలాగ నటించి, యిటువంటి శక్తిమంతురాలను సుమా, నను త్రోసిపుచ్చితివేని, నీకు గొప్ప అనర్థం వాటిల్లగలదు. జాగ్రత్త-తరువాత వచ్చే ఆపద తెలుసుకో." అన్నట్లుగా తన ప్రేమ తిరస్కరించవద్దని వేడుకొనుచున్నట్లు చెబుతూ, ఆయన ఆ పద్యాన్ని దేవగాంధారిరాగంలో చల్లగా చదివి వినిపించారు. అప్పుడు శ్రీ నరసింహారావుగారు, దాని నిజభావాన్ని గ్రహించి. మాకు యిలాటి బోధ చేసేవారు లేక తోచినట్లుగా చేయుచున్నాము. "మీ బోటి వారి guidance ఉంటె యింకా వృద్ధికి రాగల" మని, ఆచార్యులవారిని ఎంతో కొనియాడారు. ఇది కవి యొక్క నిజమైన భావమని ఆచార్యులవారు వక్కాణించారు. కవియైన శ్రీ కృష్ణమాచార్యులవారు వీరికి మేనమామగుట వల్లను; వారిద్దరు ఒకే

సంఘంలో నటులై యుండి నాటకములు ప్రదర్శించుచుండుట చేతను, ఆయనకు కవి హృదయం బోధపడింది.

అప్పుడప్పుడు ఆయన యిలా అనేవారు "నాటక రంగం మీద ఏకాగ్రతతో, పాత్రలో లీనమై పాత్ర ఔచిత్యం గ్రహించి, పోషణ చేసుకుంటూ నటించే నటునకు, ఆ అనుభవంలో, ఉత్తీర్ణుడయి, తరించే మార్గం అలవడుతుంది. ఆధ్యాత్మికంగా కూడా యిది చాలా ఉపకరిస్తుంది. రంగస్థలం ఒక దేవాలయంలాగ అందుకు ఉపయోగ పడుతుంది. "This is one of the ways of salvation for soul" అనేవారు. ఆయన ఆ దృక్పథంతోనే నడిచారు. అందరకు ఆదర్శప్రాయులైనారు. ఆయన గొప్ప శాస్త్రజ్ఞులు, పండితులు గూడాను. ఆధ్యాత్మికంగా గూడ అనుభవజ్ఞులు, గొప్ప భక్తులు. శ్రీలక్ష్మీనరసింహ ఉపాసన గూడ ఉండేదని ప్రతీతి. ఆయన గురించి వ్రాయాలంటే ఎంతని వ్రాయగలం? అమరజీవి. స్వాభావిక చైతన్యం ఉట్టిపడుతూం టుంది - ఆయన నటనలో. జన్మనటుడు. ఆయన "acting is my birth right" అనేవారు. మన మెప్పుడు ఆయనను చిరస్మరణీయంగా ఉంచుకోవాలి. ఆంధ్ర నాట్యకళకు, నూతన ఉజ్జీవం తెచ్చిన మహానటుడు, కళాకారుడు, కవి. నటులయిన వారందరకు శ్రీ రాఘవాచార్యులవారు ఆచార్యస్థానమని నేను భావిస్తూ ఉంటాను. *



ఆకాశవాణి ప్రసారితాలైన

# తెలుగు సంగీత రూపకాలు

శ్రీమతి పద్మజాభూషణ్

తెలుగులో సంగీతరూపకాలను గురించి చర్చించవలసివస్తే ముందుగా యక్షగానాలను పేర్కొనాలి. నాటకాలలో సంగీతం అవసరమా కాదా అన్న మీమాంసరాకముందే తెలుగు, జానపదులు పద్యాన్ని గేయాన్ని వరించారు. తదాది తెలుగు ప్రజలకు కొంచెమో గొప్పో సంగీతం, రాగం ఉన్న నాటకాలమీద ఎక్కువ మోజు ఉన్నట్లు కనిపిస్తుంది. తెలుగు ప్రజలకు సంగీతాత్మకాలైన నాటకాలు రుచిస్తాయని చెప్పడానికి మరో ఉదాహరణ కూచిపూడి భాగవతుల నాటకాలు. అటు యక్షగాన నాటకాలు, ఇటు తరంగాలతోకూడిన కృష్ణలీలా తరంగిణీ-కూచిపూడివారి నాట్యప్రదర్శనాలకు మూలభూతమైనాయి.

ప్రదర్శించినట్లు దాఖలాలు లేవుకాని త్యాగరాజు కూడా ప్రఖ్యాతాలైన సంగీత రూపకాలను రచించినవాడే। నౌకాచరిత్రము, ప్రహ్లాద భక్త విజయము, సీతారామ విజయము త్యాగరాజు సాహిత్య సంగీత ప్రతిభలకు గీటురాళ్ళు.

19 వ శతాబ్దం చివరి వరకు వచ్చిన యక్షగాన, వీధినాటకాలలో పాటలే ఎక్కువ. ఎక్కడోకాని వచనం కన్పట్టదు. కాగా, 20 వ శతాబ్దంలో ఈ పాటలలో గొప్ప మార్పు కానవస్తుంది. 20 వ శతాబ్దపు తెలుగు నాటకాలలోనిపాటలన్నీ పార్శీమట్లవలెకనీసం ఆ సంప్రదాయ పద్ధతిలో నడచినవే। తొలి తెలుగు నాటకాలలో పద్యాలకన్న పాటలే ఎక్కువ. ఈ విషయం ధర్మవరం, కోలాచలం గార్ల నాటకాలు రుజువు చేస్తాయి.

ఆధునిక యుగంలో సంపూర్ణ సంగీత నాటకాలు ప్రదర్శనకు నోచుకోలేదు. పద్యాల ప్రభావం వల్ల పాటలు కుంటువడ్డాయి. సినిమావల్ల కూడా పాటల నాటకాలకు జనరంజకత్వం తగ్గింది. అటువంటి సమయంలో సంగీత నాటకాలను శ్రోతలకు అందించడానికి పూనుకొన్నది ఆకాశవాణి. నిజానికి ఇటీవల-గత నాలుగు దశాబ్దాలుగా వెలువడుతున్న సంగీత నాటకాలలో చాలభాగం రేడియోకు వ్రాసినవే।

సమకాలీన యుగంలో తెలుగు సంగీత రూపకం అనగానే కృష్ణశాస్త్రి, రజనీకాంతరావు, నారాయణ రెడ్డి, దాశరథి, మల్లవరపు విశ్వేశ్వరరావు వంటి కవులపేర్లు ప్రథమంగా కన్పిస్తాయి. తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు రచించిన "పద్మావతీ చరణచారణ

చక్రవర్తి", "వరపరీక్ష", "యక్షపాత్ర", ''సహజయాన పంథీ", 'దీక్షితదుహిత', 'కవిప్రియ', "పదాంకము", ''సద్వాక్యము" వంటి పద్యగేయ నాటికలలో అంతగా సంగీత ప్రాధాన్యం లేకపోయినా అవి సంగీత రూపకాల కోవకే చెందినవిగా భావించవచ్చు.

రేడియోలో (1939) తొలిగా వెలువడిన సంపూర్ణ సంగీత రూపకం ''బిల్హణీయం". దీని రచన మల్లవరపు విశ్వేశ్వరరావుగారు చేశారు. అయినా ఇది సంగీత రూపకంగా రూపొందడంలో కృష్ణశాస్త్రిగారి కృషి చెప్పుకోతగింది. ఆ తర్వాత శ్రీశ్రీ ''మోహినీ రుక్మాంగద" మొదలైన సంగీత రూపకాలను రచించారు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన "ఊర్వశి", "శర్మిష్ట", ''విద్యావతి", "ధనుర్దాసు", ''గుహుడు" "అండాళ్ కల్యాణం",''ఉమర్ ఖయ్యాం" "దక్షయజ్ఞము" మొదలైన సంగీత రూపకాలు పద్యగద్య మిశ్రితమై ఆకాశవాణిద్వారా ప్రసారం చేయబడి విశేష ప్రజాదరణ పొందినవి. వారి "వసంతోత్సవం" అన్న సంగీత రూపకం వారి సంగీత రూపకాలన్నిటిలోకి మకుటాయమానమైనది.

ఆకాశవాణి హైదరాబాదుకేంద్రంలో చేరినతర్వాత శ్రీకృష్ణశాస్త్రి దాశరథితో కలిసి వ్రాసిన ''కొత్తకోవెల" అన్న సంగీతరూపకంలోని పాటలు తెలుగువారి గుండెల్లోగూడుకట్టుకొనిచిరస్థాయిగా నిలచిపోయాయి.

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు ''పొమిథియస్ అన్ బౌండు" (షెల్లీ)ను సంగీత నాటకంగా అనువదించారు. ఇదికాక వీరు కళాపూర్ణోదయాన్ని అనుసరించి చేసిన "కలభాషిణి''ధారావాహిక నాటికగుచ్ఛం, "శారదోత్సవం" ఆకాశవాణి ద్వారా ప్రసారమై ప్రజామన్ననలనందుకొన్నవి.

విశ్వనాథవారి ''కోకిలమ్మపెళ్ళి'', ''కిన్నెరసాని'' ''మారీచుడు'', ''ఊర్మిళ'', ''సుమిత్ర'', ''గోదావరి'' మొదలైన సంగీత నాటకాలు ఆకాశవాణి ప్రసారంలో వినుతికెక్కాయి.

వీరి తర్వాత కృష్ణశాస్త్రిగారితో సన్నిహితంగా ఉండి ఆయన సంగీతరూపకాలకు సంగీతాన్ని కూర్చిన బాలాంత్రపు రజనీకాంతరావు చెప్పుకోతగ్గ రూపక రచనలు కావించారు. ''మధురానగర గాథ'',"సుభద్రా విజయము", ''మేనక'', ''నౌకావిహారము", "పుష్పలావికుడు", 'రాసలీల', 'స్వప్నసీమ', 'సుమజన్మ', "నళినభ్రమరి", "శాఫో" "అమృత వర్షిణి", "మేఘసందేశం", "చండీదాసు", 'లకుమాదేవి', ''విజయవిధాత", "విశ్వవీణ", స్వైరిణి శాంతి పథము'' అనే సంగీతరూపకాలు 'విశ్వవీణ', పేరుతో సంపుటీకరింపబడ్డాయి. ఈ "విశ్వవీణను', రజని కృష్ణశాస్త్రిగారికి అంకితం చేసారు. సంగీత జ్ఞానం కలవాడు కనుక రచయిత, తన రూపకాలలో సంగీతాన్ని నిలబెట్టుకొచ్చారు. ఈయన సంగీతరూపకాలలో 'లకుమ', 'మేఘసందేశం', 'విశ్వవీణ', 'శాంతిపథం' విశేషంగా ప్రజాదరణ పొందాయి. శ్రీరజని 16 సంపూర్ణ గేయ నాటకాలను, 30 వరకూ గద్యపద్య గేయాత్మక రూపకాలను రచించారు. ఇందులో ఐదారు నాటకాలు రంగస్థలం పై ప్రదర్శింపబడ్డాయి.

సినిమా రంగంలో అగ్రశ్రేణి లిరిసిస్టుగా పేరొందిన శ్రీ సి. నారాయణరెడ్డి తన సంగీతరూపకాల ద్వారా ప్రజాదరణ పొందారనడం నిస్సందేహం. ఈయన ''నాగార్జునకొండ'', "కర్పూర వసంత రాయలు", "వెన్నెలవాడ" బహుళ ప్రచారం పొందిన సంగీత రూపకాలు. "దివ్వెల సంగీతం", "సంక్రాంతి" ''గోకుల విహారం", "అజంతా సుందరి", "మనిషి-యంత్రం", ''నవ్వనిపువ్వు"అనే సంగీత రూపకాల్ని

"వెన్నెలవాడ" పేరుతో సంపుటీకరించి ప్రచురించారు.

ఈయన వ్రాసిన "హరిచరణదాసి మీరా", "వసంత లక్ష్మి". "వనరాపేడుకలు", "సుగాత్రి", "కౌముదీ విహారం", "రామప్ప" అనే రూపకాలన్నింటా "రామప్ప" అగ్రగణ్యమైనది. జనరంజకమైన ఈ "రామప్ప" హిందీలోకి అనువదింపబడి జాతీయరూపక కార్యక్రమంగా పన్నెండు భారతీయ భాషల్లో ప్రసారం చేయబడింది. హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంనుండి వెలువడ్డ సంగీత రూపకాలలో దీనికి లభించినంత ప్రశస్తి మరొక రూపకానికి లభించలేదనడం అతిశయోక్తి కానేరదు.

స్వాతంత్ర్య ఉద్యమానికి సంబంధించిన సంగీత రూపకం "మహోదయం" రచించి తన అకలంకమైన దేశభక్తిని ప్రదర్శించాడు దాశరథి. మోతీలాల్ జీవితానికి సంబంధించి వ్రాయబడినది "ఆనంద్ భవన్", ఎక్కువగా శ్రోతలను ఆకట్టుకున్న దాశరథి సంగీత రూపకాలు "మహాశ్వేత", "యశోధర".

మల్లవరపు విశ్వేశ్వరరావుగారి "కృష్ణా పుష్కరం", "మహిషాసుర మర్దని", "బలహీనులు", "గాజుల బేహారి" మొదలైనవి పేర్కొనదగిన సంగీత రూపకాలు. "గాజుల బేహారి" మల్లవరపు వారికి మంచి పేరు తెచ్చిపెట్టిన రూపకం. వీరు రవీంద్రుని "చిత్రాంగద" కు తెలుగు అనువాదం చేశారు. ఇది ఒక మంచి సంగీతరూపకంగా పేర్కొనదగినది.

శ్రీ వింజమూరి శివరామారావుగారు సంగీత రూపకాలను ఎన్నో ప్రసారం చేశారు. వీరు వ్రాసిన నాటకాలలో 'స్నేహశీలి', 'నాగార్జున సాగర్' వంటివి ప్రఖ్యాతమైనవి.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి "శివతాండవం" వంటి సంగీత రూపకాలు చాలా అపురూపమైనవి. చాలా అరుదుగా కాని మనం అటువంటి రూపకాలను వినము.

అబ్బూరి రామకృష్ణారావుగారి "నదీసుందరి", కరుణశ్రీ గారి "అమరావతి", స్వర్గీయ నార్ల చిరంజీవి గారి "భాగ్యనగరం", "మేఘసందేశం". కేశవపంతుల నరసింహశాస్త్రిగారి "గిరిక" ఎన్నతగ్గ సంగీత రూపకాలు.

పాలగుమ్మి విశ్వనాథంగారు "ఎంకి అలక" "సంగీతపు చెట్టు" వంటి అనేక చక్కని సంగీత రూపకాలను వ్రాసారు. కీర్తిశేషులు శశాంక వ్రాసిన పచ్చతోరణం, దీపలక్ష్మి, నల్లనయ్య, వసంతశోభ కూడ ప్రజాదరణ పొందిన సంగీత రూపకాలు. శ్రీ బాపురెడ్డి వ్రాసిన సంగీత రూపకాలలో "సాగర సౌధం" ఎంతైనా చక్కని సంగీత రూపకం. "విజయహేల", "కల్యాణయాత్ర", "రాకెట్ రాయబారం", "భావిజీవాలు" శ్రీ బాపురెడ్డి వ్రాసిన మరికొన్ని సంగీత రూపకాలు.

ఈ రకంగా వ్రాస్తూపోతే మరెన్నో సంగీత రూపకాలను గురించి ప్రస్తావించవలసి ఉంటుంది. వస్తు విస్తరణ భీతితో వాటినిగురించి ముచ్చటించక పోవడమేగాని ఈ సంగీత రూపక రచనా క్షేత్రంలో ఎవరినైనా చేర్చకపోయి ఉంటే అది ఉద్దేశపూర్వకం కాదని గ్రహించమని కోరుతున్నాను.

మొత్తంమీద తెలుగులో సంగీతరూపకాలను స్వీకరించి సంగీతాభిమానులైన శ్రోతలకు అందజేయడం ఎంతైనా అవసరం.

# సురభి నాటక సమాజాలు

మల్లాది వేంకటకృష్ణశర్మ



నభై సంవత్సరాలుగా ఆంధ్రదేశంలో నాట్యకళయే
వృత్తిగా కుటుంబాలతో నాటక ప్రదర్శనాలిస్తూవర్య
చే సురభివారు చాలామందికి సుపరిచితులే. ప్రత్యే
గా నాటకాలపైనే జీవించే ఒక జాతి ఆంధ్ర
ష్ట్రంలో తప్ప యితరరాష్ట్రాలల్లో లేవనుకుంటాను.
లామంది పెద్దలు ఇంకా సురభికంపెనీలున్నాయా?
ఖ్యాతామెరిగిన "జుబ్బూటి వెంకూబాయి" హీరోయిన్
పాబాయి - రామాబాయి - పార్వతీబాయి మొద
న సురభికంపెనీ పూర్వ నటీమణుల గురించి
ప్పగా చెప్పుకుందుట మాత్రమే జరుగుచున్నది.
ంధ్రనాటక కళాపరిషత్సంస్థాపకులు - ఆంధ్ర
టక రంగోద్ధారకులు స్వర్గీయు వనారస గోవింద
వు గారి ద్వారా సురభివారు దేశానికి పరిచిత
నప్పటికీ విద్వద్విమర్శకుల వృష్టిని వారాకర్షించలేక
యారు. కాని యీనాడు సురభి కంపెనీలు ఒకనాటి
స్థితులకు చాలా భిన్నమైనవని చెప్పక తప్పదు.

1869 సం॥లో కడపజిల్లా రాయచోటి తాలూకా
రభి'అనేచిన్నగ్రామంలో "శ్రీశారదా మనోవినోదినీ
ంగీత నాటక సభ" యనుపేర శ్రీ వనారస వెంకోజీ
శ్రీ వనారస గోవిందరావుగారి తండ్రి)గారిచే నెలకొల్ప
డినసురభి సమాజము నేడు తొమ్మిది పెద్ద కంపెనీలు
ను ఇరవై ఏడు చిన్న కంపెనీలుగను రూపొందినది.

పెద్ద కంపెనీలు అనగా, సంచార యోగ్యమైన టిన్నురేకు హాలు-ఎలక్ట్రిసిటీ, సౌండ్ సిస్టమ్, ఆధునిక యంత్రాలు, తెరలూ దుస్తులూ కలిగి ఏనాటకానికానాటకం ప్రత్యేకసీనరీ సెట్టింగులతో పది పండ్రెండు నాటకాలు ప్రదర్శించగలిగే సమాజాలు తొమ్మిది సురభి సమాజాలు విశాలాంధ్రలో వివిధ ప్రాంతాలలో సంచరిస్తున్నవి. గ్రామానికి పది పండ్రెండు నాటకాలు ప్రదర్శిస్తూ నెలదినాల వరకు ఒక గ్రామంలో ఉంటూ మరొక గ్రామం వెళ్ళడం వారికి పరిపాటి. పదిహేను వందల మంది కూర్చొనుటకు తగిన టిన్నురేకు హాలూ-ప్రేక్షకాగారానికి కావలసిన కుర్చీలు, బెంచీలు, బల్లలూ మొదలైనవి ఇవిగాక సింహాసనములూ-తెరలూ, సెట్టింగులూ-ఇంజన్-లైటింగ్ సామాగ్రి మొత్తం ఆరునుండి పదిలారీల సామానుతో-రమారమీ అరవై మంది స్త్రీ బాలవృద్ధులతో నిరంతరం గ్రామ గ్రామాలు సంచరించే నాటకసంస్థ సురభివారిది. వారి సమాజ నిర్వహణ పద్ధతులూ-వారి నాటక ప్రదర్శనా విధానం ముఖ్యంగా నాటక కళాకారులకు ఆదర్శమైనవని చెప్పక తప్పదు.

విశాలమైన ఆవరణలో వారు నాటకశాల వేస్తారు. ఆ ఆవరణలోనే కుటుంబాలు నివసించడానికి టిన్నురేకు షెడ్లు వేస్తారు. ఒకప్పుడు దేశం మొత్తంమీద

రెండు మూడు సమాజాలున్నప్పుడీ కుటుంబాలకు రాబడిలో భాగాలుండేవి. కాని యిప్పుడందరికీ జీతాలే. ఒక్కొక్క కంపెనీలో రమారమీ అరవైమంది స్త్రీ, పురుష, బాల, వృద్ధులుంటారు. అందరూ కష్టపడి హాలు వెయ్యడంలోనూ, తియ్యడంలోనూ, రంగస్థలంలోనూ, బయటా హెచ్చు తగ్గులు లేకుండా కష్టపడతారు. ముఖ్యంగా ఇంజన్‌పని చేసేవారు, హార్మోనిస్టు తదితర టెక్నీషియన్లు సురభివారే ఉంటారు. వారు ప్రదర్శించే నాటకాల్లో వేషాలు అందరికీ క్షుణ్ణంగా వచ్చి ఉంటాయి. స్త్రీలు స్త్రీపాత్రలు ధరిస్తారు. అన్నిరకాల వయస్సులవాళ్ళూ ఉండడంచేత ఏ వయస్సుకి సరిపోయే వ్యక్తులా పాత్రలు ధరిస్తారు. వేషధారణాదులలో వారు సిద్ధహస్తులు. ఉన్నంతలో చక్కగా అలంకరించుకొని పాత్రోచితంగా తయారవుతారు. గ్రీన్‌రూమ్‌లోగాని ప్రదర్శన సమయాల్లోగాని ఎప్పుడూ హెచ్చు తగ్గులుండవు. బాధ్యతతో ఎవరి పనులు వారు నిర్వహించి ప్రదర్శన విజయానికి తోడ్పడతారు. అవసరాన్ని బట్టి పెద్దవేషాలు వేసేవారు చిన్నవేషాలు, చిన్నవేషాలు వేసేవారు పెద్ద వేషాలు వేస్తూఉంటారు. ఇప్పుడన్ని పెద్దకంపెనీల్లోనూ పాఠశాలలున్నవి. సమాజానికి పదినుండి పాతిక వరకూ బాలబాలికలా పాఠశాలలోనే చదువుతూ ఉంటారు. ఉదయం మొదలు సాయంత్రం వరకు వారి హాలు గురుకులంలాగు కన్పిస్తుంది. ఒకదగ్గర బడి, ఇంకోచోట కర్టెన్లూ, సెట్టింగులూ రాసే చిత్రకారులు-సింహాసనాలు, కిరీటాలు, విగ్గులూ తయారుచేసేవారూ, మరొకచోట హార్మోనిస్టు వద్ద పద్యాలు, పాటలూ ప్రాక్టీసు చేసేవారు, మరొక దగ్గిర డ్రస్సులు కుట్టేవారు, ఈ విధంగా రంగస్థలానికి కావల్సిన కార్యకలాపములలో నిమగ్నులై ఉంటారు. రాత్రి నాటకంలో జరిగిన పొరపాట్లను మేనేజరు పొరపాట్లు చేసిన వారిని పిలిచి వివరంగా విమర్శించి చెప్పి మళ్ళా అట్టివి జరగకుండా చేస్తారు. గేటుదగ్గర బుకింగ్ వద్ద, ఎడ్వర్‌టైజుమెంటుకీ ఇతర శాఖలకు ఒక్కొక్క ప్రధాన వ్యక్తి బాధ్యత వహిస్తాడు. ఎవరి పనివారు బాధ్యతతో నిర్వహిస్తారు. నాటకం జరుగుతున్నప్పుడు లోపల తెరలు లాగేవారూ, సీను ఏర్పాటు చేసేవారు, వైర్ వర్కులూ-ఫోకసింగులూ, ధ్వనియంత్రాలు మొదలైన నేపథ్య కార్యకలాపములు నిర్వహించేవారు చాలమంది ఉంటారు. వేషాల్లోఉన్నా స్త్రీ పురుష విచక్షణ లేకుండా ఒకరికొకరు సహకరిస్తారు. ప్రదర్శనం కాగానే డ్రస్సులు యథాస్థానంలో భద్రపరిచే వారు, స్త్రీలకు వేరుగా పురుషులకు వేరుగా యిద్దరుంటారు. నాటకంలేని రోజున రాబోయే నాటకం రిహార్సిల్సు చేస్తారు. ఏనాటకానికా డ్రస్సులూ, సీ లూ సెట్టింగులూ, వైర్ వర్కులూ ప్రత్యేకంగా ఉంటాయి. కనుక నాటకం లేని రోజు రంగస్థలం మీద అవసరాన్ని బట్టిఅన్నీ సిద్ధంగా ఉంచుకుంటారు.

స్త్రీ పురుషులంతా ప్రతి నాటకం ప్రాంప్టింగు చెయ్యగలరు.అందరికీ అన్నిపాత్రలువచ్చి ఉండటమే కాకుండా అభినయ విధానంలోనూ ఉచ్చారణ క్రమంలోనూ తెరచాటు నుండి తోడుపడుతూ ఉంటారు. ఎవరో ఒకరు నాటకం పుస్తకం చేతితో పట్టుకొనే ఉంటారు. సీనుకీ సీనుకీ విరామం లేకుండా కనురెప్పపాటులో లైట్లు ఆర్పి సీను ఎత్తుతూ ఉంటారు. అది వారి ప్రత్యేకత. కొన్ని పెద్ద సమాజాలు ఇటీవల ట్రాలీస్టేజీ యేర్పాటు చేసినై. వీటి ఉపయోగం శ్లాఘనీయమైనది. రంగస్థలంమీద నాటకం జరుగుతూ ఉండగా ట్రాలీమీద మరొక సీనుకి కావలిసిన ఏర్పాటు చేసికొని రంగస్థలం మీద సీను ముగిసినంతనే కనురెప్ప పాటులో యీట్రాలీ స్టేజీని చక్కగా సురభివారు వినియోగిస్తారు.

సురభివారు ప్రదర్శించే నాటకాలు ప్రత్యేకంగా వారికోసం వారికి కావలిసిన పద్ధతిలో కవులచేత వ్రాయించుకుంటూ - ఆ కవుల వల్లనే తరిఫీదు పొందుతూ ఉంటారు. కంపెనీ స్వజనాన్ని బట్టి

ారి శక్తి సామర్థ్యాలను బట్టి యే నాటకాలు యే విధంగా వ్రాయాలో వారు కవులతో సంప్రదిస్తారు. సించి దుస్తులూ, సీనులూ, వైరువర్కులూ చూపించడా నికి వీలుండే నాటకాలు వారికి చాలా యిష్టం. ఒక క్రొత్త నాటకం ప్రాక్టీసు ప్రారంభించారంటే ఆ నాటకానికి కావలసిన సీనూ, సెట్టింగులూ, డ్రస్సులూ తయారుచేసే పనివారుకూడా వచ్చి పని ప్రారంభి స్తారు. ప్రథమ ప్రదర్శనానికి అన్నీపూర్తి చేసు కుంటారు. వారికి లగ్నాలూ, ముహూర్తాలూ, వీటిపై నమ్మకారం యెక్కువ. పూర్వ సంప్రదాయాల్లోనే రంగపూజా ప్రార్థనాదికములు నెరవేరుస్తారు. ప్రథమ ప్రదర్శనం కాగానే కవిని సత్కరించి పంపివేస్తారు. ఇది సనాతనంగా వస్తున్న ఆచారం.

సురభి వారితో నాకు ముప్పదియేండ్లుగా పరిచయం కలదు. చాలా సురభి సమాజాలవారు నా నాటకాలు ప్రదర్శిస్తున్నారు. గత నెలలో న్యూ పూర్ణానందా డ్రమెటిక్ థియేటర్సు అధిపతి నటరాజేంద్ర శ్రీ ఆవేటి నాగేశ్వరరావు గారు నాచేత వసంతసేన, ఉత్తరరామచరిత్ర నాటకాలు వ్రాయించి ప్రదర్శిస్తు న్నారు. ప్రస్తుతం వారి సమాజం గుంటూరు జిల్లా రేపల్లెలో ఉన్నది. శ్రీ శారదా విజయ నాట్యమండలి అధిపతి శ్రీ బాబారావుగారు శశిరేఖ, మాయాబజార్, భూకైలాస్, దేవదాసు, బాలనాగమ్మ, నాటకాలు వ్రాయించి ప్రదర్శిస్తున్నారు. వారికంపెనీ గుంటూరు జిల్లా మంగళగిరిలో నున్నది. శ్రీ గోవిందరాయ సురభినాటక సమాజం అధిపతి వనారస సుబ్బారావు గారు అలెగ్జాండరు, ప్రతిజ్ఞ నాటకాలు నాచే వ్రాయించి ప్రదర్శిస్తున్నారు. వారి కంపెనీ కర్నూలు జిల్లాలో నున్నది. శ్రీ వెంకటేశ్వర నాట్యమండలికి సురభి, ఆర్. వెంకట్రావుగారు సమాజాధిపతి. కృష్ణవేణి ఫ్రీ నాటకాలు నాచే వ్రాయించి ప్రదర్శిస్తున్నారు. ప్రస్తు తం వారి కంపెనీ, ఏలూరువద్ద జంగారెడ్డి గూడెంలో ఉన్నది. ఈ సమాజాలన్నీ యెవరికివారివే. అందరికీ ప్రత్యేకంగా టిన్నురేకు హాలులు ఎలక్ట్రిసిటీ మొద లైన అన్నీ హంగులూ ఉన్నాయి. పెద్ద సమాజాలన బడే తొమ్మిది సమాజాలు ఒకే వరవడిలో నడుస్తాయి. హాలు స్వరూపం-నాటక ప్రదర్శనా - విధానం ప్రార్థ నాదికాలూ అన్నీ అందరివీ ఒకే విధంగా ఉంటాయి. ప్రస్తుతం ఆంధ్ర దేశంలో తొమ్మిది పెద్ద సమాజాలు ఇరవైఏడు చిన్న సమాజాలు సంచారం చేస్తున్నవి. రమారమి 70 సంవత్సరములుగా అవిచ్ఛిన్నంగా నడుస్తూన్న సురభి కంపెనీల గురించి ప్రభుత్వంకానీ, నాటక కళాభిమానులుకానీ, కళా సంస్థలు కానీ, కల్పించుకోకపోవడం శోచనీయం. వారికి రంగ స్థలమే జన్మభూమి. వారి మనుగడ రంగస్థలం. వారి అంతిమ విన్యాసం రంగస్థలం. ఎన్నో కుటుంబాలు, ఎన్నో సంవత్సరాలుగా నాటక కళ నారాధిస్తూ నాటక రంగాన్ని నమ్ముకొని జీవిస్తూ నాటక కళ కాహుతి చెందుతూన్న వారిని గూర్చి కళాభిమానులకు కొంత కర్తవ్యము ఉన్నదని జ్ఞప్తికి తెస్తున్నాను.



# సురభి

గుడిపూడి శ్రీహరి

మరో ఏడేళ్ళు గడిస్తే సురభి వయస్సు నూరేళ్ళు. ప్రపంచ రంగస్థల చరిత్రలోనే సురభి నాటక సమాజం ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొంది. ఆంధ్ర నాటక రంగస్థలానికి 'సురభి' నూరేళ్ళ పంట.

అయితే సురభి నాటకసమాజం 'మరో ప్రపంచంలో' బ్రతుకుతోందని చెప్పాలి. ఆంధ్రప్రదేశ్‌లో మారుమూల గ్రామాలలో గ్రామీణులకు చక్కటి వినోదాన్ని అందిస్తున్న ఈ సురభి సమాజాలు పుట్టినప్పటినుంచీ ఈ రోజువరకూ ఎన్నో బాధలనుభవిస్తూ తమ కాళ్ళమీద తాము నిలబడగలగటానికి ఈ రోజుకూ చుట్టూ వున్న ప్రపంచంతో, ప్రభుత్వంతో ఘర్షణ పడుతున్నాయి. నిలదొక్కుకుంటున్నాయి. 'మాకు వారి సహాయం కావాలి...వీరి సహాయం కావాలి' అంటూ ఘోషించే మిగిలిన రంగస్థల సమాజాలలాగా కాకుండా— 'మాకే సహాయం వద్దు. మా బతుకు తెరువుకు మాత్రం మీరడ్డం పడొద్దు' అంటూ అర్థించే ఈ సురభి సమాజాలు ఈ నాటికీ నగరవాసులు చాలా మందికి ఓ వింత!

మొన్నీ మధ్యనే సురభి భాగ్యవిధాత, పూర్వ పురుషుడు వనారస గోవిందరావు వర్ధంతిని సురభి నాటక సమాజాల వారంతా కలసి హైదరాబాద్‌లో జరుపుకొన్నప్పుడు వారి 'మాయా బజార్' నాటకాన్ని ప్రదర్శించడం జరిగింది. వారి అపూర్వ కళా కౌశలానికి నగర ప్రేక్షకులు అడుగడుగునా హర్షధ్వానాలు చేశారు. వారి సాంకేతిక పురోగతికి జోహార్లర్పించారు. "సురభి" అంటే ఎవరు అని అడిగిన నాటక రంగ ప్రియులు కొందరు లేకపోలేదు.

వీరి నాటకాల్లో విష్ణుమూర్తి తదితర దేవుళ్ళు - తపస్సు చేస్తున్న భక్తుడికి క్షణంలో ప్రత్యక్ష మవుతారు. నారదుడు ఆకాశ సంచారం చేస్తూ రంగస్థలం మీదికి దిగుతాడు. ఘటోత్కచుడు. ఆకాశం నుంచి నిప్పులు కురిపిస్తాడు. వాయవ్యాస్త్రం, ఆగ్నేయాస్త్రం పురాణ కథల్లో విన్నట్లుగా సురభి రంగస్థలం మీద చూస్తాం. గదలూ, బాణాలూ ఆకాశంలో భీషణయుద్ధం చేస్తాయి. ఏనుగులూ, భల్లూకాలూ రంగస్థల అరణ్య దృశ్యాల్లో సంచారం చేస్తాయి. నీళ్ళు తాగుతాయి. మాయల మరాఠీని హతమార్చడానికి బాలవర్ధిరాజు గద్దమీద సాగరాలు దాటుకుంటూ ప్రయాణం చేస్తాడు మంత్రోచ్చారణతో ఒక కమలం వికసిస్తుంది. ముకుళిస్తుంది. ఒకే దృశ్యంలో - రెండు మూడు స్థలాల్లో జరుగుతున్న సంఘటనలు కూడా ఒకేసారి కనబడతాయి. ఇటువంటి దృశ్యాలు ఒక్క సినిమాల్లోనే సాధ్యం! ఈ సినిమాలు రోజు చూసే నగరవాసులే ముగ్ధులైతే - సినిమాల ధాటికి గురవని గ్రామ

గ్రామాల సంగతి వేరే చెప్పాలా? అదే 'సురభి' మాజాల బ్రతుకు తెరువులో మొదటి రహస్యం.

సురభి నాటక సమాజంలో వున్న నటీనటులంతా క్కే కుదురుకి చెందినవారు. చాలా అరుదుగా బయటి రు "నటించి బతకడానికి" ఈ సమాజాల్లో చేరతారు. గ్గుపాలతో రంగరించి నటన పోస్తారు పిల్లలకు- సమాజాల పెద్దలు ! ఈ మధ్య నేనొక గ్రామా కి వెళ్ళి అక్కడ గత నెల రోజులుగా నాటకాలు దర్శిస్తున్న ఒక సమాజాన్ని పరిశీలించటం జరి ది. అన్ని సురభి సమాజాల జీవన విధానం ఇదే దిరిగా వుంటుంది.

ఈ సమాజం పేరు గజపతి నాట్యకళా మండలి. రంగస్థలాన్ని రేకులతో ఒక పొలంలో నిర్మిం రు. మొత్తం థియేటర్ని ఒక డిర్నించి మరొక రికి నాలుగు లారీల్లో తరలించవచ్చు. దాదాపు న్నడ, తమిళ రంగస్థలాల్లో పొలాల్లోనే వీరు రంగ న్ని నిర్మిస్తారు. స్టేజీ వెడల్పు 45 అడుగు ంటుంది. ఎత్తు 30 అడుగులు. స్టేజీ ఆరుబయట ంతో సమానంగా ఉంటుంది. దీనివల్ల బయట ండీ తీసుకురావలసిన వాహనాలు కాని, రథాల టి నాటక ప్రదర్శనకు అనుపయ్యే హంగులుకాని లభంగా స్టేజి మీదకు తీసుకురావచ్చు. స్టేజి ందు నలుచదరంగా వుండే గోతిని తవ్వుతారు. గొయ్యి మొదటి తరగతి ప్రేక్షకులు కూర్చొనే ం. తోడుగా హార్మోనియం, తబలాలు వాయించే ళ్లూ, వాద్య సహకారాల నందించే తదితర వాద్య ళ్లూ ఆ గోతిలో కూర్చుంటారు. మొదటి తరగతి క్షకుల కోసం సురభి నాటక సమాజాల వారంతా మూలు రేకు కుర్చీలు, కొయ్య కుర్చీలు వేస్తారు.

గోతిలోంచి తీసిన మట్టి వెనక్కి చల్లుకుంటూ తారు. వెనక్కు పోగా స్థలం ఎత్తవుతుంది. దటి తరగతి తరువాత రెండవ తరగతి ప్రేక్షకులు కూర్చోడానికి చాపలు ఏర్పాటు చేస్తారు. ఆ వెనకాల కూర్చొనే మూడవ తరగతి పుడమి ఒడి. దాన్ని నేల టిక్కెట్టంటారు. మిగిలినవి కుర్చీ టిక్కెట్టు, చాప టికెట్టూ అన్నమాట.

మొత్తం థియేటరు 48 అడుగుల వెడల్పూ 150 అడుగుల పొడవూ వుంటుంది. చుట్టూతా, పైనా-రేకులు వుంటాయి. రేకులు త్వరగా కట్టడానికి, విప్పడానికి వీలుగా తాళ్ళతోనో, వైర్లతోనో బిగిస్తారు. మేకులు మాత్రం కొట్టరు. స్టేజి మీద మాత్రం పై రేకులు మిగిలిన థియేటర్ కన్నా కూడా బాగా ఎత్తుగా బిగి స్తారు. ఆపై భాగంలోనే సురభివారి సాంకేతిక విద్య అంతా నిక్షిప్తమై వుంటుంది. వైర్లూ,తాళ్ళూ, సామాగ్రి, అంతా అపైనే వుంటాయి. స్టేజీ మధ్యలో కూడా 6 అడుగుల లోతున్న గొయ్యి వుంటుంది. ఈ గోతిలో నుంచే కన్నుమూసి తెరిచేలోగా దేవుళ్ళు ప్రత్యక్షమై బిరాన వరాలు ఇచ్చి మాయమైపోతారు. ఇందుకు తగిన ఏర్పాట్లు ఆ గోతిలో వుంటాయి. నాలుగు రోజుల్లో మొత్తం థియేటరు నిర్మించగలరు. ఒక్క రోజులో థియేటర్ని ఎత్తేయనూ గలరు.

సురభి గొప్పదనం మరొకటుంది. ప్రతి సమా జంలో నటీనటులే కాకుండా - తెరలు తయారు చేసే వారూ, 'ట్రిక్కు' సామాగ్రి తయారుచేసేవారూ, పెయింటర్లూ, సంగీత వాద్య నిపుణులూ కూడా ఎప్పటి కప్పుడు తర్ఫీదవుతూ వుంటారు. ఎవరికి దేనిమీద అభిరుచి వున్నదో గమనించి చిన్నప్పటి నుంచీ అందులో శిక్షణ యిస్తారు.

ఇక థియేటర్‌కి ఒక ప్రక్క టికెట్లు అమ్మడానికీ, మరో ప్రక్క సురభి కళాకారుల కుటుంబాలు నివ సించడానికీ షెడ్లు వేస్తారు. ఈ కుటుంబాలన్నీ బీర కాయ పీచు లాంటివి. అన్నదమ్ముల బిడ్డలూ, బంధు వులూను. అయితే ఎవరిమట్టుకు వారే వేరుగా వుంటారు. భార్యా భర్త ఒక కుటుంబం. వారికి జీతం ఏర్పాటు చేస్తారు ఆ సమాజ ప్రధాన నిర్వాహకులు.

ఈ కుటుంబంతో పాటుకోళ్ళు వగైరా అన్నీకూడా తిరుగుతూ వుంటాయి. వెనకటి రోజుల్లో గొడ్డు గోడా, గుర్రాలూ మొదలైనవి కూడా వెంటపెట్టుకొని 'బంజారాల్లా' తిరిగేవారమనీ, ప్రస్తుత పరిస్థితుల్లో దీనికి వీలుపడక ఆ సరంజామా అంతా తగ్గించామనీ, గణపతి నాట్యకళామండలి అధినేత చెప్పారు.

నాటకం మొదలు పెట్టిందగ్గర్నుంచి, చివరివరకూ చకచకా బిగువుగా నడుస్తుంది. క్షణాల్లో అంకం, దృశ్యం మారడానికి తగ్గ ఏర్పాట్లు వుంటాయి.

'ట్రిక్కు'లు ఎక్కువగా వుండే నాటకాల్నే సాధారణంగా సురభి సమాజాలన్నీ ఎన్నుకుంటాయి. 'మాయాబజార్', కృష్ణలీలలు' ... ఇటువంటివి. ఆ మధ్య 'వీరబ్రహ్మం చరిత్ర' చాలాకాలం నడచిందట. క్షణానికో వింతతో నాటకాన్ని వింపేశారు.

ఒక్కొక్క సమాజం ఒక ఊళ్ళో క్యాంపు వేస్తే నెలల తరబడి నాటకాలాడతారు. వెనుకటి రోజుల్లో రోజుకు రెండాటలు వేసేవారు. ఇప్పుడు చాలామంది రోజు విడిచి రోజు నాటకం వేస్తున్నారు. ఎస్. ఎ. బాబురావు నాటక సమాజం (శారదా విజయా నాట్య మండలి) నల్గొండ జిల్లా 'నేరేడుచర్ల'లో 11 నెలల 20 రోజులపాటు నాటకాలాడింది. సురభి సమాజాల్లో ఇప్పటివరకూ ఇది రికార్డు.

సురభి సమాజాలు ప్రస్తుతం 35 వరకూ వుంటాయి. అయితే వీటిలో 9 సమాజాలు మాత్రం పెద్దవి. దాదాపు అన్నిసమాజాలూ ఇప్పుడు తెలంగాణా ప్రాంతంలో నాటకాలాడుతున్నాయి.

సురభి నాటక సమాజం ఎదుర్కొనే పెద్ద సమస్య 'పోలీసు'లని ఈ సమాజాలవారు చెప్పారు. లంచాలు చదివించుకుంటేగాని పోలీసులు నాటకాన్ని సవ్యంగా సాగనివ్వరు. లేకపోతే కంచే చేను మేసినట్లు పోలీసులే రాళ్ళ వర్షం కురిపించడానికి ఏర్పాట్లు చేస్తారు. లేకపోతే 'చుట్టుపట్ల ఊళ్ళల్లో జరిగే దొంగతనాలకు మీ నాటకాల కంపెనీయే కారణ'మంటారు. ఎందుకంటే నాటకాలు చూడ్డానికి జనం ఊళ్ళు వదలి వస్తారు కనుక దొంగతనాలు చేయడం – సులభమని. కొన్ని ప్రాంతాల్లో ముఖ్యంగా ఆంధ్రలో–పోలీసు అధికారులు సైతం సురభి నాటక ప్రదర్శనలకు ముగ్ధులై ఫాన్లు వంటివి బహూకరించిన సంఘటనలూ వున్నాయి. అటు వంటి ఫాన్లు నేను వెళ్ళిన నాటక సమాజంవారి థియే టర్ల పైన తిరుగుతూ కనిపించాయి.

ఈ నాటక సమాజాలకు మూలపురుషునిగా వనారస గోవిందరావు పేరు చెప్పుకుంటారు. కానీ అతనికి కూడా ఈ కళలో ఆద్యులున్నారు. 1860లో వనారస సంజీవరావన్న వ్యక్తి మహారాష్ట్రనుంచి ప్రభుత్వం యిచ్చిన ఈనాములు పుచ్చుకొని రాయలసీమలో వ్యవసాయదారునిగా స్థిరపడ్డాడు. వీళ్ళు వస్తుతః ఆరె కాపులు. సైనికులుగా పనిచేస్తూ ఉండేవారు.

ఈ సంజీవరావు ఒకానొక సందర్భాన తన ఆస్తంతా సోదరులకు రాసిచ్చి కాళికాదేవికి తనని తాను బలి యిచ్చుకున్నాడు. ఫలితంగా సంజీవరావు పిల్లలు దరిద్రులయ్యారు. బతుకు తెరువు కోసం ఏం చెయ్యాలా అని ఆలోచించి తోలు బొమ్మలాట నేర్చుకుని ప్రదర్శనలివ్వడం ప్రారంభించారు. సంజీవరావు పిల్లల్లో రెండోవాడు వెంకోజీ. ఆయనకు పిల్లల్లేరు. దిక్కూ మొక్కూ లేక, మశూచి రోగంతో చావు బతుకుల్లో వున్న ఒక పిల్లాడ్ని ఏదో ఊళ్ళో చూసి చేరతీశాడు వెంకోజీ. కుర్రాడికి నయం చేయించి, చివరికి అందరి అనుమతితో పెంచుకున్నాడు. ఆ కుర్రాడే సురభి భాగ్యవిధాత వనారస గోవిందరావు. ఒకానొకనాడు పూనాలో ఒక నాటకాన్ని చూసి ముగ్ధుడయ్యాడు. ఎవరికీ చెప్పకుండా యింట్లోంచి పారిపోయి నాటకాల్లో చేరాడు. తల్లిదండ్రులు ఆ పిల్లవాడిని యింటికి తీసుకువచ్చి పెళ్ళి చేశారు. గోవిందరావు కొంతకాలం తరువాత మరో పెళ్ళికూడా చేసు

కున్నాడు - పెళ్ళాం చెల్లెలినే : ఈ యిద్దరూ ఆవేటి కుటుంబానికి చెందిన పెద్దసుబ్బమ్మ, లక్ష్మమ్మ. ఈ వనారస కుటుంబం 1889 వ సంవత్సరంలో తోలు బొమ్మలాట వేయమంటే ఒక వూళ్ళో తమాషాకి స్టేజి నాటకం వేశారు. అదే మొదటి తెలుగు నాటకం 'కీచకవధ'. వేసింది కడపజిల్లా రాయచోటి తాలూకా లోని 'సొరుగు' అన్న గ్రామం. అది ఆ తరువాత "సురభి" అయింది. అప్పటినుంచే సురభి నాటక సమాజం ఒక పెద్ద ఉద్యమంగా మారింది-ఈ నాటికీ మూడు పువ్వులూ ఆరు కాయలుగా విలసిల్లుతోంది. "సురభి కుటుంబం" వేరుపడితే పంచుకునేది ఇళ్ళూ, భూములూ కావు. కర్టెన్లు, బాణాలు, గదలూ, వాయిద్యాలూ వగైరా...కుటుంబాలు చీలితే సాధారణంగా ఎవరయినా బాధపడతారు కానీ, సురభి కుటుంబం వేరుపడితే సంతోషించాలి. ఎందుకంటే మరో నాటక సమాజం వుద్భవిస్తుంది. ఈరోజున యిన్ని నాటక సమాజాలు తెలుగునాట గ్రామీణులకు వినోదం అందిస్తున్నాయంటే దానికి అదే కారణం.

ప్రవహిస్తున్న నదిలో మరిన్ని పాయలు చేరి నది మరింత పెద్దదయినట్లుగా సురభి సమాజానికి క్రమ క్రమంగా సరికొత్త నటులూ, రచయితలూ ఊతనిచ్చారు. ధర్మవరం సుబ్బదాసు మూడు నాటకాలు రాసిచ్చాడు. ఈ రోజుకూ ఈయన రాసిన ప్రార్థనా గీతమే సురభి సమాజాల వారందరూ పాడుతున్నారు. 1901లో ఈ సమాజం గుంటూరులో మొట్టమొదటిసారి "హార్మోనీ" చూచింది. అప్పటి నుంచీ ఆ వాద్యాన్ని వాడటం ప్రారంభించారు. 1902లో విశాఖపట్నం వెళ్ళినప్పుడు మారేపల్లి రామచంద్ర కవి "బిల్హణీయం" వంటి తమ నాటకాల్లో సురభి సమాజానికి శిక్షణ యిచ్చారు. వఝుల చింతామణి శాస్త్రి తమ 'చంద్రకాంత' నాటకాన్ని యిచ్చారు. ఈ సమాజం బర్మా, మలయా తిరిగి వచ్చిన తరువాత 1910లో మొట్టమొదటిసారిగా మూడు భాగాలుగా చీలింది. ముగ్గురన్నదమ్ములూ రాష్ట్రాన్ని మూడు భాగాలుగా విభజించుకొని తమ నాటకాలు ప్రదర్శించారు. వనారస గోవిందరావు తన తండ్రి పేర వచ్చిన సమాజాన్ని చేపట్టి దానికి 'గోవిందరాయ సురభి నాట్యమండలి' పేరుతో ఏలూరు ప్రధాన కేంద్రంగా నిర్వహించటం ప్రారంభించారు. ఒక అగ్ని ప్రమాదంలో గోవిందరావు గాయపడ్డా సమాజ నిర్వహణ మాత్రం మానలేదు. గోవిందరావు తన ఇద్దరి భార్యలవల్లా కలిగిన 13 మంది సంతానంలో అందరికీ నాటక కళలో తర్ఫీదు ఇచ్చాడు. వీరిలో పదిమంది ఆడపిల్లలు. ముగ్గురు మగపిల్లలు. విశ్వనాథకవిరాజు గోవిందరావుతో చేతులుకలిపిన తరువాత ఈ నాట్యమండలి మరింత వికశించినది. 1929లో వీళ్ళు "ఆంధ్రనాటక కళాపరిషత్తు" స్థాపించారు. సమాజాల నన్నింటినీ ఒకే తాటిమీదకు తీసుకు రావాలని గోవిందరావుకు "ఆంధ్ర నాటక పితామహ" బిరుదు లభించింది. మల్లాది వెంకట కృష్ణశర్మ దాదాపు 15 నాటకాలు రాసి గోవిందరావుకు ఇచ్చాడు.

గోవిందరావుతో కలసి వున్న చిన్నరామయ్య విడిపోయి 1928లో తన సొంత సంస్థను ప్రారంభించారు. ఇక అక్కడి నుంచి ఈ నాటక సమాజాలన్నీ ఇంకా చీలిపోతూ-అనేక పటిష్టమైన సమాజాలుగా రూపొందాయి.

ప్రస్తుతం సమాజాలన్నీ ఒక సంఘాన్ని ఏర్పరచుకున్నాయి. యస్. ఎ. బాబారావు ఆ సంఘానికి అధ్యక్షుడు. ఈ సంఘ కార్యాలయం హైద్రాబాద్‌లో వుంది.

"సురభి జెండా" ఒక్క ఆంధ్రప్రదేశానికే కాదు. యావద్భారతానికీ, యావత్ప్రపంచానికీ గర్వకారణం.

రాష్ట్రంలో నిర్మించబోయే రంగస్థలాలన్నీ సురభి రంగస్థలం కొలతల్లో నిర్మిస్తే బావుంటుంది. ఈ కొలతల్లోనే అటు తమిళము, కర్ణాటక రాష్ట్రాల్లో కూడా రంగస్థలాలు నిర్మించబడ్డాయి. నిర్మించబడుతున్నాయి. దీనివల్ల భారీసెట్లు వేయడానికి, ట్రిక్ ఎఫెక్ట్సు చూపించడానికి వీలవుతుంది. యిటువంటి రంగస్థలాలు లేకపోవడంతో సురభివారు తమ నాటకం అప్పుడప్పుడన్నా నగర వాసులకు చూపించడానికి వీలవడంలేదు.

ఈ విషయంలో సురభివారు ఎదుర్కొంటున్న మరో ఇబ్బంది-మైక్ లైసెన్సు సులభంగా లభించక పోవడం. మైక్ వక్కటే వారికి పబ్లిసిటీ ఆయుధం. ఈ విషయాలు ప్రభుత్వం ఆలోచించాలి. *

నటాగ్రణి

# స్థానం నరసింహారావు

- పసల సూర్యచంద్రరావు

యుగయుగాలుగా నడచిపోతున్న ఈ విశ్వనాటక రంగముపై ఎందరెందరో మహామనీషులు వేరు వేరు భూమికలలో అగుపిస్తూ తమ తమ జన్మాంతర వాసనాఫలమునననుసరించి వివిధ రీతులలో, నటన నొనర్చి లోకానికొక సందేశాన్నందిస్తూ తరలిపోతున్నారు. ఇది కాలగతిలో సహజము; అనివార్యము! ఇది లోకధర్మము!!! ఉన్మీలిమైన ప్రతి జీవి, లోకంలోనికి అడుగిడేటప్పుడే. తన స్థానమును వెదుక్కొంటూ వస్తాడు. నిర్ధారించుకొంటాడు. స్థానం ఏర్పరచుకొన్నాక, నిలువ ద్రొక్కుకొని వికసిస్తాడు. వికసించి ప్రకాశాన్ని వాసనలను వెదజల్లి పోతాడు. లోకం కొరకు తన విధి నిర్వహణ కొరకూ కూడా!

విశ్వ విలసితమైన, ప్రతి రూపమునందూ, సౌందర్యమూ, లావణ్యమూ, ఎంతోకొంత పాలు వుంటుంది. దీనినే కళా విలసనము అంటారు ప్రజ్ఞానులు. ప్రకృతితో పెనవైచుకొన్న ఈ కళా సౌందర్య లావణ్యములు అంతర్నిహితములై వుండుటచే సాధన సంపత్తి వలన - పూర్వకర్మ ఫలమువలన, వర్తమాన జన్మయందు తానొనర్చు కళా తపః ఫలము వలననూ ఈ కళావిలసనము బాహిరపడి, ప్రస్ఫుటముగ సర్వులకు గోచరిస్తుంది. అనుభూతుల నందిస్తుంది. సర్వానందదాయకమయి, విశ్వ శ్రేయః సాధనకు చేయూతనిస్తుంది. ఇట్టి అపురూప అవకాశము, శక్తి ఏ కొద్దిమంది మూర్తులకో, లభ్యమై వారి సౌందర్య కళామూర్తి విశ్వమానవ హృదయాలపై మాసిపోని చిత్రమై అనవద్య స్థానమును ఆక్రమించుకొంటుంది. ఇట్టి సత్కళా స్థానమును సృష్టించిన మహనీయులు సర్వదా సంభావ్యులు, వంద్యులు, చిరస్మరణీయులు.

అట్టి కోవకు చెందిన మనీషులలో స్థానం అగ్రగణ్యులు. కళాతపస్సు పరిపూర్తినందినప్పుడే పరమార్థం లభిస్తుంది. జ్వలితమైన భావ ప్రస్తార రంజకతను బాగ హృదయాలలో రేకెత్తించిన తరి తజ్జనిత స్వర్ణకాంతులు భావి యుగాలలో చొచ్చు

1971వ సంవత్సరం ఫిబ్రవరి 21వ తేదీన శ్రీ స్థానం నిర్యాణం చెందారు. ఆ సందర్భంలో అప్పటి "నాట్యకళ" సంపాదకులు శ్రీ పసల వారి సంపాదకీయం ఇది.

కొనిపోయి శ్రేయఃకామియై యశోపరంపరల చేకూరుస్తుంది.

నవమోహనాంగి అంగసౌష్టవమున, కచ, కుచ, కటులెంత వున్నతములగుట ప్రాధాన్యములో వీరికి బాగుగా తెలుసు. వీటి సౌమ్యచలనం, శృంగారాభినయనమున ఎంతగా శోభించుచూ రసిక మనముల చూరగొనునో వీరనుభవమునందినట్లు ఏ సామాన్య స్త్రీయు అంతగా గ్రహించినట్లు తోచదు.

నడకలో, కులుకులో అభినయనమున, కూని రాగమును జోడించుటలో, వొయ్యారములొలికేలా అలంకరణముల అస్తవ్యస్తపరచడంలో ఈ కళావతంసునకు తెలిసినట్లు, రసికత వొలకబోసే ఏ ఆడదానికీ తెలియదు! నాట్యమర్మములను యింతగా గ్రహించి లాలించి పోషించి ఉన్నతోన్నత స్థానములకు గొనిపోయిన ఒక మహానటుడు ఇప్పుడు మనకు లేడు.

వన్నెచిన్నెలలది, మేనుకు ధీటైన చీరకట్టి- గుత్తముగ కంచుకమును ధరించి - పూలగుత్తుల వాల్జడ నింపి - కంటికి కాటుక పూచి - నిత్యనూత్న శోభన కాంతవలె నటస్థలిని నడయాడే సత్యభామలేదు మనకు నేడు.

మధురవాణిగా - చిలిపి చిలిపిగా వలపు వల్లరుల పచరిస్తూ పల్లవుల వుల్లముల రంజిస్తూ వన్నెల విసనకర్రలా నయగారముల వొలక బోస్తూ కలకలా నవ్వుతూ హృదయాలను మెలికలు త్రిప్పగల రంగరత్నము రాలిపోయింది. ముగ్ధమోహన మోహంపు మురుపుల మూటను విప్పిచూపు ముగ్ధత్వములో వచరించు స్త్రీ సహజ ప్రౌఢతలు సామాజిక హృదయ తంత్రులమీటి వివిధానురాగముల ప్రహింపజేయగల విచిత్రవ్యక్తి, చిత్రాంగి వేషధారి చనిపోయినాడు.

ఈర్ష్య, ప్రేమ, నిరాశ, నిస్పృహ - రాజనీతి - సౌందర్యగర్వం - యౌవ్వనపు పరుగులు - వీటి కలయికతో హావ - భావ - వివేక - విలాస భ్రూవిక్షేపములతో - నీల నీరద కుటిల కుంతలముల నీడలలో నిన్ను కాపాడుకొందునను వింత వినూత్న విన్యాసములతో శివాజీ ముందు మోకరించు మోహన మూర్తి రోషనార మనకు కరవైపోయింది శాశ్వతంగా.

మురగా, పొందిన అవహేళన, ప్రతీకారకాంక్ష యందలి దృఢత, సంకల్పనిర్వహణ, క్రమమునందలి కుశలత, దక్షత - తాను భావి సామ్రాజ్య చక్రవర్తికి మాతను కాబోతున్నాననే నమ్మకం - సహజంగా అబలకు గల దుర్బలత్వములు - ఎంతో మెరుకువగా నటిస్తూ - కుమారుని యుద్ధ రంగమునకనుపు తీరు "పరుగిడరా తనయ" అనే పాటలో పతాకస్థాయినందుట చూడదగ్గ సన్నివేశం!

చంద్రమతి, దేవదేవి, చింతామణి, చండిక మొదలగునవి ఇంకా ఎన్నో పాత్రలు ఎన్నెన్నో మెలకువలతో ఎంతో మనోజ్ఞంగా వొయ్యారాలొలికిస్తూ కన్నులకు విందొనర్చిన మధురమూర్తి స్థానం.

లోతైన కళారీతులతో నవరసాలను తూచి ప్రస్తరించే నిశితమైన అత్యుత్తమ కళా కుశలత అతడు ధరించిన ప్రతి పాత్రలోనూ ప్రస్ఫుటంగా గోచరిస్తుంది!

వయసు మళ్ళినా వేషంలో పడుచుపిల్లలా పరవళ్ళు త్రొక్కుతూ నోరూరించే మిత్రుడు స్థానం ఈనాడు లేడు.

ఎన్నో వినూత్న శోభలను, రంజకతలను, కళా రహస్యములను సంతరించుకొన్న కళాస్రష్ట మన స్థానం. ఎందరో ముగ్ధులు కళా పిపాసతో స్త్రీ సహజమగు ప్రౌఢతలనలవరచుకొనుటకై శతాధికంగా వారిని అనుసరించి, ఆశ్రయించి తిరుగుట నేనెరుగుదును.

ఇంత సమగ్ర ప్రతిభాశాలి స్థానం కాలవాహినిలో సప్తనదీ తీరాన్ని చేరేసరికే కళా ప్రవంతిలో లీనమై పోయిన స్థానం మరపురాని మనీషి.

ఆతని పురుషత్వంలో జీర్ణించుకొనిపోయిన సౌమ్య సౌజన్య సౌందర్య కళాకాంతా పసిడి ప్రతిమను ఆంధ్ర నాటక రంగస్థల రజితగద్దెపై ప్రతిష్ఠించగల ప్రజ్ఞాప్రాభవ కీర్తులు వారికే దక్కినవి. చిర స్మరణీయులైన శ్రీ పద్మశ్రీ స్థానం నరసింహారావు గారి కళాత్మ సర్వత్రా సర్వకాలములలోను ఆంధ్ర నాటక కళాకారుల రసహృదయముల నుత్తేజ పరచు చుండుగాక!

ఆతని నటనావైదుష్యమునందలి విలాసములు, విభ్రమములు అవలోకనములు కులుకుల చిలకరించు పలుకులు ప్రేక్షకులకు గిలిగింతలు పెట్టి ఉక్కిరి బిక్కిరి చేస్తవి. అంతటి ప్రజ్ఞ, ఉపజ్ఞవుంది స్థానం వారి కమనీయములగు భూమికానిర్వహణ పటిమలో.

రచయితగా, నటాగ్రణిగా, నిర్వాహకునిగా, రస గ్రహణ పారీణగుణిగా, కళాశీలిగా, స్నేహశీలిగా శ్రీ స్థానం జన్మ సార్థకత నందినది.

ఆతని కీర్తికాంత కళాకాశములో దిగంతముల నిండి-మంజుల మధుర నిక్వనముల నినదలింపులతో నిత్యము ప్రతి కళాకారుని కర్ణపుటములలో గింగురు మంటుంది.

అట్టి కళాధుని - ఆప్తమిత్రుని యొక్క ఆ మధుర మంజుల స్మృతులకు, ఆ కమనీయ సౌందర్య స్థితులకు, ఆ శృంగార సింగార కళా స్వరూపములకు, నవనవభావ విన్యసనమునందలి స్నిగ్ధలలిత ఆంగిక రీతులకు, పలుకు పలుకున తేనెలొలుకు వాచికము నందలి సాత్విక సంస్కారమునకు, మాధుర్యంగా, కర్ణపేయంగా, కమ్మగా కళాపిపాసుల కౌగలించుకొని సర్వాంగాన్ని పుల్కరింపచేసే భావాభిరంజికమైన సంగీత విన్యసనమునకు నా నమోవాకములు !!

అస్తు ! శాంతిరస్తు !

# భరతకళాప్రపూర్ణ

# శ్రీ వేదాంతం రాఘవయ్య

—భాగవతుల రామకోటయ్య

...రతీయ సశాస్త్రీయ సాంప్రదాయక నాట్యములలో ...[illegible]... కూచిపూడి ...ట్యమునకు, మూలమగు కూచిపూడియను ...మమునందు, నాట్య ప్రతిభలో, దేశం ...మూలలందేగాక, సుప్రసిద్ధ నాట్యకళా ...రులు, నాట్యాచార్యులును ఉద్భవించి ...తి గడించిన, ఆ గ్రామములోనే, నాట్య ...వేత్తలందరిచేతనూ, నాట్యమునందు ... పురుషుడనిపించుకొని అపరసిద్ధేంద్రుడే ...రల ఆ గ్రామము నందుద్భవించినాడని, ...టి ఆ గ్రామ కళాకారులందరిచే పిలువ ...న శ్రీ రాఘవయ్యగారు, నాట్యము ...దు నాటినుండి నేటివరకు ప్రసిద్ధి జెందిన ...దాంతం వారి కుటుంబములలో కీ॥ శే॥ శ్రీ ...దాంతంరామయ్య, శ్రీమతి అన్నపూర్ణ ...గారలకు ప్రథమ పుత్రుడుగా, 8-6-1919 వ సం॥ న జన్మించిరి.

... కూచిపూడివారు ప్రదర్శించే యక్షగానాలు ...ు, (1) ప్రహ్లాద, (2) రామనాటకము, ...) హరిశ్చంద్ర (4) మోహినీ రుక్మాంగద, ...) ఉషాపరిణయము, (6) శశిరేఖా పరిణ...యము (7) గయనాటకము. వీటిలో ఒక్క ప్రహ్లాద నాటకము మాత్రము, మూడు రాత్రులు ప్రదర్శించేవారు. వీని అన్నింటిలోను నటించి అనితర సాధ్యమైన ఖ్యాతిని గడించారు రాఘవయ్యగారు.

రాఘవయ్యగారు, తన ఐదవయేట అక్షరాభ్యాసముతో బాటు, నాట్యము- నాట్యానికి కావలసిన నృత్య సంగీతము - నాట్యపితామహులగు కీ॥ శే॥ శ్రీ చింతా వెంకట్రామయ్యగారి వద్ద ప్రారంభించి, అచిరకాలములోనే, అనగా, తన ఏడవఏటనే, రంగస్థలంపై మూడు రాత్రుల ప్రహ్లాదుడు గాను, కుశలవుల పాత్రలలో ఏదో ఒకటిగాను, లోహితాస్యుడు గాను, ధర్మాంగదుడుగాను, మొదలగు బాలల పాత్రలను ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పును బొందెడివారు. ఒకప్పుడు మచిలీపట్టణములో పురప్రముఖులచే నిర్వహింపబడు "శ్రీ సీతారామ కళ్యాణ" మహోత్సవములందు చింతా వెంకట్రామయ్యగారి సమాజము ప్రదర్శించిన మూడు రాత్రుల ప్రహ్లాద నాటకమునందు ప్రహ్లాదుడుగా, హావ, భావ, రాగ, తాళయుతముగా తానొక్కడే ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పును బొందిరి. ఆ సభలకు అధ్యక్షత వహించిన, జిల్లా కలెక్టరగు

శ్వేతజాతీయుని చేత, రాజ లాంఛనము గల ముఖమల్ చమ్కీ సూటును, రాజ ముద్ర గల బంగరు పతకమును బహుమతిగా బొందిరి. అదియే ఆయనగారి వేదికపై తొలిప్రదర్శనము. అప్పటికి ఆయనకు ఏడేండ్ల వయసు. అది ఆయన ప్రతిభకు తార్కాణము.

అప్పటినుండి ఆయన, తన పదిహేనవ సంవత్సరము వరకును, బాలల పాత్రలనే ధరించుచూ, షుమారు ముప్పది బంగారు పతకములు బహుమతులుగా బొందినారు. రాఘవయ్యగారు, బాల్యమునుండి, సమ, ఎదురు విషమ లయలను, కీర్తనలలో చొప్పించుట గాని, ఐదు జాతులయందు గల తాళములను అనులోమ, విలోమక్రమసరళిగా, హస్తపాద విన్యాసములతో పకడ్బందీగా, నృత్యము చేయుట గాని, మన నాట్య సాంప్రదాయ మగు, శాస్త్రీయ. నృత్య సంగీత మందు గల యక్షగాన దర్వులను, కందార్థములను, భుజంగ ప్రయాతములును, పంచచామరము లును, శ్రీకృష్ణలీలా తరంగములును, క్షేత్రయ పదములును, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలును, జావళీలును, పుష్ప బాణ విలాస మందుగల సంస్కృత శ్లోకములను, శాస్త్ర బద్ధము తప్పకుండ, ఎప్పటికప్పుడు నూతన సరళిగా, గాన మొనర్చుట ఆయన ప్రత్యేకత.

ఆర్ష విద్యలకు జీవితాన్ని అంకితం జేసే ప్రతిభావంతులకు. కాలముకూడా కలిసివచ్చు నన్నట్లు, రాఘవయ్యగారి ఉషాకన్య పాత్ర ధారణ ప్రథమముగా, గుడివాడ తాలూకా పెదపాడు గ్రామములో, ప్రఖ్యాత హనుమదోపాసకులు శ్రీ శిష్టా చంద్రమౌళి శాస్త్రి గారి హనుమజ్జయంత్యుత్సవములలో జరిగినది.

ఆ పాత్రకు, శ్రీ శాస్త్రిగారిచే, పండితుల సమక్షమున, బంగారు హనుమద్విగ్రహము చెక్కిన పతకము బహుమతియును, మరి యును, ఆంజనేయ మహామంత్రోపాసన ఉపదేశమును బొందిరి, అది 1935 వ సంవత్సరము.

తదుపరి, 1936 వ సంవత్సరంలో, ఆంధ్ర నాటక కళా పరిషత్తు వారి ఆరవ వార్షిక మహాసభలు, మద్రాసులో జరిగినవి. ఆ సభలకు అధ్యక్షులుగా డా॥ గోవిందరాజుల సుబ్బారావుగారును, ప్రారంభకులుగా శ్రీ హరిప్రసాదరావు గారును వ్యవహరించిరి. నాటి కార్యక్రమాలలో పాల్గొన్న, పద్మశ్రీ స్థానం నరసింహారావు, శ్రీ బళ్ళారి రాఘవాచార్య, ఆంధ్ర గంధర్వ జొన్నవిత్తుల శేషగిరి రావు, శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి, శ్రీ కపిలవాయి రామనాథ శాస్త్రి, శ్రీ మాధవ పెద్ది వెంకట్రామయ్య, శ్రీ తుంగలచలపతి రావు, శ్రీ ముంజులూరి కృష్ణారావుగారల స్టేజి నాటకములతో బాటు, శ్రీచింతా వెంకట్రామయ్యగారి నృత్య నాటకమను ఉషా పరిణయము గూడా ప్రదర్శింపబడినది అందులో ఉషాకన్యగా నటించిన, రాఘవయ్యగారి కైశికీ విధానమగు హావ భావ రస ప్రదర్శనకు, నాటి ప్రముఖ కళాకారులచ్చెరు వందుచుండగా దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు

# భరతకళా ప్రపూర్ణ

# శ్రీ వేదాంతం రాఘవయ్య

—భాగవతుల రామకోటయ్య

భారతీయ సశాస్త్రీయ సాంప్రదాయక నాట్యములలో నొకటైన కూచిపూడి నాట్యమునకు, మూలమగు కూచిపూడియను గ్రామమునందు, నాట్య ప్రతిభలో, దేశం నలుమూలలందేగాక, సుప్రసిద్ధ నాట్యకళా కారులు, నాట్యాచార్యులును ఉద్భవించి ఖ్యాతి గడించిన, ఆ గ్రామములోనే, నాట్య కళావేత్తలందరిచేతనూ, నాట్యము నందు కళ పురుషుడనిపించుకొని అపరసిద్ధేంద్రుడే మరల ఆ గ్రామము నందుద్భవించినాడని, నాటి ఆ గ్రామ కళాకారులందరిచే పిలువ బడిన శ్రీ రాఘవయ్యగారు, నాట్యము నందు నాటినుండి నేటివరకు ప్రసిద్ధి జెందిన వేదాంతం వారి కుటుంబములలో కీ॥ శే॥ శ్రీ వేదాంతంరామయ్య, శ్రీమతి అన్నపూర్ణ మ్మగారలకు ప్రథమ పుత్రుడుగా, ది 8-6-1919 వ సం॥ న జన్మించిరి.

కూచిపూడివారు ప్రదర్శించే యక్షగానాలు ఏడు, (1) ప్రహ్లాద, (2) రామనాటకము, (3) హరిశ్చంద్ర (4) మోహినీ రుక్మాంగద, (5) ఉషాపరిణయము, (6) శశిరేఖా పరిణయము (7) గయనాటకము. వీటిలో ఒక్క ప్రహ్లాద నాటకము మాత్రము, మూడు రాత్రులు ప్రదర్శించేవారు. వీని అన్నింటిలోను నటించి అనితర సాధ్యమైన ఖ్యాతిని గడించారు రాఘవయ్యగారు.

రాఘవయ్యగారు, తన ఐదవయేట అక్షరాభ్యాసముతో బాటు, నాట్యము- నాట్యానికి కావలసిన నృత్య సంగీతము - నాట్యపితామహులగు కీ॥ శే॥ శ్రీ చింతా వెంకట్రామయ్యగారి వద్ద ప్రారంభించి, అచిరకాలము లోనే, అనగా, తన ఏడవఏటనే, రంగస్థలంపై మూడు రాత్రుల ప్రహ్లాదుడు గాను, కుశలవుల పాత్రలలో ఏదో ఒకటిగాను, లోహితాస్యుడు గాను, ధర్మాంగదుడుగాను, మొదలగు బాలల పాత్రలను ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పును బొందెడివారు. ఒకప్పుడు మచిలీపట్టణములో పురప్రముఖులచే నిర్వహింపబడు "శ్రీ సీతారామ కళ్యాణ" మహోత్సవము లందు చింతా వెంకట్రామయ్యగారి సమాజము ప్రదర్శించిన మూడు రాత్రుల ప్రహ్లాద నాటకమునందు ప్రహ్లాదుడుగా, హావ, భావ, రాగ, తాళయుతముగా తానొక్కడే ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పును బొందిరి. ఆ సభలకు అధ్యక్షత వహించిన, జిల్లా కలెక్టరగు

శ్వేతజాతీయుని చేత, రాజ లాంఛనము గల ముఖమల్ చమ్కీ సూటును, రాజ ముద్ర గల బంగరు పతకమును బహుమతిగా బొందిరి. అదియే ఆయనగారి వేదికపై తొలి ప్రదర్శనము. అప్పటికి ఆయనకు ఏడేండ్ల వయసు. అది ఆయన ప్రతిభకు తార్కాణము.

అప్పటినుండి ఆయన, తన పదిహేనవ సంవత్సరము వరకును, బాలల పాత్రలనే ధరించుచూ, షుమారు ముప్పది బంగారు పతకములు బహుమతులుగా బొందినారు. రాఘవయ్యగారు, బాల్యమునుండి, సమ, ఎదురు విషమ లయలను, కీర్తనలలో చొప్పించుట గాని, ఐదు జాతులయందు గల తాళములను అనులోమ, విలోమక్రమసరళిగా, హస్తపాద విన్యాసములతో పకడ్బందీగా, నృత్యము చేయుట గాని, మన నాట్య సాంప్రదాయమగు, శాస్త్రీయ. నృత్య సంగీత మందు గల యక్షగాన దర్వులును, కందార్థములును, భుజంగ ప్రయాతములును, పంచచామరములును, శ్రీ కృష్ణలీలా తరంగములును, క్షేత్రయ పదములును, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలును, జావళీలును, పుష్పబాణ విలాస మందుగల సంస్కృత శ్లోకములను, శాస్త్ర బద్ధము తప్పకుండ, ఎప్పటికప్పుడు నూతన సరళిగా, గాన మొనర్చుట ఆయన ప్రత్యేకత.

ఆర్ష విద్యలకు జీవితాన్ని అంకితం జేసే ప్రతిభావంతులకు. కాలముకూడా కలసివచ్చునన్నట్లు, రాఘవయ్యగారి ఉషాకన్య పాత్రధారణ ప్రథమముగా, గుడివాడ తాలూకా పెదపాడు గ్రామములో, ప్రఖ్యాత హనుమదోపాసకులు శ్రీ శిష్టా చంద్రమౌళి శాస్త్రిగారి హనుమజ్జయంత్యుత్సవములలో జరిగినది.

ఆ పాత్రకు, శ్రీ శాస్త్రిగారిచే, పండితుల సమక్షమున, బంగారు హనుమద్విగ్రహము చెక్కిన పతకము బహుమతియును, మరియును, ఆంజనేయ మహామంత్రోపాసన ఉపదేశమును బొందిరి, అది 1935 వ సంవత్సరము.

తదుపరి, 1936 వ సంవత్సరంలో, ఆంధ్ర నాటక కళా పరిషత్తు వారి ఆరవ వార్షిక మహాసభలు, మద్రాసులో జరిగినవి. ఆ సభలకు అధ్యక్షులుగా డా॥ గోవిందరాజుల సుబ్బారావుగారును, ప్రారంభకులుగా శ్రీ హరిప్రసాదరావు గారును వ్యవహరించిరి. నాటి కార్యక్రమాలలో పాల్గొన్న, పద్మశ్రీ స్థానం నరసింహారావు, శ్రీ బళ్ళారి రాఘవాచార్య, ఆంధ్ర గంధర్వ జొన్నవిత్తుల శేషగిరిరావు, శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి, శ్రీ కపిలవాయి రామనాథ శాస్త్రి, శ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్య, శ్రీ తుంగల చలపతిరావు, శ్రీ ముంజులూరి కృష్ణారావుగారల స్టేజి నాటకములతో బాటు, శ్రీచింతా వెంకట్రామయ్యగారి నృత్య నాటకమను ఉషా పరిణయము గూడా ప్రదర్శింపబడినది అందులో ఉషాకన్యగా నటించిన, రాఘవయ్యగారి కైశికీ విధానమగు హావ భావ రస ప్రదర్శనకు, నాటి ప్రముఖ కళాకారులచ్చెరు వందుచుండగా దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు

పంతులుగారి చేత, బంగారు పతకముతోను, ఆ సభలకు ఆహ్వానింపబడిన బెంగాలు నర్తకి, శ్రీమతి రాగిణీదేవి చేత దుశ్శాలువలతోను రాఘవయ్యగారు సన్మానింపబడిరి. క్రమేపి రాఘవయ్యగారు తన వయసుతో బాటు ఉపాంగన, శశిరేఖ, మోహిని పాత్రలే గాక సీత, చంద్రమతి, లీలావతి మొదలైన పతివ్రతల పాత్రలు గూడా రసపోషణగా ప్రదర్శిస్తూ దేశం నలుమూల లందును అఖండ కీర్తి నార్జించుచూ, లెక్కకు మిక్కిలి సన్మానములను బంగారు పతకములను బొందిరి.

విశాలనేత్రములు, కోటేరువేసిన ముక్కు, హావ, భావ ప్రదర్శన కనువుగా చిరునగవు గల ముఖము, విశాల వక్షస్థలముతో బాటు సన్నని నడుము గలిగిన అజానుబాహువగు రాఘవయ్యగారి గాత్ర సౌష్టవము మంచి ఒడుగు బడి-కలిగి రాగములందు సంగతులను రెండు నిముషములు అనర్గళముగా పాడగలది గాను, స్త్రీ, పురుషపాత్రల కనువగు రీతిగాను నుండెడిది. ఆయన కేవలము నాట్యమునందు గల స్త్రీ పాత్రలేగాక, యక్షగానములందు గల కృష్ణుడు, రాముడు, హరిశ్చంద్రుడు మొదలగు ప్రధాన పాత్రలను ధరించుటే గాక, నాటకములందు గల పిన్న పెద్ద పాత్రలన్నిటినీ కడు సమర్ధవంతముగా నటించేవారు. మరియును, నట్వాంగమందును, సూత్రధారణయందును కడు సమర్ధులు. ఇంతెందుకు నాటి ఆంధ్రదేశమునందు గల ప్రసిద్ధ పౌరాణిక, సంగీత, సాహిత్య, హరికథా గాన విద్యాగ్రేసరులందరి ఆశీర్వచనములందుకొనుటయే గాక, విద్వత్పరీక్షలో వారిచే గౌరవింపబడిన సంఘటన లెన్నియో గలవు. మరియు ఆయన సువర్ణహస్త ఘంటాకంకణ బిరుదాంకితులు.

ఒకప్పుడు విజయవాడలో పురప్రముఖులచే నిర్వహింపబడిన వసంత నవరాత్రోత్సవములందు, ఒక రోజు సాంస్కృతిక కార్యక్రమాలకు, హరికథా పితామహ ఆదిభట్ట నారాయణదాసుగారు అధ్యక్షత వహించిరి. నాటిరాత్రి శ్రీ రాఘవయ్యగారి సమాజము, శశిరేఖాపరిణయ యక్ష గానము ప్రదర్శించగా, అందులో శశిరేఖ, శ్రీకృష్ణ పాత్రలు ధరించిన రాఘవయ్యగారిని నాటి కూచిపూడి నాట్యమునకు కళపురుషుడుగా వర్ణించి, నాట్యమందు సంపూర్ణ విద్యాపారంగతుడవై చిరకాలము వర్ధిల్లుమని దీవిస్తూ తన బంగారు పతకము నొకదానిని బహుమతి నొసగిరి. రాఘవయ్యగారు నృత్యనాటకములందు పాత్రలను ధరించుటే గాక, కూచిపూడి యందు గల తన సాటి కళాకారులతో కలిసి గాని, లేక తానొక్కడే ప్రత్యేక నృత్య ప్రదర్శనలిచ్చుట గూడా ఎన్నోకలవు, ప్రథమముగా ఆయన సినిమారంగ ప్రవేశము కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మము గారి ద్వారా జరిగినది. మోహినీ రుక్మాంగద, రైతుబిడ్డ మొదలగు చలనచిత్రములలో ప్రత్యేక నృత్యమొనర్చుటతో ప్రారంభమైన రాఘవయ్యగారు మాయలోకములోను, గరుడగర్వ భంగములోను పెద్ద పాత్రలను ధరించి మద్రాసు చలనచిత్ర రంగములో

మంచిపేరు సంపాదించి అచ్చటనే స్థిరపడిరి. బహుశా తెలుగు చలనచిత్రాలలో నృత్యమును మొదలుగా ప్రవేశపెట్టి, దాని నభివృద్ధి జేసిన కీర్తి, కూచిపూడి నృత్య కళాకారులకే దక్కినదనుట అతిశయోక్తి కాజాలదు.

పద్మశ్రీ చిత్తూరు నాగయ్య గారి త్యాగయ్య సినిమాతో రాఘవయ్య గారు, చిన్న బాలికలచే గోపికా కృష్ణ నృత్యము ప్రదర్శింపజేసి, మంచి నృత్య దర్శకుడుగా పేరొందుటయేగాక, మచిలీపట్టణ పురప్రముఖులు పండితులును గల మహాసభలో శ్రీ చిత్తూరు నాగయ్యగారి అధ్యక్షతన రాఘవయ్యగారి కాలికి "గండ—పెండెరము" వేయబడినది.

పెక్కు సినిమాలలో నృత్య దర్శకత్వము వహించి ఖ్యాతి గడించిన రాఘవయ్యగారు, సినిమా దర్శకులలో అగ్రశ్రేణికెందిన వ్యక్తిగా పేరొందినారు. దేవదాసు, చిరంజీవులు, సువర్ణసుందరి, స్వర్ణమంజరి, సక్కుబాయి, అడబ్రతుకు లాంటి ఖ్యాతి గడించిన చిత్రములాయనవెన్నో కలవు. సంగీత, సాహిత్యచిత్రలేఖనములను నాట్యమునందు కడుసమర్థవంతముగా సమకూర్చగల పండితునిగా భావించి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు ది 1964వ సంవత్సరములో జరిపిన అఖిల భారత నృత్యోత్సవాలకు శ్రీ రాఘవయ్యగారిని అధ్యక్షులుగా జేసి, వారిని "భరతకళా ప్రపూర్ణ" బిరుదముతో సన్మానించి వారి కీర్తిని ఇనుమడింపజేసిరి.

ఇంతింతై, వటుడింతయైమరియు తానింతై యన్నట్లు, నాట్యమునందుగల చతుర్విధాభినయ సంపూర్ణ సమర్థత గల్గి, సంగీత, సాహిత్యములందు, మంచిపాండిత్యము గల్గి, నాట్యరంగమందును, చలన చిత్ర రంగమందును, సర్వసమర్థతతో వ్యవహరిస్తూ తన సాటి కళాకారులను గూడా, ఉత్సాహవంతముగా నటింపజేయగల, ఏక సంధాగ్రాహి, అపర సిద్ధేంద్రుడు అనదగు రాఘవయ్యగారు, తన ఏబదినాల్గవయేట నాదబ్రహ్మములో కలసిపోవుట కేవలము కూచిపూడి నాట్యమునకే గాక, ఆంధ్రదేశమునకే తీరని కొరత *

పంతులుగారి చేత, బంగారు పతకముతోను, ఆ సభలకు ఆహ్వానింపబడిన బెంగాలు నర్తకి, శ్రీమతి రాగిణీదేవి చేత దుశ్శాలువలతోను రాఘవయ్యగారు సన్మానింపబడిరి. క్రమేపి రాఘవయ్యగారు తన వయసుతో బాటు ఉషాంగన, శశిరేఖ, మోహిని పాత్రలే గాక సీత, చంద్రమతి, లీలావతి మొదలైన పతివ్రతల పాత్రలు గూడా రసపోషణగా ప్రదర్శిస్తూ దేశం నలుమూల లందును అఖండ కీర్తి నార్జించుచూ, లెక్కకు మిక్కిలి సన్మానములను బంగారు పతకములను బొందిరి.

విశాలనేత్రములు, కోటేరువేసిన ముక్కు, హావ, భావ ప్రదర్శన కనువుగా చిరునగవు గల ముఖము, విశాల వక్షస్థలముతో బాటు సన్నని నడుము గలిగిన ఆజానుబాహువగు రాఘవయ్యగారి గాత్ర సౌష్టవము మంచి ఒదుగు బడి కలిగి రాగములందు సంగతులను రెండు నిముషములు అనర్గళముగా పాడగలది గాను, స్త్రీ, పురుషపాత్రల కనువగు రీతిగాను నుండెడిది. ఆయన కేవలము నాట్యమునందు గల స్త్రీ పాత్రలేగాక, యక్షగానములందు గల కృష్ణుడు, రాముడు, హరిశ్చంద్రుడు మొదలగు ప్రధాన పాత్రలను ధరించుటే గాక, నాటకములందు గల చిన్న పెద్ద పాత్రలన్నిటినీ కడు సమర్ధవంతముగా నటించేవారు. మరియును, నట్వాంగమందును, సూత్రధారణయందును కడు సమర్ధులు. ఇంతెందుకు నాటి ఆంధ్రదేశమునందు గల ప్రసిద్ధ పౌరాణిక, సంగీత, సాహిత్య, హరికథా గాన విద్యాగ్రేసరులందరి ఆశీర్వచనములందుకొను టయే గాక, విద్వత్పరీక్షలో వారిచే గౌరవింపబడిన సంఘటన లెన్నియో గలవు. మరియు ఆయన సువర్ణహస్త ఘంటాకంకణ బిరుదాంకితులు.

ఒకప్పుడు విజయవాడలో పురప్రముఖులచే నిర్వహింపబడిన వసంత నవరాత్రోత్సవములందు, ఒక రోజు సాంస్కృతిక కార్యక్రమాలకు, హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాసుగారు అధ్యక్షత వహించిరి. నాటిరాత్రి శ్రీ రాఘవయ్యగారి సమాజము, శశిరేఖాపరిణయ యక్ష గానము ప్రదర్శించగా, అందులో శశిరేఖ, శ్రీకృష్ణ పాత్రలు ధరించిన రాఘవయ్యగారిని నాటి కూచిపూడి నాట్యమునకు శకపురుషుడుగా వర్ణించి, నాట్యమందు సంపూర్ణ విద్యాపారంగతుడవై చిరకాలము వర్ధిల్లుమని దీవిస్తూ తన బంగారు పతకము నొకదానిని బహుమతి నొసగిరి. రాఘవయ్యగారు నృత్యనాటకములందు పాత్రలను ధరించుటే గాక, కూచిపూడి యందు గల తన సాటి కళాకారులతో కలిసి గాని, లేక తానొక్కడే ప్రత్యేక నృత్య ప్రదర్శనలిచ్చుట గూడా ఎన్నో కలవు, ప్రథమముగా ఆయన సినిమారంగ ప్రవేశము కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మము గారి ద్వారా జరిగినది. మోహినీ రుక్మాంగద, రైతుబిడ్డ మొదలగు చలనచిత్రములలో ప్రత్యేక నృత్యమొనర్చుటతో ప్రారంభమైన రాఘవయ్యగారు మాయలోకములోను, గరుడగర్వ భంగములోను పెద్ద పాత్రలను ధరించి మద్రాసు చలనచిత్ర రంగములో

మంచిపేరు సంపాదించి అచ్చటనే స్థిరపడిరి. బహుశా తెలుగు చలనచిత్రాలలో నృత్యము మొదలుగా ప్రవేశపెట్టి, దాని నభివృద్ధిజేసిన కీర్తి, కూచిపూడి నృత్య కళాకారులకే దక్కినదనుట అతిశయోక్తి కాజాలదు.

పద్మశ్రీ చిత్తూరు నాగయ్య గారి త్యాగయ్య సినిమాతో రాఘవయ్య గారు, చిన్న బాలికలచే గోపికా కృష్ణ నృత్యము ప్రదర్శింపజేసి, మంచి నృత్య దర్శకుడుగా పేరొందుటయేగాక, మచిలీపట్టణ పురప్రముఖులు పండితులును గల మహాసభలో శ్రీ చిత్తూరు నాగయ్యగారి అధ్యక్షతన రాఘవయ్యగారి కాలికి "గండ—పెండెరము"వేయబడినది.

పెక్కు సినిమాలలో నృత్య దర్శకత్వము వహించి ఖ్యాతి గడించిన రాఘవయ్యగారు, సినిమా దర్శకులలో అగ్రశేణిజెందిన వ్యక్తిగా పేరొందినారు. దేవదాసు, చిరంజీవులు, సువర్ణసుందరి, స్వర్ణమంజరి, సక్కుబాయి, అడబ్రతుకు లాంటి ఖ్యాతి గడించిన చిత్రములాయనవెన్నోకలవు. సంగీత, సాహిత్యచిత్రలేఖనములను నాట్యమునందు కడుసమర్థవంతముగా సమకూర్చగల పండితునిగా భావించి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమివారు ది 1964వ సంవత్సరములో జరిపిన అఖిల భారత నృత్యోత్సవాలకు శ్రీ రాఘవయ్యగారిని అధ్యక్షులుగా జేసి, వారిని "భరతకళాప్రపూర్ణ" బిరుదముతో సన్మానించి వారి కీర్తిని ఇనుమడింపజేసిరి.

ఇంతింతై, వటుడింతయైమరియు తానింతై యన్నట్లు, నాట్యమునందుగల చతుర్విధాభినయ సంపూర్ణ సమర్థత గల్గి, సంగీత, సాహిత్యములందు, మంచిపాడిత్యము గల్గి, నాట్యరంగమందును, చలన చిత్ర రంగమందును, సర్వసమర్థతతో వ్యవహరిస్తూ తన సాటి కళాకారులను గూడా, ఉత్సాహవంతముగా నటింపజేయగల, ఏక సంధాగ్రాహి, అపర సిద్ధేంద్రుడు అనదగు రాఘవయ్యగారు, తన ఏబదినాల్గవయేట నాదబ్రహ్మములో కలసి పోవుట కేవలము కూచిపూడి నాట్యముననే గాక, ఆంధ్రదేశముననే తీరని కొరత *

# క్షేత్రయ్య పదములు - అభినయము

''భరతకళాప్రపూర్ణ'' నటరాజ రామకృష్ణ

తము దామె వత్తు రర్థులు
కర్మిమ మెఱిగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబులున్న చోటకు
భ్రమరంబులనచ్చు తేంద్ర, రఘునాథనృపా!

ఈ విధంగా, తేనె తీయదనాల మరిపించి మురిపించు తేట తెనుగు కవితలో సమ ధానమిచ్చినాడు, క్షేత్రయ్య- తంజనగరం, రాజదర్బారును సందర్శించిన సమయంలో రఘునాథుడు అతనినిగూర్చిప్రశ్నించాడు. అది మూడువందల సంవత్సరాలక్రిందటి మాట.

క్షేత్రయ్య మువ్వపురివాసి. మధురభక్తి ఉపాసకుడు. శ్రీ కృష్ణదాసుడు. కవి, గాయ కుడు, శాస్త్రవేత, అభినయకళయందు ఆరితేరిన పండితుడు. తన పదకవితచే మువ్వపురిలోని గోపాలునికి అంకితంగా మువ్వగోపాల పద ములు రచించినాడు. ఈ మువ్వ గ్రామం యెచ్చటిది? దివిసీమ. దివ్యసీమ. ఆంధ్రసంస్కృ తికి లలితకళలకు నిలయము. నేటికాలంలో కృష్ణాజిల్లా అని పిలువబడే ప్రాంతంలో ఒక భాగం. ఆంధ్రరాజులు శాతవాహనుల రాజ ధాని నగరం శ్రీకాకుళం ఈసీమలోవెలిసి నది. అచ్చట వేంచేసిన తెనుగుదేవుడు శ్రీకా కుళఆంధ్రవిష్ణువు. ఆలయంలో-స్వామిపూజలో దేవనర్తకినులు నృత్యగాన సేవ చేసేవారు.

అచ్చటికి, కొద్దిదూరంలో బౌద్ధుల మహా క్షేత్రం ఘంటశాల వుంది. మరికొంతదూరంలో మువ్వను ఆనుకొనే భాగవతులకు ప్రసిద్ధ మైనవూరు కూచిపూడివుంది.

'మువ్వ' నే మవ్వ- మొవ్వ- అనిగూడా అంటారు.

ఇంతటి ప్రసిద్ధప్రాంతములో నుండినవాడు క్షేత్రయ్య. అతడు 'మువ్వగోపాలుని' పేర పదరచన చేసిననూ, ఆనాటి దక్షిణాపథము లోని పవిత్రయాత్రాస్థలాలు, రాజాస్థానాలు ఏన్నో సందర్శించాడు. అనేకపదములు అదే ఊళ్లపై చెప్పాడు.

కానివిశేష మేమిటంటే- ఆయాత్రాస్థలాల్లో దేవుడెవరైనప్పటికీ, వారిలో మువ్వగోపా లుని రూపమే చూచేవాడు. మువ్వగోపాలుని సౌందర్యాన్నే గాంచేవాడు. మువ్వగోపాలుని మురళీగానమే వినేవాడు.

అతడు వెళ్ళిన రాజాస్థానాల్లో ముఖ్యమై నవి మూడు. గోల్కొండ, తంజనగరం, మధుర.

ఆకాలంలో గోల్కొండను పాదుషాలు పాలించినారు. పాదుషాలు మహమ్మదీయు లైనప్పటికీ, వారు హైందవకళను ఆరాధిం చారు.

తెనుగుకవులు వారి ఆస్థానాల్ని అలంకరించారు. తెనుగుకళలు, కవిత వారి సంస్థానంలో యెంతో వృద్ధిగాంచినది. పాదుషాలు తెనుగుభాష నేగాక సంస్కృత భాషను అభ్యసించి, అందు పాండిత్యం సంపాదించి, సంస్కృతంలో అలంకార శాస్త్రములను రచన చేసినారు. గోల్కొండను క్షేత్రయ్య సందర్శించినాడు. వారి ఆస్థానకవి తులసి మూర్తితో పోటీపడి పదకవిత రచన చేసినాడు. పాదుషాలచే సన్మానింపబడినాడు.

మధుర నాయకుల ఆస్థానమునకు గూడా పోయి, వారి దర్బారులో పదకేళికలు చేసి, నూతన పదములెన్నో రచనచేసినాడు. అన్నిటి కంటే ముఖ్యమైనది తంజనగరం.

తల్లికోటయుద్ధంతరువాత ఆంధ్రకళాలక్ష్మి విజయనగరం వీడి, తంజనగరంలో తలదాచుకుంది. విజయనగరప్రభువులకు సామంతులుగా ఉండిన నాయకరాజులు ఆకళాలక్ష్మిని, అగరు చందనములు బంగారుపూవులతోపూజించారు. ఆరాధించారు. తంజనగరం సరస్వతీనిలయమై విద్యలనగరమై విరాజిల్లినది. క్షేత్రయ్యవెళ్ళిన కాలంలో నృత్య సంగీత యిత్యాది లలితకళలు మహోన్నత స్థితిలో వెలుగొందుచుండినవి.

సంస్కృతాంధ్రములందు ఆశుకవితచెప్పిన రామభద్రాంబ, గంటకు నూరుపద్యములు చెప్పిన శతలేఖిని మధురవాణి, పగటి దివిటీల వారు ముందునడవగా, బిరుదు మిటారులు స్తోత్రగానంచేయగా, ముత్యాలపల్లకిలో తన యింటినుండి రాజమహల్ కు తరలివెళ్లి 'పేరిణి' లాస్య కేళిక జేసిన ముద్దుచంద్రరేఖ ఆస్థానమునలంకరించినారు.

అభినయమందారితేరిన కృష్ణాజి, శశిరేఖ, మదనరేఖ, రూపవధూటి, యిత్యాది నర్తకీమణులెందరో ఆ సంస్థానములో నృత్యసరస్వతి నారాధించినారు. అష్టభాషాప్రవీణ, విజయరాఘవనాయకునిచే కనకాభిషేక గౌరవము పొందిన పసుపులేటి రంగాజమ్మ ఆ ఆస్థాన విదుషీమణి-వీరుగాక యింకెందరో ప్రసిద్ధులైన కవిశ్రేష్టులు, నృత్యశాస్త్రవేత్తలు, గాయకులు, నర్తకులు, పండితులు అచ్చట వుండిరి.

దురుపదము, నవపదము, చౌపదము, పేరిణి, దేశి, గుజరాతి, దేశి, పదకేళిక, కురవంజి యిత్యాది సుమారు యిరువది వరకూ నృత్యరీతులను ఆఆస్థాన నట్టువరాండ్రు ప్రదర్శించేవారు.

అంతేగాదు. అంతఃపుర అంగనలు ఒకరు ముచ్చటించుకున్న, కోపగించుకొని దూషించుకున్న, ఒకరినొకరు విమర్శించుకున్న అది చక్కని పద్యరూపంలోనే వుండేది. మచ్చునకు రెండు పద్యములు యిచ్చట పొందు పరుస్తున్నాను. రాజుగారు రాణిగారిమహల్ కు వస్తారని తెలిసికొని ఆమె అలంకారాలు ధరిస్తుంది. అప్పటి ఒకపద్యం. నాయికవాసిక సజ్జిక.

మహారాణి- రాజనిభాననా! సరసురాలవు

జబ్బుగానల్లినావదే మేజడ!!

చెలికత్తె- ఇంతకంటే వలయునటే!

రాణి- వలనొప్ప బిగువుగానల్లవే ఓ జవరాల
వేరొక పనియున్నది.

చెలి- దోసము దోసమే చెలి! రాజగునట్టి
ఆ విజయరాఘవ మై తవిరాకే కోమలి.

♦ ♦ ♦

రంగాజమ్మ. రాణిగారికి సమాధానంగా వ్రాసిన లేఖ-ఖండిత:

ఏ మగువల్ మము దలంప నేమి పనో,
తమరాడు వారు గారో వలపించునేర్పెరుగరో
తమ కౌగిటిలోన నుండగా రాజగునట్టి
ఆ విజయవిభుని బలిమిన్ పైబడి పెనంగుకొని
వచ్చితిమా తలోదరి?

ఇట్లు యెన్నో రీతుల సరస్వతి లాస్య తాండవ అభినయ కేళికలు తంజనగరాన సల్పుచున్న సమయాన క్షేత్రయ్య అచ్చటకు పోయినాడు.

అచ్చటి రాజులమెప్పించినాడు, ఈర్ష్యా పరులైన కవుల నోడించినాడు. రాజనర్తకినులచే తన పదములందలి భావముల నభినయింప చేసినాడు. దక్షిణ భారతదేశంలోని నృత్య కళలో ఒక నూతన వికాసం కల్గించినాడు. నాటినుండి 'శుద్ధసాత్త్వికి' అభినయానికి ఆయనపదములు రసనిలయములై విరాజిల్లినవి.

క్షేత్రయ్య కృష్ణాజిల్లాలోని మువ్వపురానికి చెందినవాడని తెల్పియున్నాను. నేటికి కొందరు ఆ క్షేత్రయ వంశానికి చెందినవారు ఆ వూరిలోవున్నారు.. కాని మూడు దశాబ్దముల క్రిందటివరకు-క్షేత్రయ ఉత్తరఆర్కాటు జిల్లాలోని మువ్వ గ్రామము వాడని, పదముల రచించినాడని సంగీత విద్వాంసులు ప్రచారం చేశారు. గవర్నమెంటువారి సంగీత, నృత్య పరిక్షా పత్రములందు గూడా అట్లే పేర్కొన బడేది. అది నిజముగాదని క్షేత్రయ్య కృష్ణా జిల్లావాడని, మువ్వ గ్రామంలోని గోపాల స్వామికి అంకితంగా అతడు పదాలువ్రాశాడని, పూజ్యులు విస్సాఅప్పారావు బహుపరిశోధన చేసి నిరూపించినారు. అంతేగాక మొదటిసారిగా మొవ్వలో వుత్సవాలు జరిపించి, క్షేత్రయ్య పదముల ప్రచారానికి విశేషకృషి సల్పినారు.

## పదములు-నేనభ్యసించిన అభినయ కళ

తంజావూరు నాయక రాజుల తరువాత మహారాష్ట్రులు పాలించారు. వారి మాతృభాష మరాఠీ అయిననూ, తెనుగుభాష యొక్క మాధుర్యం వారిని ఆకర్షించింది. వారు ఆ భాషను పోషించుటయే గాక, వారి ఆస్థాన భాషగా ఉపయోగించుటయేగాక, ఆ భాషను అభ్యసించి, అందు యక్షగానములు, కావ్యములు, మరియూ ఎన్నో సంగీత రచనలు చేసినారు. ఈ మహారాష్ట్రి ప్రభువుల్లో ప్రముఖుడు శరభోజి - వారి ఆస్థానములో చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం అను నల్గురు అన్నదమ్ములు ప్రముఖ నాట్యాచార్యులుండినారు. వారి కాలంలోనే పదవర్ణముల ఆట, అభినయం ఆస్థాన కేళికలో ప్రవేశ పెట్టబడింది ఆ నల్గురు తెనుగుభాషను, చక్కగా అధ్యయనం చేసిన కళావేత్తలు.

ఈ విధం పూర్వం పెద్దలు, శాస్త్రవిరుద్ధమని అంగీకరించే వారుగాదు. పదము ముఖ్యంగా సాత్విక సంచారుల ద్వారా అభినయించాలి. నాట్యమాడగూడదని వారి అభిప్రాయం. అంతేకాక, అష్టవిధ నాయికలు–ప్రోషిత, విరహోత్కంఠిత, కలహాంతరిత, ఖండిత, అభిసారిక, విప్రలబ్ధ, స్వాధీనపతిక, వాసకసజ్జికలందు; స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, అభిసారికలందు కొంతవరకు నృత్య నృత్యాలు అంగీకరింపబడినసూ, మిగిలిన నలుగురు నాయికలకు పూర్తిగా నిషేధించినారు, నాట్యశాస్త్రవేత్తలు. ప్రోషిత, కలహాంతరిత, ఖండిత, విప్రలబ్ధలందు నృత్తమాడుట రసభంగము కల్గునని వారి అభిప్రాయము. ఈ ఎనిమిది శృంగారనాయికలు గాక మరి యిద్దరు ప్రవత్స్యత్పతిక, సిఘాగచ్ఛత్పతిక గూడా అభినయింపబడేవారు.

వీరుగాక ప్రసిద్ధనాయికలు స్వీయ, పరకీయ, సామాన్యలు అభినయంలో ప్రముఖ స్థానంవహిస్తారు. వీటిలో పరకీయ నభినీయించుట కళాకారులకు పరిఋగా చెప్పవచ్చును.

నాయకుని విరహమును దెల్పునట్టివి బహు కొద్దిగా వున్నవి.

అందుమూడు పదములు—

"బావి నీమణిని ఎవరు తోడితెచ్చేరు."
"ఎన్నిటికో నాకొమ్మను జూచేది"
"ఏంతో వెగటైదోచె, దానికినేడు"

ఈ మూడుపదములునాకు అభ్యాసంలోవున్నవి.

ఇవిగాక సారంగపాణిప్రాసినవి కొన్ని అభ్యసించానుగాని అవి తమాషాగా పాడుకునేవి, పండిత సభల్లోయెప్పుడూ అభినయించుటకు నామనస్సు యిచ్చగించలేదు.

**నేను పదములు అభ్యసించిన పద్ధతి**

గురువుగారి వద్ద సుమారు రెండున్నర సంవత్సరాలు వున్నాను. సాత్వికాభినయం అభ్యసించుటకు అందు ఒక సంవత్సరంనన్ను పరీక్షించుటతో గడిచిపోయింది ఆమె డెబ్బది సంవత్సరాల వృద్ధురాలనియిదివరకే తెల్పియున్నాను. లక్ష్మి సరస్వతు లిరువురు ఆమెను సంపూర్ణంగా కటాక్షించారు. ఆమెవయస్సులో ఎన్నో పండితసభలకు, రాజదర్బారులకు వెళ్ళి కీర్తి సంపాదించారు. పధ్నాల్గు తరముల నుండి ఆమెవంశీకులు కాళహస్తిదేవుని సేవలో, నృత్యపూజతో తరించారు. ఆమెజీవిత సంధ్యాసమయం నాటికి నేను వెళ్ళాను. అప్పటికే కళాకారుల కుటుంబాలు నృత్యకేళికలనుండి విరమించుకొన్నవి. నృత్యంపేరు చెప్పితేనే అగౌరవంగా, సిగ్గుగా తలంచేవారు. అలాంటి సమయంలో ఒకవుత్తమ కుటుంబానికి చెందిన యువకుడు నృత్యకళ నభ్యసిస్తానని ఆమెవద్దకు వెళ్ళడం– ఆమెకు ఆశ్చర్యం కల్గించింది. ఆమెకు నేనిచ్చే ధనం అవసరం లేదు. కీర్తి అసలే అవసరంలేదు. ఆమె విద్యను నేను ప్రచారం చేస్తాననే నమ్మకం కలగాలి.

అప్పుడుగాని విద్యచెప్పదలంచ లేదు. అందుకే సంవత్సరకాలం పరిక్షించినారు.

కాని యీ సంవత్సరకాలం ఆమెసేవలోగడిపి నేనుసంపాదించుకున్న అనుభవం అమోఘమైంది. ఆమెప్రతిశుక్రవారం అమ్మణ్ణి జ్ఞాన ప్రసూనాంబ సాన్నిధ్యంలో, సోమవారం స్వామివద్ద పూజంతా ముగిసిన తరువాత - కూర్చొని పాడుతూ అభినయించేవారు.

"శివదీక్షాపరురాలనురా నే
శీలమిం తైనావిడువజాలనురా"

ఒకసంవత్సరకాలం. విన్నాను, చూచాను ఈరెండు పంక్తులఅభినయం ఈ రెండుపంక్తులే ప్రతిసారి ఒకగంట, గంటన్నర అభినయించేవారు. ఆ ప్రశాంతవాతావరణంలో ఆమె మెల్లగా, కంఠమెత్తి పాడుతూ, అభినయిస్తుంటే, ఆ ఆలయమంతా ఆ రాగంలో ప్రతిధ్వనించేది. 'ఓం' కార నాదంతో నిండి పోయింది.

లింగాకారరూపంలో వున్న ఆ స్వామి, నటరాజరూపం- దాల్చి ఆ అభినయకేళిక జూడవచ్చినాడా, గర్భగుడినిపీడి, అనిపించేది. ఆలయంలో యెచ్చటజూచినా శివరూపం దర్శించేవారము. శృంగారం, భక్తిభావము రెండుమిళితమైనట్టిది ఆ అభినయం. మధుర భక్తి మాత్రంగాదు.

ఆ కాళ హస్తీశుని సాన్నిధ్యంలోనే నేనభినయం మొదటి సారిగా వుత్తమోత్తమమైనట్టిదీ; అర్థ జేసుకొని చూచాను - అభ్యాసించాను. అచ్చటి ప్రతిశిలా స్థంభములో సంగీతము విన్నాను.

ప్రతి శిలా ప్రతిమ ముఖంపై భావందర్శించాను.

ప్రతి సుందర ప్రతిమ హృదయంలోని సాత్విక సంచారుల వికాసం తిలకించాను.

ఆ ఆలయమే నా అభినయ కళకు పవిత్ర ఆచార్య పీఠమైంది.

అభినయము - ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్వికమని నాల్గు విధాలు. ఇది పండితులందరూ ఎరిగిన విషయమే.

మా గురువుగారి కాలం వరకూ ఆహార్యంలో నేటి కాలంలో భరతనాట్య కచ్చేరిలందు కతీ వేషధారణ, ముఖానికి ప్రత్యేకమైన మేకప్పు అంతగా లేదు. ఆ వేషధారణ, భాగవతము (భామాకలాపం, గొల్ల వేషము) లందు, యక్షగాన వీధి నాటకములందు ప్రత్యేకముగా వుండేది.

అతి సహజమైన అలంకరణ వారు ధరించేవారు.

వారికి అలంకారము వారి అభినయ కళయే.

ఒక్కొక్కసారి అభినయించే కళావేత్త సభలో కూర్చొని, పదం పట్టేవరకూ ఆమె అభినయంచేస్తుందని గుర్తించలేనంత సహజవంతంగా వుండేది వేషధారణ.

ఆంగికం — : నృత్యము నృత్తము అభ్యాసం ముగిసిన తరువాత ఆంగికాభినయ ప్రాధాన్యత కల్గినట్టి కొన్ని వర్ణనాత్మక గీతాలు,

శబ్దాలు, సలాంజతులతో ఈ సాధన ప్రారంభ మయ్యేది - ఇందు సాధారణంగా

ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, శబ్దాలు 'సరసిజాతులు జలకమాడే' యిత్యాదులు;

సలాంజతులు—

"రారా స్వామి రారా
దామెర తిమ్మేంద్ర కుమార
శతకోటిమన్మథాకారా" మొదలైన

వాటికి ఆ మాటల అర్థానికి ముద్రాభినయం, భావప్రకటన. తాళ లయల గతుల ననుసరించి ఆడి చెప్పేవారు.

**వాచికం** :- ఆ కాలంలో నర్తకుడు కేవలం మూగ నాట్యంచేయుట ఆచారంగాదు. నాట్యం ఎంత సాధనచేస్తారో, పాటలోగూడా అంతా సాధన చేయాలి. అ పాట, పాట కచ్చేరిగాక, ఆట కచ్చేరికి అనుకూలించి యుండాలి.

**గాత్రం**:- వివిధ సంచారులు పకాలి. అనగా ఒక భావాన్ని అభినయించేటప్పుడు అందుకు తగినరీతిని గొంతుని సవరించుకొని ఆయా భావాలు సంగీతంలో పలికిస్తూ పాడాలి. దశవిధ గమకములవలే దశావస్థలు అభిన యంలో ప్రదర్శించేటప్పుడు అందుకు తగిన రీతిని గొంతులో నాదాన్ని పూరించాలి. అభి నయించే పాత్రయే పాడుచుండిన వంత పాటకు అవసరమేమిటి? అనే సందేహం కలుగ వచ్చును.

దశావస్థలో స్థంభము, అశ్రువులు, స్వర భంగము అభినయించునప్పుడు పాత్ర ఆ భావ ములో లీనమై ఒక్కొక్కప్పుడు శ్రుతి దోషము సంభవించవచ్చును. అట్టి సమ యాల్లో సహకారగాత్రాల వారు నర్తకికి సహాయపడుతారు. సంచారుల అభినయించు నప్పుడు వంత పాడేవారి సహాయం యెక్కు వగా అవసరముండును.

**వాచికం** : శాస్త్రపఠనము - సంస్కృతం తెనుగు భాషలందు చక్కని పాండిత్యం వచ్చేలా గ్రంథాలు పఠింపచేశారు. సంస్కృతం లో పంచ కావ్యాలు, తెనుగు కావ్యాలు ముఖ్యంగా ప్రబంధాలు చదివించారు. శబ్ద మంజరి, అమరంలోని దేవతీసర్గ ఆంధ్రనామ సంగ్రహం చదివించారు.

అటుపై శృంగార మంజరి, అమరుకం, పుష్పబాణ విలాసం, రసమంజరి, ప్రతాప రుద్రీయం, కావ్యాలంకార సంగ్రహం పఠింప చేయడమేగాక, అందలి శ్లోకాలకు అభినయం చెప్పించారు. ఆ శిక్షణ ఎలావుండేదో ఒక చిన్న వుదాహరణ యిస్తున్నాను.

ఒకరోజు జయదేవుని అష్టపది - "చందన చర్చిత నీలకళేబర"కు అభినయం గురువుగారు చెప్పుతున్నారు.

ఇది భ్రమాలంకారం — అభినయం ప్రారం భించారు. ఆపాట యొక్క అర్థాన్ని భావాన్ని చెప్పిస్తున్నారు. ఒక నెల గడిచిపోయినది. ఇంకా ఆ ఒక్క అష్టపదికే అభినయం చెప్పు తున్నారు.

కాని ఆ నెలలో స్వీయ, పరకీయ, సామాన్య ప్రసిద్ధనాయికలు, పద్మిని, హస్తిని, చిత్రిణి, శంకిని, కళాశాస్త్ర నాయకులు; అష్ట విధ శృంగార నాయికలు; వారి తనుగతి, అలంకరణ విధానాలు, చేష్టలు, వ్యాపారాలు, నవరసములు, అందు అభినయంలో ముఖ్యమై నట్టిది శృంగార రసం; అందు అతి ముఖ్యమైన విప్రలంభ శృంగారము, విభావానుభావాలు, ఆలంబన ఉద్దీపనలు, సాత్విక సంచారులు, ముఖరాగం వీటన్నింటినీ అభినయించే తీరులు చెప్పుతూ చేసి చూపించారు. ఇక నేర్చుకోవల సిందేమిటి?

ఒక్క అష్టపది ముగిసేలోగా అభినయం లోని ఒద్దిక, పొందిక తెలిసికొనే అవకాశం కల్గింది. ఇదంతా వాచికమే. ఇందు ముఖ్యంగా మాకు చెప్పిన అంశములో ఒకటి తాళ ఛందస్సు. ఛందస్సు తెలిసి మార్దంగికుడు పదాలకు ప్రక్క వాయిద్యం వాయించాలి లేకుంటే రసభంగము కల్గుతుంది. నృత్తము, నృత్యంలో వాయించే విధానంవేరు, అభినయ పద్ధతిలో వాయించేవిధం వేరు. పదాభినయంలో భావానికి తగు రీతిని నాదం పూరిస్తూ వాయించాలి. ఇది చాలా కష్టమైన పద్ధతి - ఈ కాలంలో యిట్టి వాద్యం వాయించేవారు అరుదుగా వున్నారు.

**భామాలంకారమునకు నృత్త, నృత్య, అభినయాలు**

శ్రీమతి రాజమ్మగారి, తరువాత, భామా "కలాపం" అభ్యసించినప్పుడు శ్రీమతి పెండేల సత్యభామ చెప్పించారు. ఈమె పిఠాపురంలోని కుంతి మాధవస్వామి కంకితమై ఆ స్వామి సేవలో భామా కలాపము, గొల్లకలాపము ప్రదర్శించి తరించారు. అలిగి వెళ్ళిన శ్రీకృష్ణుని వెదుకుతూ సత్యభామ వెళ్ళుతుంది. అప్పుడు వనములో శ్రీకృష్ణుడు ఒకచోట గోపికలతో రాసకేళి సల్పుతున్నట్లు, వేరొకచోట గోపికల సిగలందు మల్లెపూలదండలు తురుముతున్నట్లు ఊహిస్తుంది.

ఈ అలంకారానికి. ఆట, నృత్యము సుమారు ఒక గంటకాలం మించి చేయ వచ్చును. ఆ సంచారుల అభినయం, ఆ నృత్యానికి తగినట్టి అడుగు వరసలు, ప్రతి చరణం ముగింపు నందు ప్రదర్శించే ధ్రువాలు చిత్రవిచిత్రంగా వుండి కనుల పండువుగా వుండును. రాజమ్మగారి వద్ద పదాలకు అభినయము, సత్యభామగారు, బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారి వద్ద కలాప రీతి యందు అభినయ రీతులు అభ్యసించినాను. ఈ మూడు రీతులందలి అభినయ పద్ధతులు అభ్యసించినప్పుడు ఆ కళయొక్క సంపూర్ణత, విశిష్టత గ్రహించే అవకాశం కల్గింది.

**పదములు, భాష—**

పదములందు క్షేత్రయ్య వాడిన భాష, ఆ వాడిన విధానం, అభినయానికి ఏ విధంగా వుపయోగపడింది తెల్పుటకు ఒక చిన్న ఉదాహరణ యిచ్చుట యిస్తున్నాను.

కమ్మవిల్తునిగన్న । చక్కని । మువ్వ
గోపాలుని
రమ్మనవే సముఖాన రాయభార మేలే?

కమ్మవిల్లునిగన్న వాడు - మన్మథుని తండ్రి- సౌందర్యమూర్తి - మువ్వగోపాలుడు.

కమ్మవిల్లుని గన్నవాడు — ఈ పదానికే యెంతో అభినయముంది, ఆంగికం. సాత్వికం, అటుపై 'మువ్వగోపాలుడు' అన్న పదానికి యింకాఎన్నో హస్తాలుప్రదర్శిస్తాము. ఈ రెండే గాక-అనగా.

కమ్మవిల్లునిగన్న మువ్వగోపాలుడే గాక 'చక్కని' అనే పదాన్ని క్షేత్రయ్య ప్రయోగించాడు. ఈ ప్రయోగంవల్ల ప్రయోజనమేమిటి? సాత్వికాన్ని పూర్తిగా వికసింపచేస్తూ-అభినయ కళావేత్త తనకున్నట్టి పాండితీ ప్రతిభనంతనూ ప్రదర్శించుటకు ఒక చక్కని అవకాశం కల్పించినాడు. 'చక్కని' మాట చిన్నదే. నాలుగక్షరాల కూర్పు. కాని ఆ మాటను పూర్తిగా వికసింపజేస్తూ అభినయించాలంటే కనీసం గంట సమయమైనా పట్టుతుంది.

'రతి' ని స్థాయి జేసి—నాయిక ప్రౌఢ, సామాన్యయై, 33 సంచారులు వికాసము ప్రదర్శించుటతో ముగించవలసి వుండును. గనుక పూర్వం పల్లవి, అనుపల్లవిని అభినయించుటకే గంట, రెండుగంటల సమయం పట్టేది అంతేగాక పల్లవి, అనుపల్లవి అభినయమందే నాయిక పూర్తిగా నిరూపింపబడేది.

**పదాలకు అభినయం యెలా కూరుస్తాము?**

ఒక పదమును అభినయించుటకు ప్రారంభించే ముందు ఆ పదములోని నాయికను గూర్చి ముందుగా తెలుసుకుంటాము. అనగా స్వీయనాయికయా, పరకీయా, లేక ప్రోషిత, కలహాంతరిత యిత్యాదులముందుగా నిర్ణయించి, అందుకు తగిన రీతిని స్థాయీభావ నిరూపణచేస్తాము. ఉదాహరణకు-ప్రత్యక్ష శృంగారమా, విప్రలంభమా, లేక అద్భుతంతో కూడిన విప్రలంభమా యిత్యాదులు నిర్ణయించి ఆభావాన్ని స్థాయీ, భావనిరూపణాల్లో చూపెదము-అటుపై ఆ నాయిక చేష్టలు, వ్యాపారాలు నిర్ణయించెదము, పిమ్మట సాత్విక భావములు-దశావస్థలు నిర్ణయించెదము. అటుపై సంచారిభావములు, ప్రదర్శనవుండును. సంచారులు ముప్పదిమూడు. ఒక్కొక్క సంచారిలో సుమారు పది విధములైన అభినయవిధానములైనావుండును. అనగా మూడువందల వరకు సంచారుల అభినయ ముండును. కాని, అన్ని పదములందూ, అందలి నాయికలందూ, ముప్పది మూడు సంచారులు వుపయోగించబడవు. అట్లే ఒక్కొక్క సంచారిలోని అన్నిభావములు ప్రదర్శింపబడవు. ఈ సంచారుల యొక్క ప్రస్తారమునందే నర్తకుల సామర్థ్యం వుంటుంది. సంగీతంలో, స్వరప్రస్తారం వస్తే మృదంగ వాయిద్యంలో లయప్రస్తారంవలే అభినయంలో సంచారుల విన్యాసం ముఖ్యమైంది.

కొన్నిసమయములందునిర్వేదము, దైన్యం, నిర్వేదము, విషాదము వెంటవెంటనే అభిన

యించవలసి వచ్చినపుడు, నర్తకుల సమర్థత తెలిసికోగలము.

ఈభావముల ప్రకటనలతో ఒకటిగానేపైకి కన్పించినను, అంతా ఒకటి గాదు. ఆ తేడాలను వివరంగా తెలియజేస్తూ అభినయించగల్గిన వారే హర్షింపబడేవారు. పండితులచే ప్రశంసింపబడేవారు. విద్వాంసులచే గౌరవింపబడేవారు.

**పదములు సంగీతము, కూర్పు**

త్యాగయ్య కూర్చిన రాగ వరుసల్లో భక్తిభావం పలికినట్లు, క్షేత్రయ్య రాగాల కూర్పులు శృంగార రసం, మధురభక్తి, అష్టవిధనాయికలు, వారి వివిధ అనుభూతులు, చేష్టలు వినిపిస్తుంటాయి. ఆకూర్పు అట్టిది. శృంగారము ముఖ్యరసమై ఆరసాన్ని వికసింపజేసే రీతిగా వుంటుంది. ఆస్వరములకూర్పు ఆసగంతులు వేసే విధము.

అంతేగాక ఆయా భావం పూర్తిగా పలికించుటకు అనుకూలమైన రాగాలందే అతడు పదములు రచించినాడు.

ఉదాహరణకు -:

నీలాంబరి రాగంలోని ఒకపదం.

పదములోని నాయిక సామాన్య-రసములు శృంగారము,

అద్భుతము —: శృంగార రసముతో మిళితమైన అద్భుతము, అందులో శంక, ఉత్సాహము యిత్యాది సంచారుల అభినయానికి నీలాంబరి రాగం యెంతగానో వుపయోగపడుతుంది.

ఎటువంటి వాడే । వాడు । । ఓయమ్మా । వాడు ఎన్నడూ । ఈవీధిని । రాడూ.

కుటిల కుంతలి! మువ్వగోపాలుడట! పేరూ! ఈ మాటల్లోని వుత్సాహము, ఆవేగము, ప్రశ్నారీతి, అప్పుడు ప్రదర్శించే ఒదుగు ఒయ్యారం, సొగసు సొంపు, ముద్దు ముచ్చట, అభినయించుటకు 'నీలాంబరి రాగం' ఎంతగా, ఉపయోగపడుతుందో రసజ్ఞులు గ్రహించగలరు. పండితులు ఊహించగలరు. విద్వాంసులకు తెలిసిన విషయమే.

పైపదమును మనం ఊరికే చదివితే నూటికి యిరవై పాళ్ల ఆనందానుభూతి కలుగ వచ్చును. అటుగాక స్వచ్ఛమైన కర్నాటక సంగీత బాణీలో పాడుకుంటే రాగానికే ప్రాముఖ్యత లభించి వినేవారికి నలభై పాళ్ళ వరకు ఆనందం లభించవచ్చును. అంతేకాక, ఆరాగ భావాన్ని, పదంలోని సాహిత్య భావాన్నీ రెండింటి చేర్చి గాత్రంలో ఆసంచారుల ఒదుగులను పలికిస్తూ గానం చేసినప్పుడు ఆధ్వనిలో, కొంతవరకు నాయిక సాక్షాత్కరించి, నూటికి యాభై పాళ్ల ఆనందానుభూతి రసికులు అనుభవించగలరు. ఇక, రాగ భావాలు పలుకునట్లు నీలాంబరిలో ఆ పదాన్ని గానంచేస్తూ అందుకు తగిన ఆంగికాభినయంతో పదాభినయం ప్రారంభించి సాత్వికంతో ముగించినప్పుడు నూటికి, నూరు పాళ్ళు సంపూర్ణమైన ఆనందం పొందగలం. ఆనాయిక వివిధరంగుల్లో, చిత్రవిచిత్రమైన భావప్రకటనతో, గానవాహినులు ప్రసరింప

చేసే తనూలత కదలికలతో; మధుర మంజీర ధ్వనులతో మనముందు దర్శనమిచ్చి, మనకు గిలిగింతలు పెడుతుంది. సమ్మోహితులను చేస్తుంది. రసలోకంలోనికి గొనిపోయి, వివిధ సంచారుల నడుమ విహారింపచేస్తుంది. ఇదే క్షేత్రయ్య పదంలోని విశిష్టత. గనుకనే క్షేత్రయ్య పదాలు-భాష, ఆట, పాట, అభినయం వీటన్నింటికీ ప్రాధాన్య మిచ్చినపుడే సంపూర్ణత్వం నొందగలవని పెద్దలు అభిప్రాయం వెలిబుచ్చారు.

## పదములు-సాత్విక భావాభినయము

పదాభినయంలో ఆంగికం యెక్కడైతే ఆఖరు అవుతుందో అక్కడ సాత్వికం ప్రారంభమవుతుంది. అసలైన అభినయం ఆదే. దానినే శుద్ధసాత్వికం అనిగూడ అంటాము. ఆంగికానికి కొన్ని హద్దులుంటాయి. ఆహద్దును మించి అభినయించే అవకాశముండదు. కాని సాత్వికమటుగాదు ఆ రసానుభూతులు హృదయకమలంలో వికసిస్తాయి. వివిధకాంతుల్ని వెదజల్లుతవి. వివిధ సువాసనలు ప్రసరిస్తాయి. లెక్కకు మిక్కిలి భావాలను, విభావాలను, కలిగిస్తాయి. ఆసాత్వికము నిత్యనూతన అనుభవము. ఆంగికములో ఆ రీతి గోచరించదు. అందులకే ఏదైనా, పదాన్ని అభినయించాలను కొన్నప్పుడు ఆంగికము తెలిసిన వారు కొన్ని హస్తాలు, కొన్ని ముద్రలు, మరికొన్ని వాటితో చేర్చి భావాలు, అభినయించి ముగించేవారు. సాత్వికంలో ప్రావీణ్యం గలవారు మహాసముద్రంలో తరంగాలు లాగ అంతులేని భావవికాసము, సంచారుల విన్యాసముతో ఆనాయికను చిత్రిస్తూ, సాక్షాత్కరింపచేసేవారు.

ఉదాహరణకు ఈ క్రింద పదం వివరిస్తున్నాను.

"అందమైన నీమోము అయ్యాలూ ముద్దులొల్కు చున్నది ఎందుదాచు కొందు నిన్ను ఏమిసేతు నేను''

ఇందులో "అందమైన నీమోము" - ఈ మాటలను ఆంగికంలో ప్రస్తారముచేసేటప్పుడు.

ఉంగరాలజుత్తు, తుమ్మెదరెక్కల లాంటి నల్లనైన గిరజాలజుత్తు, నల్లని మేఘాలవలె శిరస్సు నలంకరించినజుత్తు, విశాలమైనసుదురు, మన్మథునివెక్కు పెట్టినవిల్లువంటి కనుబొమలు, విశాలనేత్రాలు, సంపంగివంటిముక్కు, దొండపండువంటి పెదవులు, వెన్నెలకాంతులను వెదజల్లే పలువరుస, అద్దాలవంటి చెక్కిళ్లు, పున్నమ చంద్రునివంటి ముఖం, మెఱుగు చామనచాయ ముఖకాంతి - యీ విధంగా, యెంతని వర్ణించినా అది కొంత వరకుపోయి ఆగిపోతుంది. అంతకుమించి ఆంగికానికి అవకాశంలేదు.

ఇకసాత్వికమో-

అందమైన యవ్వనంలో వున్న పురుషుణ్ణి అందులో గోపాలుణ్ణి ఆ జవ్వని చూస్తుంది.

ఆ ముఖం చూడగానే- ఆమెలో కలిగే "సంభ్రమము" అది ఎన్ని విధాలుగానో అభినయించవచ్చును.

ఔత్సుక్యము -ఔత్సుక్యములోని వివిధ

...యరీతులు, మరల సంభ్రమము పొత్తు ...కలిపి అభినయించిన వచ్చే భావపరంపర.

...ప్పటి ఆనె తనుగతి, ముఖరాగము, ...లు, వ్యాపారాలు, చేష్టలు- ఇవన్నీ ...ని తరువాత ఒక్కటి అభినయిస్తూ ... అలంకార శాస్త్రమంతా, మనసుందు ...ళ్లంపబడుతుంది. ఆఖరికి ముఖరాగంలో ...రీరంలోని ప్రతి రక్తాణువులో కలిగే ...భూతి, అందువల్ల కలిగే మార్పులు ...కృతమౌతాయి. అంతకు మించి అభినయం అదేఅభినయకళగా పరాకాష్ఠ.

...ట్టిఅభినయంలో ఎప్పటికప్పుడే నూతన ...సం కన్పిస్తూంట సహజత్వం గోచరి...

...నాదం వినిపిస్తుందా? నాయిక కని...ందా?

...దం మాట్లాడుతుందా? నిను నీవు జూను ...న్నవా?

...సురువుగారు అభినయంలో శిక్షణ నివ్వడం ...రంభించిన కొంత కాలానికి యిలాగ ...గు తుండేవారు

...నాదం వినిపించడం, నాయిక కనిపించడం- ...టో అగమ్యగోచరం. అర్థమయ్యేది ... ఏమిసమాధానం చెప్పగలను?

...కాళహస్తీశుని ఆలయంలోకూర్చునప్పుడు ...క్కసారి చిన్నరాయితో అక్కడి ...ాలపైకొట్టి - నాదం వినిపిస్తుందా? అని ...ంచేవారు.

నాదమేమిటి- రాతితోకొట్టిన చప్పుడు వినిపించేది? అదేచెప్పేవాణ్ణి.

అదిగాదు ఆ చప్పుడును జాగ్రతగావిను- అందునుండి ప్రణవనాదం వినిపిస్తుంది.

ఆనాదాన్ని ఆధారశ్రుతిగా చేసుకొని గానంచేయడం అలవడి శ్రుతి అంటే తంబూర మీద, హార్మోనియం రీడ్లునొక్క. అందులో నుండి వచ్చేధ్వనిని ఆధారంగా చేసుకొని పాడడమేగాదు. ప్రకృతిలోని ప్రతిధ్వనిలో ఒక మాధుర్యముంది. మానవుని శరీరంలోని ప్రతి కదలికలో ఒకభావం యిమిడి యున్నట్లు, ప్రతిధ్వనిలో ఒక విశిష్టతయిమిడి వున్నది. ఆధ్వనుల్లో చేర్చి కంఠం ఆలపించాలి. ఏదో ఒకఆధారశ్రుతివుంటేగాని పాడలేను అన్న అసహాయస్థితిరాగూడదు. అది సంగీతసాధనకు అవసరమైనా నాదోపాసనకు గాదు

ఈ విధంగా చెప్పేవారు. కొంత కాలానికి అరాతి స్తంభాల్లోనుండి వచ్చే చప్పుడులో సంపూర్ణగానం వినగలిగినాను. అందులో వివిధ స్వరాలు, వివిధ అనుభూతులలో గూడినట్టివి తెలిసికోగలిగినాను.

నాయిక కనిపిస్తుందా— పదాలు అభినయం నేర్చుకుంటున్నాను. పాడుతున్నాను. అభినయిస్తున్నాను. చాలా బాగా అభినస్తున్నానను కుంటున్నాను. అప్పుడు ప్రతి దినము—

"ఇదుగో యిక్కడ ఈ హస్తము తప్పుగా పట్టావు. ఈముఖ కవళిక బాగులేదు, పెదవులు

అలాగేనాకదిలించేది. మెడలలాగేనాత్రిప్పేది. కన్నుల్లోభావమేది. పలువరుసను భావప్రకటన వుపయోగించలేదు," -ఇలా అంటూ సరి దిద్దేవారు. నాకు ఒక్కొక్కసారి చిరాకు తోచేది. అలాంటప్పుడు "నాయిక నీకు కని పించిందా? బాబు" అనిప్రశ్నించేవారు. కొంతకాలం సాధన చేయగా, అభినయించే టప్పుడు ప్రతిపదంలోని నాయిక నాకనుల ముందు ప్రత్యక్షమయ్యేది. అంతేగాదు మాట్లాడేది. తన మనస్సులోని ఆవేదన వెలిబుచ్చేది. కష్టసుఖాలుచెప్పుకొనేది. తన స్వామికి తనబాధను తెల్పమని రాయబార మంపించేది.

"మువ్వగోపాలుడు మోసముచేసుకున్నడు
మొన్నటాలనుండీ రాడూ- సీతోడు.
నేనెవ్వరినంపుదు ఏలాగు తాళుదు.
ఇది బుద్ధియనవమ్మా—
అతడి పోరాదు అని; అతని పిలువరాదుఅని
నీవుఅంటే నావెతలెట్లు తీరునే, నీకంటే
నాకు హితవరు లెవ్వరున్నరే, సీతోడు"

X X X

"రమణీ! బంగారు మంచముపై యిద్దరము
చాలా మమతతో సరసంపు మాటలాడే
వేళ—ఆ కమలాక్షి పేరనన్ను ఘనుడు
పిల్వగా కోప శమనము లేక నాదు
జడకొద్ది కొట్టితినమ్మా,—
ఏమరింపుమమ్మ యీవిధము తెలిసి యిపుడు
ఎవరివల్లదుడుకు మాయిద్దరిలో సఖియా"

X X X

వసరి వాడు యిందువచ్చి! పడకయిల్లు
జొచ్చితే
నిదుర లేపవదని ।నెలత నీవు అనుమా .
కదని మెల్లన యిచ్చకములకు వాడు నా
పదము లొత్తవచ్చితే పట్టవద్దనవే.
అతివ వినవే నాలుగు ఐదు దినములవరకూ
భ్రతి మాలించినగాని భయము రాదమ్మా
అటు పయికౌగిట అదుముకొని కెమ్మోవి
అతడు ఆన వచ్చితే అంటవద్దు అనవే"
"వదరక పోపోవే వాడేల వచ్చేనే
వద్దు వద్దు రావద్దనవే
అది వేరే యుగము. ఓచెలి.
ఇప్పుడు అతడెవరో నేనెవరో"

X X X

'అన్నమందక అతివెత నొందకు
కన్నీరు కార్చకు కలవరింపకు' అని
ఎన్నెన్నో విధాల హితవులు తెలుపుచూ
కన్నీరు నించుచు, కాంతుడు చెప్పినమాట
ఏమని నీకు తెల్పగలనే ఓచెలియా,
ఏలాగు తాళగలనే

X X X

మగువా!పాపపు బ్రహ్మ మగవాడు గావున
మనసు తెలియడాయెనే
అగణితముగ నేను మగవాడినైతే
వాని బిగువెట్టిదో చూతునే
ఇపుడు ఏమిసేతునే
తగదు పొమ్మనుటకు నాతరమవునా?
ఓయమ్మా.

ఇట్లు ఎన్నెన్నో విధాలుగా క్షేత్రయ్య నాయికలు మాట్లాడేవారు. పాడేవారు. మనస్సులోని విషాదాన్ని తెల్పేవారు. కన్నీరు కార్చేవారు. కోపగించుకొనేవారు. తపించేవారు.

ఇదంతా ఒక విచిత్రమైన అనుభవం. ఆ అభినయసాధన ముగిసిన తరువాత కొంత సమయం వరకు ఆ నాయికలందరూ ఆ గదిలో కదిలాడుతున్నట్లు; మాట్లాడుతున్నట్లు; ఏదో ఏదో వింతయైన అనుభూతులు కలిగేవి. కొంత సమయానికిగాని మరల యదార్థ స్థితిలోనికి రాలేక పోయేవాణ్ణి - ఒక్కొక్కసారి ఆ భావానుభూతుల ప్రభావము ఒకదినమంతా వుండి, ఏమీతోచక, ఏమీచేయలేక, ఎవరితో మాట్లాడక, ఏకాంతంగావుండి కాలం గడపాలనిపించేది. అలాగే వుండేవాణ్ణి. సాత్విక అభినయ అభ్యాసంలో ఇదొక స్థితి—

ఆరోజు శుక్రవారం. అమ్మణ్ణికి ముఖ్యమైన రోజు. మధ్యాహ్నం మూడుగంటల సమయముంటుంది. అమ్మణ్ణి జ్ఞానప్రసునాంబకెదురుగా కూర్చొని అభినయం అభ్యాసం చేస్తున్నాను.

ఇంత తెలిసియుండి యీగుణమేలరా?
పంతమా? మువ్వగోపాల నాసామి.
అలుక జేసి యింటికి రావైతివి.
నెనరైన చెలికత్తెలున్నారా? పిలువ
వచ్చేరా?
చెలికత్తెవైననీవే చెలువుడవైననీవే
చింతించి చూడ నా జీవనమునీవే॥

ఈపదం అభినయిస్తున్నాను. గురువుగారు చాలా దీక్షతో నా అభినయం తిలకిస్తున్నారు. కొంతసమయం అభినయించి నిలిపేసి.

"ఛాఛా. — భావం తప్పుపట్టాను. ముఖాభినయం సరిగా లేదు"— అని మరల మొదటినుండి అభినయించుట ప్రారంభించాను.

'తప్పని యెలాగ గ్రహించావు బాబూ' అని అడిగారు ఆమె.

"నా అభినయం నాకండ్లముందు, అద్దంలో నాముఖంలా కనిపిస్తుందండి," అన్నాను.

ఆమె ఒక్క క్షణ కా లం అలాగే వుండిపోయారు. నేత్రాలు అశ్రువులతో మెరిసిపోయాయి.

"నిజంగా, నీ అభినయం నీవుచూచావా?" అని మరల ప్రశ్నించారు.

"అందుకే తప్పుచేశానని చెప్పి, సరిదిద్దుకొన్నానండీ'' అన్నాను.

ఆరోజు సాధన ముగిసిన తరువాత ఆమె ఏమీ మాట్లాడలేదు. ఇద్దరం నిశబ్దంగా యిల్లు చేరుకున్నాము.

నాకు ఎవరితో మాట్లాడాలనిపించలేదు. నాగదిలోనికిపోయి, ఏదో ఆలోచిస్తూ, ఒంటరిగా పడుకున్నాను.

రెండు రోజులు గడిచిపోయినవి. సోమవారం ఉదయం గురువుగారు నన్ను వారి యింటిలోని పూజామందిరం వద్దకు పిలిచారు. నేను వెళ్ళగానే ఒక్కక్షణకాలం నన్ను నిశ్చలంగా చూచారు

"రామబాబు! నీవు యింక వెళ్ళిపోవచ్చును. మీఅన్నయ్యగారికి లేఖ వ్రాస్తున్నాను." ప్రశాంతంగా పలికారు. నేను ఆశ్చర్యంగా అలాగే నిలబడి చూస్తున్నాను.

"బాబూ! అభినయంలో నిన్ను నీవు
జూచావు —
నీకు చెప్పవలసిందేముందీ? నీకు మనోధర్మం
వచ్చేసింది."

నేనలాగే వుండిపోయాను.

"నా కృషి ఫలించింది. నాకు చాలా
ఆనందంగా వుంది.
ఇదుగో నీకొక బహుమతి యిస్తున్నాను.
అపరూపమైంది. అమూల్యమైంది –.
పద్నాల్గు తరాలుగా, మా యింటి నృత్య
సరస్వతిచే
నట్టువార్లు నృత్య కేళిక చేయించిన
పాత తాళాల జత"

అని పూజపెట్టెలోనుండి. తాళాల జత తీసి యిచ్చారు.

నా శరీరం పులకరించిపోయింది. నేత్రాలు ఆనందాశ్రువులతో నిండిపోయాయి పెదవులు వణకుతున్నవి. నోట మాట రాలేదు. భక్తితో గురువుగారి పాదాలకు ప్రణమిల్లాను.

కృతజ్ఞతాంజలి ఘటించాను. ఆ తాళాల జత తీసుకొన్నాను. నేటికీ వాటిని మా నృత్య ప్రదర్శనాల్లో ఉపయోగిస్తున్నాను.

ఆ తాళాల విలువ తెలియని వారికి అవి అరిగిపోయిన పాత తాళం చిప్పలు. కాని నేను ఆ తాళాలు వాయిస్తూ నృత్య కేళికలు చేయిస్తున్నప్పుడు

నృత్య సరస్వతి పసుపుపారాణి పాదాల కలదుకొని, రత్న మంజీరాలు మధురంగా ధ్వనింపజేస్తూ ఆడుతూ, వాటిలో దర్శన మిస్తూంది, మా గురువుగారి రూపంలో.

కొద్దిరోజులకు మా అన్నగారు వచ్చినన్ను నాగపూరు తీసుకొని వెళ్ళారు.

ఉత్తరహిందూస్థానంలోని అనేక రాజాస్థానములందు, శ్రీ బండారా సంస్థానాధీశులు రాజాగణపతి రామపాండ్యగారి ఆస్థానవిద్వాంసునిగా, కేళికలు చేశాను. అచ్చట అష్టపదులు, అమరుకం, పుష్ప బాణ విలాసంలోని శ్లోకాలు, టుమ్రీ, టప్పా, ఖజరీ యిత్యాది వ్రజభాషలోని పాటలకు యెక్కువగా అభినయించవలసివుండేది. తెలుగు పదాలు బహు తక్కువ–కాని గురువుగారు చెప్పించిన అభినయకళ నాకెంతో మేలును కల్గించింది. నేను వెళ్ళిన ప్రాంతాల్లో ఎంతటి విద్వాంసులున్నను అభినయంలో నాముందు నిలువలేక పోయేవారు. జోహారులర్పించే వారు. అభినయవిద్యలో విశేష ఖ్యాతి నార్జించి, మరల కొంతకాలానికి తిరిగి తెనుగు దేశంవచ్చాను.

పూజ్యశ్రీ విస్సా అప్పారావుగారితో పరిచయం, నాలో మరుగునవున్న క్షేత్రయ్య పదాల అభినయం మరల వెలుగు చూచే అవకాశం ఏర్పడింది. ఒక్క సంవత్సరకాలం వారు నాచేత వందపదములు మరల అభినయం సాధన చేయించారు భావోద్దీప గాయక శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరిగారు వంత పాడేవారు. అప్పారావుగారు క్షేత్రయ్య పదాలను ఒక పుస్తకరూపంలో ముద్రింపిం

చారు. శ్రీ మంచాల జగన్నాధరావు గారిచే, పదములు సర్వసహితంగా, రచన చేయించి ముద్రింపించారు. నాచే పదములకు అభినయం రచన చేయించారు. పదిసంవత్సరాలు శ్రమించి వందపదాలకు వేయి పేజీల వ్యాఖ్యానం వ్రాశాను. అది ప్రస్తుతకాలం ఎవ్వరూ చేయలేనిపని. ప్రస్తుత నన్ను వ్రాయమని కోరినా, నేనూ వ్రాయలేనేమో అనే సందేహం కల్గుతుంది. అంతటి కష్టతరమైన రచన. కాని ఆ వ్యాఖ్యాన రచన ముగిసేలోగా వారు గతించారు. అంతటితో ఆకార్యం ఆగిపోయింది. పదిపదాల వ్యాఖ్యానం మాత్రం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆర్థిక సహాయంతో ముద్రించ గల్గినాను. మిగిలిన గ్రంథం వెలుగు చూడడానికి యింతవరకూ నోచుకోలేదు.

నృత్తం, నృత్యం అందరికీ సాధనవల్ల అలవడ వచ్చును. నాట్యము కొద్దిమందికి అల వడ వచ్చును. కాని అభినయం, అందునూ శుద్ధసాత్వికం బహుకొద్దిమందికి మాత్రమే అబ్బుతుంది. ఆ కొద్దిమందిలో శ్రేష్ఠులు తెనుగు దేశపు కళాకారులు. ఇది ఆంధ్రులకు గర్వకారణము.

భారతదేశ నృత్య సరస్వతికి—అలంకారంగా ఆంధ్రులు, అర్పించిన అమూల్య ఆభరణము అభినయము.

---

నాట్యాభినయకళలో అకీర్తి గడించిన పూజ్యులు శ్రీ స్వా అప్పారావుగారు, ఆ కళను చెప్పిన అన్న స్వామిసు దర్, ఆ కళను నేర్పిన గురువులు శ్రీమతి నాయుడుపేట రాజమ్మగారు, వీరందరూ కీర్తిశేషులు, వీరికి అంజలి ఘటిస్తున్నాను

# కూచిపూడి నాట్యం - నవరసాలు

కోరాడ నరసింహారావు

పరమాత్మ యొక్క దివ్య సౌందర్యాన్ని రూప కల్పన చేయునదే నాట్యము. సర్వ లక్షణ శోభితమై వాచికముతో, ఆహార్యముతో అంగసాత్వముతో మరియు సాత్వికాభినయ ముతో సర్వాంగ-సుందరమై ప్రతిబింబించుచూ నవరస భరితమై మానవుడు పశుత్వమునుండి దైవత్వానికి చేరుటకు సుగమమైన మార్గ మును సూచించునదియే నాట్యము. ముని పుంగవులచే ప్రవచించబడి తరతరాలుగా శ్రేయస్సుకు ఆలంబనమై పలు విధముల పరి ణతిని జెంది ఈ పవిత్ర మాతృభూమియొక్క దివ్య సంస్కృతికి మకుటాయమానమై వెలు గొందుచున్నదీ నాట్యము.

అట్టి పవిత్రమైన నాట్య కళా విశేషము లలో ఒకటి కూచిపూడి నాట్యము. ఆంధ్రుల ఆత్మరూప సంపద కూచిపూడి నాట్యము. తెలుగుల జిలిబిలి పలుకుల తేనెలూరు నవ రసాల నవ్య, దివ్య, మంజూష కూచిపూడి నాట్యము. భరత మహర్షి చే తెల్పబడిన నాట్య నృత్త, నృత్య విశేషంబులతో, లాస్య తాండవ మిళితంబై వాచిక, ఆంగిక, ఆహార్య సాత్వి కాభినయములతో ప్రస్ఫుటమై, శృంగార, వీర, కరుణ, హాస్య, అద్భుత, భయానక, బీభత్స, రౌద్రి, శాంతము ఆది గాగల నవరసాదులచే ఆలంబనమై ఈ పవిత్ర మాతృ భూమియొక్క దివ్య ఆర్ష సంస్కృ తిని సువ్యక్తము చేయునది కూ చి పూ డి నాట్యము. ఇది కేవలము ఒక వర్గమునకుగాని కులమునకు గాని, గ్రామమునకుగాని పరి మితి చెందినది గాదు. చరిత్రను పరిశోధించిన తెనుగుల నాట్యకళ శాతవాహనులు, కాక తీయ రాజ్యాధిపతులు, విజయనగర సామ్రా జ్యాధిపతులు, వేంగి, రెడ్డి రాజులు ఆదిగాగల మహారాజులచే ఆదరింపబడి, పోషించబడి కాలగమనంలో సిద్ధేంద్రమహా యోగింద్రు నిచే చేపట్టబడి పవిత్రమైన దివ్యకళగా ఆరా ధించబడి కూచిపూడి నాట్యకళగా రూపొం దించబడి నేడు జగత్ ప్రసిద్ధమైనది.

ఇట్టి కూచిపూడి నాట్యము రెండు శాఖ లుగా విరాజిల్లినది. భాగవతులచే శైవ, వైష్ణవ సంప్రదాయములను ప్రచారము చేయుటకు తత్సంబంధమైన ఇతి వృత్త విశేష ములచే భాగవత మేళములుగా మిక్కిలి ప్రసిద్ధి నందినది ఒక భాగము. మరియొక భాగము దేవ దాసీలచే ఆరాధించబడి దాసీ ఆట్టము లేక నట్టువమేళముగా ప్రసిద్ధి నొంది

ఇది దేశ, కాల, మాన పరిస్థితుల నను అనేక రూపాంతరములు చెంది నేడు పూడి నాట్యమున ఒక ప్రసిద్ధ "ఏక కేళికా" నృత్యముగా (సోలోడాన్సు) గా రూపొందినది. భాగవత మేళ దాయముగా ప్రచారములో ఉన్న సమ లో కూచిపూడి నాట్య గురువర్యులం శ్రీ వెంపటి వెంకట నారాయణ, ంతా వెంకటరామయ్య, శ్రీ వేదాం క్ష్మీనారాయణ శాస్త్రిలలో ఒకరైన క్ష్మీనారాయణ శాస్త్రిగారి కృషి ఫలి కూచిపూడి నాట్యము ఏకపాత్ర నృత్యముగా రూపొందినది. దీనికొరకు కుణతో ఉన్న అడవు పద్ధతులు, వివిధ తులతో కూడిన జతి విన్యాసములు ని శరీర సౌష్ఠవము పొందుటకు అను , ఉన్కీలు, సూర్య నమస్కారాదులు, సనములు, రెప్పపాటున జతించుటకు గు నవరసాదులు తగుటగల విషయ వమున కనువగు శాస్త్రపఠనము ఇందు ర్చబడినది. ఇట్టి ఏకపాత్ర కేళికా సాంప్రదాయమును తెలుదోలుతగా లు పూర్తా నృత్య మునర్చెదరు.

జానృత్యము:- ఇదియే రంగపూజ ూడా పిలువబడుచున్నది. భరతముని శాస్త్రమున పేర్కొనబడిన పూర్వ విశేషములు జరుపబడుచున్నవి. ఋత్వి వేదపఠన గావింతురు. పవిత్ర రంగస్థలిని నర్తకులు పరిశుద్ధిగావించి, ల్లి కలచే తీర్చిదిద్ది, రంగ మంటపము మధ్య ధ్వజ స్థాపన గావించి, పూర్ణకుంభము ప్రతిష్ఠించి పూర్వరంగ విశేషమును పరి సమాప్తి గావింతురు. వెనువెంటనే నాట్యాధి దేవతయగు పరమేశ్వరుని ఆరాధించి గురు వందనము ఆచరించి, విద్వజ్జనంబుతో కూడిన సభకు, వందన మాచరించుచూ, పుష్పాంజ లులు ఘటింతురు. అనంతరము కూచిపూడి నాట్యాధి దేవతయైన శ్రీ సిద్ధేంద్ర యోగీం ద్రులను ప్రణమిల్లి "సర్వేజనాస్సుఖినోభ వంతు" అను ఆశయంబుతో అనంత కోటి జీవరాశి శుభము కోరుదురు. పూర్వరంగము చక్కని వివిధ తాళగతులు-త్రిశ్ర, ఖండమిశ్ర సంకీర్ణ గతులతోగూడి నర్తకులయొక్క లయ ప్రాశస్త్యమును తెలుపును. తరువాత తదను గుణంబగు వివిధ శ్లోకములు కీర్తనలతోగూడి చక్కని జతి విన్యాసముతో నర్తించబడును.

జతిస్వరం :— ఇందు నర్తకులు కేవలము వివిధ అడవు విన్యాసమును, అంగికాభినయ ముతో మిళితముచేసి నర్తింతురు. భృకుటి, గ్రీవ, నేత్రాభినయములు చక్కగా ప్రద ర్శించబడును. ఇది కేవలము నృత్త విశే షమునకు సంబంధించి నర్తకులయొక్క లయ తాళాదుల పాటవమును వ్యక్తీకరించును. "తారిఝుం" అను జతి స్వరము అఠాణా రాగములో ఆదితాళములో మిక్కిలి ప్రచార ములో నున్నది.

శబ్దము :— ఈ కూచిపూడి నాట్యములో ప్రసిద్ధమైనటువంటిది దశావతారములు, మండూక శబ్దము, కృష్ణ శబ్దము, రామ పట్టాభిషేకము, ప్రహ్లాదపట్టాభిషేక శబ్దము,

తులజాజి శబ్దములు మొదలైనవి. ఇవి ఎక్కువగా మోహన, కాంభోజి రాగములలో మిశ్ర చాపు తాళములలో గలవు. ఇది నృత్య విశేషమునకు సంబంధించిన ప్రక్రియ. ఇది తత్సంబంధమైన కథా వస్తువులను ఆయా రసముల స్థాయి సంచారీ భావముల ననుసరించి పటిష్ఠమైన పద విన్యాసముతో ప్రదర్శింపబడును. ఇక్కడ కూచిపూడి నాట్యములో ఒక ప్రత్యేకమైన విశేషము గలదు. అది 'సలాముదరువు'. నృత్యమునకుముందు ఆయా రాజులకు వందన మాచరించు పద్ధతి కలదు. అనంతరము తత్ సంబంధమైన ఇతి వృత్తము ప్రదర్శింపబడును.

**దరువు :—** ఇది కూచిపూడి నాట్యములో భాగవతమేళ సాంప్రదాయ ఛాయలతో కూడినటు వంటిది. దరువులు కూచిపూడి నాట్యములో ఆయా పాత్రలయొక్క స్వభావమును, ఆహార్య విశేషములను తెలుపుచు తన్ను తానుగా పరిచయ మొనర్చుకొనును. ఇందు శబ్దము, కందార్థము, పంచచామరము, చూర్ణిక, రగడ మరియు మిశ్రగతి విన్యాసములతోకూడి ఆయా పాత్రౌచిత్యాన్ని అనుసరించి వాచికాభినయమును కలిగియుండును. భరత మహర్షి పేర్కొన్న నాట్య విశేషం యిందు సంపూర్ణముగా ప్రస్ఫుటమగు చున్నది. ఇది తాళమాలికయై రాగమాలికయై నవరసాదులతోకూడి నర్తకుల యొక్క ప్రజ్ఞను వ్యక్తీకరించును. జక్కిన దరువు, పూజారిణి, అర్థనారీశ్వర, ఉలూపి మొదలగునవి ప్రసిద్ధమైనవి.

**తరంగనృత్యము :—** కూచిపూడి నాట్యములో మణిపూసల వంటివి తరంగ నృత్యములు. ఇవి అత్యంత ప్రముఖ స్థానాన్ని ఆక్రమించినవి. ఇది మినహా కూచిపూడి నాట్యము లేనేలేదు; నారాయణ తీర్థుల వారి కృష్ణలీలా తరంగిణి అనుగ్రంథము దీనికి ఆధారము. శ్రీ కృష్ణునియొక్క జన్మము, బాల్య క్రీడలనుండి రుక్మిణీ కల్యాణమువరకు వివిధ రసవత్తర ఘట్టములను రాస క్రీడలను నృత్యమున కనువుగా వివిధ తాళగతులలో రచింపబడినవి. నర్తకులు యిందు తమప్రజ్ఞా విశేషములను చక్కని రసాభినయముతో, నాట్య నృత్యములతో కూర్చి నర్తించుట అవసరము. ఇందు కుంభ నృత్యము ప్రత్యేక స్థానమాక్రమించినది. ఇది గీతా చార్యుడైన శ్రీ కృష్ణ భగవానునిచే ప్రవచించబడిన భక్తి, జ్ఞాన, కర్మ యోగములయొక్క దివ్య సందేశమును తెలుపుచున్నది.

**కుంభ నృత్యము:—** నర్తకులు శిరస్సుపై జలభాండము, పాదములక్రింద పళ్ళెరముంచి నర్తించెదరు. దీని విశేషంబేమనగా మానవుడు ఈ కలియుగములో ఎన్నియోతి బాధలు సుఖదుఃఖాదులు ఈ సంసార సాగరములో అనుభవిస్తూ, వాటిచే పెనవేసుకోబడినన్నూ, ఒక్కసారి పరమాత్మను మనసారా తదేక లక్ష్యముతో ధ్యానించినట్లైతే మోక్షాన్ని పొందగలడు. అది ఎట్లనగా శిరస్సుపై జల భాండమున్నా, పాదములక్రిందపళ్ళెరమున్నా తమలక్ష్య సిద్ధియగు రాగతాళాదులు తప్ప

కుండా, మనస్సు లగ్నమొనర్చి పరిపూర్ణత రాగ, తాళ, లయాదులయందు పొందు విధంబు. ఇది భక్తి, జ్ఞాన, కర్మయోగముల యొక్క ప్రతీక. ఇందు నర్తించుట కర్మ, రాగ తాళాదులయందు లయ తప్పకుండా నర్తించుట భక్తి, తల్లీనసిద్ధిని పొందుటకు తదేక ధ్యానముతో పరిపూర్ణత సాధించుటయే జ్ఞానము. ఇట్టి మహత్తర దివ్యఆర్ష సంస్కృతి యొక్క సందేశమును అందించునదే యీ తరంగ నృత్యము. ఈ నృత్యమందు కత్తెర నాటులు, అడ పాదములు, అడ కత్తెరలు, రేచిత అంచిత పాదములు, గర్గరము, పాద ఘట్టనము మొదలగు విశేష అడవిన్యాసములు ప్రాధాన్యత వహించి, నర్తకులయొక్క లయ ప్రజ్ఞను విశదీకరించును.

**భామా కలాపము:**—కూచిపూడి నాట్యాధి దేవత సిద్ధేంద్ర యోగీంద్రులచే రచింపబడినది. ఇది ఒక ప్రత్యేక యక్షగానము. సాధారణ ముగా దీనిని పూర్వీకులు వరుసగా ఏడు దిన ములు ప్రదర్శించెడివారు. ఇందు సత్యభామ జడభరతము, ప్రవేశము, సత్యభామయొక్క విరహవేదన, సత్యభామయొక్క లేఖ, భామా స్వాంతనము, భామా కృష్ణులయొక్క సంవా దము, అనంతరము భామయొక్క సమర్పణ మొదలగు ఘట్టములతో నవరస భరితమై, అష్ట విధ నాయికా లక్షణమై విరాజిల్లుతుంది. కాని ఏకపాత్ర కేళికా నృత్యములో యిది అంతయు ప్రదర్శించుటకు వీలుకాదు. కాన యిందు రెండు ఘట్టములు మాత్రమే ఏకపాత్ర కేళి కలో ప్రదర్శించుటకు యోగ్యముగానున్నవి. ఒకటి సత్యభామ ప్రవేశ దరవు, పాత్రపోషణ, సూత్రధారుని భామా సంవాదము, సిగ్గాయనే యమ్మా అను ఘట్టముల వరకు. రెండవది కృష్ణుని లేమిచే సత్యభామ అనుభవించు విరహ వేదన, మదనాదరవు, లేఖ శకునములతో అంతమగును. ఈ రెండు ఘట్టములలో ఏదో ఒకటి అంతమున ప్రదర్శింపబడుచున్నవి.

ఈ విధముగా ఏకపాత్ర కేళికా నృత్యము ఒక ప్రత్యేక సంప్రదాయ రీతిలో మిక్కిలి ప్రచారములోవుండి ప్రేక్షకులచే ఆదరింప బడుచున్నది.

ఇది శృంగార, వీర, కరుణ, హాస్య, భయానక, బీభత్స, అద్భుత, రౌద్ర, శాంత- మొదలగు నవరసములతో, ఆయా పాత్రలకు యితి వృత్తము ననుసరించి, స్థాయీ భావ ముగా ఏదో ఒక రసముండి తదితర రసములు సంచారీ భావములుగా మెలగుచు, అనుభావ, విభావములతో మిళితమై, వ్యక్తిగత ప్రజ్ఞను మిక్కిలి రసవత్తరముగా ప్రదర్శించి, నాట్య కళా రంగములో తనకొక ప్రత్యేక స్థానాన్ని సృష్టించుకొనే ధీశక్తిని యీ నవరసాలు కూచిపూడి నాట్యమునకు కలిగించుచున్నవి

# జానపదసంగీతం-శాస్త్రీయసంగీతం

డా॥ అనసూయాదేవి

సంగీతం సునాదపూరితం. సప్తస్వర సమ్మిశ్రితం. అది ప్రాంతీయమైనా, దేశీయమైనా, ఏ దేశానికి చెందినా, నాగరకమైనా, జానపదమైనా, ఏకైక కళా ప్రపంచాన్ని అలుసుకున్న అఖండ కళావాహినే. జాతీయ, ప్రాంతీయ అభిరుచులను మనోప్రవృత్తులను పట్టి, వివిధప్రాంతాల్లో వెలువడే గానస్రవంతులకు, విభిన్నమైనశైలులు ఏర్పడుతూంటాయి, కవిత్వంలో శైలులులాగ. ఈ విశాలదృష్టితో చూస్తే, జానపద సంగీతానికీ, శాస్త్రీయ సంగీతానికి అంతర్వాహిని అయిన ఒక సాన్నిహిత్యం కనపడుతుంది.

ప్రపంచసంగీతానికి (Universal Music) మెదడు శాస్త్రీయ సంగీతమైతే, గుండె జానపద సంగీతం అని నా నమ్మకం. శాస్త్రీయ సంగీతం, మానవుని మేధశ్శక్తి వలన నిర్మితమైనది. జానపద సంగీతం మానవుని గుండె నుండి ఉద్భవమైనది. నాగరకులూ విజ్ఞానవంతులూ, అల్పసంఖ్యాకులూ అయిన మానవులు ఏర్పరచుకున్న నియమాలకు బద్ధమై, శాస్త్రీయ సరిహద్దులలో సంచరించేది, శాస్త్రీయ సంగీతం. అనాగరకులూ అసంఖ్యాకులూ అయిన మానవుల గుండెలోతులనుంచి సరిహద్దులుదాటి పొంగి పొరలేది, జానపద సంగీతం శాస్త్రీయసంగీతం శృంఖల, జానపద సంగీతం విశృంఖల. ఆశృంఖలాలను తగుల్చుకున్నవారు, విదల్చుకున్నవారూకూడా కళాకారులే. ఒకరు కృషివల్ల కళాకారులైనవారు. మరొకరు అయాచితంగా కళాకారులైనవారు. అంతేతేడా. ఇద్దర్నీ సన్నిహితులను చేసే అంతర్వాహిని ఒకే సంగీతం.

మనమే సృష్టించుకున్న శాస్త్రానికి, ఏర్పరచుకున్న నియమాలకూ బద్ధమైనదే శాస్త్రీయ సంగీతం అని మనం అంటున్నాము కాబట్టి, అవేనియమాలకు బద్ధము కానంతమాత్రాన, జానపద సంగీతాన్ని అశాస్త్రీయం అనడానికి వీలులేదు. జానపద సంగీతానికీ నియమాలున్నాయి. ఎటొచ్చీ, అవి — శాస్త్రీయ సంగీత నియమాల్లాగ-ఆలోచించి ఏర్పరచుకున్నవికాక, అనాలోచితంగా, ఇన్‌స్టింక్ట్ వల్ల ఏర్పడినవి. శాస్త్రీయ నియమాలను ఏర్పరచినది వ్యక్తులైతే, జానపద నియమాలను ఏర్పరచినది ప్రజా సమూహం.

శాస్త్రీయ సంగీతం రాగ, భావ తాళాల కలయిక. జానపద సంగీతానికి లయ ప్రాధాన్యం. శాస్త్రీయ సంగీతాన్ని, జానపద సంగీతాన్ని సన్నిహితం చేసేది, లయ. ఏ సంగీతమైనా దానికి ప్రాణం లయే. అసలు ఈ

ప్తే లయ బద్ధమైనది. Cosmos నాగరకు న శాస్త్రీయ సంగీతజ్ఞులు, లయను రక్తికి కరణంగా ఉపయోగించు కుంటున్నారు. ని లయే జానపదుల్లో జీర్ణించిఉంది. లయే ళ్ళని నడిపిస్తోంది. నిత్యజీవితానికి ఆధార న ప్రతివృత్తీ లయలోనే సాగుతూంది, బట్టి వాళ్లు లయకోసం ప్రాకులాడనక్కర దు. ఎటొచ్చీ జానపదుల పాటలు, స్త్రీయ సంగీతంలో లాగ సప్తతాళాలలో డకపోవచ్చు. త్రిశ్ర, చతురశ్రగతులలోనే రచునడుస్తూంటాయి.

ఇంక శ్రుతి సునాద పూరితం కాని దేదీ ంగీతంకాదు."శ్రుతిలేనిపాట, మతిలేనిమాట' న్నారు పెద్దలు. అపశ్రుతి అందరికీవర్జ్యమే. స్త్రీయగాయకులు, సాధకంవల్ల తమ నాన్ని శ్రుతిపక్వం చేస్తున్నారు. జానపదు కు అటువంటి వ్యక్తిగత సాధకం లేక యినా, సమిష్టి సాధకంవల్లవారి గాత్రాలు ృతిపక్వంగానే ఉంటాయి. శాస్త్రీయ ాయకుల కున్న శృతిజిజ్ఞాస, (Conscious-ness) జానపదగాయకులకు లేకపోవచ్చును. ాని వీరి సంగీతంలో తరచుగా బృందగానం ెక్కువగా ఉంటుంది కాబట్టి, ఆ group consciousness వల్ల, అందరూ ఒకేబాటలో డవాలి కాబట్టీ, నలుగురి గాత్రాలతోపాటు, అందరి గాత్రాలూ, అప్రయత్నంగా, శృతి లోనే ఉంటాయి.

స్త్రీలకు అలంకారం ఆభరణం. సంగీతానికి అలంకారం గమకాలు. శాస్త్రీయగాయకుల్లాగ జానపదగాయకులు, దశవిధ గమకాలనూ, ప్రయత్నపూర్వకంగాప్రయోగింపకపోవచ్చు. జంట, దాటు, స్ఫురితం, కంపితం. ముంపితం లాంటి గమకాలన్నీ జానపదులూ వాడు తున్నారు. అన్ని విధములైన గమకాలూ, వీరి సంగీతంలో, అప్రయత్నంగా దొర్లుతూనే ఉంటాయి. ఇవికాక, ఇంకాకొన్ని విశిష్ట మైన గమక ప్రయోగాలు(folk gamakas) కూడా జానపదులు చేస్తూనే ఉన్నారు. పాడే గాత్రాలకి గమకం అనేది ఉగ్గుపాలతో అల వడుతుంది.

జానపద సంగీతంలో రాగాలు లేవను కోవడం పొరపాటు. ఎటొచ్చి శాస్త్రీయ సంగీతంలోలాగ సంపూర్ణరాగాలుండవు. తరచుగా జానపద సంగీతానికి ఏ శాస్త్ర గ్రంథాలూ ప్రమాణాలుకావు. వాళ్ళ హృద యాలే వాళ్ళకు ఆధారం. అందువల్ల అను కోకుండా, అప్రయత్నంగా, కొన్నిపాటలు పూర్తి రాగాల్లో దొర్లినా, చాలవరకు వాళ్ళ పాటల్లో రాగచ్ఛాయలు మాత్రమే కనబడు తూంటాయి. శాస్త్రీయ సంగీతంలో లాగ, జానపద సంగీతంలో కూడా ప్రతిరాగమూ, సంపూర్ణంగా ఉండాలని మనం అనుకో కూడదు.

తరచుగా, జానపదగేయాలు, హనుమ తోడి (8), వకుళాభరణం (14), మాయా మాళవగౌళ (15), నటభైరవి (20),కీరవాణి (21),ఖరహరప్రియ(22), హరికాంభోజి (28), ధీరశంకరాభరణం (29)— ఈమేళకర్తలకు

చెందిన రాగాల్లోనో, ఈరాగచ్ఛాయల్లోనో ఉంటూంటాయి వాళ్ళమన స్తత్వాలకిఎక్కువ సన్నిహితమైన రాగాలు-ముఖ్యంగా. నాటకురంజి, నవరోజ్, యదుకులకాంభోజి, రాయదు కులకాంభోజి, రేగుప్తి, ముఖారి,ఆనంద భైరవి మధ్యమావతి, జంఝూటి, లాంటివి. ఇవన్నీ వాళ్ళ అభిమానరాగాలలాగ అనిపిస్తుంది. ఏ రాగము జానపదుల నోట వెలువడినా, అది అప్రయత్న ఆశుధారే అన్నమాట, మనం మరచి పోకూడదు.

జానపద వాఙ్మయాన్ని విసర్జించిన సాహిత్యమూ, జానపద సంగీతాన్ని విసర్జించిన సంగీతమూ, అసమగ్రమే అవుతాయి. గ్రాంధిక సాహిత్యానికి, జానపద వాఙ్మయములాగే, శాస్త్రీయ సంగీతానికి జానపద సంగీతం ప్రాతిపదిక. అందువలన, శాస్త్రీయ సంగీతమూ, జానపద సంగీతము పరస్పర విరుద్ధాలు అనుకోవడం, సంకుచిత భావం. శాస్త్రీయ, జానపదసంగీతాలు, ఏకైక గానవాహినిలో కలిసి, రెండు సజీవకళా ప్రవంతులుఅన్నవిశాల దృక్పథమే కళాకారులందరికీ ఉండాలి. అప్పుడే, మన కళలు బూజుపట్ట కుండా, నిత్యయౌవ్వనంగా, చిరస్థాయిగా, నిలుస్తాయి.

# జానపద వీరగేయాలు

డా॥ యెల్దండ రఘుమారెడ్డి

పల్లెటూరి హృదయం జానపదగేయం, బతుకు గాయమైనా మెతుకు మాయమైనా గేయమే ధ్వనిస్తుంటది. లేతప్రాయమైనా గాతటియమైనా ఆ పలుకే పలుకుతుంటది. జానపద వాఙ్మయంలో ఆ గేయశాఖ బలమైంది. మొగులు మీది చుక్కలను లెక్కించజాలనట్లే యీ శాఖకు వర్తించే సుత్తిక గేయాలను కూడ లెక్కించ తరంగాదు. ఒక్కొక్క పల్లెపట్టు పల్లెపదాల పట్టు-తేనెపట్టు. అద్రిస కొద్దిగ ముద్దుగ వుంటాయి. పలుకులు కవిత్వాన్ని అద్దుకొంటయి. తొమ్మిది రసాలను చిమ్ముతుంటయి. అందులో ఉత్సాహం ఉరకలేసినపుడు వీరరసం, కోరమీసం. దిప్పుతుంటది. "ఉత్తమ ప్రకృతిర్వీర ఉత్సాహస్థాయి భావకః" అనగా వీరరసానికి ఉత్సాహాన్ని స్థాయి భావంగా చెప్పుట జరిగింది. ఇట్టి ఉత్సాహం పౌరుష సంబంధమైనది తత్ ప్రత్యమే వీరం.

భారతజాతి అనాదినుంచి ధర్మానుగత వీరాన్ని ఆరాధిస్తూవచ్చింది. వేదాలలో ఆ విషయం సువ్యక్తం ఆ వీరమంతా శిష్టరక్షణార్థమే. బలహీనుడైనవాన్ని భగవంతుడు కూడ రక్షించడు. అవతారాలు చరిత్ర అంతా వీరోపాసనాత్మకమే ఈ సంప్రదాయం జానపద సాహిత్యంలో కూడ మెరుపు మెరిసినట్లయింది. బొబ్బిలి, పల్నాటి వీరులవంటి గాథలు చిరస్మరణీయాలై వీరగాథలనే పేర ప్రత్యేకశాఖ రూపొందింది. నిత్యజీవితములోని పెక్కు వీరోచిత సన్నివేశాలలో గుండె ప్రేరించిన ఆ క్షణంనుంచి ఉత్సాహోపేతయంగా వ్యక్తీయుడల్లుకొన్ని చిన్నచిన్న పదాలే వీరగేయాలు. ప్రస్తుత వ్యాసంలో వీర గేయాలను మాత్రమే వర్గంగా పరిశీలించుటవుతుంది.

పల్లెటూరి తల్లులు చనుగుడుపుతూ చంటిపిల్లలను వంటిలో బెట్టుకొని పెంచుతుంటరు ఊగయిస్తూ ఊహలుంటస్తుంటారు గునగున నడుస్తుంటే భవిష్యత్తునకు గుస్తులు నూపుతుంటరు. క్రీడిపదములో తల్లి వీరరసాన్ని బిడ్డకు నూరిపోసిన తత్త్వం గమనించదగినది –

"విద్దెం విద్దెం వరాలవిద్దెం – విద్దెం చేస్తే
గిద్దెడు నెయ్యి
తప్పక చేస్తే తవ్వెడు నెయ్యి – మళ్లీ చేస్తే
మానెడు నెయ్యి"

ఇందులో యుద్ధం (విద్దెం) సంగతి తడవబడింది. ఆ విషయం బిడ్డకు తెలిసినా తెలువక పోయినా దాని పట్ల ఆసక్తిని పెంచుటలో తల్లి కర్తవ్యం తల మానికమైంది. ఎంత యుద్ధం చేస్తే అంత నెయ్యి ప్రతిఫలంగా జెప్పుటలో బలోపనాపా మంత్రం దర్శింపబడుచున్నది

తల్లి : నూకలిస్తా మేకలగాస్తావా, బిడ్డ :–
ఊఁ కాస్తా
తల్లి : ఎలగ్గొడ్డొస్తే బెదరవా, బిడ్డ :– బెదరను
తల్లి : పెద్దపులి వస్తే శివంగివస్తే,
బిడ్డ :–ఊఁ ఊఁ బెదరను.

ఇట్లా తల్లి ప్రశ్నిస్తుండగా బిడ్డ తన నిర్భయత్వాన్ని ప్రకటిస్తున్నప్పుడు ఆమె "ఉఫ్" అంటూ బిడ్డ కంటిలో వూదును అప్పుడా బిడ్డ కండ్లుమూయక పోయినచో ధీరగుణము కలదని నిశ్చయిస్తుంది అనగా భయాన్ని తొలగించి, వీరత్వాన్ని నూరి పోస్తుంది ఆ వీరమాత.

పిల్లలు ఆడుకునేదశలో వాళ్ళ ఆటల్లో పరాక్రమాన్ని ప్రదర్శించే సన్నివేశ సందర్భాలెన్నో చూస్తుంటాం. పాడిపాడి మాటల్లో పాడుపు కథల్లో– "రాజిం" వెనుక పచ్చని గరక
వచ్చినగాడిద గరక తినకుంటే
చెప్పుతో గొట్టాలెనా? పాపోసుతోనా ?"
'ఒక రాజెక్కుతుంటే ఒకరాజు దిగుతుంటడు'
వంటి రాచరికవ్యవహారాలు మెదులుతుంటాయి.

ఇంటిలో పనిపాటలు చేస్తూకూడా వనితలు వీర వనిత లవుతుంటారు. విసురు రాయి విసురుతూ–

"ఓయీ ఓయీ రాజా వద్దాదిరాజా
బొబ్బిల మీదాయె...కిమిడి కిందాయె
మాడుగులు మనకాయె మళ్ళు మారాజా"
పూసపాటి వారు పుణ్యవంతుళ్ళు

పులిజంపి పులిగోళ్ళు జూదమాడేరు
దూరాన పులిజంపి వారుతేబోసి
దండిగల మేనత్త కొడుకు వచ్చాడో''-

అంటూ ఉత్సాహంతో చారిత్రక విషయాలు కొన్ని తడవుతూ-

''బుద్ధిగల నా ముద్దు ఓ అన్నలారా
భూపణా లిచ్చేను భూములే లండీ
చాలకుంటే నానుసిరులు యిచ్చేనూ
ఒడ్డాణ మిచ్చేను ఓడి రాకండి!''-

ఓటమిని సహింపని వారై ప్రోత్సహిస్తుంటారు. వీరుతై భూములేల వలెనని తమ పురుషులను, సోదరులను ప్రేరేపిస్తూ ఉంటారు.

"కొండవీడు మనదేరా కొండపల్లి మనదేరా
కాదని వాదుకు వస్తే కటకందాకా మనదేరా
కృష్ణానది మనదేరా గోదావరి మనదేరా
కోరుకొండ మనదేరా కోనసీమ మనదేరా
కాదని వాదు వస్తే కటకందాక మనదేరా''-

ఇది శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో ఒక చాకలి వాడు పాడినపాటగా చరిత్రకెక్కింది. రాయల వారికి వాడు వింజామర వీచేవాడంట. ఒకనాటి రాత్రి రాయలవారు మారువేషంతో నగర సంచారంచేస్తూ వాడు పాడుకొంటున్న ఆ పాట విన్నాడంట. దానితో పౌరుషానందం పుటమరించి తక్షణమే రాయలవారు పూర్వ దిగ్విజయ యాత్రకు పూనుకోవడమేగాక ఆ చాకలివాన్ని తన అంగరక్షకునిగా జేసికొని ఆ పిదప వాన్ని దేవరకోట సంస్థానాధిపతిగా జేసెనని చరిత్రకథనం. దీన్నిబట్టి పల్లెటూరి వారుకూడా మహారాజుల వీరత్వానికి ప్రేరణ కల్గిస్తుంటారని తెలిసికోవచ్చును. శ్రీనాథునివంటి మహాపండితుడు సహితం నాటి పల్లె పదాల ప్రభావాన్ని మరిచి పోలేదుగదా.

కోలాట మాడేటపుడు కొన్ని గేయాల్లో ఉత్సాహం ఇనుమడించి పరువుతో-కోలల ఊపుతో వీరరసోద్రేకం ఉడుకునెత్తురోలె పారుతుంటది.

"అడుగు జాడలు గట్టిరాకురా మగవాడ
అంబులకు నెంబులేసేను
జోడంబులూ చేతిమన్నాయీ
పవూరి కమ్మరీ జేసినమ్మాలూ
తేవె సుందారీ తేవె సూదామూ
గుంటూరి కమ్మరీ పేసినా అమ్మలూ
గుమ్మడాకు చాయ నుండేనురా
వాడి గుండెలూ తెగబూని వేసేనురా
మావూరి కమ్మరీ సేసినా అమ్మలూ
మామిడాకు చాయనుండేనురా
వాడిమాంసమూ తెగబూని యేసేనురా!'

ఇట్లే గ్రామదేవతలకు బలులిచ్చే సందర్భాల్లో గోసంగి కత్తి చేతబట్టుకొని సాహస ముట్టిపడేటట్లు గంతులిడుతూ ఇట్లా పాడుతుంటడు-

ఓరి ఆదిమూలము బ్రహ్మ విష్ణు విగ్రహము మీద
ఆనందమాడే వాడెవ్వడురా
అఖిలదేవతలకూ అభయమిచ్చినవాడు
అలనాడు గోసంగి నేనేనురా
పసుపుగందం చాల పైనిండ బూసుకా
పసుపుకత్తీ చేత బూసుకోసీ
మేల్మేలు సలిపినా యేటిమృగముల కెల్ల
నా కత్తి సయ్యాటలాడూనురా ॥లింగ తా॥
అండాండ మనుబిరుదు ఆసాది నాపేరు
పిండాండ మనుబిరుదు కాళపోసి
అండ పిండ బ్రహ్మాండాల కెల్లాను
మొండొండు దైవాల మెండాడురా॥ లింగ తా।

పై పాటలోని వర్ణన భయానకతర శీలగా ఒప్పినప్పటికిని ఆ సన్నివేశం వీరావేశాన్ని పోషించేదిగా ఉంటుంది.

జానపద సమాజంలో వీరరసం పొంగే సంఘటనలెన్నో వుంటయి. పరాయి ప్రభుత్వాన్ని ఎదిరించిన వ్యక్తిలో; దుర్మార్గానికి అడ్డంతిరిగి దుఃఖంపాలైన-శక్తిలో శౌర్యాన్ని దర్శించి వీరపూజచేసే గుణం జానపదుల గుండెలోతుల్లో జూలు దులుపుతుంటది. ఈక్రింది పాటలో ఓబుల్ రెడ్డి శౌర్యాన్ని మీసం దిద్ది చూపటం జరిగింది.

''కోలు కోలనకోలు కోలనా్న కోలే
కోలు మాయకు బాలనరసింహా కోలే
గుట్టగురప్పకొండ గురిదప్పకుండా
పైదళము రాకుండ పడెరా నీజెండా
సైరా ఓబులరెడ్డి నెలవన్నె కాడా
నిడు జూచినాగుండె జల్లుజల్లుమనెరా
నీకు పూలూ నీదు కత్తికీ పూలూ
నీచేతికి వన్నె బంగారు రవలూ
పద్రాది గుజ్జమూ వెండి కళ్లెమురా
దూకించె గుజ్జాన్ని దుమ్మెల్ల రేగ

బూడిద గుఱ్ఱాము బుగడ కళ్లెమురా
బుగడ కళ్యాణికి బాండు మల్లెలురా"

తెలంగాణాలో కాముని పున్నమ దినాల్లో పాడే మరో గేయం గమనించండి.

"చుక్కవోలె పాగజుట్టి చూచినావు దేశమెల్ల
యెత్తినావు యెల్మతేజినో ఓపాలేల
ఏలినావు గోలకొండనో
కుందేలంత గుట్టమెక్కి బంగరుకుచ్చుల బల్లెమేసి
ఎక్కినావు యెల్మ తేజినో ఓపాలేల
ఏలినావు గోలకొండనో"

ఇందలి పటీలు ఎవడో తెలిసికోవటం కష్టం. వాడెన్నడూ గుట్టమెక్కి బల్లెమేసి గోలుకొండ నేలెనో? గోలకొండ నేలటమంటే ఆనాడు అంత సామాన్యం కాదు. చరిత్రకారుల కంటపడని చారిత్రక విషయాలు పల్లీయులపదాల్లో నిక్షేపాలైనయి.

పైటకొంగునైతే నడుముచుట్టింది రాజమ్మా
చీరకుచ్చెళ్లాను వెనుకకు విరిచి కట్టేను
జుత్తు విరియాబోసి కన్నుఎఱ్ఱ చేసింది.
శక్తిరూపమై తాదాల్చి యున్నది.
త్వరపడి కత్తినీ తిప్పుచున్న యప్పూడూ
దొంగలామెను జూచిదద్దరిల్లేరూ వెంటనే
పారిపోపుటకై యత్నించారూ ద్వారానా
కాపుగనున్నట్టి వారు కాచేరు దొంగాల
చావుతప్పదు మనకుఅనుకొని వారేకమై
రాజమ్మామీదకు కత్తులు దూశారందరూ
కొడుకునూ దలచుచూ కోపముహెచ్చంగా
రాజమ్మా
కొడుకునుచంపినపగకూ మారువేయంగా
ఒక్కొక్క దెబ్బ దొంగల కొట్టుచునుండం
గవారునూ
చిన్నకత్తుల తోడనామెను కూడా బొడిచిరీ
దేహామంతయు రక్తమయమైనపుడు రాజమ్మా
కన్నూలా నిప్పులు గ్రక్కుచున్నదీ రాజమ్మా
వీరావతారిణీ వీరా రాజమ్మా దెబ్బాకూ
ఒక్కొక్క దొంగను నరికివేసిందీ"

పలనాటి సీమలో పుట్టిన వీరరాజమ్మ నాగిరెడ్డి కుమారుడైన పేరిరెడ్డి భార్య. భర్తఊరలేనినాడు అత్తబెట్టిన ఆరడికి తట్టుకోలేక చంటిన బిడ్డనెత్తుకొని తల్లిగారింటికి పయనమయింది. దారిలో దొంగలామెను చెరుపదలచి చేరువలోని గుడిలోనికి ద్రోచింద్రు. కాని ఆమె మానరక్షణకై సాహసించి బిడ్డను గుడిలోనే వదలి రివ్వున వెలుపలికివచ్చి గుడి తలుపులు మూసేసింది. వారు మాయమాటలు చెప్పినా' చంటిబిడ్డను ముక్కలుచేసి కిటికీగుండా వెలుపలికి విసిరినా పుత్రశోకాన్ని భరించింది కాని మాన రక్షణ పవిత్రంగా ఎంచుకొన్నది. మానమే మగువకు ప్రాణం కదా! ఇంతలో ఆ దారిని రైతుల బండ్లు వచ్చుటగాంచి ఆమె వారికీ విషయం తెలిపి గుడితలుపులు తెరిచింది. బిడ్డశవాన్ని చూసి. మీద బడనున్న దొంగలను గమనించి ప్రళయ చండికా స్వరూపిణియై వారిచేతిలోని కత్తులనులాగి వారినే భీకరంగా పొడిచి పొడిచి తుదకు కత్తిపోటు తగిలి వీరమరణం చెందింది ఇంతటి వీరనారి కోడెత్రాచైన సంఘటనపై పాటలో నున్నది. కీ. శే. నేదునూరి గంగాధరంగారి జానపదగేయ వాఙ్మయ వ్యాసావళిలో నీవిషయం చూడదగును.

"దీగుల్ దీగుల్ మంటాది-పులిమామిడికోట
అగుల్ బొగుల్ మంటాది
అత్తె కాదురా-పత్తె కాదురా-కనుమనూరి
గుడెవుగాడు
కత్తి లేదు కతారిలేదురా-మనుబోతు కాపోన్ని
సంపిన
అదే కత్తి నాసేతుల వుండే-కొల్లంపల్లి తాటి
మానుల
కొట్టికొట్టి ముర్దార్ సేతురా-కొలువోదు పులి
మామిడికోట ॥దీ॥
వాడు ఏసినా గుండుగాదురా వీడు ఏసినా
గుండు గాదురా
మదాపురాయడు ఏసిన గుండు-సెట్టు నేమాకు
తగులకుండరా
పానుగంటికి పగులుచుక్కరా—మూప
ప్యాటమూక తేసెరా
అల్కజల్క పాతాళ మోదురా-అజ్జిలిక
జివిలికె తిమ్మడు
కురకుర మీసం బయరి గడ్డము-వొంటి
వ్రాల బాకు చేతుల
బంగారి ముచ్చాలవాడురా ॥దీ॥
ఎక్కక్కడెడి దండు వచ్చెరా-ఎల్లమ్మ
గుడ్డాలు పట్టవు
మల్లమ్మ గుడ్డాలువట్టవ-

పై పాట మదాపురాయుని వీరత్వాని గూర్చి పల్లీయులు అల్లుకొన్నట్టిది. అతడు పాలమూరు మండలంలోని పులిమామిడి నేలినవాడు. కత్తి బట్టి కదన రంగానికి బయలుదేరినాడంటే శత్రువులు చెదరి పోవలసిందే. అతని కాలంలో పులిమామిడికోట మంచి స్థితిలో వుండింది. వీరవిహారం చేస్తున్నపుడు ఆ రీవి, అతని గుఱ్ఱం నైపుణి, చూపరులను పౌరుషంలో ముంచెత్తుందేది.

మరొక ఈక్రింది పాటలో పండుగ సాయన్న ప్రతాపం వర్ణించబడింది, పండుగోళ్ళ వంశాన-

దొంగతనం లేదురా కొడుకా
పొద్దుపొద్దు సాయిలన్న-పండుగోళ్ళసాయిలన్న
పొద్దన్నా నేపోతా-పొమ్మన్నా నే పోతమ్మా
గద్దావోలే లేసినాడు-గద్దు ఎాలదోసినాడే
తెల్ల వార్లూ లేసినాడే-ఉన్న ఇండ్లూ దోసినాడే
ప్యాదోల్ల పెండిండ్లు నేసినాడే
పావురా మోలే లేసినా డే-పాలమూరు
దోసినాడే
బుజువు వోలే లేసినా డే-బా దేవల్లిదోసినాడే

ఈ పండుగ సాయన్న పాలమూరు మండలం వాడు ఈ శతాబ్ది ప్రథమ పాదమందుండినవాడు. పండుగోని వంశానికి చెందినవాడు. సాహసవంతుడు. తల్లి పేరు సాయమ్మ. వనపర్తి, గద్వాల, కొల్లాపురం, వంటి సంస్థానాధీశ్వరులను సరిగా నిద్రపోనీయలేదు. సంస్థానాలను, భూస్వాములను, ధనికులను-చెప్పిన సమయానికి పోయి దోసుకొని వచ్చి బీదసాదల పెండ్లిళ్ళు చేసేవాడు. దొరలను కొల్లగొట్టడం సాయన్నకు తెలిసిన పని. అదొక సాహసమైనటువంటి నైపుణ్యం ఇప్పటికీ పాలమూరు మండలంలో పెద్దమ్మలవారు పండుగ సాయన్న జ్ఞాపకం కోసం ఆతని ముఖచిహ్నాన్ని తమ ముఖాలకు తగిలించుకొని ఆడుతుంటారు.

"దొరవారి నరసింహ్వారెడ్డి
నీదొరతనము కూలిపోయెరాజా
నరసింహ్వారెడ్డి ॥దొర॥
రేనాటిసీమలోన రెడ్డోల్ల కులములోనా
దొర వారి వంశానా ధీరుడే నరసింహ్వా
రెడ్డి ॥దొర॥
కోయిల్ కుంట్లా గుట్టలెంటా
కుందేరు పొద్దులెంటా
గుట్ట మెక్కి నూవువస్తే కుంపిణీకి
గుండెదిగులూ ॥దొర॥

పై పాటలోని రాజా నరసింహ్వారెడ్డి రాయలసీమ లోని కోయిలకుంట్ల పరిసర ప్రాంతాలను పలిన వాడు. ఈతడు 19వ శతాబ్దం ఆరంభ కాలంలో వుండినవాడు. ఆంగ్లేయ కుంపినీ దొరతనాన్ని యెదిరించి వీరమరణం చెందినట్టి వాడు నర్సింహారెడ్డి. ఆ కాలంలో ఆప్రాంతంలో కుంపినీ దొరల గుండెల్లో నిద్దురపోయినాడనీ, పల్లీయులు ఆ వీరుని వీరమరణాన్ని ఇప్పటికీ కోలాటాల ద్వారా వినిపిస్తూనే వుంటారు.

ఈ విధంగా ఎటువంటి వ్యక్తిలోగాని పౌరుషం, సాహసం, కనిపిస్తే చాలు-పల్లెటూరి వాళ్ళు అప్పటికప్పుడు స్పదించి పాటలల్లుకొని చరిత్రకందని స్థానిక విషయాలను సమకూర్చి అందిస్తుంటారు. ఇటువంటి వీరగేయాలు జాతిని జాగృతం చేస్తుంటయి. స్వాతంత్ర్యాన్ని నిలుపుతుంటయి. మనజాతి పౌరుషం పల్లెటూరి గుండెల్లో ప్రతిధ్వనిస్తున్నంత కాలం ఈ భారతం వీరభారతమే.





# శ్రీ వెంపటి సత్యం

శ్రీ వెంపటి సత్యం తెలుగు దేశ నాట్య సంప్రదాయానికి మూలభూతమైన కూచిపూడి అగ్రహారంలో 1922వ సంవత్సరం డిశంబరు 5 వ తేదీన జన్మించారు. ప్రఖ్యాత కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ చింతా వెంకటరామయ్య, ఆ తరువాత శ్రీ వేదాంతం లక్ష్మినారాయణ శాస్త్రి గారలు శ్రీ వెంపటి స్యతం గారిని ఒక ఉత్తమమైన నృత్యకారునిగా రూపొందించారు.

చిన్న తనంలో చిత్ర లేఖనంలో అభిలాష ఉన్నా శ్రీ అడివి బాపిరాజుగారి సలహా ననుసరించి నాట్యానికే తమ జీవితాన్ని అంకితం చేశారు. ఈ రోజుల్లోనే వారికి సినిమా ప్రపంచంనుంచి పిలుపు వచ్చింది. శ్రీ అడవి బాపిరాజు శిల్ప దర్శకుడిగా పని చేస్తున్న నవ్యకళా ఫిలిమ్స్ వారి "మీరాబాయి" సినిమాకు తొలిసారి- 1939 లో నృత్య దర్శకత్వం నెరిపారు. శ్రీ సత్యం. శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ తాండవ కృష్ణలతో కలిసి దక్షిణ దేశంలో పర్యటించి కూచిపూడి నాట్యానికి ఒక ఉన్నతిని కల్పించారు.

శ్రీ వెంపటి సత్యంగారి నృత్య దర్శకత్వంలో వెలువడ్డ మొదటి తెలుగు చిత్రం "భక్తిమాల" అందులో ఆయన ప్రథమ శిష్యురాలు శ్రీమతి భానుమతీ రామకృష్ణ.

కథాకళి, భరతనాట్యం, కథక్‌లలో కూడా శిక్షణ పొందిన శ్రీ సత్యం నృత్య రూపకాలను సినిమాలకు మలచడంలో సిద్ధ హస్తులుగా పేరు పొందారు. 1943 లో శ్రీ సత్యం రామగోపాల్ బృందంతో దేశ మంతటా పర్యటించారు. 1948 లోనే ఈ పర్యటన తరువాత మద్రాసులో కూచిపూడి కళా విజ్ఞాన కేంద్రం స్థాపించి కూచిపూడి నృత్య ప్రచారానికి దోహదం చేశారు.

దాదాపు 300 తెలుగు, తమిళ, కన్నడ, హిందీ చిత్రాలకు నృత్య దర్శకత్వం నెరపిన శ్రీ వెంపటి సత్యం

గురువులకే గురువై ఎందరో ప్రఖ్యాతులైన నృత్య కళాకారులను తయారు చేశారు. వేదాంతం సత్యనారాయణ శర్మ వెంపటి చిన సత్యం, యడవల్లి శమ వంటి ప్రఖ్యాత కూచిపూడి కళాకారులు శ్రీ వెంపటి సత్యం వద్ద కొంత కాలమైనా విద్య నభ్య సించిన వారే !

శ్రీ వెంపటి కూచిపూడి నృత్యాన్ని గూర్చి ఎన్నో పరిశోధక వ్యాసాలు కూడా రాశారు 1951 లో కూచిపూడిలో జరిగిన సిద్ధేంద్రయోగి జయంతి ఉత్సవాలకు శ్రీ సత్యం అధ్యక్షులు. 45 సంవత్సరాలుగా కూచిపూడి నృత్య ప్రదర్శనలలోనూ, ఆ నృత్యాన్ని శిష్యులకు నేర్పడంలోనూ, చిత్రాలలో నృత్య దర్శకుడిగాను పేరు పొందిన శ్రీ వెంపటి సత్యం కూచిపూడి నాట్యకళకుచేస్తున్న సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాదమీ వీరికి అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి సన్మానిస్తున్నది.

# శ్రీ యన్. వి. యల్. నరసింహాచార్యులు



శ్రీ యన్. వి. యల్. నరసింహాచార్యులుగారు శ్రీ నండూరి పట్టాభి రామానుజాచార్యులు, శ్రీమతి అలివేలు మంగతాయారమ్మ గారల పుత్రుడు. చిన్నతనంలోనే నాటకరంగం మీద నటుడిగా ప్రవేశించిన యన్. వి. యల్. ప్రఖ్యాత నటులు శ్రీ యడవల్లి సూర్యనారాయణగారి అంతేవాసి కావడం వారి జీవితంలో ఒక మైలురాయి. నటనలోని మర్మాలు తెలుసుకుంటున్న ఈ తరుణంలోనే శ్రీ యన్ వి. యల్. సంగీతం కూడా అభ్యసించారు. వీరి సంగీత గురువులు శ్రీ ఓగిరాల జానకిరామయ్యగారు.

శ్రీ యన్. వి. యల్. ధీరోదాత్త నాయక పాత్రలు నటించడంలో ప్రత్యేకమైన ఖ్యాతి గడించారు. "హరిశ్చంద్రలో" హరిశ్చంద్రుడు, "చిత్ర నళీయం"లో నల, బాహుక పాత్రలు, "ప్రతాప రుద్రీయం"లో యుగంధర పాత్ర, "బొబ్బిలియుద్ధం"లో పాపారాయ, రంగారాయ, ధర్మారాయ పాత్రలు వీరికి నటలోకంలో ఓ ప్రత్యేకమైన స్థానం గడించి పెట్టాయి. ప్రేక్షక లోకానికి ఆయన అభినవ దుర్యోధనుడు, అపురూప అశ్వత్థామ. "ఉద్యోగ విజయాల్లో" ఆయన ఈ పాత్రలు కడుసమర్థవంతంగా నిర్వహించి చెళ్ళపిళ్ళ వారిచే బహూకృతి పొందారు. ప్రఖ్యాతులైన తెలుగు రంగస్థల నటీనటులందరి ప్రక్కనా శ్రీ యన్. వి. యల్. నటించారు. "హరిశ్చంద్ర"లో శ్రీ స్థానం వారితోనూ, "సారంగధర"లో తాను రాజరాజ నరేంద్రుడిగా, శ్రీ బందా సారంగధరుడిగా, శ్రీ స్థానం చిత్రాంగిగా నటించి ప్రేక్షకలోకాన్ని ముగ్ధుల్ని చేశారు. అలాగే బళ్ళారి రాఘవ చాణక్యుడిగా, శ్రీ యన్. వి. యల్. చంద్రగుప్తుడిగా పేరు పొందారు. శ్రీ యన్. వి. యల్. ఎందరో శిష్యుల్ని తయారుచేసి నటనలో శిక్షణ నివ్వడమే కాక, ఎందరికో ధన సహాయం చేసిన వదాన్యులు.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నాటక విభాగానికి గౌరవ సలహాదారుగా ఉన్న శ్రీ నరసింహాచార్యులుగారు ప్రస్తుతం కోరుకొండలో విశ్రాంతి తీసుకుంటున్నారు. తెలుగు నాటకరంగానికి శ్రీ యన్. వి. యల్. నరసింహాచార్యగారు ఒనరించిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈ వింశతి ఉత్సవాల్లో వారికి అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి గౌరవిస్తోంది.

# శ్రీ రామకృష్ణ శుక్లా



కథక్ నృత్య శిక్షణకు 22 సంవత్సరాల పాటు నిర్విరామ కృషి చేసిన శ్రీరామకృష్ణ శుక్లా 1918 వ సంవత్సరం మే 29 వ తేదీన జన్మించారు. వీరి తండ్రి శ్రీరామ్ దులారే శుక్లా.

శ్రీరామకృష్ణ శుక్లా చిన్న తనంలోనే "సంగీత విశారద'' డిప్లమోను పొంది గాయకులుగా పేరొందారు, కాని కథక్ నృత్యం వారిని ఆకర్షించింది. బొంబాయిలోని మేనకా ఇన్‌స్టిట్యూట్‌లో 5 సంవత్సరాల పాటు కథక్ నృత్యంలో శిక్షణ పొందారు. 1934_39 మధ్య కాలంలో ప్రఖ్యాత కథక్ నర్తకులు కీర్తి శేషులు శ్రీ శంభూ మహరాజ్ వద్ద లక్నోలో కథక్ నృత్యంలో ప్రత్యేక శిక్షణను పొందారు.

1942లో మేనక బృందంలో చేరి భారతదేశమంతా పర్యటించి నృత్య ప్రదర్శన లిచ్చారు. అదే సంవత్సరంలో హైద్రాబాద్‌లో యుద్ధనిధికి ప్రదర్శన లిచ్చారు. 1945_47 మధ్య కాలంలో F. D. S. అన్న పేరుతో బ్రిటిష ప్రభుత్వ సహాయంతో యూరపు ఖండంలో పర్యటించి నృత్యప్రదర్శన లిస్తూ ప్రశంసలు పొందారు.

1952లో హైదరాబాదులోని ప్రభుత్వ సంగీత నృత్య కళాశాలలో కథక్ నృత్య అధ్యాపకులుగా చేరి 22 సంవత్సరాలపాటు వందలాది శిష్యులకు కథక్ నృత్యంలో శిక్షణ నిచ్చారు.

కథక్ నృత్య శిక్షణలో ప్రఖ్యాతి వహించిన గురువుగా శ్రీ శుక్లా సేవ మరువరానిది. నృత్య శిక్షణలో వారి సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వింశతి ఉత్సవాలలో వారికి విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి సన్మానిస్తున్నది.



# షేక్ దావూద్

శ్రీ దావూద్ 1916 వ సంవత్సరం డిసెంబర్ 16 వ తేదీన షోలాపూర్‌లో జన్మించారు. చిన్నతనంనుంచీ హిందూస్థానీ సంగీత గానంలోనేకాక హార్మోనియం, ఫ్లూటు వాయించడంలో శిక్షణను పొందారు. కాని తబలా వాద్యమే వారిని ప్రత్యేకంగా ఆకర్షించింది.

షోలాపూర్‌లో ఉస్తాద్ మహమ్మద్ ఖాసిం, హైద్రాబాద్‌లో ఉస్తాద్ అల్లాదియాఖాన్, ఉస్తాద్ మొహమ్మద్ ఖాన్, ఉస్తాద్ ఛోటేఖాన్, మిరాజ్‌లో ఉస్తాద్ మహబూబ్‌ఖాన్ గార్లు వారి శిక్షణలో శ్రీ దావూద్‌ను తబలా వాద్యనిపుణినిగా తీర్చిదిద్దారు.

1936 లో ఇరవై సంవత్సరాల వయస్సులోనే, ప్రఖ్యాత గాయకుడు అబ్దుల్ కరీమ్‌ఖాన్ గారికి సహవాద్యం చేసే అదృష్టం కలిగింది. శ్రీ దావూద్‌కు అప్పుడే 'దక్కన్ రేడియోలో' ప్రవేశం కూడా కలిగింది. 1939 లో దక్కన్ రేడియోలో తబలా వాద్య నిపుణుడుగా ఉద్యోగంలో చేరి, 1978 వ సంవత్సరం డిసెంబర్ 16 వ తేదీ పదవీ విరమణ చేశారు.

ఎన్నో అఖిల భారత సంగీత సభల్లోను, రేడియో సంగీత సమ్మేళనాల్లోను పాల్గొన్న శ్రీ దావూద్ ప్రఖ్యాత హిందూస్థానీ గాయకులు, వాద్యసంగీత ప్రవీణులందరికీ తబలావాద్యంతో సహకరించి మన్ననలు పొందారు. ఉస్తాద్ అబ్దుల్ కరీమ్‌ఖాన్, ఉస్తాద్ ఫియంజ్‌ఖాన్, ఉస్తాద్ బడే గులాం అలీఖాన్, రోషనారా బేగమ్, హీరాబాయ్ బరోడేకర్, భీమ్‌సేన్ జోషీ, ఉస్తాద్ అమీర్‌ఖాన్, ఉస్తాద్ విలాయత్‌ఖాన్, ఉస్తాద్ అలాఉద్దీన్‌ఖాన్, ఉస్తాద్ అలీ. అక్బర్‌ఖాన్, పండిట్ రవిశంకర్, ఉస్తాద్ అబ్దుల్ హలీమ్ జాఫర్‌ఖాన్ మొదలైన సంగీత విద్వన్మణులకు ప్రక్కవాద్యం వాయించారు.

తబలా వాద్యంలో శిక్షణ నివ్వడంలో కూడా శ్రీ దావూద్ పేరు ప్రఖ్యాతులు గడించారు.

ఎందరో యువకులకు యీ వాద్యంలో శిక్షణ నిచ్చారు. హైదరాబాద్‌లోని ప్రముఖ నవాబుల పుత్రులకు తబలా వాద్యం నేర్పారు. శ్రీ దావూద్ వీరిలో నవాబ్ జహీర్‌యార్‌జంగ్ బహదూర్, నవాబ్ రహీద్‌జంగ్ బహదూర్ వంటి వారు పేర్కొనదగిన వారు. ప్రముఖ తబలా వాద్య నిపుణుడు ఉస్తాద్ అహమద్‌ఖాన్ "తిరక్వా" ప్రశంసించినట్లు శ్రీ దావూద్ హైదరాబాద్ "తిరక్వా"గా పేరు పొందారు.

కొంత కాలం ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సభ్యులు. హిందూస్థానీ సంగీతంలో వీరు చేసిన సేవకు 1975లో "యూనిటీ అవార్డ్"ను పొందారు.

శ్రీ షేక్‌దావూద్ హిందూస్థానీ సంగీతానికి చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈ వింశతి ఉత్సవాలలో వారికి అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి సత్కరిస్తున్నది.

# శ్రీ మల్లాది సూర్యనారాయణ



కృష్ణా తీరంలోని కనకపల్లిలో జన్మించిన శ్రీ మల్లాది సూర్యనారాయణగారు, కూచిపూడి భాగవతుల ప్రదర్శన చూచి ప్రేరేపితులై తమ 17వ యేట "శ్రీకృష్ణతులాభారం"లో నారద పాత్ర ధరించి తమ నటనా వైదుష్యాన్ని ప్రకటించుకున్నారు.

ప్రఖ్యాత నటులు శ్రీ డి. వి సుబ్బారావుగారి "ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ"లోచేరి "హరిశ్చంద్ర" "నలదమయంతి", ''పాండవ విజయం'', ''చంద్రహాస'', "వింధ్యరాణి" వంటి ప్రఖ్యాత నాటకాలలో నటించి తమ, నాటక కళాపాటవాన్ని ప్రకటించారు.

శ్రీ అబ్బూరి ఆదినారాయణ శర్మ గారితో కలిసి "ఆంధ్ర డ్రమెటిక్ కంపెనీ'' ప్రారంభించి 'హరిశ్చంద్ర' నాటకాన్ని ఆంధ్రదేశంలోని మారుమూల పల్లెల్లో కూడా ప్రదర్శించి తమ నటనతో ప్రేక్షకులను మైమరపింపచేశారు.

ప్రఖ్యాత నటులు శ్రీ పి. సూరిబాబుగారి ఆహ్వానాన్ని అంగీకరించి శ్రీ రాజ రాజేశ్వరీ నాట్య మండలిలో చేరి ఎన్నో నాటకాలలో ప్రధాన భూమికలు ధరించారు. "భూకైలాస్"లో రావణ పాత్ర వారి ప్రత్యేకత.

పౌరాణిక నాటకాలలోనే కాక "దేశ ద్రోహి" వంటి చారిత్రక నాటకాలలోను, "స్వతంత్ర భారతం" వంటి సాంఘిక నాటకాలలో కూడా శ్రీ మల్లాది నటించి మెప్పు పొందారు.

హరిశ్చంద్రుడు, ధర్మరాజు, గయుడు, నలుడు, బాహుకుడు, అశ్వత్థామ, బిల్వమంగళుడు, రావణుడు, దుర్యోధనుడు వంటి పాత్రలను ధరించి ప్రతి పాత్రను మలచడంలోను తనదైన ఒక ప్రత్యేక పద్ధతిని రూపొందించు కొన్నారు శ్రీ మల్లాది.

నట తపస్వులైన శ్రీ మల్లాది సూర్యనారాయణగారు నాటకరంగానికి చేసిన సేవను గుర్తించి ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈ వింశతి వార్షికోత్సవ సందర్భంలో అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి సన్మానిస్తున్నది.



# శ్రీమతి ఆవేటి పూర్ణిమ

శ్రీమతి ఆవేటి పూర్ణిమ ప్రఖ్యాత నటులు, సురభినాటక సమాజ నిర్వాహకులు అయిన నాటక కళోద్ధారక వనారస గోవిందరావుగారి పుత్రిక. ఈమె జననం 1918వ సంవత్సరం మార్చి 1వ తేదీ. ప్రహ్లాద నాటకంతో ప్రహ్లాదుడుగా చిన్ననాడే రంగస్థల ప్రవేశం చేసిన శ్రీమతి పూర్ణిమ తదాది ఎన్నో నాటకాలలో నటించి ప్రేక్షకుల మన్ననలు, సహనటీనటుల ప్రశంసలు అందుకున్నారు.

'కృష్ణలీల'లో కృష్ణుడుగా, 'లవకుశ'లో లవుడు, కుశుడు-చిన్ననాటి వేషాలు. తరువాత 'శ్రీ కృష్ణ తులాభారం'లో సత్యభామ, "సక్కుబాయి'లో సక్కుబాయి 'సావిత్రి'లో సావిత్రి, 'సారంగధర'లో చిత్రాంగి, 'ప్రమీలార్జునీయం'లో ప్రమీల హరిశ్చంద్ర'లో చంద్రమతి, 'బొబ్బిలి యుద్ధంలో' మల్లమాంబ "భక్త రామదాసు"తో కమల వంటి ఎన్నో నాటకాలలో ప్రధాన స్త్రీ పాత్రలను ధరించారు.

తండ్రి గారితో పాటు రంగూన్‌లో పర్యటిస్తున్న పదకొండేళ్ళ చిన్న వయసులోనే బంగారు పతకాలు బహూకృతిగా గైకొన్న శ్రీమతి పూర్ణిమ ఆ తరువాత ఎన్నో ప్రశంసలు, పతకాలు, బిరుదులు పొందారు.

శ్రీమతి పూర్ణిమ "చింతామణి" నాటకానికి గ్రామఫోను రికార్డులు ఇచ్చారు. హరికథలు చెప్పారు.

పంచవర్ష ప్రణాళికా ప్రచార నాటకాల్లో పాల్గొన్నారు.

శ్రీమతి పూర్ణిమ గీతాంజలి, అందాల రాముడు, ముత్యాల ముగ్గు, సీతారామ కల్యాణం వంటి చిత్రాలలో నటించి ఆయా పాత్రలకు జీవం పోశారు.

నాలుగు దశాబ్దాలు నటిగా, సమాజ నిర్వాహకురాలుగా ప్రసిద్ధి పొందిన శ్రీమతి పూర్ణిమకు ఆమె నాటక కళకు చేసిన సేవను గుర్తించి ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వింశతి వార్షికోత్సవాల సమయంలో అకాడమీ విశిష్టసభ్యత్వాన్ని ఇచ్చి సత్కరిస్తున్నది.



# శ్రీ నోరి నాగభూషణం

శ్రీ నోరి నాగభూషణంగారు గుంటూరు జిల్లా నండూరులో సంగీతజ్ఞులవంశంలో జన్మించారు. వీరి తండ్రి శ్రీ విశ్వనాథశాస్త్రిగారు ప్రఖ్యాత గాయకులు. వయొలిన్ వాద్యంలో సిద్ధహస్తులు. శ్రీ నాగభూషణంగారు 6 సంవత్సరాల ప్రాయంలోనే తండ్రిగారివద్ద సంగీత అభ్యాసం ప్రారంభించి 10 వ ఏటనే సంగీత సభల్లో తమ ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించి పెద్దల మన్ననలను పొందారు. కొంతకాలంపాటు మచిలీపట్టణంలో ప్రఖ్యాత సంగీత విద్వాంసులు శ్రీహరి నాగభూషణంగారి వద్ద శిక్షణపొందారు. సంగీతంతోపాటు సంస్కృత సాహిత్యం అభ్యసించి వేదాధ్యయనంలో పరిపుష్టులైనారు. ఆంగ్లవిద్య నభ్యసించి గుంటూరు జిల్లా బోర్డు ఉన్నత పాఠశాలల్లో అధ్యాపకుడిగా పని చేశారు. శ్రీ నోరివారు చిన్నతనంలోనే మహారాష్ట్రలో ప్రఖ్యాతిచెందిన స్వామి బ్రహ్మానంద తీర్థస్వామి దీవనలందు కొని వారి ఆశ్వీరాద బలంవల్ల త్వరితగతిలో సంగీత ప్రపంచంలో ఎనలేని కీర్తి నార్జించారు.

స్వయంగా గాయకులై వయొలిన్ సోలో వాద్యంలో సిద్ధహస్తులు కావడమేకాక, కర్ణాటక బాణీలో ప్రఖ్యాతులైన గాయకులందరి ప్రక్కనా "శభాష్" అనిపించుకునే పద్ధతిలో సహకార వాద్యం వాయించడం శ్రీనోరి వారి ప్రత్యేకత. శ్రీ నోరి వారు దక్షిణ దేశమంతటా కచ్చేరీలు ఇచ్చి ఎన్నో బిరుదులు, సత్కారాలు పొందారు. కాశీ కృష్ణాచార్యవంటి ప్రఖ్యాత కవి పండితుల ఆశీస్సులు పొందారు. స్వయంగా బాపట్లలో తమ ఇంట 13 సంవత్సరాలపాటు త్యాగరాజ ఆరాధనోత్సవాలు నిర్వహించి సంగీతవ్యాప్తికి కృషిచేశారు. 1952లో హైదరాబాదులోని సంగీత నృత్యకళాశాల ప్రిన్సిపల్‌గా నియమితులై తదాది ఎందరో శిష్యులకు సంగీత విద్యను గరిపారు. మద్రాసు మ్యూజిక్ అకాడమీ నిపుణుల బృందంలో సభ్యులుగా పనిచేశారు. స్వయంగా కొన్ని వర్ణాలు, స్వరజతులు రచించారు. ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి-సంగీత గ్రంథాల ప్రచురణలో సాంకేతిక సహాయాన్ని అందచేశారు. కేంద్రంలోనూ హైద్రాబాదులోనూ ఆలిండియా రేడియో ఆడిషన్ కమిటీలో సభ్యులు. కొంతకాలంపాటు యాదగిరి లక్ష్మీనృసింహస్వామి దేవస్థాన విద్వాంసులు.

సంగీత విద్వాంసులుగా, పరిశోధకులుగా, అధ్యాపకులుగా, శ్రీ నోరి వారు చేసిన సేవను గుర్తించి ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వింశతి ఉత్సవాల సందర్భంలో అకాడమీ వీరికి విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి గౌరవిస్తున్నది.



# శ్రీ రొద్దం హనుమంతరావు

శ్రీ రొద్దం హనుమంతరావు 1906 వ సంవత్సరం ఫిబ్రవరి 23 వ తేదీన పెనుగొండలో జన్మించారు శ్రీ వెంకోబారావు-వెంకమ్మగారలు ఆయన తల్లిదండ్రులు. అనంతపూర్‌లోని సీడెడ్ జిల్లా కాలేజీలోను, మద్రాసు లా కాలేజీలోనూ చదివే రోజుల్లోనే నాటకాలలో పాత్రధారణ చేసారు. రంగస్థలం మీద స్త్రీ వేషధారణతో నటజీవితం ప్రారంభించిన శ్రీ హనుమంతరావుగారి మొట్టమొదటి వేషం 1922 లో "విజయనగర సామ్రాజ్య పతనం" నాటకంలో రామరాజు భార్య తిరుమలాంబ, తరువాత అదే నాటకంలో అషాబీ గానూ, " కృష్ణ దేవరాయ విజయం " లో అన్నపూర్ణగానూ, "బృహన్నల" లో ఊర్వశిగానూ, "సావిత్రి" లో సావిత్రిగానూ "పాదుకాపట్టాభిషేకం" లో కైకేయిగానూ నటించి స్త్రీ పాత్రధారణకు ఎనలేని కీర్తిని సంపాదించారు.

శ్రీ హనుమంతరావుగారి మొదటి పురుషవేషం "బృహన్నల"లో ఉత్తరకుమారుడు. తరువాత 1931 లో మైసూరులో స్థానం వారితోపాటు "కన్యాశుల్కం" లో రామప్పపంతులుగా నటించారు. శ్రీ బళ్ళారి రాఘవతో "సారంగధర"లో సుబుద్ధి, "చంద్రగుప్త"లో వాచాలుడు "రామదాసు"లో ధర్మకీర్తి, స్థానం వారితో "తులాభారం"లో వసంతుడు, కృష్ణుడు, 'చింతామణి"లో సుబ్బిశెట్టి, "విప్రనారాయణ" లో శ్రీనివాసుడు వంటి పాత్రలకు జీవం పోశారు. సుమారు వంద నాటకాలలో నటించిన శ్రీ రొద్దం వారికి హాస్యరస ప్రధానమైన వేషాలంటే ప్రత్యేకమైన అభిమానం.

కళోపాసన, పెళ్ళి ట్రైనింగ్, పెళ్ళి చూపులు, గాలివాన, వంటి నాటికల్లో పాత్రధారణ చేసి ఉత్తమ నటనకు బహుమతులు పొందారు. ఇవి కాక శ్రీ హనుమంతరావుగారు ఆంగ్ల నాటకాలలో కూడా ప్రధాన భూమికలు ధరించారు. "మర్చెంట్ ఆఫ్ వెనిస్"లో ఆంటానియో, "ఒథెల్లో"లో ఇయాగో పాత్రలు సమర్థవంతంగా ధరించి మెప్పు పొందారు.

అనంతపూరులోని నటశిక్షణాలయానికి ప్రిన్స్‌పల్‌గా రెండు సంవత్సరాలు పనిచేసి ఎందరో నటీనటులకు నాటక కళలో శిక్షణ గరిపారు.

తెలుగు నాటక కళకు శ్రీ హనుమంతరావుగారు చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వింశతి ఉత్సవ సందర్భంలో అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి గౌరవిస్తున్నది.



# శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

శ్రీ మిక్కిలినేని జననం గుంటూరు జిల్లా, గుంటూరు తాలూకా లింగాయపాలెంలో. కృష్ణాజిల్లా విజయవాడ తాలూకా కోలవెన్నులో పెరిగారు. కోలవెన్నులోనూ, ఆ వెనుక పునాదిపాడులోనూ, విద్యనభ్యసించారు. చిన్నతనంనుంచి శ్రావ్యంగా పాటలు పాడి సభల్లో ప్రేక్షకులను రంజింప చేసేవారు. స్కూల్ నాటకాల్లో "సావిత్రి" లో యముడిగా, "రాయబారం" లో భీముడు, కర్ణుడు పాత్రలద్వారా రంగస్థల ప్రవేశం. తండ్రిగారి మరణంతో హైస్కూల్ విద్య ఆగిపోగా చుట్టుపక్కల గ్రామ నాటక సమాజాల్లో నారదుడు, అర్జునుడు, కృష్ణుడువంటి పౌరాణిక పాత్రలనేకాక 'చింతామణిలో' భవానీశంకరుడు, దామోదరుడు, రాధ వంటి పాత్రలను ధరించి గాయకుడుగా పేరుపొందారు. ప్రసిద్ధ రంగస్థల నటుడు శ్రీ కపిలవాయి రామనాథశాస్త్రి, శిష్యులైనారు. చిన్నతనంలోనే జాతీయోద్యమంలో ప్రవేశించి కాంగ్రెసు వాలంటీరుగా, కార్యకర్తగా పనిచేశారు. భగత్‌సింగ్ సుఖదేవ్, వంటి విప్లవకారుల ప్రభావంతో రాజకీయ ప్రవేశం చేసి కాంగ్రెసు, సోషలిస్టు, కమ్యూనిస్టు, ఉద్యమాల్లో పని చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో తెలంగాణా పోరాటంలోనూ 5 సార్లు జైలు శిక్షననుభవించారు.

శ్రీ మిక్కిలినేని గ్రామాభ్యుదయ కార్యక్రమాలలో చేరి కృష్ణాజిల్లా యువజనోద్యమంలో పాల్గొని "ప్రజా నాట్యమండలి" స్థాపనకు కృషి చేశారు. జానపద కళారూపాల పునరుద్ధరణకు, ఆకళారూపాల చారిత్రిక పరిశోధనకు, బుర్రకథ శిక్షణ శిబిరాలకు నిరంతరం కృషి చేశారు. బుర్రకథ, జముకుల కథలను చెప్పడంలోనూ, రాజకీయ వీధి నాటకాలలో నటించడంలోనూ, బృంద నృత్యాలలో నర్తకుడిగానూ పేరు పొందారు. ప్రజానాట్య మండలి ప్రదర్శించిన మా భూమి, ముందడుగు, పరివర్తన, ఈ నాడు మొదలైన నాటకాలలో ప్రధాన భూమికలను ధరించి ప్రశంస లందుకున్నారు. రంగస్థల నటుడిగానే కాక చలన చిత్ర నటుడుగా శ్రీ మిక్కిలినేని తనదైన ఒక బాణీని రూపొం

దించుకున్నారు. ఇప్పటికి వీరు సుమారు 250 చిత్రాలలో ఎన్నో విభిన్నమైన పాత్రలు ధరించి "క్యారెక్టర్ ఏక్టర్" గా పేరు పొందారు. "కృష్ణ పాండవీయం"లో భీష్ముడు, "నర్తనశాల"లో ధర్మరాజు, "కృష్ణార్జున యుద్ధం"లో బలరాముడు,, "సంపూర్ణ రామాయణం"లో జనకుడు వంటి పాత్రలు శ్రీ మిక్కిలినేని నటనకు గీటురాయి వంటివి.

తెలుగు భాషా సమితి ప్రచురించిన "ఆంధ్ర నాటక రంగ చరిత్ర" ధారావాహికంగా ఆంధ్రప్రభలో (వారపత్రిక) ప్రచురిస్తున్న నటరత్నాల పరంపర నాటకరంగ పరిశోధనలో శ్రీ మిక్కిలినేనికి గల పాటవాన్ని నిరూపిస్తున్నవి.

నిరంతర క్రియాశీలిగా, భావుకుడిగా, ప్రయోక్తగా, నటుడుగా, పరిశోధకుడుగా, తెలుగునాటక, జానపద కళల పునరుద్ధరణకు అహరహము శ్రమిస్తున్న శ్రీ మిక్కిలినేనికి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈ వింశతి ఉత్సవాల సమయంలో అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని యిచ్చి సన్మానిస్తున్నది.



## శ్రీ ఆచార్య ఆత్రేయ

ప్రఖ్యాత నాటక రచయిత, సినిమాస్క్రిప్ట్ రచయిత ఆచార్యఆత్రేయ తెలుగునాటక రంగంలో ఒక వినూత్నమైన విప్లవానికి నాందీవాక్యం పలికారు. తెలుగు సాంఘిక, గద్య నాటకాలు ఆయన రచనలతో అత్యున్నతస్థితికి వచ్చాయి ఆయన మొదటి నాటకం 'ఈనాడు' ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలలో రచనకు ప్రథమ బహుమతి పొందింది. ఆయన 'ఎన్. జి. ఓ.' తెలుగునాటక చరిత్రలో ఒక మైలురాయి. "కప్పలు, విశ్వశాంతి" వంటి నాటకాలు; "ప్రగతి, ఎవరు దొంగ" వంటి నాటికలు తెలుగునాట బహుళ ప్రచారం పొందినవి ఆచార్య ఆత్రేయగారి "అభయం" అన్న నాటకం మధ్యతరగతి ప్రజల మానసిక సంక్షోభానికి వ్యక్తీకరణ

శ్రీ ఆత్రేయ ప్రఖ్యాత సినిమా రచయిత కూడా వందకుపైగా చిత్రాలకు ఆయన రచనచేసి తన విశిష్టతను చాటుకున్నారు. సినిమారంగంలో తనదైన ఒక ప్రత్యేక బాణీని సృష్టించిన శ్రీ ఆత్రేయకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి సన్మానిస్తున్నది.



శ్రీ దూడల శంకరయ్య

తూర్పుభాగవత ప్రదర్శనలో-ముఖ్యంగా భామ వేషధారణలో-ప్రత్యేకనై పుణ్యం గడించిన శ్రీ దూడల శంకరయ్య 1914 వ సంవత్సరం ఫిబ్రవరి 1 వ తేదీన జన్మించారు. అధికార్ల సత్యనారాయణభుక్తగారు వీరి గురువర్యులు.

కళా ప్రదర్శనలో తూర్పుభాగవతం పద్ధతి శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలో ఈనాటికీ ఆదరాభిమానాలను పొందుతున్నది. జానపద శాస్త్రీయపద్ధతుల సమ్మేళనంతో ఒక ప్రత్యేక బాణీని రూపొందించిన శంకరయ్యగారు తమ భాగవత ప్రదర్శనలతో దాదాపు ఏభై సంవత్సరాలు ఉత్తరాంధ్ర దేశాన్ని ఉర్రూతలూగించారు.

శ్రీ శంకరయ్య భామవేష ప్రదర్శనలోనేకాక, సూత్రధారిత్వం నెరపడంలో కూడా ప్రఖ్యాతి పొందారు. ఎందరో శిష్యులను ఉత్తమ కళాకారులుగా చేసి, ఎన్నో బహుమతులను, సన్మానాలను పొందారు. శ్రీ శంకరయ్య కలాపవిద్యకు చేసిన సేవ గణనీయం. ఆయన చేసిన సేవకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఆయనకు విశిష్ట సభ్యత్వాన్ని ఇచ్చి సన్మానిస్తున్నది.



1960 ఫిబ్రవరి 25 నుంచి 29 వరకు హైద్రాబాద్‌లో జరిగిన కర్నాటక సంగీత సదస్సును
ప్రారంభిస్తున్న అప్పటి గవర్నర్ శ్రీ భీమసేన్ సచార్.



1964 మార్చి 12 నుంచి 17 వరకు హైదారాబాద్‌లో జరిగిన అఖిలభారత నృత్యోత్సవాలకు ప్రారంభోత్సవం చేస్తున్న అప్పటి విద్యాశాఖామాత్యులు శ్రీ పి.వి.జి. రాజుగారు.



1977 జనవరి 6 నుంచి 9 వ తేదీ వరకు హైదరాబాద్‌లో జరిగిన అఖిలభారత హిందూస్తానీ
సంగీతోత్సవముల అధ్యక్షులు శ్రీ విజయరాఘవరావుగారితో అకాడమీ అధ్యక్షులు
శ్రీ కె.వి. గోపాలస్వామి, ఉపాధ్యక్షులు శ్రీ మామిడిపూడి ఆనందం
కార్యదర్శి శ్రీ కంభంమెట్టు వెంకటసుబ్బారావు, సంయుక్త
కార్యదర్శి శ్రీ బి. కృష్ణంరాజు.



1978, మే 6 నుండి 9 వరకు వరంగల్‌లో జరిగిన నృత్యోత్సవాలలో శ్రీ కోరాడ నరసింహారావుకు
"భరత కళా ప్రపూర్ణ" బిరుదు నిచ్చి సత్కరిస్తున్న సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు
శ్రీ కె.వి. గోపాలస్వామిగారు; కన్వీనర్ శ్రీ యం. ఆనందంగారు.



1970 ఆగష్టు 22, 23 తేదీలలో రాజమండ్రిలో జరిగిన అభినయ సదస్సులో పాల్గొన్న కళాకారులలో కన్వీనరు భరతకళాప్రపూర్ణ నటరాజ రామకృష్ణ.



1969 జనవరి 8 నుంచి 15 వరకు తాడేపల్లిగూడెంలో జరిగిన హరికథా సప్తాహంలో పాల్గొన్న కథాగాయకులలో అప్పటి అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావుగారు.




1976 ఏప్రిల్ 15 నుంచి 19 వరకు ఏలూరులో జరిగిన రాష్ట్రనాటకోత్సవాల సందర్భంగా ఉత్సవ అధ్యక్షులు శ్రీ పీసపాటి నరశింహమూర్తి, నాటక కళాప్రపూర్ణ బిరుదును గ్రహిస్తున్న దృశ్యం.



1970 మార్చి 21 నుంచి 24 వరకు హైదరాబాద్‌లో జరిగిన జానపద కళోత్సవాల సందర్భంగా సన్మానితులు.

# అకాడమీ బిరుదాంకితులు

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ నిర్వహించే సంగీత, నాట్య, నాటకోత్సవాల సందర్భంలో ఆయా కళల్లో నిష్ణాతులైన ప్రఖ్యాతులను ఆ ఉత్సవాలకు అధ్యక్షులనుగా ఎన్నుకొని గౌరవిస్తున్నది. సంగీతోత్సవాల అధ్యక్షులకు "గానకళా ప్రపూర్ణ" అన్న బిరుదును, నాటకోత్సవాల అధ్యక్షులకు "నాటక కళా ప్రపూర్ణ" అన్న బిరుదును, నాట్యోత్సవాల అధ్యక్షులకు "భరత కళా ప్రపూర్ణ" బిరుదును, కథా గాన ఉత్సవాల అధ్యక్షులకు "కథా గాన కళా ప్రపూర్ణ" బిరుదును, ఒక బంగారు పథకాన్ని ఇచ్చి అకాడమీ ఈ సన్మానితులను సత్కరిస్తుంది. [1977వ సంవత్సరంలో నాటకోత్సవాలలో మాత్రం శ్రీ కె. వి. గోపాలస్వామిగారికి "ఆధునికాంధ్రనాటక ప్రయోగవిధాత" అన్న బిరుదును ఇచ్చింది.] ఈ ఇరవై సంవత్సరాలలోను ఆ విధంగా సన్మానితులైన ప్రముఖులను గురించి ఈ క్రింద సంక్షిప్తంగా పొందుపరుస్తున్నాము.



## శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ అనంతపురం జిల్లాలోని ఆలపల్లిలో 1839జనవరి 23వ తేదీన విద్వత్కుటుంబంలో జన్మించారు. వీరు తమ తండ్రిగారు శ్రీ కృష్ణమాచార్యులుగారివద్ద 13వ ఏడు వరకు సంస్కృతం, తెలుగు అభ్యసించి, ఆ తరువాత సంస్కృతంలో పాండిత్యం సంపాదించేందుకు మైసూరు వెళ్ళారు. 1912లో మైసూరు మహారాజావారి కళాశాలలో పండితులుగా చేరారు. మైసూరులో వీరు శ్రీ బిడారం కృష్ణప్పగారివద్ద సంగీతం అభ్యసించారు. వీరు సంగీత విద్వాంసులేకాక గొప్ప సాహితీ వేత్తలుకూడా. వీరి వేమన, సారస్వతోపన్యాసాలు, గేయాలు తెలుగు సాహిత్య సరస్వతికి అలంకారాలు.

మైసూరు నుంచి తిరిగి వచ్చిన తర్వాత శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ సంగీతశాఖకు రీడరుగా 1956 వరకు పనిచేశారు. 1958లో మదరాసు సంగీత అకాడమీ వారు వీరిని సన్మానించి, సన్మాన సంచికను ప్రకటించారు.

ఫిబ్రవరి 1960 ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు నిర్వహించిన సంగీత సదస్సుకు అధ్యక్షత వహించారు.

అకాడమీవారు వీరికి 1960లో హైదారాబాదులో జరిగిన సంగీతోత్సవాలలో 'గానకళాప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించారు.*

* శ్రీ, రాళ్ళపల్లి మార్చినెల 11వ తేదీన బెంగుళూరులో మరణించారని తెలియచేయడానికి చింతిస్తున్నాము.

# పండిట్ రతన్ జన్‌కర్

ప్రఖ్యాత హిందుస్థానీ సంగీతజ్ఞులు శ్రీ రతన్‌జన్‌కర్ 1900వ సంవత్సరంలో బొంబాయిలో జన్మించారు. 7వ ఏటనే సంగీతాన్ని అభ్యసించడం ప్రారంభించిన శ్రీ రతన్‌జన్‌కర్ కృష్ణ భట్ హార్నవార్, అనంత్ మనోహర్ జోషి బావాల వద్ద ముందుగా సంగీతాభ్యసనంచేసి ఆతరువాత ప్రఖ్యాత సంగీత శాస్త్రవేత్త పండిత భాట్ ఖండే శిష్యులైనారు. తరువాత బరోడా ఆస్థాన విద్వాంసు డైన ఉస్తాద్ ఫైయజ్ ఖాన్ శిష్యత్వంలో తమ సంగీత విద్యకు మెరుగులు దిద్దుకున్నారు.

భాట్‌ఖండే సంగీత కళాశాలలో ఆచార్యులుగా ప్రవేశించి, అచిరకాలంలో దానికి అధిపతులై 28 సం॥ ఆ పదవిలో సంగీత కళకు నిర్విరామ కృషి చేసారు.

గాయకుడుగా, సంగీతజ్ఞుడుగా, ఆచార్యుడుగా డాక్టర్ రతన్‌జన్‌కర్ సాధించిన అసమాన ప్రజ్ఞను గుర్తించి మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఆయనను ఇందిరా కళా సంగీత విశ్వవిద్యాలయానికి ఉపకులపతిగా నియమించారు. భాట్‌ఖండేవిశ్వవిద్యాలయం,మద్రాస్ మ్యూజిక్ అకాడమీ, కేంద్ర సంగీత నాటక అకాడమీ విశిష్ట సభ్యు డుగా స్వీకరించిన శ్రీ రతన్ జన్‌కర్ 'పద్మ భూషణ్' విజేత.

హిందుస్థానీ సంగీతాన్ని గురించి వారు ఎన్నో గ్రంథాలు కూడ రచించారు. వారి సేవను గుర్తించి ఆం. ప్ర. సం. నాటక అకాడమీ వారికి హైద్రాబాదులో 1964 లో జరిగిన హిందుస్థానీ సంగీతోత్సవాల్లో 'గానకళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించింది.



## శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్యం పిళ్లై

శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్యం పిళ్లై సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ పెరనార్య పుత్రులు. వీరు చిత్తూరు జిల్లా కులమత్త పల్లిలో జన్మించారు. వీరు 5 వ ఏటనే సంగీతాభ్యాసం ప్రారంభించి 12 వ ఏటనే పాట కచేరీలు చేయనారంభించారు. కంజీవరం శ్రీనాయని పిళ్లై వద్ద సంగీత శిక్షణ పొంది స్వరం, పల్లవి, కీర్తనలలో ప్రత్యేక ప్రజ్ఞను సముపార్జించారు. దాక్షిణాత్య సంగీతజ్ఞులలో ప్రథమ శ్రేణిలో ఎన్నతగిన వారు శ్రీ పిళ్లై.

వీరికి "గానకళాసేవక", "సంగీత స్వర చక్రవర్తి" మొదలైన బిరుదులున్నాయి. మదరాసు సంగీత అకాడమీ వారు వీరిని "సంగీత కళానిధి" బిరుదునిచ్చి సన్మానించారు. శ్రీ సుబ్రహ్మణ్యం పిళ్లై స్వయంగా కృతులను రచించి గానం చేసేవారు.

వీరికి 1964లో విజయవాడలో జరిగిన సంగీతోత్సవంలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ "గాన కళా ప్రపూర్ణ" బిరుదాన్ని ఇచ్చి సత్కరించింది.

# శ్రీ శ్రీపాద పినాక పాణి

విశాఖ జిల్లా ప్రియాగ్రహారం గ్రామంలో 1913 వ సం॥ మార్చి 8 వ తేదీన జన్మించిన శ్రీ పినాకపాణిగారిది పండితవంశం. తండ్రిగారు శ్రీపాద కామేశ్వరరావు గారు ప్రఖ్యాత నాటక రచయిత, నటుడు, విమర్శకుడు. తల్లి జోగామ్మగారు. పినాకపాణి గారి అక్కగారు మైసూరు బి. యస్. లక్ష్మణరావుగారి వద్ద సంగీత శిక్షణ పొందుతున్న సమయంలో ఆ సంగీతం వినికిడి వల్లనే కీర్తనలు పాడే శక్తి అలవాటైంది.

9-12-1924 తేదీన అప్పగారి గురువుగారివద్దనే వీరూ విద్యాభ్యాసం ప్రారంభించారు. తరువాత సుప్రసిద్ధ సంగీత విద్వాంసులను వింటూ, స్వర పరచిన కీర్తనలను అభ్యాసంచేస్తూ, స్వయం కృషివలన ఆయన పురోగమించారు. వీరి గురువుగారి ద్వారా శ్రీద్వారం వెంకటస్వామినాయుడుగారి గురుత్వం లభించింది పినాకపాణిగారికి. 1932లో మూడు మాసాలు మాత్రమే శ్రీద్వారం వారివద్ద శిక్షణ పొందారు.

1932—38 మధ్య కాలంలో వైద్య కళాశాలలో అభ్యాసం చేస్తూనే సంగీతోత్సవాలకు హాజరై మెళకువలు తెలుసుకున్నారు. తరువాత శ్రీ R. రామానుజయ్యంగారి ప్రభావం వల్ల వీరి సంగీత విద్య ఉన్నతంగా పరిణతి చెందింది.

శ్రీ పినాక పాణిగారు సంగీతంలో తమదైన ఒక బాణీని సృష్టించి సంగీతానికి ఎనలేని సేవచేశారు.

మార్చి 1966లో వరంగల్లులో జరిగిన సంగీతోత్సవాల సందర్భంలో శ్రీ శ్రీపాద పినాక పాణిగారికి "గాన కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ.



## శ్రీ పర్వతనేని వీరయ్యా చౌదరి

గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా, పెదనందిపాడు గ్రామంలో 4-10-1888 నాడు జన్మించిన శ్రీ చౌదరిగారికి చిన్నతనం నుంచి కళలన్నా సంఘ సంస్కరణమన్నా ఎంతో ఇష్టం. 1921వ సంవత్సరంలో పెదనందిపాడులో నిరాకరణోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు చౌదరిగారు. కారణాంతరాల వల్ల రాజకీయాలు మాని సంగీత కళకు తమ జీవితాన్ని అంకితం చేశారు.

శ్రీ చౌదరిగారు శ్రీ రాజనాల వెంకటప్పయ్యశాస్త్రిగారి వద్ద విద్యనభ్యసించారు. నాటకాలు, హరికథలతో ప్రారంభమైన వీరి కళాజీవితం త్వరలోనే సంగీతానికి అంకితమై ఎన్నో సత్కారాలను సంపాదించి పెట్టిందివీరికి. సంగీతంలో సాహిత్య భావానికి గల ప్రత్యేకతను గుర్తించిన వీరి గానం ప్రముఖులందరి ప్రసంశలను పొందింది. "భావోద్దీపక గాయక శిఖామణి" అన్న బిరుదును సార్ధకం చేసిన శ్రీ చౌదరిగారు దక్షిణ భారతంలో పలుచోట్ల కచ్చేరీలు చేసి వారి ప్రత్యేక బాణీని నిరూపించుకున్నారు. 1967 మార్చిలో విశాఖపట్టణంలో జరిగిన సంగీతోత్సవాలలో వారికి "గాన కళా ప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ.

## శ్రీ క్రోవి సత్యనారాయణశాస్త్రి

శ్రీ క్రోవి సత్యనారాయణశాస్త్రిగారు కృష్ణాజిల్లా దివి తాలూకా విశ్వనాథపల్లి అగ్రహారంలో 1903వ సం॥ క్రోవి అన్న పూర్ణాంబ లక్ష్మయార్య దంపతులకు జన్మించారు. వీరి సంగీత గురుపితామహులు శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు. గురువులు, వీరి మూడవ సోదరులు, చల్లపల్లి ఆస్థాన విద్వాంసులు శ్రీ క్రోవి సీతారామ శాస్త్రిగారు.

శ్రీ శాస్త్రిగారు తమ తొమ్మిదవ ఏటనే సంగీత విద్యాభ్యాసం ప్రారంభించి పదునారవ సంవత్సరానికే స్వతంత్రంగా కచేరీలు చేయడం ప్రారంభించారు. ఆంధ్రప్రదేశం నలుమూలలా సంగీత కచేరీలలో పాల్గొని మన్ననలు పొందారు. ఏలూరులో సంగీత గురుకులం స్థాపించి ఎందరో శిష్యులకు విద్యాదానం చేశారు.

శ్రీ శాస్త్రిగారు తరువాత మద్రాసులో నాలుగు సంవత్సరాలు ఉండి తమ విద్యకు మెరుగుదిద్దుకొని దక్షిణదేశం అంతా పర్యటించి కచేరీలు చేశారు. భక్తప్రహ్లాద, నౌకాచరితం వంటి సంగీత నాటకాలలో పాల్గొన్నారు. విశ్వవిద్యాలయ పరీక్షాధికారిగా ఉన్నారు.

తిరుపతిలో 1968 మార్చి నెలలో జరిగిన రాష్ట్ర సంగీతోత్సవాలలో వీరికి అకాడమీ 'గానకళాప్రపూర్ణ' బిరుదునిచ్చి గౌరవించింది.



శ్రీ షేక్ చిన పీరు సాహెబ్

వంశపారంపరంగా నాదస్వరాన్ని ఆరాధించే కుటుంబంలోపుట్టిన శ్రీ షేక్ చిన పీరు సాహెబ్ ప్రసిద్ధ నాదస్వర విద్వాంసులు, చిలకలూరిపేట సంస్థాన నాదస్వర నిపుణులు అయిన నసర్దిసాహెబ్ పుత్రులు. చిన్ననాటనే తండ్రిని కోల్పోయిన శ్రీ చినపీరు, పితామహుల యింట నాదస్వర సాధన ప్రారంభించి అచిర కాలంలోనే నాదస్వరగానం చేయడం ప్రారంభించారు. శ్రీ రాజనాల వేంకటప్పయ్యశాస్త్రి గారు వీరి సంగీత గురువులు.

తరువాత పిన తండ్రులైన పెద మౌలా, చిన మౌలాలవద్ద నాదస్వర వాద్య సాధనం చేసి, నాదస్వర విద్యలో పాండిత్యం సాధించారు. వీరి సుమధురనాదం శ్రోతల మనస్సులను ఆకట్టుకొన్న దంటే ఆశ్చర్యంలేదు.

శ్రీ చిన పీరు దక్షిణ భారతం అంతటా నాదస్వర కచ్చేరీలు ఇచ్చారు. పలు తావుల్లో సన్మానాలు పొందారు.

స్వయంగా నాదస్వర వాద్యంలో ప్రఖ్యాతులే కాక, శ్రీ చినపీరు ఎందరో ప్రసిద్ధులైన శిష్యులనుకూడా తయారుచేశారు.

నాదస్వర గానానికి, సంగీత కళకు శ్రీ చిన పీరు చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1969లో ఏలూరులోజరిగిన సంగీతోత్సవాలలో 'గానకళా ప్రపూర్ణ' బిరుదు నిచ్చి సత్కరించింది,

## శ్రీ మహావాది వెంకటప్పయ్య శాస్త్రి

శ్రీ మహావాది వెంకటప్పయ్య శాస్త్రిగారు 16-9-1911 న గుంటూరు జిల్లా, నర్సారావుపేట తాలూకా సంతగుడిపాడులో సంగీత కుటుంబంలో జన్మించారు. వారి కుటుంబంతో చిన్నతనం లోనే గుంటూరు తరలివచ్చిన శ్రీ వెంకటప్పయ్య శాస్త్రిగారు ప్రాథమిక విద్యాభ్యాసానంతరం తమ తండ్రిగారివద్దనే సంగీతం నేర్చుకోవడం ప్రారంభించారు. 1926 లో ప్రఖ్యాత సంగీత విద్వాంసులు శ్రీ బలిజేపల్లి సీతారామయ్య గారి శిష్యులై సంగీత విద్యలోని సూక్ష్మాలను గ్రహించారు. తరువాత వయొలిన్ వాద్యంలో ప్రవీణులైన శ్రీ చదలవాడ కుటుంబరావుగారి వద్ద వయొలిన్ వాద్య సాధన చేశారు.

శ్రీ శాస్త్రిగారు సంగీతలోకానికి జంత్రజ్ఞులుగానే మొదట పరిచయం అయ్యారు. 1936-40 కాలంలో స్వయంకృషితో గాత్ర విద్యను సాధనచేసి అచిరకాలంలోనే ఆంధ్రప్రదేశంలోని అత్యుత్తమ గాయకులలో ఒకరైనారు.

శ్రీ శాస్త్రిగారు సంగీతంలో ఎంతో విశిష్టమైన స్థానాన్ని పొందడానికి ముఖ్యకారణం వారి కల్పనాశక్తి, వారి రాగప్రస్తార విలక్షణత, వారి సంగీత సాహిత్య భావ సమ్మేళనము.

శ్రీ శాస్త్రిగారు సంగీతకళకు చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1970లో కాకినాడలో జరిగిన సంగీతోత్సవంలో "గానకళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది.



## శ్రీ వింజమూరి వరదరాజ అయ్యంగార్

శ్రీ వింజమూరి వరదరాజ అయ్యంగార్ 1915 జూలై 15వ తేదీన గుంటూరులో జన్మించారు. 1935లో పట్టభద్రులైనారు. ప్రథమ గురువులు పిరాట్ల శంకరశాస్త్రిగారు. పదేళ్ళపాటు మద్రాసులో టైగర్ వరదాచారిగారి గురుత్వంలో సంగీతంలోని మర్మాలు గ్రహించారు. 1937లో మ్యూజిక్ అకాడమీ పోటీలలో బంగారు పతకం గెలిచారు.

దక్షిణభారతదేశంలో పలు చోట్ల కచేరీలు చేశారు. రామకృష్ణ మిషన్ సహాయార్థం బర్మా, థాయిలాండ్, సింగపూర్ మొదలైన దేశాలలో పర్యటించారు.

1964లో కొలంబియా విశ్వవిద్యాలయం వీరికి సంగీతంలో గౌరవ డాక్టరేటు పట్టాను ఇచ్చి గౌరవించింది.

శ్రీ అయ్యంగార్ హైదరాబాద్‌లోని నృత్య సంగీత కళాశాలకు మొదటి ప్రిన్స్‌పాల్‌గాను, ఆకాశవాణి హైదరాబాద్‌లో కర్ణాటక సంగీతానికి మొదటి ప్రొడ్యూసర్‌గాను పనిచేసి, సంగీత వ్యాప్తికి ఎంతగానో కృషిచేశారు.

సంగీతంలోని వివిధ అంశాలపై ఎన్నో వ్యాసాలు వ్రాసి సంగీత సాహిత్యాన్ని పెంపొందించారు.

సంగీత కళకు వీరు చేసిన విశిష్టమైన సేవకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వీరికి 1971లో హైదరాబాద్‌లో జరిగిన సంగీతోత్సవాలలో 'గానకళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించింది.



శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ

శ్రీ బాలమురళి 1930లో సంగీత విద్వద్వంశంలో జన్మించారు. వీరికి శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు సంగీత గురువులు. ఏడేళ్ళ ప్రాయంనుంచే కచేరీలు ప్రారంభించిన అసాధారణ ప్రజ్ఞాశాలి శ్రీ బాలమురళి.

దేశ విదేశాలలో అన్ని ముఖ్యమైన పట్టణాలలోను కచేరీలు చేసి మన్ననలు పొందారు. గాత్ర సంగీతంలోనే కాక, వయొలిన్, వయోలా వాద్యాలను వాయించడంలో కడు నిపుణులు.

40 సంవత్సరాలుగా తన మురళీమోహన గానంతో శ్రోతలను రంజింపచేస్తున్న శ్రీ బాలమురళి ప్రఖ్యాత సంగీత శాస్త్రజ్ఞుడు కూడా. వాగ్గేయకారుడై, 72 మేళకర్త రాగాలలో కృతులు వెలయించడమే కాక ఎన్నో నూతన రాగాలను సృష్టించారు.

సంగీత కచేరీలతో పాటు, ఎన్నో తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ చిత్రాలలో నేపథ్యగానం చేసి కీర్తి నార్జించారు. కొన్ని చిత్రాలలో, నాటకాలలోను నటించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చి సన్మానించింది. పద్మశ్రీ బిరుదును కేంద్రప్రభుత్వం ఇచ్చింది ఎన్నో గజారోహణాది సన్మానాలు పొందారు.

వీరు సంగీతకళకు చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1976లో చిత్తూరులో జరిగిన సంగీతోత్సవాలలో ఆయనకు 'గాన కళాప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించింది.



## శ్రీ ఈమని శంకరశాస్త్రి

విద్వద్వంశంలో, కళలకు కాణాచి అయిన ద్రాక్షారామంలో జన్మించిన శ్రీ ఈమని శంకరశాస్త్రిగారి తండ్రి వీణాచార్య శ్రీ అచ్యుత రామశాస్త్రిగారు. తండ్రివద్దనే సంగీతం అభ్యసించి, సంగీత శాస్త్రంలోని మర్మాలను ఆకళింపు చేసుకొన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి పట్టభద్రులైనారు.

జెమినీ స్టూడియో (మద్రాసు)లో సంగీత దర్శకులుగా మంగళ, సంసార్, నిషాద్, చంద్రలేఖ (ఆంగ్లం), మిస్టర్ సంపత్ వంటి చిత్రాలకు సంగీత దర్శకులుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. 1957లో ఆకాశవాణి సంగీత ప్రయోక్తగా ప్రవేశించి అనతి కాలంలోనే జాతీయ వాద్యబృంద సంచాలకులైనారు. ఆదర్శ శిఖరారోహణ, స్వరతరంగిణి, భ్రమర రవిన్యాసంవంటి ధ్వని చిత్రణలు ఆయన కల్పనాశక్తికి గీటురాళ్లు. దేశ విదేశాలలో పర్యటించి ఐక్యరాజ్య సమితి వేదికనుంచి "వేదశాంతి మంత్రాలు" పఠించారు. కేంద్ర సంగీత నాటక అకాడమీ బహుమతి గ్రహీత. స్వయంగా ఉత్తమ వైణికులు కావడమే కాక ఎందరో ఉత్తమమైన శిష్యులను తయారుచేసిన శ్రీ ఈమని శంకరశాస్త్రిగారిని 1978లో మచిలీపట్నంలో జరిగిన సంగీతోత్సవాలలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 'గానకళా ప్రపూర్ణ' బిరుదుతో సత్కరించింది.



## శ్రీ స్థానం నరసింహారావు

శ్రీ స్థానం నరసింహారావు గుంటూరు జిల్లా బాపట్లలో 1902 సెప్టెంబరు 23న జన్మించారు. స్త్రీ పాత్రలను ధరించి వీరు తెలుగు నాటకరంగం మీద దేదీప్యమానంగా వెలుగొందారు. అచ్చంపు ఆడవే అని భ్రమింపచేసి అనేక పతకాలు బహూకరణ పొందారు. చిత్రాంగి, మధురవాణి, రోషనార పాత్రలు వీరి సొమ్ము. ఆంధ్ర దేశంలోనే గాక, ఇతర భారతీయ నగరాలలో, బర్మాలో నాటకాలు ప్రదర్శించి మెప్పు పొందారు. "నటకావతంస", "ఆంధ్ర బాల గంధర్వ", "నటశేఖర" ఇత్యాది బిరుదులు పొందారు. వీరు పౌరాణిక, చారిత్రక నాటకాలు రచించి ప్రదర్శించారు ఆంధ్ర నాటక కళా పరిషత్తు సభలకు 1949లో అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు.

భారత ప్రభుత్వం వీరి నటనా కౌశల్యానికి పద్మశ్రీ బిరుదు నిచ్చి సత్కరించింది. కేంద్ర సంగీత నాటక అకాడమీ వారి అవార్డును స్వీకరించారు. శ్రీ స్థానం నాటకానికి చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1960లో హైదరాబాద్‌లో జరిగిన నాటకోత్సవాలలో "నాటక కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సన్మానించింది.



## శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి

శ్రీ అద్దంకి 1898 సెప్టెంబరు 21వ తేదీన గుంటూరు జిల్లా అద్దంకి గ్రామంలో జన్మించారు. బాపట్లలో కొంతకాలం ఆంగ్ల విద్య నభ్యసించి 1912లో నాటకరంగ ప్రవేశం చేశారు. గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్య గారివద్ద 12 సంవత్సరాల పాటు సంగీతం నేర్చుకున్నారు. రాజమండ్రిలో హిందూ నాటక సమాజంలో, బందరు బాలభారతి సంఘంలో, మైలవరం మోతే నాటక సమాజాలలో ప్రధాన భూమికలను ధరించి ఖ్యాతిగాంచారు. నటరత్న పారుపల్లి సుబ్బారావుతో కలసి "సంగీత నాట్యమండలి"ని స్థాపించి కొంతకాలం స్వయంగా నిర్వహించారు. వీరి గ్రామఫోన్ రికార్డులు 60 పైన ఉంటాయి. 50 పైగా సినిమాలలో నటించారు. ఆంధ్రనాటక కళాపరిషత్తు వీరిని సన్మానించింది. అనేక పట్టణాలలో వీరు ప్రదర్శనలిచ్చి ప్రేక్షక హృదయాలను చూరగొన్నారు. దశరథుడు, ధర్మరాజు, కర్ణుడు పాత్రలను తమ సొత్తుగా చేసుకున్న నటుడు శ్రీ అద్దంకి.

శ్రీ శ్రీరామమూర్తిగారు దాదాపు ఇరవై సినిమాలలో నటించి పేరుగడించారు.

యాభై సంవత్సరాలు ఆంధ్రనాటక రంగానికి చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ శ్రీ శ్రీరామమూర్తి గారికి 1967లో ఏలూరులో జరిగిన నాటకోత్సవాలలో "నాటక కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సన్మానించింది.



శ్రీ సి. నాగభూషణం

శ్రీ చండి నాగభూషణం 1922వ సంవత్సరం మార్చి 22వ తేదీన ప్రకాశంజిల్లా అనకర్లపూడి గ్రామంలో జన్మించారు. శ్రీ నాగభూషణం విద్యాభ్యాసం నెల్లూరులో జరిగింది.

శ్రీ నాగభూషణానికి విద్యార్థిదశలోనే నాట్యకళలో అభిమానం ఏర్పడ్డది. ఏకపాత్రాభినయంలోను, నాటక పాత్రధారణ లోను హైస్కూలు, కాలేజీలలో ఎన్నో బహుమతులను గెల్చుకున్నారాయన.

1943లో మద్రాసులో రైల్వే ఉద్యోగిగా చేరిన తరువాత నాటకరంగ సేవను ఇనుమడింపచేశారు శ్రీ నాగభూషణం. 1947లో విజయవాడ చేరిన తర్వాత పరివర్తన, ప్రగతి, ఇదా ప్రపంచం, ఎదురీత, బాగుబాగు, మావూరు, గాలిమేడలు, అల్లీముఠా, మహానటుడువంటి అనేక నాటకాలు, నాటికలలో పాల్గొని ఎన్నో బహుమతులు పొందారు.

1951లో చలనచిత్ర రంగంలో చేరి ఎన్నో చిత్రాలలో విజయవంతంగా నటించారు అయినా నాటకరంగాన్ని మరువకుండా, తన "రక్తకన్నీరు" నాటకంతో తెలుగు దేశంలో జైత్రయాత్ర చేశారు.

శ్రీ నాగభూషణానికి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1973లో హైదరాబాద్‌లో జరిగిన రాష్ట్ర నాటకోత్సవాలలో 'నాట్యకళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి గౌరవించింది.



## శ్రీ పీసపాటి నరసింహమూర్తి

శ్రీ పీసపాటి 1920, జులై 10 వ తేదీన వంతరాంలో జన్మించారు. కాకినాడలో పినతండ్రిగారి వద్ద పెరిగారు. వేదశాస్త్ర అధ్యయనంచేశారు. 1939లో వాణీ నాట్యమండలిలో చేరి శ్రీ కిళాంబి కృష్ణాచార్యులుగారి వద్ద నటనలో శిక్షణ పొందారు. 1940లో ఆంధ్ర నాటక కళాపరిషత్తు సభల్లో 'ఆంధ్రశ్రీ' నాటకంలో కన్నమదాసు పాత్రకు ప్రథమ బహుమతి పొందారు. 1949లో శ్రీ చెళ్ళ పిళ్ళ వెంకటశాస్త్రిగారి సన్మాన సభల్లో శ్రీ కృష్ణ పాత్రకు ప్రథమ బహుమతిని పొందారు. ఆనాటినుంచి నాటకకళకు జీవితం అంకితంచేశారు.

1949లో శ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్యగారు స్థాపించిన 'ఆంధ్రా ఆర్టిస్ట్స అసోసియేషన్'లో చేరి పలుచోట్ల నాటక ప్రదర్శన లిచ్చి అభినవ కృష్ణుడని బిరుదు పొందారు

తమ 40 ఏళ్ళ నటజీవితంలో ఎందరో పెద్దల ఆశీస్సులు పిన్నల మన్ననలు పొందిన శ్రీ నరసింహమూర్తి శ్రీకృష్ణ పాత్రకు జీవం పోస్తారు.

శ్రీ నరసింహమూర్తిగారు నాటక కళకు చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1972లో ఏలూరులో జరిగిన రాష్ట్ర నాటకోత్సవాలలో వారికి "నాటక కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది,



శ్రీ వేదాంతం రాఘవయ్య

శ్రీ వేదాంతం రాఘవయ్య ప్రఖ్యాత నాట్యసంప్రదాయం కలిగిన కూచిపూడిలో, అందునా వేదాంతంవారి వంశంలో 8-6-1919లో జన్మించారు. శ్రీ చింతా వెంకట్రామయ్యగారి వద్ద విద్యాభ్యాసం ఏడవ ఏటనే చేస్తూ ప్రహ్లాదుడుగా రంగప్రవేశం చేసి ప్రశంసలు పొందారు. బాల పాత్రలన్నీ కడు సమర్థవంతంగా నిర్వహించారు. కూచిపూడి వారి యక్షగాన దరువులేకాక, క్షేత్రయ పదాలను, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలను, శ్లోకాలను అభినయించడంలో సిద్ధహస్తులనిపించుకున్నారు.

ఉషాకన్య వేషంవేసి దేశం నలుమూలలా తిరిగి ప్రేక్షకులను సమ్మోహితులను చేశారు. కూచిపూడి యక్షగానాలలో స్త్రీ పురుష పాత్రలన్నీ కడుసమర్థవంతంగా ధరించడమేకాక సూత్రధారిత్వం నెరపడంలో ప్రశస్తి పొందారు.

సినిమాలలో నృత్యంచేశారు, నృత్యదర్శకత్వం నెరపారు. చిత్రదర్శకులై 'దేవదాసు'వంటి చిత్రాలను సృష్టించి అజరామరులైనారు.

తెలుగు నాట్యకళకు ఆయన చేసిన సేవను గుర్తించి, ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ 1964లో హైద్రాబాదులో జరిపిన అఖిలభారత నృత్యోత్సవాలలో "భరతకళాప్రపూర్ణ'' బిరుదునిచ్చి సన్మానించింది.



## శ్రీ చింతా కృష్ణమూర్తి

శ్రీ చింతా కృష్ణమూర్తిగారు ప్రఖ్యాత నాట్యాచార్యులు, వెంకట్రామా నాట్యమండలి సంస్థాపకులు అయిన శ్రీ చింతా వెంకట్రామయ్యగారి తృతీయ పుత్రుడు. 10 సం॥ ప్రాయంనుంచీ తండ్రిగారి పర్యవేక్షణలో కూచిపూడి భాగవత నాటకాల్లో పాత్ర ధారణ ప్రారంభించి ముందు ప్రహ్లాదుడు, ధర్మాంగదుడు మొదలైన బాలపాత్రలలో నటించి తరువాత హరిశ్చంద్రుడు, రాముడు, కృష్ణుడు, రుక్మాంగదుడు, మొదలైన ధీరోదాత్త పాత్రలను నటించడంలో సిద్ధహస్తులనిపించుకున్నారు.

శ్రీ చింతావారు కేవలం నటులే కాదు, తండ్రికి వలె ప్రఖ్యాత సూత్రధారుడు కూడ. తాను సూత్రధారుడై శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ బృందంతో భారతదేశమంతా పర్యటించి ఎన్నో సన్మానాలు పొందిన శ్రీ కృష్ణమూర్తిగారు కూచిపూడి నాట్య పునరుద్ధరణకు ప్రత్యేకమైన కృషి చేశారు.

నాట్యకళకు వీరు చేసిన కృషిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1966వ సం॥ విజయనగరంలో జరిగిన నృత్యోత్సవాలలో వారికి 'భరత కళా ప్రపూర్ణ, బిరుదునిచ్చి సత్కరించింది.



శ్రీ నటరాజ రామకృష్ణ

ప్రముఖ నృత్య శాస్త్రవేత్త శ్రీ నటరాజ రామకృష్ణ 1932లో బాలీద్వీపంలో జన్మించారు. బాల్యదశ మధ్యప్రదేశ్‌లో గడిచింది. నాగపూర్ విశ్వవిద్యాలయం నుండి పట్టభద్రులైనారు. వీరి సోదరులు డాక్టర్ డి. శ్యామ్‌సుందర్ నాట్య శాస్త్రంలో కలి గించిన అభిరుచి, మధ్యప్రదేశ్‌లోని బండారు సంస్థానాధీశులు శ్రీ గణపతి పాండ్యగారి దోహదం శ్రీ రామకృష్ణగారిని నాట్య కళా భ్యాసంలో ఉన్నతులను చేసింది.

శ్రీ రామకృష్ణ భరతనాట్యాన్ని తంజావూర్, శ్రీ మీనాక్షి సుందరం పిళ్లై వద్ద, దేవాలయ నృత్య కళను కాళహస్తికి చెందిన శ్రీమతి నాయుడుపేట రాజమ్మగారివద్ద, కూచిపూడి నృత్యాన్ని శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారివద్ద, భాగవత సాంప్ర దాయ నృత్యాన్ని శ్రీమతి పెండ్యాల సత్యభామగారి వద్ద అభ్య సించారు.

శ్రీ రామకృష్ణగారు ఉత్తమ పరిశోధకులు. నృత్య కళను గురించి పెక్కు గ్రంథాలను రచించారు. హైదరాబాద్‌లో నృత్య నికేతన్‌ను ప్రారంభించి ఎందరో విద్యార్థినీ విద్యార్థులకు శిక్షణ నిచ్చారు.

నృత్య కళలో శ్రీ రామకృష్ణగారు చేసిన కృషిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారికి 1967లో విజయవాడ లో జరిగిన నృత్యోత్సవాలలో ''భరత కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది.



## శ్రీమతి అన్నాబత్తుల బులి వెంకటరత్నం

అభినయ కళావేత్త శ్రీమతి బులి వెంకటరత్నం భరత విద్యకు ఆచార్యపీఠమైన కుటుంబంలో జన్మించారు ఆరవయేట మాతామణి శ్రీమతి సూర్యకాంతమ్మగారివద్ద భరత విద్యాభ్యాసాన్ని, శ్రీ చెరుకూరి రామమూర్తిగారి వద్ద సంగీత విద్యాభ్యాసాన్ని ప్రారంభించారు. సంస్కృత కావ్యాలను, తరంగాలను, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలను నేర్చుకొన్నారు. ఎ. సుబ్బరామశాస్త్రి గారివద్ద గొల్లకలాపం, భామాకలాపాలను నేర్చుకొన్నారు. పధ్నాల్గవ ఏటనే ప్రదర్శనలు, కలాప కేళికలు చేయడం ప్రారంభించారు. కొన్ని వేల ప్రదర్శనలిచ్చి మెప్పుపొందారు.

జ్ఞాన ప్రబోధాత్మకమైన గొల్ల కలాప విద్యలో ప్రవీణురాలు శ్రీమతి బులి వెంకటరత్నం. కోనసీమలో ఆమెను ఆహ్వానించని, సన్మానించని పండిత సభలు లేవంటే అతిశయోక్తి కాదు.

నృత్యకళకు ఈమె చేసిన సేవకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈమెకు 1972లో హైదరాబాద్‌లో జరిగిన నృత్యోత్సవాలలో 'భరత కళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించింది.



## శ్రీ కోరాడ నరసింహారావు

శ్రీ కోరాడ పశ్చిమ గోదావరిమండలంలో జన్మించిచారు. పన్నెండేళ్ల వయసులోనే గజ్జెకట్టిన వీరికి శ్రీ గంటా కనకారావు, శ్రీ గుడిమెట్ల కృష్ణ చిన్ననాటి గురువులు. ఒకవంక లౌకిక విద్యలో ఎం ఎ .పట్టానుపొంది, మరొక వంక నాట్యకళలో సిద్ధహస్తులైన శ్రీ కోరాడ ప్రఖ్యాతనాట్యవేత్తలు. శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శర్మ, శ్రీ సి. ఆర్. ఆచార్యగారల శిష్యులై నాట్యవిద్యలోని మెలకువలను గ్రహించారు.

'నృత్యభారతిని' స్థాపించి స్వయంగా ప్రదర్శనలిస్తూ ఎందరో శిష్యుల్ని తయారు చేశారు. అందమైన నృత్యనాటకాలను రూపొందించారు. దేశభక్తి ప్రేరకాలైన నృత్యనాటకాలను లడక్, నేఫా, నాగాలాండ్ ప్రాంతాలలో ప్రదర్శించి మన సైనికులను ఉత్తేజపరిచారు.

జాతీయ, అంతర్జాతీయ రంగాల్లో కూచిపూడి ఖ్యాతిని ఇనుమడింపచేశారు. పారిస్‌లో యునెస్కో ఆధ్వర్యంలో జరిగిన నృత్య పోటీలలో ప్రథమ బహుమతి పొందారు.

నాట్యకళకు శ్రీ కోరాడ చేసిన కృషిని గుర్తించి ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1978లో వరంగల్లులో జరిగిన నృత్యోత్సవాలలో ఆయనకు "భరతకళాప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది.



## శ్రీ పాతూరి మధుసూదనరావు

శ్రీ మధుసూదనరావుగారు 1909 వ సంవత్సరం జూలై 31వ తేదీన రేపల్లె తాలూకా దూళిపూడి గ్రామంలో జన్మించారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సభలో గానం చేసి ఆంగ్లవిద్యకు స్వస్తి చెప్పారు. నాటకాలు ఆడుతూ 1931లో గాంధీజీ శంఖారావం విని ఉద్యమంలో చేరి జైలుకెళ్ళారు. అక్కడే "శ్రీకృష్ణ జననం" అన్న హరికథను స్వయంగా రాసి, గానం చేశారు.

విడుదల అయిన తరువాత హరికథా గానంలో ప్రత్యేక కృషిచేశారు. స్వయాన పండితులు కావడం వలన వారి హరికథాగానం ఉదాత్తంగా నడిచేది. శ్రీ చెళ్ళపెళ్ళ వెంకటశాస్త్రి, శ్రీ విశ్వనాథల ఆశీస్సులు అందాయి. 1944లో శ్రీ ఆదిభట్ల నారాయణదాసు, ద్వారం, తాతా సుబ్బరాయ శాస్త్రిగార్ల సమక్షంగా కథాగానం చేసి ప్రశంసలు అందుకున్నారు. "పండిత హరిదాస హంస" వారి సార్థకమైన బిరుదు.

శ్రీ మధుసూదనరావుగారు సంస్కృతాంధ్రాలలో రచయితలు, కవులు. 'దివ్యజ్యోతిః', 'దివ్యస్తవః' అన్ని సంస్కృత గ్రంథాలు, 'పార్వతీ పరిణయం,' 'హనుమత్కల్యాణం'వంటి హరి కథలు, 'భారతరంగిణి' వంటి ఖండకావ్య సంపుటులు వెలువరించారు.

కవి పండిత గాయకుడై హరికథా గానాన్ని మహోత్కృష్టదశకు తీసుకొనిపోయిన శ్రీ పాతూరి మధుసూథనరావుగారికి 1964లో తాడేపల్లిగూడెంలో జరిగిన కథాగాన ఉత్సవాలలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ "కథా గాన కళాప్రపూర్ణ"బిరుదునిచ్చింది.

